# వీరశైవ సాహిత్యము సమతాదృక్పథము

శ్రీ కృష్ణదేవరాయ విశ్వవిద్యాలయమునకు
పి. హెచ్. డి. పట్టము నిమిత్తము సమర్పించిన

## సిద్ధాంత వ్యాసము





డా॥ కెల్లా పరమేశ్వరప్ప

తిరుమల తిరుపతి దేవస్థానము
మరియు
తెలుగు విశ్వవిద్యాలయము
హైదరాబాదు
వారి ఆర్థిక సహాయముతో

# వీరశైవ సాహిత్యము సమతాదృక్పథము

శ్రీ కృష్ణదేవరాయ విశ్వవిద్యాలయమునకు

పి. హెచ్.డి. పట్టము నిమిత్తము సమర్పించిన

## సిద్ధాంత వ్యాసము



డా॥ కెల్లా పరమేశ్వరప్ప

ఆంధ్ర భారతి

శ్రీ కృష్ణదేవరాయ విశ్వవిద్యాలయము

అనంతపురము

అక్టోబరు 1991

# వీరశైవ సాహిత్యము సమతా దృక్పథము

డా॥ కెల్లా పరమేశ్వరప్ప





ప్రథమ ముద్రణ : 1995
ప్రతులు : 1000

వెల : రూ॥ 140-00

ప్రతులకు

కె. ఫణిభూషణ్ కుమార్
ఇంటి నెం. 13/2
పోలీస్ స్టేషన్ దగ్గర
నందికొట్కూరు-518 401

P. శ్రీనివాసులు
శ్రీ వెంకటేశ్వర టైప్ ఇన్స్టిట్యూట్
తాలూకా ఆఫీస్‌రోడ్
నందికొట్కూరు-518 401

ముద్రణ : హరిప్రియ ప్రింటర్సు
తాలూకా ఆఫీస్‌రోడ్
నందికొట్కూరు-518 401

# అంకితము

జన్మనిచ్చిన తల్లి దండ్రులు
కె. నాగమ్మ - విరుపాక్షప్ప గార్లను
స్మరిస్తూ

ప్రేమతో - నా ధర్మపత్ని
కె. పార్వతీదేవికి

# SRI KRISHNADEVARAYA UNIVERSITY

**ANANTAPUR**



'ACHARYA TOOMATI DONAPPA PALNADU RESEARCH GOLD MEDAL'

for the Year 1992

AWARDED TO

Kella Parameswarappa

at the Sixth Convocation held

on 17th January, 1994

for his / her best thesis produced in the Department

of TELUGU

ANANTAPUR
7 JAN 1994

M. J. [signature]

*VICE-CHANCELLOR.*

# కృతజ్ఞతలు

నా ఈ సిద్ధాంత వ్యాసమునకు చక్కని ప్రణాళికను రూపొందించుట లోను, కొన్ని క్లిష్టమైన అంశములను సావధానముగా చర్చించి సరియైన అంశమును నిగ్గు తేల్చుటలోను, ఒక ప్రత్యేక ఒరవడిలో వ్యాసరచనా పద్ధతిని ఓపికతో తెలియజేయుటలోను గురుతుల్యులు, శ్రేయోభిలాషులైన శ్రీ డా. హెచ్.ఎస్. బ్రహ్మానందగారికి వారితో సహకరించిన శ్రీమతి హెచ్. నిర్మల గారికి నా హృదయపూర్వక ధన్యవాదములు.

ఆంధ్రశాఖ అధ్యాపక బృందమునకు-ముఖ్యముగా వీరశైవ సాహిత్యమును పరిశోధించి నాకు ప్రేరణ కలిగించిన డా. యం. బుద్ధన్న గారికి ధన్యవాదములు. మరియు డా. ఆర్. శేషశాస్త్రి గారికి అభివాదములు.

మా కళాశాల మాజీ అధ్యక్షులు శ్రీ యస్. హనుమంతరెడ్డి గారికి, ప్రస్తుత అధ్యక్షులు శ్రీ పి. శ్రీరామిరెడ్డి గారికి, నా సోదర అధ్యాపక, మిత్రులకు ముఖ్యముగా శ్రీ కె. విజయేంద్ర గార్లకు మరియు జె. మల్లికార్జునరావు గార్లకు నా నమస్సులు

పుస్తకములు సేకరించుటలో సహాయపడిన శ్రీమతి జె. మీనాక్షి గారికి శ్రీ డి. బసవరాజు గారికి, అనంతపురము వాస్తవ్యులు సుప్రసిద్ధ న్యాయవాది బి. జోగప్పగారి కుమారుడు శ్రీ బి.జి. రాజేంద్రప్రసాద్‌గారికి అభివందనలు

సమతా సిద్ధాంతము వర్గము చేసికోనుటలో నాకు మార్గ దర్శకులైన పూర్వ పరిశోధకులకు, ముఖ్యముగా శివశరణుల జీవిత చిత్రణము ప్రామాణికముగా రచియించి ప్రేరకులుగా నిలిచిన డా మ.న. జవరయ్య గారికి నా కృతజ్ఞతా సుమాంజలులు

నా ఈ పరిశోధనా వ్యాసాంగములో అన్ని విధముల సహకరించిన నా శ్రీమతి కె. పార్వతిదేవికి. నా చిరంజీవులు కై. విజయ భారతి, ఫణిభూషణ కుమార్, యామిని సురేఖ, మరియు మీనాక్షిలకు నా శుభాకాంక్షలు.

పుట-ఏ

# స్ఫూర్తి

నాకు ఒక మతమనిన ప్రత్యేకమైన అభిమానము లేదు. మనస్సు మాత్రము వైదికము వైపు ఆకర్షింప బడినను అందలి కొన్ని అంశములు సామాన్యునకు బాధ కలిగింపక మానవు. మనిషి ఎప్పుడు తన చుట్టు ఏ సంఘమున్ననూ, ఏ మతమున్ననూ, ఏ ఆచారమున్ననూ దానిలోని మంచిని స్వీకరించుటకు యత్నించును. ప్రతి మత చరిత్రలో కొంత లోపమున్నది. అయినను మానవతా దృక్పథ లక్షణములు ఎచ్చట నున్నను స్వీకరింపవలయునన్న అభిప్రాయము కలవాడిని నేను. అందుకు 12వ శతాబ్దములోని వీరశైవ మతము నాకు దగ్గరగా అనిపించినది. ఈ నా ఆలోచన–ఒక సామాజిక స్పృహగా-దానిమ్మ పండులోని బీజ ప్రాయముగ మనసులో మెదలుచుండెను. ఆ మతములో ఏమున్నదో అని తెలిసి కొనుటకు ప్రయత్నించినను నాకు అది అంతగా ఉపయోగపడలేదు. అట్టి అంశములను ఋజువు పరచు పద్ధతి నాకు తెలిసినదికాదు. పరిశోధన యొక్క శాస్త్రజ్ఞానములేని నన్ను ప్రేరేపించినవారు శ్రీ డా. హెచ్. ఎస్. బ్రహ్మానంద గారు వారి యొక్క ముక్కు సూటిగా మాట్లాడు తత్త్వము, అపార పాండిత్య అనుభవములు, శల్య పరీక్ష జేయు గుణము, సామాజిక స్పృహ గల వ్యక్తిత్వము నా పరిశోధనకు గొప్ప స్ఫూర్తి నిచ్చినవి.

పుట్ట–బి

# ముందుమాట

వీరశైవ సాహిత్యములో సమతా దృక్పథము-మత పరముగా, సంఘ పరముగా నేవిధముగా చోటు చేసికొనినదో తెలిసికొనుటకు 11వ శతాబ్దము నుండి 13వ శతాబ్దము వరకుగల వీరశైవ సాహిత్యమును పరిశీలించుటయే ఈ సిద్ధాంత వ్యాసము యొక్క ముఖ్యోద్దేశ్యము.

ఈ సిద్ధాంత వ్యాసమునందలి ప్రణాళికను స్థూల దృష్టితో క్రింది విధముగా విభజింపవచ్చును.

వైదికమునందు దర్శనములోనున్న సమత్వము ఆచారమున లేదని, వీరశైవము నందు అన్ని కులాలవాళ్ళు, 'శివశరణు'లై 'సమత్వము' సాధించిరని 'భూమికలో' సూక్ష్మముగా చర్చించుట జరిగినది.

'భిన్న సంప్రదాయములలో సమత్వ దృష్టి' అన్న మొదటి అధ్యాయములో యోగులు సాటి మానవుల జీవిత గమనమును మార్చలేదని, పాశ్చాత్య దేశములలో వృత్తిలోని స్థాయీ భేధములే తప్ప జన్మాగతములయిన వర్ణ విభేదము పరిగణనలో లేదని, భారత రాజ్యాంగము సమత్వ సాధన కేర్పడిపదని, ఒక్క మార్క్సిస్టులు మాత్రమే 'సమత్వము' గురించి ఆలోచించిరని వివరింపబడింది.

రెండవ అధ్యాయమైన 'వీరశైవము-విశ్వమతసారము'లో వైదికమతము నందలి వర్ణాశ్రమధర్మములను ఖండించి, యజ్ఞయాగాది క్రతువులను నిరసించి, కర్మల స్థానమున 'క్రియ' యొక్క ప్రాధాన్యతను వివరించి వీరశైవ మతము సమత్వ సాధనకు కృషి చేసినదని చర్చింపబడినది. ఆయా మతములలోని మానవతా గుణముల స్వీకరించి విశ్వమతసారమైనదని నిర్ధారింపబడినది.

'లింగము'ను ధరింపజేసి అన్ని కులముల వాళ్ళను మతపరముగా శివ డనెడు ఒకే దైవము క్రింద వీరశైవము జేర్చినది. అట్టి శివశరణులలో మత పరమయిన సమానతయున్నది కాని సంఘములో సామాన్యుడు మాన్యుడుగా జీవించుటకు తన విద్యుక్త ధర్మములతో పాటు హక్కులు గలవని ఋజువు పరచు ప్రయత్నము మూడవ అధ్యాయములో జరిగినది. 'వృత్తి'లో అర్థము, పరమార్థము గలదని జెప్పుటకే 'దళిత జనుల కాయక సిద్ధాంతము'. ఇది యొక నూతనాంశము.

వీరశైవ మతము ఆవిర్భవించుటకు, ఆవిర్భవించి జీవించుటకు - మారిన పరిస్థితుల కనుగుణ్యముగా మలచబడినది. అనాడు అధిక వ్యాప్తిలోనున్న వైదిక బౌద్ధ, జైన, వైష్ణవ మతములలో సంఘర్షించి తనకంటూ ఒక ప్రత్యేకతను నిలుపు కొన్నది. 'మత సంఘర్షణలు-రాజకీయ సంస్కృతి' అన్న నాలుగవ అధ్యాయ

పుట-సి

ములో బసవేశ్వరుడు శివశరణ ధర్మమును ప్రదర్శించుటకెట్లు కృషిచేసెనో తెలుప బడినది. వీరశైవ మతము ఇతర మతములతో గల్గిన సంఘర్షణలు వివరింపబడినవి.

వీరశైవములోని వీరభక్తికి, కాయకమునకు స్ఫూర్తినిచ్చిన నాయనారులు—వీరే పురాతన భక్తులు, నూతనభక్తులు బసవేశ్వరునికి సమకాలీన భక్తులలోని కొందఱి జీవితములు వర్గపోరాటమునకు వీర వ్రతమునకు, శరణ ధర్మమునకు ఎట్లు ఆలవాలమైనవో 'శివశరణుల జీవన చిత్రణ అద్దము పట్టును'. నిధి సుఖము కన్న శివుని సన్నిధి—శరణుని సన్నిధిలో చాల సుఖము. గొప్పతనమున్నదని ఐదవ అధ్యాయము తెలియజేయును.

శాసనములలో వీరశైవము కలదని, వీరశైవ కవుల రచనలకు వచనములే బ్రహ్మసూత్రముల వంటివని లక్ష్య లక్షణములతో నిరూపింపబడినవి. ఇది మరియొక క్రొత్త అంశము. 'వీరశైవ కవుల రచనలు—గ్రంథ సమీక్ష' అన్న ఆరవ అధ్యాయములో పాల్కురికి సోమనాథుడు మొదలగు కవుల యొక్క గ్రంథములలోని వీరశైవ తత్త్వములు పేర్కొనబడి, అవి అన్వయింపబడిన విధము సూక్ష్మముగా గలదు.

'వస్తు—రూప—నిర్వహణ' అనెడి ఏడవ అధ్యాయములో వీరశైవ కవుల వస్తువులో శివస్పందము, శైవ పారమ్యము ప్రధానము. వీనికి అంగములైన విభూతి, రుద్రాక్ష, పాదోక, లింగార్చన, లింగధారణ, ప్రసాద మహిమలు ఆగమములలో చర్చించిన వైశము తెలుపబడినది. గురుభక్తి, జంగమభక్తి, లింగభక్తి, పాదోదక, ప్రసాద, విభూతి, మహిమలు తెలియజేయు జీవితములు కథలు అన్నియు పేర్కొనబడినవి. రూప నిర్వహణలో వీరశైవ కవులు జాను తెనుగును, ద్విపద ఛందస్సునుపయోగించిన విధము తెలుపబడినది.

సంఘములోని వివిధ వర్గముల జీవితములోని సంస్కృతికి తోడ్పడు అంశములు వీరశైవ సాహిత్యములో కనిపించే జన సంస్కృతికి అనెడి ఎనిమిదవ అధ్యాయములో వివరింపబడినవి.

తొమ్మిదవ అధ్యాయము 'గృహ జీవితము-స్త్రీలు'. ఇందు వీరశైవుల గృహ జీవితములోని ముఖ్యమైన అంశములు తెలుపబడినవి ముఖ్యముగా స్త్రీలు వీరశైవ ధర్మాచరణలో ఎటువంటి ప్రధాన పాత్ర ధరించిరో చర్చింపబడినది. సమత వ్యాప్తిలో స్త్రీలు—విభిన్న వర్గములలోని వారు—ఇంతటి పోరాటము సల్పినట్లు కానరాదు. అనగా వీరశైవమతము అన్ని వర్గముల శివశరణ ధర్మాచరణకు, శివ శరణుల మధ్య సమతా సాధనకు కృషిచేసినదని నిరూపింపబడినది.

శ్రీ బసవేశ్వర జయంతి, —రచయిత

శ్రీముఖనామ సంవత్సరం. పుట—డి

## : సంకేత వివరణ :

| | | |
|---|---|---|
| ఈశ. ఈ | : | ఈశ ఐతరేయ కఠోపనిషత్తులు |
| కారణ | : | కారణాగమః (కన్నడాగమ గ్రంథము) |
| క్రీ॥ శ॥ | : | క్రీస్తు శకము |
| కు. సం. | : | కుమార సంభవము |
| చంద్రజ్ఞాన | : | చంద్రజ్ఞానాగమః (కన్నడాగమ గ్రంథము) |
| చె.బ.పు | : | చెన్న బసవ పురాణము |
| ధ.భ.బ | : | ధర్మ భండారి బసవణ్ణనవరు |
| దీ.ప్ర. | : | దీక్షా ప్రకరణము |
| ప. | : | పద్యము |
| పం.చ. | : | పండితారాధ్య చరిత్ర |
| పు. | : | పుట |
| పె.పు. | : | పెరియ పురాణము |
| ప్ర.లీ. | : | ప్రభులింగ లీల |
| బ.పు. | : | బసవ పురాణము |
| బ.వ. | : | బసవణ్ణ వచనము |
| వృ.శ | : | వృషాధిప శతకము |
| వీ.శై.స.సం. | : | వీరశైవ సదాచార సంగ్రహః (కన్నడ గ్రంథము[…] |
| శి.వ. | : | శివ శరణెయర వచనగళు |
| శి.సా. | : | శివతత్త్వసారము |
| శూ.సం. | : | శూన్య సంపాదనె (కన్నడ గ్రంథము) |
| శ్రీపతి కాల నిర్ణయ | : | శ్రీపతి పండితారాధ్యర కాలనిర్ణయ (కన్నడ గ్రం[…] |
| శ్లో. | : | శ్లోకము |
| సి.శి. | : | సిద్ధాంత శిఖామణి (కన్నడ గ్రంథము) |

# విషయసూచిక



## అనుబంధములు

# భూమిక

'సమత' ఒక సాంస్కృతిక భావన. సంస్కృతి స్వభావము ననుసరించి దీనిని నిర్వచించుట గమనింపవచ్చును. 'ఈ క్వాలిటీ' అని పిలువబడే ఈ భావనను పండితులిట్లు నిర్వచించుచున్నారు.

"A Concept denoting the identical condition of people in society, but having different contents in different historical epochs and among different classes"[1]. A Dictionary of philosophy. P. 145.

భగవద్గీతలో సమతను గురించి రెండు విధములుగ చెప్పిరి.

1. సమత్వం యోగ ఉచ్యతే:

—2వ అధ్యాయము–48వ శ్లోకము, పుట–285

2. 'శునిచైవ శ్వపాకేచ పణ్డితాః సమదర్శినః

—5వ అధ్యాయము, 18వ శ్లోకము, పుట–460

ఈ రెండు చోట్లలోను 'సమ' శబ్ద ప్రయోగమున్నను వీని స్థాయి భిన్నమైనది. 'సమత్వం యోగ ఉచ్యతే' అన్నప్పుడు మనోబుద్ధులకు, చిత్త అహంకారములకు, కర్మేంద్రియ జ్ఞానేంద్రియములకు లౌకికాలౌకికములకు, 'సమత్వ' అధిస్థితిని 'సమాధి' అన్నారు. దీనికి వైరాగ్యము, ధ్యానము అనే రెండు అవయువములు ప్రధానములు. లౌకిక జగత్తు 'మిథ్య' యని దోష భూయిష్టమని, బాధామయమని భావించుట వలన పుట్టునది వైరాగ్యము, పరమసత్య స్వరూపమైన భగవంతుని గురించిన ఎరుక కలుగుటకై చేసెడి ప్రయత్నము ధ్యానము. ఇటు దేహము, అటు ఇంద్రియములు–ఈ రెండింటి యొక్క సమన్వయ స్థితిని 'సమత', అన్నారు.

'శునిచైవ శ్వపాకేచ' అన్నప్పుడు–కుక్కను, కుక్క మాంసమును తిను వానిని బ్రాహ్మణునితో సమానముగా చూచువాడు పండితుడు. వాడే సమదర్శి ఇచ్చట దర్శనము ప్రధానము. ఇది భావనకు సంబంధించినది.

వైయక్తికమైన సమాధి స్థితి, మానసికమైన సమత్వ దర్శనము–ఈ రెండును ఉన్నను మానవుడు అందుకోవజాలనిది క్రియాసమత్వము. దీనినే వ్యాపార సమత్వము అందురు.

---

1. Edited by M, Rosenthal and P. Yudin-A Dictionery of Philosophy (1967:P. 145)

భారత దేశములో ఎన్ని గొప్ప మత సంప్రదాయములు వచ్చినను, ఈ వ్యాపార సమత్వ విషయమున నిష్ఫలములై పోయినవి. అందుకే భావాద్వైతము, క్రియాద్వైతము వేరని తృప్తిపడి అనాది కాలము నుండి వైదికమతము అంటరాని మతమై మడికట్టుకొని, ఎవరికివారే సమూహములుగా బ్రతుకుట ఆచారమైనది కాబట్టి వైదిక మతము నందు 'ధర్మశాస్త్రము'లోనున్న సమత్వము ఆచరణలో లేదు

దీనికి భిన్నముగా అవైదిక మతాలలో కొంతకు కొంత సమతా దృష్టి ఉన్నది. దీనికి ప్రమాణము లోకాయతులుగాని, బౌద్ధులుగాని, జైనులుగాని, తాంత్రికులుగాని, సంఘము లేదా కులము అనే ప్రమాణాలుగా ఏర్పడుట వైదికులలో గోత్ర ప్రాధాన్యము ఉన్నది. గోత్రము అంటే జన్య సంబంధము కలిగి ఉన్నది. గణము, వంశ సంబంధము కలిగి ఉన్నది. కులము దీనికి భిన్నమైన శక్తి సంబంధము కలిగి ఉన్నది. సంఘము వీని అన్నింటికి అతీతమైన సామాజిక సంబంధము. వీరశైవము ఒక సంఘము తప్ప గణము కాదు. ఒక గోత్రము కాదు. అందుచేతనే అన్ని కులాల వాళ్ళు 'శివశరణు'లైరి. ఈ ఆందోళనమునకు స్ఫూర్తి నిచ్చిన బసవణ్ణను గాంధీజితో పోల్చవచ్చును.

"Basava and Gandhi are Fundamentally religious and both broadly below to this tradition of levellers. And both have strong faith in nondual conceplion of God and have struggled for Organic Unity of the Society".[2]

అని హెచ్. కళ్యాణ ప్రసాదుగారు మతముపై బసవణ్ణ, గాంధీలకుగల అభిప్రాయములను పోల్చిరి. ఇదే వీరశైవములో విశిష్టముగానున్న 'సమతాదృష్టి' ఇలా మనుష్యులను ఒక సూత్రములో కట్టి పెట్టే ఏదో ఒక సామాజిక సంబంధము ఉన్నప్పుడే మనుష్యులందరు ఒకటేనన్న భావన కలుగుతుందని సామాజిక విజ్ఞులు గుర్తించిరి.

వీరశైవము కాలక్రమములో హైందవ స్రవంతిలో కలసిపోయినది. ఇక్కడ కూడ బ్రాహ్మణ, బ్రాహ్మణేతర (ఆరాధ్య-జంగమ) భేదాలు ఏర్పడినవి. పెళ్ళి సంబంధాలు కూడ ఆయా వర్గాలలోనే జరుగుచున్నవి. భోజన భాజనాదులు కూడా వేరైపోయినవి దీనిని బట్టి మార్క్సిస్టులు గుర్తించినట్లుగా ఒక ఆర్థిక సమానత్వము ద్వారానే ఇతరమైన సమానతలు కూడ సిద్ధించునని చాల కాలము మేధావులు భావించిరి. కాని ఇటీవల ప్రపంచ దేశాలలో జరుగుతున్న పరిణామాలని బట్టి చూచిన ఆర్థిక సమానత్వ మన్న సూత్రమే దుస్సాధ్యమని,

---

2. H. Kalayana Prasad-Basava Journal 'December' (1984 :9p)

కమ్యూనిష్టు దేశాలలో కూడ భయంకరమైన అన్ని వర్గ వివక్షలు ఉన్నవని తెలియుచున్నది. ఇటీవల గోర్బచెవ్ ప్రతిపాదించిన 'పెరిస్త్రోయికా', 'గ్లాస్‌నాస్త్' అన్న సూత్రాల వెనుక మనిషి బాహ్యాంతర జగత్తులలో స్వతంత్రుడు కావలయునన్న అభిలాష కనిపించుచున్నది. ఈ స్వాతంత్ర్యము సిద్ధించుటలో మత ప్రమేయము చాల ఉన్నది. మతములు మనుష్యులను వేరుచేయును. ఈ భేదాల కతీతమైన ఒక 'తాత్త్విక స్పృహ' మనుష్యులను కలువగలుగుచున్నది. ఇక్కడే బౌద్ధము, వీరశైవము వంటి సాంఘిక దృక్పథములు ఈ నాటికి మార్గదర్శకముగా ఉన్నవి.

'శివుడు' అన్నమాట లింగాన్నో లేదా త్రిశూలధారినో సూచించిన కాలము ఉండినది. శివ శరణులకు శివుడు ప్రత్యక్షరూపము. తాను స్థిరముగా ఉంటూ ప్రతి జంగమ రూపములోను కనిపించును. 'ప్రతి మనిషి ఒక శివుడే'యని ఆనాటి సమాజము నమ్మినది. ప్రతి మనిషి మనిషేనని గుర్తించుటకు ఈనాటి సమాజము జంకుతూ ఉన్నది. ఈ వైరుధ్యాన్ని గుర్తిస్తే ఈనాటి సమాజము కన్నా ఒకనాటి బౌద్ధ సమాజమో లేక వీరశైవ సమాజమో ఒకింత మెరుగని ఎవరైనా చెప్పగలుగుదురు.

ఈ కారణము చేతనే ఈ సిద్ధాంత వ్యాసము 'వీరశైవ సాహిత్యములోని సమతాదృక్పథము'ను గురించి చర్చిస్తున్నది.

## అధ్యాయము — 1

## భిన్న సంప్రదాయములలో సమత్వ దృష్టి

(నాలుగు భిన్న కోణముల నుండి సమత్వ దృష్టిని నిరూపించుట కిచ్చటి ప్రయత్నము)

### 1. యోగశాస్త్రము :

యోగ శబ్దము 'యుజ్' అనే సంస్కృత ధాతువు నుండి ఉత్పన్నమైనది. 'యుజ్' అనగా 'కలయిక', లేక 'ఐక్యము', లేక 'జతచేయుట' అని యర్థము. దీనినే 'టులింక్' అని అందురు. The word YOGA means UNION. Possibly it is derived from the same root as the English word YOKE. ప్రతి మతసంప్రదాయము భగవంతుని అనుసంధానమునకు ఒక్కొక్క మార్గమును అవలంబించినది. భక్తి, కర్మ జ్ఞానములుగా మార్గములు త్రిధావిభక్తములైనవి. వీనికి అతీతమైన సమన్వయ సూత్రము యోగము. సుఖదుఃఖ, లాభాలాభ, కీర్తి అపకీర్తి, జనన మరణ, జ్ఞానాజ్ఞాన, పుణ్య పాపాది ద్వంద్వముల నడుమ అన్వయమును సాధించుటయే సమత్వమని, యోగమని భగవద్గీతా కారుడు చెప్పియున్నాడు. 'సమత్వం యోగ ఉచ్యతే' అని గీత చెప్పిన నిర్వచనము. హఠయోగ, రాజయోగ, ఆచర యోగ, భృక్త రహిత తారక యోగాది న్న మార్గములన్నియు ఈ ద్వంద్వాతీత స్థితిని అందుకొనుటకే సాధకుని ప్రబోధించినవి. ఆత్మజ్ఞాన గవేషణలో ఈసమత్వ స్థితికి వారికి సాధన సంపత్తిగా మారి యోగులను సంఘమునకు దూరముగా అరణ్యములలోను, గుహలలోను ఉండునట్లు చేసినది తప్ప వారుతమతోటి వ్యక్తుల జీవితగమనమును యోగబలముచేత మార్చినట్లుగా నిరూపణలులేవు. ఆత్మ సాక్షాత్కారము, శాశ్వతానంద అనుసంధానము యోగులను శుద్ధ భావవాదులుగ మార్చినదేమో కాని వారిని సంఘ సేవకులుగా మార్చలేక పోయినది. జైన బౌద్ధములందు 'నిర్వాణ' మనుపేర వైదికము నందు 'ముక్తి' యనుపేర యోగమునకు ధ్యేయము ఒక అలౌకిక పదముతప్ప లౌకికజీవితమున సమత్వస్థితి యనుట కాకపోయినది.

భారతదేశమున నున్న వర్ణ వ్యవస్థ ఈ యోగ ఫలితమును కూడ కొందరికే చెందునట్లుగా ప్రత్యక్షముగనో, పరోక్షముగనో శాసించియే

యున్నది. ఒక నిదర్శనమును చూతము. యోగికి బ్రహ్మకర్మ సమాధి యుండవలయును. దానిని పొందుటకు బ్రాహ్మణ్యమవసరము. బ్రాహ్మణ్యమును కలిగినవాడే బ్రాహ్మణుడు. కనుక అన్ని జాతుల వారును బ్రాహ్మణ తుల్యమును పొంది సిద్ధిని పొందవలయును. ఒక ఉదాహరణము ధర్మవ్యాధుని కథ. ధర్మవ్యాధుడు జన్మతః హీనకులజుడు. కుల క్రమాగతమైన మాంస విక్రయము ఆయన వర్ణ ధర్మము. కాని అది మిక్కిలి పాప కర్మమని తెలిసిన జ్ఞానవంతుడు ధర్మవ్యాధుడు. కనుక తాను జంతువులను చంపక యితరులు చంపి తేగా ఆ మాంసమును విక్రయించుచు తన వర్ణ ధర్మ పరిరక్షణ కావించుకొనుచు కౌశికునకు ధర్మమును బోధించగల అర్హతను సంపాదించెను. తాను సాత్వికుడనని, బ్రహ్మజ్ఞానమునకు కావలసిన అర్హతను సంపాదించానని ధర్మవ్యాధుడు మాటి మాటికి చెప్పుకోవలసిన అవసరమేమున్నది? ఎందులకనగా బ్రాహ్మణ్యము చేతనే సమత్వము సిద్ధించుననుట తాత్పర్యము కాదు. ఇట్లు శ్రుతి గ్రంథములు గాని, భగవద్గీతాది ఉపనిషత్తులుగాని బ్రాహ్మణ్యమును ఒక నిర్బంధ గుణ శీలముగా నిబంధించినవి. కావున యోగము నాశ్రయించిన ఈ సమత్వ దృష్టి సామాజిక జీవితమున స్థాయీ భేదములనే సృష్టించినది.

## 2. పాశ్చాత్యుల "ఈక్వాలిటీ" !

పాశ్చాత్య సంస్కృతిలో భౌతిక జీవితమునకు అతి ప్రాచీన కాలము నుండి ప్రత్యేక పరిగణనయున్నది. అందుకే నిఘంటువులిట్లు నిర్వచించుచున్నవి.

The condition of having equal dignity, rank or privilege with others, the fact of being on an equal footing by the condition of being equal in power, ability, achievement or excellence.[1]

వర్ణ వ్యవస్థ పేరున కాకపోయినను తెలుపు నలుపు భేదములు ఆనాటి నుండి ఈ నాటివరకు పాశ్చాత్య దేశముల యందు పాతుకుపోయిన దుష్ట సంప్రదాయము. అయినను వృత్తిలోని స్థాయిభేదములే తప్ప జన్మాగత

1. The Oxford English Dictionary-Volume III Oxford at the Clarendon Press (1961 : Page 253)

షమయిన వర్ణ విభేద పరిగణన పాశ్చాత్యులలో లేదు. నలుపు పట్ల వారికి యున్న దృష్టి "తెగ" ద్వేషము తప్ప వర్ణ ద్వేషముకాదు. కనుకనే గ్రీకుల కాలము నుండియు ప్రజాస్వామ్య జీవిత ధోరణి పాశ్చాత్యులకు సహజముగ ప్రీతి పాత్రమైనది. రాచరికము మీద, మతము మీద ఎప్పటికప్పుడు ఉద్యమములు సాగుచునె వచ్చినవి. తొలిసారిగ "రినైజాన్సు" (15వ శతాబ్దము) సమయమున యూరప్ దేశములందు మతాతీతమైన మానవుని సంస్కృతి గురించి మధ్య తరగతి మానవుల గురించి ఆలోచనలు మొదలయినవి. ఫ్రెంచి విప్లవములో వాల్టర్ రూసో ఇచ్చిన ప్రధానమైన నినాదము-"స్వాతంత్ర్యము, సమత్వము, సౌభ్రాతృత్వము". రష్యా విప్లవమునకు ప్రేరణ ఈ సమత్వ భావమే.

3. భారత రాజ్యాంగము :

భారత దేశమునకు స్వాతంత్ర్యము వచ్చిన తరువాత డాక్టరు బాబాసాహెబ్ అంబేద్కరు ప్రభృతులైన రాజ్యాంగ నిర్మాతలు సమత్వస్థాపనే లక్ష్యముగా నుద్ఘాటించియున్నారు. వీరి దృష్టిలో సమత్వమనగా అన్ని మతములను సమానముగా గౌరవించుట.

"ప్రజలందరు సమాన హక్కులు కలిగియుందురు. దీనినే భారత రాజ్యాంగము 'సమానత్వ' హక్కుగా పరిగణించినది"-అని కె.పి. మల్లికార్జునుడు తెలియజేయుచున్నారు.

'Equality of status and opportunity and to promote among them all'-November 1949 Constitution of India.

ఇట్టి కొన్ని సూత్రములను పరిశీలింతము :

ఎ. ,,ఏ వ్యక్తికినీ శాసన సమక్షమందు సమానత్వమును గాని, భారత దేశములో శాసనము వలన సమాన రక్షణమును గాని రాష్ట్రము నిరాకరింపకూడదు''

బి. "ఏ వ్యక్తియైనను తమ మతము యెడల గౌరవ భక్తులు కలిగియుండవచ్చును. అతనికి మత స్వాతంత్ర్యము కలదు. ప్రభుత్వము మతము, తెగ, వర్ణము, లింగము, జన్మ స్థలము మాత్రము లేక వానిలో

దేనినైనను పురస్కరించుకొని ఎట్టి పౌరునకును వ్యతిరేకముగా రాష్ట్రము వివక్ష చూపకూడదు".[2] -సూత్రము 13-(1).

సి. "అంటరాని తనము, దాని ఆచరణ ఏ రూపములోనైనను నిషేధింపబడినది. అస్పృశ్యత నుండి ఉద్భవించినట్టి ఏ అనర్హత యొక్క అమలును శాసన ప్రకారము శిక్షార్హమైన నేరముగా నుండవలెను".[3] - సూత్రము-17.

డి. "అంతరాత్మ స్వేచ్ఛకు మతమును స్వేచ్ఛగా అవలంబించుటకు, ఆచరించుటకు, ప్రచారము చేయుటకు గల హక్కునకు వ్యక్తులందరు సమానముగా అధికారము కలిగియున్నారు. అనగా అంతరాత్మ యొక్క స్వేచ్ఛయు, మతము యొక్క ప్రచారము, అవలంబనము ఆచరణల యొక్క స్వేచ్ఛ కలిగియున్నారు."[4] సూత్రము-25.

## 4. మార్క్సిస్టుల దృక్పథమున సమత :

ఇంత వరకు చర్చించిన రెండు సంప్రదాయముల కన్న భిన్నముగా 'సమత'ను గురించి ఆలోచించినవారు మార్క్సిస్టులు. ఒక్క 'ఆర్థిక సమానత' ద్వారా మాత్రమే జీవితములో అన్ని రంగములలోను సమత సిద్ధించునని వీరి ప్రతిపాదన. గత చరిత్ర అంతా వర్గ పోరాటముల మయమని, ఉన్నవారికి లేనివారికి నడుమ నిరంతరము జరిగిన సంఘర్షణలోనే చరిత్ర పుట్టినదని, కావున ఆ సంఘర్షణ ద్వారా మాత్రమే ఈ భేదములు తొలగిపోయి మానవులు ఒక ఆదర్శ సమతా సమాజమును స్థాపించుకొనగలరని వీరి యభిప్రాయము.

ఆర్థిక వ్యవస్థ జీవితములో ఇతర వ్యవస్థలకు ఆధార భూతమైనదని,

---

2. కె.పి. మల్లికార్జునుడు-భారత రాజ్యాంగము. (తెలుగు అనువాదము) (1951 : పు 5)

3. కె.పి. మల్లికార్జునుడు-భారత రాజ్యాంగము (తెలుగు అనువాదము) (పు 7)

4. కె.పి. మల్లికార్జునుడు-భారత రాజ్యాంగము. (తెలుగు అనువాదము) (పుటలు 11, 12)

అందులో మార్పు రాక మానవులలో సమత సిద్ధించినదనుట వట్టి 'భావ వాద' ప్రచారమని, శాస్త్రీయ సత్యము కాదని వీరు విశ్వసింతురు.

వీరి విశ్లేషణ ప్రకారము మత సిద్ధాంతములన్నియు మనిషిని వాస్తవిక దృక్పథము నుండి వేరు చేసి, తన సమస్యను తాను గుర్తించకుండా ఉండుట కొరకు ఉన్న వారు ప్రచారములోనికి తెచ్చిన 'కుహనా సిద్ధాంతము' అందుచే మతమును 'మత్తుమందని' కారల్ మార్క్సు నిరసించెను.

ఈశ్వరుడే లేడని, ఉన్నది మానవుడు ఒక్కడే అని భావించు సమాజము ఏ సమతా సామరస్యములను సాధించునో రష్యన్ దేశములు ఈ శతాబ్దమునందు చక్కగా నిరూపించినవి.

మానవ జీవితమున ఆర్థిక స్థితిలో మార్పు వచ్చుట ద్వారా సమత ఏర్పడదని, మనిషి నిరంతరము మత పరమైన, ఒక గాఢమైన ఓదార్పును అభిలషించుచునే ఉండునని రష్యన్ దేశములు బహుధా నిరూపించినవి.

ఈ నేపథ్యము నుండి వీరశైవము ప్రతిపాదించు 'కాయక సిద్ధాంతము'ను పరిశీలించినచో మానవుని బాహ్యాంతర జగత్తులయందు సమత అనగా నేమో అర్థము చేసి కొనవచ్చును.

అధ్యాయము — 2

## వీరశైవము-విశ్వమతసారము

(శైవేతర, శైవ మతముల చరిత్ర, మత లక్షణములు ఇచ్చట వివరింపబడుచున్నవి. పురాతన, నూతన భక్తుల ప్రభావము తో బసవేశ్వరుడు వీరశైవమును సంస్కరించిన విధము తెలుపబడినది. వీరశైవ సూత్రములు తత్వములు, తంత్రములు పేర్కొందును. ప్రధానముగా వీరశైవము వివిధ మతములలోని సమతా ధర్మముల ప్రాతి పదికపై విశ్వ మతసారము నెట్లు గ్రహించినదో నిరూపించు ప్రయత్నమే ఈ అధ్యాయమందలి ప్రధానాంశము.)

### మత నిర్వచనము :

'Religion' అను అర్థమున వాడబడు మతము అనేకార్థములు కలిగినది మత శబ్దార్థ విచారణ చేసినచో 'ఇష్ట' మని తెలియుచున్నది. అభిమతము, మతము. 'ఓటు' అను అర్థములను పరిశీలించినచో మానవుడు తనుగా తాను ఎన్నుకున్న దారి మతమని గుర్తింపవచ్చును. Religion as defined by Anthropologists is 'a system of beliefs and practices among the Societies'. ప్రాచీన కాలమున మానవ సమాజమును గుర్తించుటకు భాషతో పాటు మరియొక ప్రమాణము మతమైనది. అతి ప్రాచీన కాలమున మానవుడు ఒక అతీంద్రియ ప్రాణ శక్తిలో విశ్వాసమును చూపినాడని తెలియుచున్నది. ఆ ప్రాణ శక్తిని రకరకములగు వస్తువులలో, జంతువులలో, వృక్షములలో దర్శించినాడు. ఆయా సంకేత సూచనమే లేదా బలి విధానమే కాలక్రమములో మత రూపమును పొందినది. ఆయా సంకేతములే దైవములుగా స్థిరపడినవి. అందువలన దైవ భావన, విలక్షణమైన ఆచార వ్యవహారములు, ప్రత్యేకమైన జీవితపు విలువలను కలిసి ఒక మత స్వరూపమును నిర్ణయించును. కావుననే ఒక మత చరిత్ర సమాజ చరిత్ర కాగలుగుచున్నది.

### వైదిక మతము :

ఇది వేదము ననుసరించిన ప్రజా జీవనము. మధ్య ఆసియానుండి ఒక తెగ ప్రజలు భారత దేశమునకు వలస వచ్చిరి. వీరే ఆర్యులు. వీరు

కర్రతోను, ఆకులతోను నిర్మించిన గుహలలో నివసించుచు, ఫలములు భుజించుచు, పాలను, సోమరసమును గూడ త్రాగుచుండిరి. ఆంధ్ర దేశములో కృష్ణా, గోదావరి నదీ ప్రాంతాలలో ఆర్య సంఘములు మొదట వ్యాపించినవి. వేదములను అనుష్ఠించుచు, వైదిక కర్మలకు సంబంధించిన ఆచార వ్యవహారములను అవలంబించిరి. ఇది క్రీ.పూ. 4,500 సంవత్సరముల నుండి మొదలై యుండవచ్చునని 'అపస్తంబ మహర్షి'-దక్షిణాది వాడు సూచించెను. వర్ణాశ్రమ ధర్మములను పాటించుట, యజ్ఞ యాగాది క్రతువులను, కర్మ కాండలను నిర్వహించుటచే దైవమును దర్శించుటకు యత్నించిరి. ప్రజలు కర్మ, భక్తి, జ్ఞానముల నవలంబించిరి. సంస్కృతములో చతుర్వేదములు, వేదాంగములు, ఆరణ్యకములు, ఉపనిషత్తులు దర్శనములు ఇత్యాది వైదిక వాఙ్మయ విజ్ఞానము అద్భుతముగా నున్నది.

ఉచ్ఛస్థితిలోనున్న వైదిక మతములోని ఉన్నత వర్గాలవారు సమాన స్థితిగల వారిని తృణీకరించుట జరిగినది. దానితో మిగిలిన వర్గాల ప్రజలకు మత నియమముల పట్ల ఉదాసీనత యేర్పడుట, కొన్ని సందర్భముల్లో మానవతా విలువలు నశించుటకు కారణమగుట జరిగియుండ వచ్చును. క్రీ.పూ. 567 సం. నాటికి ఉపనిషత్తుల పతనము జరిగి బాహ్యాచారముల ఆడంబరములు హెచ్చియుండును. వానిలోని విజ్ఞానము సామాన్యులకు దూరమై మూఢాచారముల మేఘములు క్రమ్ముకొన్నవి. కర్మకాండ పేరుతో దోపిడి విధానము వ్యవస్థీకృతమై యుండెను. సామాన్యుడు బుద్ధి దిశలో ప్రయాణించుట జరిగినది. దాని ఫలితమే బౌద్ధ మతము.

## శైవేతరములు

### ఎ. బౌద్ధ మతము :

గౌతముడు స్థాపించి ప్రచారము గావించెను. 'ఇది అవైదిక ఆలోచన గల్గిన శాఖ, ప్రస్తుతము నేపాల్‌లోని కపిలవస్తు నగరములో గౌతముడు మాయదేవి, శుద్ధోదనులకు క్రీ.పూ. 567లో జన్మించెను. ఆనాడు మతము 'కర్మ ప్రధానం-అవశ్యం, అనుభోక్తవ్యము'గా నుండినది. ఆనాటి పరిస్థితిని హెచ్. శివరుద్రస్వామి చక్కగా విశ్లేషించారు.

"Buddha came; it may be stated as a sort of reaction and revolt against empty ritualism and social discrimination."[1]

గౌతముని అష్టాంగ మార్గము వలన, రాజ భోగాలు అనుభవింప వలసిన యువరాజు సన్యసించెను. 'బుద్ధం శరణం గచ్ఛామి', 'ధర్మం శరణం గచ్ఛామి', 'సంఘం శరణం గచ్ఛామి'యని ప్రజల నుద్బోధించెను. 'అహింసా పరమోధర్మః' యని చాటి చెప్పెను. సామాన్య ప్రజానీకము బుద్ధుని బోధనలకు ఆకర్షితులయిరి. రాజు త్రోవనే నిది కూడ, జీవాత్మ, పరమాత్మ వేరుగా చెప్పబడెను. ఆదిలో నాస్తికమై, సత్య దూరమైన ఈ మతము దైవారాధనకు దగ్గరై రాను రాను తాను నమ్మిన సిద్ధాంతములో మార్పులను స్వీకరించినది. బౌద్ధ మతమును పాటించువారిని 'శ్రమణు' లందురు.

కాల క్రమేణా 24 మంది బుద్ధులవతరించిరి. రాను పోను హీన యానం, మహాయానముగా చీలి పోయినది. ఈ నిరీశ్వర ఉద్యమానికి, అనాత్మ వాదానికి, నిరాశ నిస్పృహలకు ప్రజలు తట్టుకొనలేక పోయిరి. "బౌద్ధులు బిడారాల మార్గములు పట్టిరి. క్షీణ దశలోనున్న బౌద్ధ ఆరామాలు లంజ దిబ్బలయ్యాయి"[2] అని కంభంపాటి సత్యనారాయణ నాటి పరిస్థితిని సమీక్షించినారు.

చివరకు వర్ణాశ్రమ ధర్మముల చట్రములో ఇమడని బౌద్ధము క్షీణించుట మొదలయినది. 'బుద్ధుని బోధనలు కుక్క మూతిపై చిలకరించిన పాలు'[3] అని 8వ శతాబ్దపు కుమారిలభట్టు అన్నట్లు బి.ఎస్.ఎల్. హనుమంత రావు పేర్కొన్నారు. "బౌద్ధ సన్యాసిని చూడడం అశుభమని యజ్ఞవల్క్య స్మృతి ఉద్ఘోషించినదని' తెల్పబడినది. అద్వైతమును ప్రబోధించిన

1. H. Thipperudra Swamy Essay in - 'Sri Basavesvara' (1967 : P. 381)
2. కంభంపాటి సత్యనారాయణ - ఆంధ్రుల సంస్కృతి-చరిత్ర (1988. పుట 70)
3. B.S.L. Hanumantha Rao-Religion in Andhra (1969-70 : P. 137)

అది శంకరాచార్యులు 'బుద్ధుడు ప్రజల శత్రువని'[5] చాటిచెప్పెను. ఈ విధమైన సన్యాసము అశుభమని తలంచుట మొదలయినది తూర్పు దేశాలకు వ్యాపించుచునే చివరకు ఉద్యమము నిరసించినది. కోర్కెలను జయించుటలోనే గొప్ప తనమున్నదని గుర్తించుట జరిగినది. ఈ భావన మరొక క్రొత్త మతమునకు నాంది పల్కినది

బి జైనమతము :

'జిన' అనగా జయించుట అని అర్థము అనగా మానవులు కోర్కెలను జయించుట క్రీస్తుకు పూర్వము 540 సం॥లో వైశాలి నగరములో కుంధ పట్టణములో త్రికాలదేవి, సిద్ధార్థులకు మహావీరుడు జన్మించెను. దీనికి అహింసావాదము బలమైన పునాదులు ఇది గుఱ్ఱము, కోతి మొదలగు టొటమిక్ చిహ్నములు కలిగియున్నది. ఆగమములు సారముతో వెలసినది. ఇందు ఆత్మ పరమాత్మ వేరుగ చెప్పబడినది. 'సత్యమేవ జయతే యని పల్కినది. బ్రహ్మ చర్యమును ఉత్తమమని ప్రతిపాదించిరి. బౌద్ధమతము వలె ఇది కూడ అవైదికమైన మతము. నాస్తిక భావములు కలిగియున్నది. ఇందలి సన్యాసులను 'శ్రమణు'ని, సన్యాసినులను 'అజ్జి' కలసి యుందురు. "కోర్కెలను జయించుటతో పాటు ఆస్తి సేకరణలో సంతృప్తి పడాలని"[6] కంభంపాటి సత్యనారాయణ వివరించారు. ఆస్తికి సంబంధించిన మొదటి నిబంధన బహుశా ఇదే కావచ్చును. Jainism is a Science of arbitrary rules and Capricipus and not a code Commandment"[7].

యని సి. ఆర్. జైన్ నిర్వచించారు. ఈ మతము మూల పురుషులైన "ఋషభుని అజిత్, అరిష్టనేమి పేర్లు" యజుర్వేదములో నున్నవని శ్రీ సర్వేపల్లి రాధాకృష్ణన్ తెలిపిరి. ఇందు 24 మంది తీర్థంకరులు ముఖ్యులు

---

4. Ibid (Page 137)

5. Ibid (Page 137)

6. కంభంపాటి సత్యనారాయణ-ఆంధ్రుల సంస్కృతి చరిత్ర ||
(1988 : పుట 58)

7. C.R. Jain-Essay in 'Sri Basavesvara' (1967 : Page 400)

చంద్రగుప్త మౌర్య చక్రవర్తి ద్వారా కర్నాటకకు వ్యాపించినది. అచ్చటి నుండి ఆంధ్ర ప్రదేశమునకు ! మనిషి మనుగడకు పంచ శీలములు ప్రతిపాదింపబడియున్నవి. దీనిలో అష్టాంగ పూజ చేర్చబడినది. నేడు మన దేశములో నున్న 18 శైవ మఠములు తీర్థంకరుల గుడులే నసిన జైన మతము ఎంత ఉచ్ఛస్థితిలో ఉండినదో ఊహింపవచ్చును.

తరువాత జైనమతము శ్వేతాంబరులు, దిగంబరులు అను రెండు శాఖలుగ చీలిపోయినది. ఈ మతము క్షీణించుటకు అనేక కారణములు కలవు. "వర్ణ విభేదాలను, అస్పృశ్యతను గురించిగాని, స్త్రీ పురుషుల హక్కులలోని అసమానతలను గురించిగాని, జైన మతము నోరు విప్పలేదు" అని కంభంపాటి సత్యనారాయణగారు లోపమును తెలిపారు. జైన కాపాలికులు కాపాలిక స్త్రీలతో విహరించుట, మధు మాంస భక్షణము ప్రజలలో వారికి విలువ లేకుండ జేసినవి రాను పోను జైనులు పర్వతముల జేరిరి, తమ వసతులైన పంచారామములను నిలుపుకొనలేక పోయిరి. అని క్రీ॥శ॥ 9వ శతాబ్దము తర్వాత వీరశైవుల ప్రాబల్యమునకు గురియైనవి.

సి. అద్వైతము :-

ఇది జీవుడు, దేవుడు ఒక్కరేయను సిద్ధాంతము. కేరళలోని కాలడిలో జన్మించి కాశ్మీరు వరకు సంచరించి క్రీ॥శ॥ 788 నుండి 820 వరకు జీవించిన ఆది శంకరాచార్యులు స్థాపించిన మతము. ఇతడు మహా పండితుడు, తార్కికుడు. వేదాంతి, వేదములకు భాష్యము చెప్పినవాడు. 'బ్రహ్మ సత్యం జగన్మిథ్యా-జీవో బ్రహ్మైవనాపరః', 'అహం బ్రహ్మాస్మి' యన్నది వీరి సిద్ధాంతము. శంకరాచార్యులు "మీ మాంసకుల కర్మవాదమును, సాంఖ్యుల ప్రకృతి వాదమును ఖండించె"[8]నని దేవీప్రసాద్ చటోపాధ్యాయ వివరించారు. నిర్గుణ, నిరాకార తత్త్వాన్ని బోధించిన జ్ఞాన మార్గమునకు విద్యాయోగ్యత ఉన్నవారంతా ఆకర్షింపబడిరి. ఈ జగత్తంతా 'మాయ' గా అభివర్ణింపబడినది. మనిషి శీలమునకు, జ్ఞానమునకు ప్రాశస్త్యాలు ఉద్ఘోషించినది. "ఆచార్య శంకరుని మాయా వాదమునకు నాగార్జునుని శూన్య వాదమే ప్రాతిపదికయని తత్త్వజ్ఞులు తలంచుచున్నారు"[9]ని ఆచార్య

8. దేవి ప్రసాద్ చటోపాధ్యాయ-భారతీయ తత్త్వశాస్త్రం (1986 : పుట 111)
9. ఆచార్య ఖండపల్లి లక్ష్మి రంజనము-ఆంధ్రుల చరిత్ర సంస్కృతి (1951 : పుట 128)

ఖండవల్లి లక్ష్మీ రంజనము అభిప్రాయ పడినారు.

కాలక్రమేణా, సిద్ధాంతానికి, ఆచరణకు సంబంధము లేకుండా పోయి భావ వాదము ఏర్పడినది. శబ్ద ప్రాధాన్యానికి, అనుభవానికి మధ్య అంతరము పెరిగినది. సామాన్య ప్రజలకు బ్రహ్మ సత్యమన్నది దుర్భేద్యమయినది.

## శైవము :

'శివస్య ఇదం శైవం' శైవ మతము శివుని గూర్చి తెల్పునది. ఇది కేవలము భక్తి ప్రధానమైనది. శైవ మతము యొక్క చరిత్రను, తత్త్వమును సూక్ష్మముగా పరిశీలించెదను. యజ్ఞ యాగాది క్రతువులను నిరసించినది. ఇది అతి ప్రాచీనమైన మతము. క్రీ॥పూ॥ రెండు వేల సంవత్సరములనాటి మొహంజదారో, హరప్పాల సంస్కృతిని పరిశీలించిన "ఆర్యులు శైవ మతము ననుసరించిరని, రోమ్ యునానులలో ప్రిమేపస, వల్లుస అనుపేర్లతో లింగపూజ జరుగుచుండెను". ఋగ్వేద కాలమునాడు క్రీస్తుకు వేయి సం॥ పూర్వము రుద్రుడు దైవము. దుష్ట శిక్షణ, శిష్ట రక్షణ అతని గుణములు, శివుని లింగ రూపములో పూజించుచుండిరి. అధర్వణ వేదము రాకతో (?) రుద్రుడు పశుపతి అయ్యెను. శ్వేతాశ్వతార ఉప నిషత్తులో రుద్రుడు గొప్ప దైవముగా భావింపబడెను. మహాభారతములో అర్జునుడు శివుడి మెప్పించి పాశుపతాస్త్రాన్ని పొందినట్లు తెలియగలదు. గుప్తుల కాలములో 320 ఏ.డి. నాడు శైవ మతము దేశమంతటా వ్యాపించి నది నాస్తిక మతముల నుండి మానవులను తప్పించుటకు ఆస్తికమైన వైదిక సంస్కృతిని ఆకర్షణీయముగ చేయుటకు అవలంబించిన మార్గములే ఈ శైవాది మతములు.

ఈ మతమునకు అధికారములు 28 శైవాగమములు. ఆగమ శబ్దమును గ్రంథములు ఇట్లు నిర్వచించుచున్నది.

ఆ — శివుని నోటి నుండి పుట్టిన దనియు,
వేదార్థము కలిగిన దనియు,

గ — పార్వతి చెవిలో చెప్పబడిన దనియు,
స్వర్గ, మర్త్య పాతాళములను వివరించునదనియు,

మ — శివుని భక్తుల మతమనియు, మంత్ర
భూషణమైన దనియు,

ఆర్థము

కారణాగమము మొదలుకొని వాతులాగమము వరకు కలవు. ఆగమమును కొందరు తంత్రమని కూడ అందురు. ఆది శైవ మత ప్రచారకుడు కూడ శివుడేయని చెప్పాదురు బ్రహ్మ సూత్రములకు, శంకర భాష్యమునకు వ్రాసిన టీకలో శైవము, పాశుపతము, కారుణిక సిద్ధాంతము, మరియు కాపాలిక మతములు పేర్కొనబడినవి.

శైవములోనె స్కాందము, లైంగము, కౌర్మము, వామనము, వారాహము, భవిష్యము అను శాఖలు కలవు - అని మార్కండేయ మహాత్మ్యములోని బ్రహ్మ ఖండములో నున్నది. శైవ మత శాఖలు గొప్ప ఉద్యమములుగా వ్యాపించి, వర్ధిల్లక యుండినను వీరశైవ మత ఆవిర్భావమునకు తోడ్పడినవి.

## శైవ మతములు

ఎ. పాశుపతము :

ఇది పశుపతి పాశమునకు సంబంధించిన నమ్మకము. "దీనిని శ్రీకంఠ శివాచార్యుని శిష్యుడయిన ల (న) (వ) కు లీశ భట్టారకుడు రెండవ శతాబ్దములో పూర్వార్ధమున ప్రతి పాదించెను"[10]. ఇతడు లాట దేశమున నర్మదా నదీ తీరముననున్న కారోహణ అను గ్రామమున జన్మించెను. ఇది న్యాయ, వైశేషికములవై నాధారపడియున్నవి. లకులీశ శివాగమము చాల ముఖ్యమైనది. "దాదాపు ఐదవ శతాబ్దమునకు చెందిన కౌండిన్యుడు కార్య, కర్మ, యోగ, విధి, దుఃఖాంతములను చర్చించెను."[11] ఈ మతస్థులు క్రమముగా ఉత్తర భారతమునుండి ఆంధ్ర దేశమునకు వ్యాపించిరి. వర్ణ వ్యవస్థను పాటించిరి. స్నాన, జప, హోమ, నియమ

10. B.S.L. Hanumantha Rao-Religion in Andhra (1969-70 : Page 354)

11. Dr. H.M. Sada Sivaiah-A Comparative study of Two Virasaiva Monasteries (1967 : Page 7)

ధ్యానానుష్ఠాన తత్పరులు. కౌపీన మౌంజీ ధరులు. వీరు రుద్రాక్షాలంకారులు జంగమ లింగావతారులు. వీరు లింగమును తల మీద ధరించుటచే మహేశ్వరులుగా పిలువబడిరి. అహింస నాశ్రయించి, త్యాగములను తూలనాడిరి. భిక్షుక వృత్తిపై జీవించిరి. ఈ మతము ఆంధ్ర దేశములో ఏడవ శతాబ్దమున వ్యాపించినట్లు తెలియును. గుంటూరు జిల్లాలోని దుర్గమ్మ గుడికి సంబంధించిన శాసనములో "ప్రతిదినము ఐదుమంది పాశుపతులకు భోజనవసతికై దానముచేయబడినట్లు" [12] తెలియుచున్నది.

బి. కాలముఖులు :-

ఆంధ్రదేశములో ఎనిమిదవ శతాబ్దమున ఈ మతము ప్రాచుర్యము పొందినది. కర్ణాటకములో క్రీ॥ శ॥ 790 సం॥ నుండి యున్నట్లు కన్పించును. లకులీశుని శిష్యుడైన 'కౌరుస' మూడవ శతాబ్దమునకు చెందినవాడు మరియు ఈ మతమునకు మూల పురుషుడు. వీరు అవైదికులయి కర్మను నిరసించిరి. వీరిని ఉత్పాత పిడుగులందురు. నాదేండ్లలోని గుడులకు పూజరులుగ యుండిరి. ఆ తెగలోని లకులీశ పశుపతి పూర్తి శాకాహారిగ జీవించెను. "వీరు శాస్త్ర పారంగతులై గృహస్థులుగాక ఆజన్మ బ్రహ్మచారులయి స్వమతమును సర్వ వ్యాప్తమొనర్చిరి. మఠములను కూడ నెలకొల్పి పేదలకు అన్నదానములు గావించిరి." [13] శరీరమంతా బూడిదపూసికొని, కట్టెను చేత ధరించి, మత్తుపానీయము గల కడవను వెంటపెట్టుకొని పోవుచుండిరి. వీరి పేర్లలో చివర పండిత కాని రాశి, శక్తి ముని గాని యుండును, కర్ణాటకలో కాలముఖుల ఆధీనములో నున్న 'హులి' మరియు ప్రాచీన 'సిద్ధేశ్వరుని గుడి' తర్వాత వీరశైవుల ఆధీనమైనవి.

సి. కాపాలికులు :-

వీరు కపాలమును చేత ధరించెడివారు. "ఆనంద గిరి అభిప్రాయ

12. B.S.L. Hanumantha Rao - Religion in Andhra (1969-70 : Page 278)

13. Ibid (Page 278)

సంబంధమైన శాఖలను పేర్కొనెను." 14 శంకరాచార్యుని మతములో అబ్రాహ్మణ సంబంధమైన శాఖవారు, వీరికి శ్రీశైలము కేంద్రముగా నుండెను. శివుని రూపమైన మహాభైరవుని కొలిచెడివారు. వీరికి వివిధ ములైన పేర్లు యుండెను. వీరికి అఘోర పంథులని మరియొక పేరు యుండెను. వీరుకూడ కాలముఖులవలె అవైదికులై కర్మను నిరసించిరి. మెడలో మాలను ధరించి ఒక అభరణమును కలిగి చెవికి భూషణమును వేసికొని, శరీరమునకు బూడిద రాసుకొని శంఖ ధ్వని విభూషితులుగా నుండిరి. బిలములలోను, శైల వివరములలోను, సమాధులలోను నివసించు చుండిరి. బూడిదను కూడ తినుచుండిరి. వీరిలో కొందరు యుద్ధోప వీతమును గూడ ధరించిరి. 'నమశ్శివాయ' మంత్రమును జపించుచుండిరి వీరు పంచమ కారములయిన - మద్య, మాంస, మత్స్య, ముద్ర, మైధునమును పాటించిరి. 'మాలతీ మాధవము' రోజులలో శ్రీశైలము కాపాలికులకు ప్రధాన స్థానమట. జైనమత వసదులవలె మతమును బోధించుటకు, భోజన వైద్య విద్యా వసతుల కల్గించుటకు మఠముల నేర్పాటు చేసిరి. వీరి భయంకర అలవాట్లకు సామాన్య ప్రజానీకము విభ్రాంతులైనట్లు ఊహింపవచ్చును.

డి. శైవ సిద్ధాంతము :

ఇదియే తమిళ దేశములోని శైవ మతము. వీరు కూడ శైవ మతస్థుల వలె ఇరువది ఎనిమిది ఆగమములను పాటించెదరు. కామిక, యోగజ, చింత్య, కారణ, అజిత, దీప్త, సూక్ష్మ, సహస్ర, అంశుమాన, సుప్రభేద' విజయ, నిశ్వాస, స్వయంభువ, అనల, వీర, రౌరవ, మకుట, విమల, చంద్రజ్ఞాన బింబ, ప్రోద్గీత, లలిత సిద్ధ, సంతాన, సర్వోత్తర, పరమేశ్వర కిరణ మరియు వాతుల ఆగమములు.

ఇది ద్వైత సంబంధి. పతి-శివుడు, పశువు-ఆత్మ, పాశము-బంధము లకు సంబంధించినది. పతికి వివిధ నామములు గలవు "పతి, శివుడు, అక్షరుడు, అజడము, చేతనుడు, నిభువు, జ్ఞాని, ప్రేరకుడు, కర్త-

---

14. Dr. H.M. Sabasivaiah-A comparative Study ot Two Virasaiva Monasteries (1967 : Page 8)

స్వతంత్రుడు మొదలగునవి. పశునామములలో పశువు, జీవుడు, క్షరుడు, జడుడు, అచేతనుడు, అణువు, అజ్ఞాని, భోక్త, అస్వతంత్రుడు మొదలగునవి. పాశనామములలో-పాశము బంధము, జడా జడము, క్షరాక్షరము చేతనా చేతనము భోగ్యము మొదలగునవి"[15] డా. యం. భవాని తెలుపుచున్నారు. "శివుడు శుభములను కలిగించునని, హరునిగా బంధముల హరించునని చెప్పుదురు" త్రిమలములను తొలగించిన ఆత్మ పరిశుద్ధమగునని బోధింతురు. అందుకు దాస, సత్పుత్ర, సఖ, సత్‌లు మార్గములని తెలుపబడినవి. ఇందు 36 తత్త్వములు విశదీకరింపబడినవి తమిళ ప్రజలలో నాయనార్లు శైవ భక్తులు

ఇ. కాశ్మీరు శైవము :

"ఇది తొమ్మిదవ శతాబ్దపు పూర్వార్ధములో ఉత్తర భారత దేశములో నున్న ప్రత్య భిజ్ఞ సిద్ధాంతము. భగవంతుడు ఆత్మ, ప్రపంచము, విముక్తి దీని మూల సూత్రములు"[16]ని డా. హెచ్.ఎం. సదాశివయ్య నిర్వహించారు. ఆదిలో ఇది వాసు గుప్త సన్యాసి ద్వారా వ్యాప్తి చెందినది. పతి పాశము పశువుల ఈ ముక్కంటి సంబంధమే కాశ్మీర్ శైవమని జె. రుద్రప్ప తెలిపి యున్నారు. పరా, పరాపర, అపరా అనెడి త్రిసూత్రములనే త్రికములని పిలతురని డా. హెచ్.ఎం. సదాశివయ్య పేర్కొనెను. దేవుడు 'పరసంవిత్' లేక 'చిత్' లేక పరమ శివుడు. అతడు అనుత్తరుడు అతని తర్వాత ఇంక ఏమియు లేదు. ఆధ్యాత్మిక క్రమ శిక్షణ ద్వారా పరమాత్మతో అను సంధానమును పొందవచ్చునని విశ్వసించిరి.

ఎఫ్. సిద్ధులు :

సిద్ధిని పొందిన వారిని సిద్ధులందురు ఇది కూడ శైవ సంబంధి. "వీరి మతము తొమ్మిది మంది నాథులతోను, 64 మంది సిద్ధులతోను స్థాపింపబడి వృద్ధి చెందినది. యోగము పాటించుట ద్వారా ప్రకృతి కతీతమైన శక్తులను

15. డా. యం. భవాని-ముదిగొండ వీరేశలింగశాస్త్రి గారి జీవితము-కృతులు భాగము-I (1967 : పుట. 286)

16. Dr. H.M. Sada Sivaiah-A Comparative study of Two Virasaiva Monasteries (1967 : Page 10)

పొందవచ్చునని వీరి విశ్వాసము. భక్తి, జ్ఞాన, కర్మ, వైరాగ్యములనెడి నాలుగు విధములైన యోగముల ద్వారా అష్ట సిద్ధులు పొందవచ్చునని ప్రవచించిరి."[17] ఒకప్పుడు శ్రీశైలములోనున్న 'అధార్మికుడ'ను సిద్ధుడు ఋతువుకాని ఋతువులో కూడ పుష్పములను పూయించెడి వాడట

జి. నాథ సంప్రదాయము :

ఈ సంప్రదాయులను 'కన్ఫటా యోగు' లందురు. దీనిని స్థాపించి ప్రచారము గావించినవాడు 'గోర (క్ష) ఖ్' నాథుడు. పంజాబు నివాసి. "పంద్రెండవ శతాబ్దమునకు చెందిన వాడని జార్జి గ్రియెర్సన్ నమ్ముచున్నారు. గోర (క్ష) ఖ్ నాథుడనగా గోవులను లేక మాతృ దేశమును రక్షించువాడనియు, పంచేంద్రియములు జయించినవాడనియు అర్థములు కలవు. శైవాగమములను పాటించు శైవులను, శాక్తులను తన యోగ మార్గమున అంగీకరించెను. వీరు హఠ యోగులు. శరీరమునకు సంబంధించిన యోగమది. 'హ' అనగా సూర్యుడని 'ఠ' అనగా చంద్రుడని యర్థము. ఇందు శివ శక్తులు ప్రధాన తత్త్వములు. బిందు (శుక్ర), వాయు (శ్వాస) మనసు (జ్ఞానము) ద్వార సాధింపవలయును. అమరత్వము లేక శివత్వము పొందుటయే దీని ఉద్దేశ్యము"[18]ని హిరణ్మయి వివరించారు. "ఇళ, పింగళ (సూర్య, చంద్ర) నాడుల ద్వారా శ్వాసను నిల్పి గోర (క్ష) ఖ్ యోగములో నుండెను. శ్రీశైలములో నిట్లుండ అల్లమ ప్రభువు అతనిని వాదమున ఓడించి వీరశైవ తత్త్వమును గుర్తించునట్లు చేసెనట."[19]

హెచ్. తాంత్రిక శైవము :

ఇది శక్తిని పూజించు మతము. "ఈ మతస్థులను 'కౌలుల'ని, వారి ఆచారములను 'కౌలాచారము'లని అందురు. దీనిని 'సిద్ధమీన నాథుడు' ఈ లోకమునకు తెచ్చెనని ప్రతీతి. 'సిద్ధుల మతమునకు, సంబంధము

17. Dr. B.S.L. Hanumantha Rao - Religion in Andhra (1969-70 : Page 280)

18 Hiranmaya-Essay in - 'Sri Basavesvara' (1967 : Pages 312 & 313)

19. Ibid (Page 315)

కలదని''[20] డా॥ బి. ఎస్. ఎల్. హనుమంతరావు తెలియజేశారు. భైరవి తాంత్రికము లేదా చక్రపూజలో మధువు, మాంసము, మగువలను పరిమితముగ నుపయోగించెడి ఆచారము కలిగియుండిరి. మంత్రగాడయిన భైరవానందుడను నాయకుడు తాను కౌల మార్గావలంబియను విషయము రాజశేఖరుని 'కర్పూర మంజరి' వలన వ్యక్తమగుచున్నది. ఐదు, ఆరు శతాబ్దములలో మహిషాసుర మర్దిని విగ్రహము లభించినది. "చైనాలో 6వ శ॥లో యోగాచారవాదము ప్రబలినట్లును, 11వ శతాబ్దములో టిబెట్టులో శక్త్యారాధన యుండినట్లును, జపానులో 12వ శతాబ్దమున దైవమందు నిశ్చలమగు నమ్మకమే ముక్తి మార్గమని"[21] డా. మారెమండ రామారావు వివరించారు.

ఆ కాలములో దుర్గకు రక్త మాంసములు సమర్పించుచుండిరి. ఈ మతము ఉత్తర భారత దేశమునుండి ఆంధ్ర దేశమునకు వ్యాపించినది. బసవ పురాణములో చిఱు తొండ నంబిని పరీక్షించిన భైరవుడు కాపాలిక రూపములోనే యుండుట మనకు తెలియవచ్చును. మన దేశములో మొత్తము 18 శక్తి పీఠములు కలవు. 'శక్తి' చిహ్నము 'పాని వట్టము'ను 'శివ' చిహ్నము 'లింగము'నగును. శివుడు శక్తి రహితుడయి చేష్టింపజాలడనియు-శక్తి సహితుడగు శివుడే సర్వశక్తుడనియు సిద్ధాంతము.

మధ్యయుగపు చీకట్లు :

పదకొండవ శతాబ్దపునాటి మత-రాజకీయ, సాంఘిక - ఆర్థిక, సాంస్కృతిక-సాహిత్య పదములను సామాన్య ని దృక్పథము నుండి పరిశీలింపవలయును. వైదిక, జైన, బౌద్ధ, మతములు ఉచ్ఛస్థితిలో నుండెను. శైవ మతము కూడ వ్యాప్తిలో నుండెను. కాని వర్ణాశ్రమ ధర్మములకు, కర్మకాండలకు, అసమానతలకు, హింసలకు వైదిక మతము నిలయమయ్యెను. నిరాకార, నిర్గుణ పరబ్రహ్మముతోను, నిరీశ్వరవాదముతోను బౌద్ధ జైనములు మరొక ప్రక్క పోటీ పడినవి. "ఉపనయన సంస్కారము

20. Dr. B.S.L. Hanumantha Rao Religion in Andhra (1969-70 : Page 282)

21. డా. మారెమండ రామారావు-భారతీయ నాగరికతా విస్తరణము (వ్యాసము : పుట 156, 158)

మూడు వర్గాలకే చెల్లినది, మిగిలినది సర్వ విషయశ్చ"[22] యని ముడిగొండ వీరభద్ర శాస్త్రి తెలియ జేయుచున్నారు. 11వ శతాబ్దమున అవతరించిన రామానుజాచార్యుల (1098 నుండి 1137) విశిష్టాద్వైత మతము కూడ నాటి ప్రజలను సంతృప్తి పరచినట్లు కానరాదని భావింపవచ్చును. ఆంధ్ర మహా భారతము పై ఒక మతోద్ధరణకు తోడ్పడినది. కాని ఆర్యుల కాలము నుండి సమానత ఎఱుగని శూద్రులు బయటకు వచ్చిరి. అస్పృశ్యత సంఘ సంఘటిత శక్తిని బీటలు వార్చినది. మూఢ విశ్వాసాలు నిర్వీర్యము చేసినవి. స్త్రీకి స్వాతంత్ర్యము లేక జనాభాలో సగము వంతు చీకట్ల పాలయినది. వైరాగ్యము, నిర్లిప్త, తత్త్వము, నిస్పృహ, నిస్సహాయత్వము దళిత మార్గములను నిర్జీవము చేసినది. నాటి భారతీయ చైతన్యము నిస్తేజమ యినది. బ్రాహ్మణులు శ్రమ జీవుల మీద భారమైరి. వేద పురాణముల మీద భక్తి సన్నగిల్లనది. సత్యశోధన, ఋజుమార్గ జీవనము, సులభ గ్రాహ్యమయిన ధార్మిక మార్గము, సరళ సంవిధానము కొఱకు ప్రజలు ఎదురు చూచినట్లు విదితమగును. అది ఒక ఉత్క్రాంతిని సందర్శించిన దర్శనము 'వీర వ్రతము' లేదా వీరశైవ మతము.

## 'వీర' శబ్ద విచారము :

'వీర' శబ్దము శ్రుతులతో, మనుధర్మ శాస్త్రములో, యోగ శాస్త్రములో, మరియు పురాణాలలో ఎటువంటి అర్థముతో ప్రయోగింపబడినదో నిర్ధారింప వలసియున్నది. వీరత్వము మిక్కిలి ప్రాచీన కాలము నుండి ఆరాధ్యముగా సంభావింపబడుతూ వచ్చినది.

### 1. వేదములు :

"ఋగ్వేదములో ఇంద్రునికి 'వీర' అను సంబోధనము కలదు. 'సుప్రవాచనం తవ వీర' అని ఋక్కు. 'వీర బలవాన్ హే ఇంద్ర' - అని విద్యారణ్యులు తెలిపిరి, శ్రుతులలో కూడ అగ్నికి వీరుడని ప్రశంప కలదు. వీర శబ్దమునకు శ్రుతులలో కొన్ని చోట్ల పుత్రపరముగా కూడ వ్యాఖ్యాతము.

22. కె.కె. రంగనాథాచార్యులు(సంపాదకులు) తెలుగు సాహిత్యం-మరోచూపు (1981 : పుట 44)

2. తైత్తిరీయ బ్రాహ్మణం :

'వీరఃబ్రాహ్మణ, అనే చోట వీర శబ్దం క్షత్రియ వాచకమని కొందరంటారు అది పుత్ర వాచకమని "వీరః గర్భ హాతీ క్షత్రియ వాచత్వేకె"అనే పంక్తుల్లో భట్ట భాస్కరులు తెలుపుచున్నారు. కొన్ని చోట్ల వీర శబ్దానికి శ్రీ విద్యారణ్యులు పుత్రపరంగా వాఖ్యానము చేశారు.

3. మనుధర్మ శాస్త్రము :

"అవీరా యాశ్చయోషితః" అని వీర భార్య అయినా, వీరమాత అయినా కానటువంటి స్త్రీచేతి అన్నము తినకూడదని మనువు నిషేధిస్తున్నాడు.

4. ఉత్తర రఘు వంశము :

క్షాత్ర వృత్తి వృత్తిలో పుత్రుడు వీరుడే కనుక "వీర ప్రసవా భూయాః" (ఉ-ర) యని వీర పుత్రుణ్ణే భావిస్తూ వచ్చారు.

5. మహా భాష్యము :

అనేక స్థలములలో వీర శబ్దము ప్రస్తావింపబడినది. శాస్త్రములో మంగళార్థక శబ్ద ప్రయోగాన్ని ప్రశంసిస్తూ "వీర పురుష కాణ్యాయుష్మత్ పురుష కాణిచ భవంతి" 'ఆయుష్మత్పు పురుషకాలు వీర పురుషకాలు అవుతున్నవి'అని పతంజలి వీరత్వాన్ని సంభావించాడు.

6. యోగ శాస్త్రము :

ఈ వీర శబ్దాన్ని స్వీకరించి వీరాసనమనే ఒక ఆసనాన్ని ప్రతిపాదించారు. దీనినే 'వీరాసనాలతో కూర్చుండి, ధ్యానము చేయు ఋషుల యొక్క' అనే చోట కాళిదాసు రఘువంశములో ప్రస్తావించాడు.

7. భాగవతము :

శృంగార శబ్దముతో కూడ "మనాంసినః స్మరం వీర యచ్ఛసి" అని గోపికల చేత వీర శబ్దాన్ని ప్రయోగింపజేశాడు.

8. రామాయణము :

జనకుడు తన పుత్రిక 'వీర్య శుల్క' అని ప్రకటించాడు.

9. మహా భారతము :

వీర పూర్ణత్వము, వీర పత్నీత్వము మిక్కిలి ఆరాధ్యమైనవిగా ప్రాచీన కాలమునుండి సంభావితమౌతూ ఉండే "23 వని పండిత శ్రీ ఉమాకాన్త విద్యాశేఖరులు వివరించారు

10. జైన మతము :

ఇందే తొలిసారిగ 'వీర' అను శబ్దము ప్రచురమైనదని తెలియుచున్నది. వర్ధమాన మహా 'వీరు'డనుట గమనార్హము. దీనినను సరించి శ్రీరాముని గూడ మహా వీరుడని అన్నారు. (చూ: మహా వీర చరిత్ర) "ఈ విర శబ్దమే 'బీర్' గాను కాలక్రమములో 'పీర్'గాను మారిన"24దని ఆచార్య వి.యస్. అగ్రివాలగారు ప్రతిపాదించియున్నారు. కనుక ప్రతి మతము వారు తమ తమ మార్గములో సిద్ధి పొందినవారిని వీరులనియే పిలిచిరని తెలియుచున్నది. అలంకార శాస్త్రములో వీరమును కాశ్రయమైన నాయకుననుసరించియే రస విచారణ చేయుట గమనించినచో వీర శబ్దము సిద్ధికి సూచకమని అర్థము చేసికొనవచ్చును.

విర శబ్దమును మత పరముగా పరిశీలింతము :

"వి శబ్దనోచ్యతే విద్యా శివజీవైక్యబోధికా
తస్యాం రమంతే యే శైవా వీరశైవాస్తుతే మతాః"
(—సి శి-5-15)

వి శబ్దము శివజీవైక్య విద్యను బోధించు శబ్దము. అట్టి విద్యలో ఏ శైవుడు రమించునో అట్టి వానిని వీర శైవుడందురు.

మరియు

"వేదాంత జన్యం యద్ జ్ఞానం విద్యేతి పరికీర్తితే
విద్యాయాం రమతేయః సవీర ఇత్యభి ధీయతే"
(—సి.శి-5-16)

23. పండిత శ్రీ ఉమాకాన్త విద్యాశేఖరులు-పల్నాటి విర చరిత్ర (పీఠిక) (1955-పుటలు 52-54)

24. డా. హెచ్.యస్. బ్రహ్మానంద-శిష్ట సాహిత్యంలో జానపద ధోరణులు (1989 : పుట 66)

ఏ జ్ఞానము వేదాంతముల నుండి జనించినదో అట్టి జ్ఞానములో రమించువాడు వీరత్వమును కలిగియుండును.

వేదాంత జ్ఞానము పొందువాడు 'వి' యనియు ప్రశాంత చిత్తము కలవాడనియు అర్థము.

క్రియా సారములో 'వి' అనగా వికల్ప 'ర' అనగా లేకుండా యని అర్థము. వీరశైవ మనగా శైవ మతముపై అన్ని అనుమానముల నుండి దూరముగా నుండుట.

## ప్రాచీనత :

ఈ మతము అతి ప్రాచీనమైనది.

"బ్రహ్మ విష్ణ్వాదయో దేవామునయో గౌతమాదయః
ధారయంతి సదా లింగముత్తమాంగే విశేషతః"
(—సి.శి. 6-55)

బ్రహ్మ, విష్ణువు ఇత్యాది దేవతలును, గౌతముడు ఇత్యాది మునులును లింగధారణము చేయుటచే వీరశైవులుగా నిశ్చయింపబడిరి.

ఇక 'లింగ' శబ్దమునకు కూడ 'లీన మర్థంగమ యతి' యనగా "సమస్త ప్రపంచము దేనియందు ఉదయించి దేనియిందు లయమగునో అది" అని అర్థము అట్టి లింగము 'అవ్యక్త, నిర్గుణ, నిరాకర, నిరహంకార, నిరవంద్య మైన' లక్షణములు కలవి. పూజా పాత్రమునకు 'ఆకాశ, వాయు, తేజో, ఆపో లింగము, పృథ్వీ లింగములు, తగియున్నవి.

కృత యుగమున ఏకాక్షర, ద్వ్యక్షర, త్ర్యక్షర, చతురక్షర, పంచాక్షరులును, త్రేతా యుగమున ఏక వక్త్ర, ద్వివక్త్ర, త్రివక్త్ర, చతుర్వక్త్ర పంచవక్త్రులును, ద్వాపర యుగమున రేణుకారాధ్య (రేవణ సిద్ధ), దారుక, ఘంటాకర్ణ (శంఖు కర్ణ), ధేను (గజ) కర్ణ, విశ్వ కర్ణులు మూల పురుషులు.

వీరు శివుని యొక్క సద్యోజాత వామదేవ, అఘోర, తత్పురుష, మరియు ఈశాన ముఖలని భావించెదరు. వీరు కలియుగమున రేవణా రాధ్య, మరుళారాధ్య, ఏకోమారాధ్య, పండితారాధ్య, విశ్వా రాధ్యులుగా జన్మించిరి. జైనమత పువసదులవలె ఐదు పీఠములను యేర్పాటు చేసిరి. నల్గొండ జిల్లాలోని కొలను పాక (వీర సింహాసన పీఠము) మధ్య ప్రదేశ్‌లోని

ఉజ్జయిని (ధర్మ సింహాసన (పీఠము) హిమాచల్ ప్రదేశ్‌లోని కేదారము (వైరాగ్య సింహాసన పీఠము) ఉత్తర ప్రదేశ్‌లోని కాశి (జ్ఞాన సింహాసన పీఠము) కర్నూలు జిల్లాలోని శ్రీశైలములు సూర్య సింహాసన పీఠము). ఎస్.ఎన్. దాస్‌గుప్తగారు వీరశైవము యొక్క ప్రాచీనతను ఈ విధముగ వివరించుచున్నారు.

"The Kernel of Virasaiva thought is almost as early as the Upanishads and it may be found in more or less systematic manner by way of suggestion in the writings of kalidas who lived in the early centuries of the christian Era."

(A History of Indian Philosophy-Volume V : 1952-55)

వీరశైవ మత తత్త్వమునకు పలునామములున్నవి. 'ద్వైతాద్వైత సిద్ధాంతమని, భేదాభేద సిద్ధాంతమని శివాద్వైతమని, శక్తి విశిష్టాద్వైత మని, అతి వర్ణాశ్రమ ధర్మమని, షట్‌స్థల సిద్ధాంతమని పేర్కొనిరి. 'లింగేన ఆయతః 'లింగాయతః' "లింగాయత' మతమనియు పిలిచిరి. ఇవియును గాక 'పరమ మాహేశ్వర వ్రతమని, పరమ మహేశ్వరాచారమని, నిత్య నియమ వ్రతాచారమని, సదాచారమని, వీర మహేశ్వరాచామని, వీర వ్రతాచారమని, పాల్కురికి సోమనాథుడు పేర్కొనెను.

శైవ-వీరశైవములోని భేదములు :

వినికి ప్రమాణ గ్రంథములు చంద్రజ్ఞానాగమము, సూక్ష్మాగమములు. తొలుత శైవ, తర్వాత వీరశైవ భేదములను పరిశీలింతము. అవి "1. అనాది శైవము. 2. ఆదిశైవము. 3. పూర్వ శైవము. 4. మిశ్రమ శైవము. 5. శుద్ధ శైవము 6. మార్గ శైవము. 7. సామాన్య శైవము వీరశైవములో 1. సామాన్య వీరశైవము, 2. విశేష వీరశైవము, 3. నిరాభారీ వీరశైవము"[25]

"శైవము 1. అనాది, 2. ఆది. 3 మహా, 4 అనుశైవము, 5 అవాంతర శైవము, 6 ప్రవర, 7 అంత్య శైవము, వీరశైవములో 1 సామాన్య

25. కాశీనాథశాస్త్రి-చంద్రరాజాగమః (1955 : పుట 68-70)

వీరశైవము, 2. విశేష వీరశైవము, 3. నిరభార వీరశైవము."[26]

రెండు ఆగమములు, శైవ వీర శైవముల భేదముల వివరించుటలో విభేదములు కలిగియున్నవి. కనుక వీర శైవ సదాచర సంగ్రహమును ప్రమాణముగా శైవ, వీరశైవ భేదములను పరిశీలింతము.

"అనాది శైవం ప్రథమం ఆది శైవం ద్వితీయకమ్ ।
మహా శైవం తృతీయం స్యాదమ శైవం చతుర్థకమ్
అనంతరం పంచమంచ షష్ఠం ప్రవర శైవకమ్
అంత్య శైవ మితి ప్రోక్తం సప్తమం శృణు మత్ప్రియే"[27]
—చంద్రజ్ఞాన-8-3,4 శ్లో.

అని మహా దేవయ్య తెలిపారు.

శివుడు సర్వోత్తముడని విశ్వసించువారు అనాది శైవులు. శివ పంచాక్షరీ మంత్రమును జపించు దీక్షగలవారు ఆది శైవులు. శివ స్వరూపమును మనస్సులో నుంచుకొని, శివ లింగమును నిత్యము పూజించువారు అను శైవులు. పరేశ సంజ్ఞమైన పరమేశ్వరుని ఎవరు భేద భావము లేకుండా సర్వోత్తముడని ఆరాధింతురో వారు అనంతర శైవులు. ఒక మూర్తిలో పరేశను ఆ వాహము చేసి పూజానంతరము విసర్జింతురో వారు ప్రవర శైవులు. ఎవరు శివ చిహ్నములు ధరించి యుందురో వారిని చూచిన తోడనే నమస్కరించి భక్తి ప్రదర్శించువారు అంత్య శైవులు.

వీర శైవము :

"సిద్ధాంతో వీరశైవశ్చ పునశ్చాపి చతుర్విధః
ధర్మార్థ కామ మోక్షేతి యథాముక్తేశ్చ చతుర్విధమ్ ॥
సామాన్య వీరశైవేతి వీరశైవ మతః పరమ్ ।
విశేష వీరశైవేతి నిరాభారీ తథైవచ
యథాక్షీరే తత్రదధి నవనీత ఘృతాదికమ్" ।
—వీ.శై స.సం-8-15,16

26. కాశీనాథశాస్త్రి-సూక్ష్మజ్ఞానాగమః (పుటలు 43,49)

27. మహాదేవయ్య (అనువాదకులు) వీరశైవ సదాచార సంగ్రహః (1963 : పుటలు 66,68)

"సామాన్య వీరశైవము, వీరశైవము, విశేష వీరశైవము, నిరాభారీ వీరశైవమని నాలుగు విధములు.

పరబ్రహ్మ వస్తువైన శివుని పంచముఖములనుండి జన్మించిన పంచాచార్యుల యొద్ద దీక్షపొంది పూజ్యులైన గురు, జంగమ, లింగములను సేవించి తాను ఎవరిని యాచింపక తన శక్తి ననుసరించి దానము చేయువారు సామాన్య వీర శైవులు. ఇందలో ఋషి గోత్రులు, ఆరాధ్యులు ఉందురు.

పర బ్రహ్మ స్వరూపమైన పరమ శివుని యొక్క సద్యోజాతాది పంచ ముఖముల నుండి ఉదయించిన పంచాచార్యుల యొద్ద దీక్ష పొంది అత్యా శ్రమతో లింగమునే ప్రాణముగా భావించి, సదా ఆరాధించువారు వీర శైవులు.

పరబ్రహ్మ పంచముఖములనుండి ఉదయించిన పంచాచార్యుల యొద్ద దీక్ష పొంది, పంచ ముద్రలను ధరించి, వైరాగ్యశాలియై, సకాలములో దొరికిన దానితో తృప్తి చెంది, "సోహం బ్రహ్మ" అనగా బ్రహ్మ స్వరూపమే నేనన్న భావముతో బాహ్యాండంబరములకు దూరమైన వారు విశేష వీర శైవులు. ఇందులో గురు స్థలమునకు చెందిన పీఠాధి పతులుందురు.

విరాట్ స్వరూపుడును దేవాది దేవుడును అయిన పరశివుని పంచ ముఖములనుండి ఉద్భవించిన పంచాచార్యుల యొద్ద ఆణవ మాయా కార్మిక మలత్రయములను నాశనము చేయునట్లు దీక్ష పొంది ఆ షట్ స్థలాంతమైన ఐక్య స్థానములో పరబ్రహ్మ నేనని నిశ్చిత భావముతో నుండి లౌకికా చారములకు దూరమయి ముక్తి మార్గమును పొందువారు నిరాభారీ వీర శైవులు. ఇందు షట్ స్థలస్థులు, జంగములు ఉందురు. వీరే విరక్తి పీఠాధికారులు."28

వీర శైవము యొక్క ఉత్కృష్టత :

వీరవేశముతో శైవ మతమును పాటించి వ్యాప్తి చేసిన గొప్ప ఉద్యమమిది. ఇది స్వర శ్రుతి సమన్వయము. "ద్వైతాద్వైతమతే శుద్ధే

28. మహాదేవయ్య (అనువాదకుడు) వీరశైవ సదాచార సంగ్రహః (1963 : పుటలు 69,70,71)

విశేషాద్వైత సంజ్ఞకే, వీరశైవైక సిద్ధాంతే సర్వశ్రుతి సమన్వయః" యని శ్రీపతి పండితాచార్యులు అభిభాషించిరి. వీరశైవం మహోత్తమమని అందురు. "సర్వేషా మపి శైవానాం వీర శైవం మహోత్తమం" అనియు కోటి జన్మల పుణ్య ఫలం శివ భక్తి "కోటి జన్మార్జితైః పుణ్యం శివే భక్త్యః ప్రజాయతే'' అనియు వివరింపబడినది. వీర వ్రతులకు ఒక్క జన్మలోనే ముక్తి లభించు ననియు, ''ఏతాని జన్మనా ముక్తిర్వీ రాణాంతు మహేశ్వరి"యని శివగీతలో వివరింపబడినది. ఎందుచేతననగా యజ్ఞ యాగాది కర్మలవసరము లేకయే శివార్చనా ఫలము దక్కునని ''శివార్చన కర్మ విజ్ఞేయం! బాహ్యం యిగాది నోచ్యతే''యని స్పష్టముగా చేయబడినది.

వీరశైవ భక్తులకు లింగము, విభూతి, రుద్రాక్షలు ధరించుట ప్రధాన లక్షణము. ఇది సర్వమత సార సంగ్రహమని చెప్పవచ్చును. వైదికము యొక్క వర్ణాశ్రమ ధర్మములను, కర్మకాండను ఖండించినది. జైన, బౌద్ధ ముల యొక్క సన్యాసమును నిరసించినది. అద్వైతము యొక్క బ్రహ్మ జ్ఞానము అనవసరమని భావించినది. సంఘ నిర్మాణములో వృత్తులపై నాధారపడి శ్రమించు శూద్రులను, దళితులను చేరదీసినది. వారి ఉద్ధరణ కొరకు ప్రయత్నించినది. వారి అభ్యున్నతి కొరకు అహర్నిశలు కృషి చేసినది.

ఈ సందర్భమున అవసరము కాకపోయినను గోత్ర కర్తల నామములు కొంత తెలిసికొన వలసియున్నది. అవి 'వీర, నంది, భృంగి, వృష్భ స్కందములు.' ఇక గోత్రకర్తలు సూత్రములు పత్తిడి, వృష్టి లంబన, ముక్తాగుచ్ఛ పంచ వర్ణములు. ఒక వీరశైవుడు భగి, సూత్రము, గోత్రము, ప్రవర, శాఖలు కలిగియుండును. వీనితో పాటు అరువది యైదు భగెలు న్నవి. వీరు అష్టాదశ వర్ణములకు చెందిన వారుగా నుండిరిః 1. కపు 2. శెట్టి 3. బలిజ 4. శివ చిప్పిగ 5. నాగలోక 6. అండె బలిజ 7. ఆటకర 8. గాండ్ల 9. గౌళి 10. దేవాంగ 11. తంబళి 12. కుమ్మర 13. మంగళి 14. చాకలి 15. చలువాది 16. వేశ్య 17. వైశ్య 18. లాలింగండ.

## తమిళ వీరశైవ చరిత్ర :

''క్రీ॥శ॥ 1090 నుండి క్రీ॥శ॥ 1108 వరకు పరిపాలించిన చోళ మండలము రాజగు అనపాయ చోళుని ఆస్థానమునందు 'శెక్కిళార'ను

సజ్జనాగ్రణి కవిసత్తముడు మంత్రిగా నుండెను. అతడు రచించిన అరువది ముగ్గురు నాయనారుల జీవిత చరిత్రలే పెరియ పురాణము: ఎనిమిదవ శతాబ్దమునకు చెందిన శివభక్త కవి సుందర మూర్తి యొక్క "తిరుత్తొండత్తొహై" ఆధారము. అంతకు పూర్వమున్న భక్తుల జీవిత గాథల నుండి వీరశైవము స్ఫూర్తి పొందినదని సులభముగా గ్రహింప నగునని"29 పొ. సూర్యనారాయణశర్మ వివరించారు.

6వ శతాబ్దమునుండి 9వ శతాబ్దము వరకుగల పరిస్థితి :

ఎ. శైవ మతము: మధురలో నుండి మూర్తి నాయనార్ కథలో అనాటి శైవము 'అది శైవ'మని చెప్పబడినది. పూగల్ చోళరాజు కరపూరును పాలించుచు వైదిక శైవము నాచరించెను.

లక్షణములు: తిరుమురైప్పాంలోని సిరసింగ మునియరు, మెర్పురుళ్ నాయనారు, నెడుమార, ఇయకోన్ కలిక్కిమార, మూర్ఖనాయినారు ఇత్యాది భక్తులు-కొందరు త్రికాల మరియు కొందరు షట్కాల పూజా దురంధరులు. ముఖ్యముగా 'విభూతి ధారులు.' కాని వారు లింగమును ధరించునట్లుగా ఎక్కడా తెలియరాలేదు. రుద్రాక్షలను గూడ ధరించెడివారు.

బి. వీరశైవ లక్షణము:

ప్రత్యేకించి వీరశైవ లక్షణమైన శివునకుగాని, శివ భక్తునకుగాని అప చారము జరిగిన వీరత్వము ప్రదర్శించి తన వారినిగాని, ఎదుటి వారినిగాని హింసించుటగాని హత మార్చుట గాని జరిగెడిది.

1. తిరుచ్చె గాటంలో పల్లవరాజు నరసింహవర్మ సేనాధిపతిగానున్న చిఱుతొండడు (పరంజ్యోతి) సంగ భైరవునకు కొడుకును హతమార్చి సంతృప్తితో విందు చేసెను. ఇది ప్రథమ విరత్వ ప్రదర్శన గాథ.

2. పల్లవ రాజైన కళర్సింగు నాయనారు శివ సంబంధ పూవును వాసన చూచిన భార్య చేతిని ఖండించెను.

3. కలికంబ నాయనారు వైశ్యుడు. శివ భక్తులలో న్యూనాధిక్య తలను పాటించిన ధర్మపత్ని హస్తమును తెగనరికెను.

---

29. పొ. సూర్యనారాయణశర్మ-శ్రీ శివభక్త చరిత్రము (1962 : పీఠిక)

4. గండ్రగొడ్డలి ధరించిన విరార్ మిండా, కోట్టులి, శివునిచే అన్నము తినిపించిన అరివాట్టాయ (అరివాళ్-కొడవలి) మొదలగు భక్తులు విరతత్వమునకు ప్రతీకలు

సి. సమతాదృక్పథము: తిరునీలక్క, తిరుజ్ఞాన సంబంధరు, సోమాసిమారను వీరందరు అగ్రవర్ణాల శివ భక్తులు. ఇహప్ప గెయాండర్ వైశ్యుడు వీరు కుల, జాతి, మతములను పాటింపక శివ భక్తులకు సేవ చేయుచుండిరి.

డి. వృత్తి ధర్మము: తిరు నీలకంఠ, తిరుకురుప్ప తొండడు, ఏ నాదినాథ మొదలగు శూద్రులు వృత్తి ధర్మమును పాటించుచు మిగిలిన వారివలె శివ భక్తులకు అన్నదాన మొసంగి, వస్త్రాదులను సమర్పించుచు తరించుచుండిరి.

ఆంధ్ర కర్ణాటకములందలి స్థితి:

ఎ. జేదర దాసిమయ్య (క్రీ॥శ॥ 1040) జైనుడయిన చాళుక్య జయసింహుని (క్రీ॥ శ॥ 1018-1042) యొక్క గురువును ఓడించి రాజుచేలింగమును ధరింప జేసెను.

బి. శ్రీపతి పండితారాధ్యులవారు: చాళుక్యుల సామంత రాజగు 'పల్లవకేత' రాజు చెక్కించిన సంస్కృతి శాసనములో ఇట్లున్నది.

"తతః శ్రీ పండితారాధ్యనామ్నా భక్తోత్తమేనచ।
శివ భక్త ఏవ మానం దేవర్షిభ్యోఽధిక ఇతి ॥
చీనాంబరే అగ్ని సంస్థాప్య శమీ కోమల శాఖయా
బద్ధే మల్లేశ్వరః ప్రీతః ప్రత్యక్షః సమాజాయత ॥
ఈ దృగ్విధం మహా దేవం భక్త వత్సల మవ్యయం
మల్లేశ్వరం సమారాధ్య రేజిరే వృథివీభుజః ॥ "[30]

—శ్రీపతి కాలనిర్ణయ.

"శ్రీ పండితారాధ్యులు క్రీ॥శ॥ 1072 కాలమునకు చెందినవారని తెలియును"[31] శ్రీ కర భాష్యములో ఆగమలింగ పూజా విధానము 15వ

30. కాశీనాథశాస్త్రి-శ్రీపతి పండితారాధ్యర కాలనిర్ణయ (1959 : పుట 68)

31. కాశీనాథశాస్త్రి-శ్రీకర భాష్యం (1954 : పుట 3)

శ్లోకములోను, వీరశైవ ద్విజునకు శిఖా, సూత్ర ధారణము అవసరమని 33వ శ్లోకములోనున్నది.

సి. మాదర చెన్నయ్య అంబలి మహిమ, డోహర కక్కయ్య (అస్పృశ్యుడు) ప్రసాదమహిమ గొప్పవి. కెంబావి భోగయ్య ఒక అస్పృశ్యుడు తెచ్చిన షెయ్య మాంసమును వండి అతిథ్యమిచ్చెను. ఈ భక్తులు ఉన్నత వర్గపు శివ భక్తులవలె సంఘములో సమాన గౌరవమును పొందిరి.

## క్రాంతి పథము :

బసవేశ్వరునకు పూర్వమే వీరశైవ మతము ప్రచారములో నుండెడిది. దాని మూల కారకుడు ఏకాంత రామయ్యయని పండితులు అభిప్రాయము. కాని బసవేశ్వరుడు వీర శైవమును మారిన కాలమాన పరిస్థితుల కను గుణ్యముగా సంస్కరించి తీర్చి దిద్దెను. వర్ణాశ్రమ ధర్మాలను ఖండించి, యజ్ఞయాగాది క్రతువులను నిరసించి, కర్మలను మరపించు నూతన క్రాంతి పథమునన్వేషించి భక్తి' కి ప్రాధాన్యత నొసగెను, He is a Reformer and Organiser but not the Founder "This movement may be said to be some what Unique in the religious history of India"[32]. అని బసవేశ్వరుని ఉద్యమము యొక్క గొప్ప తనమును రెవరెండ్ సి.డి. ఉత్తంగి తెలిపియున్నారు. అప్పటి వీరశైవము "యజ్ఞ యాగాదులు కర్మలు, దేవాలయాలు, పూజలు, పునస్కారాలు లేనిదని"[33] ఏటుకూరు బలరామమూర్తి నిర్వచించినారు.

వీరశైవ పండిత త్రియము, శ్రీ పతి పండితారాధ్యులు (1072), శివలెంక మంచన (1100-60) మల్లికార్జున పండితారాధ్యులు (1100-60), వీరచార ప్రాభవముల కెంతో కృషి గావించిరి.

వీరశైవములోని మూల సూత్రములు, తత్వములు, తంత్రములు, సమతా దృక్పథమున కెట్లు దోహదకారులో నిర్ధారింపవలయును.

---

32. T.G. Kalghati Essay in - 'Sri Basavesvara (1967 : Page 187)

33. ఏటుకూరు బలరామమూర్తి. మన చరిత్ర (1986 : పుట 40)

మూల సూత్రములు :

1. వీరశైవులకు శివుడు ఒక్కడే దేవుడు. "ఏక సత్ విప్రాః బహుధా వదంతి." వీరు ఇష్ట ప్రాణ, భావ లింగములను పూజింతురు. ఇతర దేవతలకు పూజ చేయరాదు. చిన్న దేవతలైన _ మారి మాసాని మొదలగు దేవతలను పూజింపరాదు. తీర్థ క్షేత్రములను దర్శింప కూడదు. జ్యోతిష్యమును నమ్మరాదు శుభ దినములను గురించి పురోహితుల నడుగ రాదు.

2. 'శరణుడే సతి శివలింగమే పతి' అన్న మధుర భక్తి వీరిది. అట్టి జీవునకు దేవునకు భేదము లేదు. ఈ అభిప్రాయముతో విశిష్టా ద్వైతులు అద్వైతులు ఏకీభవించిరి. వీరితో వీరశైవులు జగత్తు విషయమున భిన్నా భిప్రాయమును కలిగియుండిరి. వీరశైవము జగత్తు సత్యమని తెలిపినది. బీజముచే వృక్షమైనట్లు మట్టిచే ఘటమైనట్లు సాదృశ్యమును చూపిరి. మన్ను సత్యము, దాని నుండి తయారైన కడవ పగలవచ్చును. కాని కడవ పుట్టుటకు కారణమైన మన్ను మాత్రము నాశనము కాదు.

3. 'అహం బ్రహ్మాస్మి' అని అద్వైతము అహంకరించినది. కాని వీరశైవము జీవుడు దేవునిలోని ఒక అంశ మాత్రమేయని స్పష్టపరచినది. దానిమ్మ ఫలము దేవుడైన దానియందలి గింజ జీవుడే కనుక అట్టి భగవంతుని షట్ స్థలముల ద్వారా సాధింపవచ్చును.

4. దేవుడు జీవుడు ఒకరైనచో పునర్జన్మ ప్రసక్తి లేదని వీరశైవులు స్థాపించిరి. అందుచేతనే మృత దేహమును అలంకరించి విమానముపై నుంచి వాద్యమైభవములతో రుద్రభూమికి గొనిపోవు ఆచారము నేటికినికలదు.

5. "మానవులందరిలో జీవుడున్నాడని ఋజువైనది. కావున వీర శైవులు వర్ణాశ్రమ ధర్మములను పాటింపరు". వర్ణమనగా మనిషిరంగు. ఆశ్రమ మనగా మతపరమైన క్రమ శిక్షణ. ధర్మమనగా మత పరము, సమాజ పరము అయిన ధర్మములకు కట్టుబాట్లకు సంబంధించిన విషయము"34 ఈ ఒక్క అంశమునే విశేషాంశముగా చేసి అనేక విధ ములుగా వానిని ఖండించి వీరశైవము సమతా దృక్పథమును సాధించినది.

34. యం. చెన్నప్ప-ప్రాచీన కావ్యాలు-ప్రాచీన గ్రామీణ చిత్రణ (1988 : పుట 16)

అందుచేతనే వీరశైవులు అస్పృశ్యతను పాటించరు. ఉదా: డోహర కక్కయ్య. మొదలగువారు ప్రఖ్యాతి వహించిన శివశరణులు.

6. జీవిత భాగస్వాములు, భాగ్య సీమలైన స్త్రీలు పురుషులతో సమానమని ఉద్ఘాటించిరి. కాని వైదిక, జైనములు స్త్రీలకు కల్పించని మోక్షాధికారాన్ని వీరశైవము కల్పించి సమతా జీవన సరళిని కలిగించినది. ఉదా: అక్కమహాదేవి (బసవేశ్వరుని సహోదరి). హేమారెడ్డి మల్లమ్మ మొదలగువారు.

7. వీరశైవులు కర్మలను అధిక్షేపించి క్రియా జ్ఞానమును అపేక్షించిరి. "క్రియాజ్ఞాన సమాయుక్తం వీరశైవ స్యలక్షణం".

8. ఆది దేవుడు శివుడు. కనుక శివభక్తి కలుగుటకు కోటి జన్మలెత్తవలయును. "కోటి జన్మార్జితైః పుణ్యైః శివేభక్తిః" ప్రజాయతే[35] శివగీతలో శివభక్తి ప్రాప్తతను ఉగ్గడించినది.

9. జీవుడందరిలోను సమానమైన పరులను హింసించుట ఉచితము కాదు. అందుచేతనే వీరశైవులు అహింసా వ్రతస్థులు. "అహింసా పరమో ధర్మః" విషయమునకు ప్రాధాన్యత నొసగుచు "దయవిల్లదధర్మ వాపుదయ్యా" అని ప్రశ్నించెను. దీనికి కుల మతముల వివక్షత లేదు.

10. వైదిక మతము, అద్వైతము జ్ఞానమునకు ప్రాధాన్యత నిచ్చినవి. కాని వీరశైవులు జ్ఞానమున కంటె క్రియకే ఆధిక్యత నొసంగిరి.

11. వైదికము దళితులైన శూద్రులను చిన్నచూపు చూసి నిర్లక్ష్యము చేసినది. దీనితో సంఘములో రెండు ప్రధాన ప్రత్యర్థి వర్గములేర్పడినవి. బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యులు ఒక వంక, శూద్రులు మరొక వంక చేరుటకు కారణమైనది. ఈ అఖాతమును తొలగించుటకు వృత్తికి ప్రాధాన్యత నొసగి, సంఘములో శూద్రులను భాగస్వాముల జేసి ఉచిత రీతిని సమ్మానించినది. ఇదియే 'కాయకవే కైలాస' మన్న సిద్ధాంతము. వృత్తిని విశ్వసించి సత్య శుద్ధముగా నిర్వహించి తగినంతగా సంపాదించి గురు లింగ జంగమములకు దాసోహము గావింపవలయును. దీనిని తరువాత అధ్యాయమున చర్చించెదను.

---

35. పండిత మహాదేవయ్య - శ్రీ శివగీతె (1978 : పుట 4)

12. వైదికాది మతములు సూత్రమునకు, సిద్ధాంతమునకు ప్రాముఖ్యత నొసంగి అనుభవమును, ఆచరణమును విస్మరించినవి. శివ శరణులు నిత్య నిజ జీవితములోని అనుభవముల యొక్క మంచి చెడులను అనుభవ మంటపములో చర్చించి, సంఘాభ్యుదయమున కవసరమైనట్లుగా మలచి శాస్త్రీయము చేసిరి. ఇందుకై బసవేశ్వరుడు కళ్యాణ కటకములో అనుభవ మంటపము నేర్పాటుజేసెను. అల్లమ ప్రభువును అధ్యక్షునిగా నియమించెను. ప్రతి శివ శరణుడు ప్రతిపాదించిన ఎంతటి అల్పమైన విషయమైనను ఫల మంచికి ఉపయోగపడినదిగా నిర్ధారించిన దానిని చట్టముగా చేసిరి. చట్టము చేయుటలో నెల్లరకు సమాన ప్రతి పత్తి కలదు.

13. క్రియకు ప్రాధాన్యత నొసంగి వైదిక మతమునకన్న గొప్ప దని నిరూపించుకొనినది. వీరశైవులకు మృతాశౌచ, రజోశౌచ, దర్శనాశౌచ, స్పర్శనాశౌచ, జాతాశౌచ, అనబడు పంచ సూతకములు లేవు. ఇందు స్త్రీ పురుషులిరువురును లింగాధారులు. "లింగ ధారీ సదాశుచిః" అన్నది ఆగమ ప్రమాణము.

14. విశేషించి లింగధారణముతో కుల, మత, జాతి, వర్ణ, వర్గ, వృత్తి, విద్య, ధన భేదములను నిర్మూలించి మానవతా వాదమును ఆవిష్కరించినది.

15. కర్మలను గణింపని వీరశైవము, స్నాన, విభూతి ధారణతో శుద్ధీకరణ శక్తిని సాధించును.

16. వీరశైవులకు దీక్షా సంస్కారములు విధింపబడినవి. 'దీక్ష' అనగా గురువు పెట్టిన 'భిక్ష' దీక్ష పొందిన శివశరణుడు సానపట్టిన వజ్రము వలె ప్రకాశించును. వేధా, క్రియా, మను సంస్కారములని త్రివిధములు.

17. వీరశైవులు నిర్భయముగా జీవింతురు. వీర వ్రతము నాచ రించుటకు 'శివ ప్రసాయిత'మను ఖడ్గము ధరింపవలయును.

18. వీరశైవము యొక్క ప్రత్యేక లక్షణము ఆత్మార్పణము. గురు లింగ జంగమములను దూషించినగాని లేదా వ్రత భంగము జరిగినగాని ఖడ్గము ఇత్యాదులతో ఆత్మార్పణము గావించుకొందురు. ఇవి కొన్ని ప్రధానమైన వీరశైవము యొక్క మూల సూత్రములు. సమతా స్థాపనకు తోడ్పడినవి.

## వీరశైవ తత్త్వములు

ఎ. జీవాత్మ విచారము :

"శివునకు, జీవునకు పారమార్థికమగు భేదాభేద మంగీకృతము. ఈ సంబంధము అగ్ని నుండి పుట్టిన అగ్ని కణములకుగల సంబంధము వంటిది. పరశివుని యందు అవినాభావ సంబంధము వలె విమర్శన శక్తియు, సత్వరజస్తమో గుణముల తారతమ్యము వలన శుద్ధచిద్రూపమైన పరశివుని యందు భోక్తృ-భోజ్య ప్రేరక రూపమువలె పరిణమించును."[36] అని కాశీనాథశాస్త్రి గారు వివరించియున్నారు.

బి. జగద్విచారము :

ఈ జగత్తు ఉత్పత్తి నాశనము లేనిది. పరశివ బ్రహ్మమునుండి ఇచ్ఛా శక్తి, దాని నుండి జ్ఞాన క్రియా శక్తులు ఉత్పన్నమయినవి. ముప్పది ఆరు తత్త్వములు, "శివ, శక్తి, సదా శివ ఈశ్వర శుద్ధవిద్య, మాయ, కళ, విద్య, రాగ, కాలనియతి, పురుష, ప్రకృతి, అలంకార బుద్ధి, మనస్సు, శ్రోత, త్వక్క, చక్షువు, జీహ్వ, ఘ్రాణ, వాక్కు, పాణి, పాదము, పాయువు, ఉపస్థ, శబ్దము, స్పర్శ, రూపము, రసము, గంధము, ఆకాశము, వాయు, వహ్ని, సలిలము, పృథ్వి" అనునవి రూపపరిణామము జెందును.

సి. పరిణామ వాద విచారము:

చరాచరాత్మకమైన సమస్త ప్రపంచము శక్తి విశిష్ట పరమ శివుని యొక్క పరిణామము చెందిన రూపము.

"వృక్షస్థిం పత్ర పుష్పాది వట బీజస్థితిం యథా।
తథా హృదయ బీజస్థం విశ్వమే తత్పరాత్మనః"[37]
(సి.శి.-20-33 శ్లో)

అని సిద్ధాంత శిఖామణిలో వర్ణింపబడినది.

వృక్షము పత్రి శాఖములతో ఎట్లు విరాజిల్లు చున్నదో అదే విధముగా శివుడు భూమి, జలముచేత విరాజిల్లుచుండును. అతి విశాలమైన మఱ్ఱిచెట్టు

36. పండిత శ్రీకాశీనాథశాస్త్రి-వీరశైవ రత్న (1981 : పుట 150)
37. కాశీనాథశాస్త్రి-సిద్ధాంత శిఖామణి (1982 : పుట 270)

యొక్క ఆకులు, పూలు, పండ్లు, మొదలగునవి ఏ విధముగా బీజమునందు సూక్ష్మరూపములో దాగియున్నవో అదేవిధముగా చరాచరాత్మకమైన ప్రపంచము పరమాత్ముని యొక్క హృదయ బీజములో సూక్ష్మరూపమున దాగియున్నది.

డి. జగత్సత్యత్వ విచారము :

శక్తి విశిష్ట పరశివ బ్రహ్మ నుండి ఉత్పన్నమైన సకల చరాచరాత్మకమైన జగత్తు మిథ్యకాదని సత్యమని అనంతమైన శ్రుతులు ముక్త కంఠముతో ఉద్ఘోషించుచున్నవి.

"యస్మాదేతత్స ముత్పన్నం మహా దేవచ్చరాచరం
తస్మాదే తన్నభి ద్యేతయథా కుంభాదికం మృదః"38
(సి.శి-10-62)

అని నిరూపించుచున్నది.

మట్టిలో పుట్టిన కడవ మొదలగు వానికి, మట్టికిని ఏవిధముగా భిన్నము కాదో అదే విధముగా శివునియందు ఉత్పన్నమైన చరచరాత్మకమైన జగత్తు శివుని కంటె భిన్నమైనది కాదు.

ఇ. ప్రమాణ విచారము:-

వీరశైవ సిద్ధాంతములో ప్రత్యక్ష - అనుమాన - శబ్దములని మూడు ప్రమాణములంగీకృతమైకవి. మిగిలిన దర్శనకారులు ప్రమాణముల నంగీకరింతురు.

యఫ్. లింగాంగ సామరస్య భావము :-

వీరశైవ సిద్ధాంతములో పరబ్రహ్మను 'స్థల'మను పేరుతో నిర్దేశించియున్నారు. చరాచర జగత్తు ఉద్భవించి అంతరించుచోటనియు మరొక భావము.

"స్థీయతే లీయతే యత్ర జగదేతచ్చా చరం।
తద్బ్రహ్మస్థల మిత్యుక్తం స్థలతత్త్వ విశారదైః॥
(సి.శి-5-24)

"స్థ" అనగా జీవి ఆవిర్భవించి ఎదుగుట అనియు, 'ల' అనగా లక్ష్యములో (అంత్యము) వదులుకొనుననియు" ఎస్.డి. పాటె వివరించియున్నారు. ఈస్థల

38. కాశీనాథశాస్త్రి-సిద్ధాంత శిఖామణి (1982 : పుట 134)

రూప పరశివ బ్రహ్మము-స్వలీలతో అంగ స్థలము, లింగ స్థలము లని ఏ విధముగా రెండు ప్రకారములున్నవో పూర్వోక్త చిత్తశక్తి విశిష్ట జీవనము అంగపదవాచ్యమై యున్నది. అట్టి అంగ స్థలములు నలుబది నాలుగు కలవనియు, లింగ స్థలములు ఏబదియేడు ఉన్నవనియు నిర్ణయించిరి. ఈనూటొక్క స్థలములు సాధకుని కొఱకు ఏర్పాటు చేయబడినవి. జీవుడు 'అంగ' మనియు, బ్రహ్మ 'లింగ'మనియు తెలియుచున్నది. వీరశైవమునకు భక్తుడు అధికారి. ముక్తియే ప్రయోజనము. శివ జ్ఞానమే విషయము. ప్రకాశ్య ప్రకాశ భావమే సంబంధము.

జి. వర్ణ విప్లవము :

వైదిక మతము వర్ణాశ్రమ ధర్మములతో, యజ్ఞయాగాది క్రతువులతో, కర్మకాండతో, మూఢ విశ్వాసాలతో సకల మానవులలో సమతను సాధించలేక పోయినది. కుల వ్యవస్థ బంధముతో సంఘము సంకుచితమయ్యెను. "శూద్రుల యొక్క వృత్తులు, వారి స్థాయి ప్రాచీన శ్రుతుల కాలము నాటిదై అభివృద్ధి నిరోధకమయ్యెను.....మిగిలిన వారికి సేవకుడు, ఆవుల కాపరి, స్నేహితుడు, రైతుల నుండి ఆహారము పొందెను."అని యు.ఎన్. ఘోషల్ అభిప్రాయపడినారు. రాజులు దాన మొనరించిన అగ్రహారములు, దేవుని మాన్యములు పురోహితులను అగ్రస్థితికి చేర్చెను. తద్వారా నిష్క్రియకు దారి తీసెను. శూద్రుణ్ణి ముట్టుకొన్న వెలివేయుటలు, ప్రాయశ్చిత్తములు తప్పనిసరి. వానితో పాటుగ "న శూద్ర స్యవచో గ్రహ్యం శునోచ్ఛిష్టం హ విర్యథా" మొదలగు నిషేధములుండెను. ముఖ్యముగా రజకులు, తెలగులు, చర్మకారులు నికృష్టపు స్థితిలో నుండిరి.

1. అక్షరముల కులములు :

ఆర్యుల రాకతో వర్ణవ్యవస్థ నిర్మాణమైనది. బ్రహ్మ ముఖము నుండి బ్రాహ్మలు.... పాదముల నుండి శూద్రులు జన్మించిరని" పురుష సూక్త కథనము. మానవులకే కాక వర్ణములకును ఇట్టి అవస్థ కలిగినది. 'అ' మొదలుకొని 'ఙ' వరకు అగ్ర వర్ణములని, 'త' వర్గ 'ప' వర్గములతో పాటు 'ర, వ' వర్ణములు క్షత్రియులని, 'య', 'ల', 'శ', 'ష', 'స', 'హ' లు వైశ్యులని, 'ళ', 'క్ష'లను శూద్రులనిరి.[39]

39. నన్నయ్య భట్టారకుడు-బాల సరస్వతీయము (1963 : పుట 148)

ఆదిశంకరాచార్యులు అద్వైతవాదమును ప్రతిపాదించుచు వేదములను, వర్ణాశ్రమ ధర్మములను, కర్మలను అంగీకరించెను.[40] అని డా. హెచ్. ఎం. సదాశివయ్య తెలియజేయుచున్నారు. జైన బౌద్ధులు హింసను నిరసించినను అంత్యములో సమత కొరకు కొట్టుమిట్టాడిరి.

వర్ణ వ్యవస్థను ఖండించుచు బసవేశ్వరుడు అనేక వచనముల విరచించెను.

"మడివాళ నెందెంబెనె మాచయ్యన ?
సెట్టి యెందెంబెనె సిరియాళన ?
డోహర నెందెంబెనె కక్కయ్యన ?
అను హారువ నెందరె కూడల సంగయ్య నగువనయ్య."

(Dr. H.M. Sadasivaiah-A Comparative Study of Two Virasaiva Monasteries-Ch. 2 48 Page).

'మడివాళ' అందుమా? మాచయ్యను నెట్టి అందుమా? సిరియాళును 'డోహర' అందుమా? కక్కయ్యను 'మాదార' అందుమా? చెన్నయ్యను నేను బ్రహ్మణుడను అనిన కూడల సంగయ్య నవ్వుతాడు అయ్యా!

బసవేశ్వరుడు వక్కాణించినట్లు లింగమును ధరించి వీరముతో శైవమును వీరశైవుడు రక్షించును. "లింగమధ్యే జగత్సర్వం, లింగ బాహ్యే త్పరం నహి" ఇత్యాది శ్రుతి ప్రమాణములచేతను లింగముతో పాటు విభూతిని ధరించి, రుద్రాక్షమాల కలిగి, పంచాక్షరీ మంత్రమును జపించు శూద్రుడు అగ్ర వర్ణజుడైన వీరశైవుడు సమానము. ప్రధాని, భాండారి యగు బసవేశ్వరుడు వీరశైవుడగు మడివాలు మాచయ్యకు నమస్కరించెను. హీనకులజుడగు శివనాగుమయ్యకు పూజలు గావించెను.

2. గోత్ర నామములు: వీరశైవులు గోత్ర నామమును జెప్పుకొనరు, అందుకు తగినట్లు పాల్కురికి సోమనాథుడు "బసవని పుత్రుండ, బసవ గోత్రుండ" అని చాటుకొనెను. వీరు తమ పేర్లను తల్లిదండ్రుల పేర్లను కూడ చెప్పుకొనరు.

---

40. Dr. H.M. Sadasivaiah :- A comparative Study of Two Virasaiva Monasteries (1967 : Page 16).

3. భవి (శివభక్తహీనుల) జన దర్శన, స్పర్శనాదుల వీరు కలనైన అంగీకరింపరు.

4. వీరశైవులకు శివుడొక్కడే దైవము. "ఏకోదేవః" అతడే ఆది మధ్యాంత రహితుడు. మరియు శివుడు దాత భోక్త. శివుడు సర్వం "శివోదాతా శివో భోక్తా శివస్సర్వమిదం జగత్"[41] అని శ్రీపతి పండితాచార్యులు ఉల్లేఖించుచున్నారు.

5. శివభక్తి కలిగిన వీరశైవులెల్లరు సమానులు. వీరికి కుల మతాలు లేవు. ధనిక, పేద భేదాలు లేవు. పండిత పామర వాదాలు లేవు. ఉచ్ఛనీచ భేదాలు లేవు. సంఘములో వీరికి సమాన స్థితి కలిగించినది. బహుదేవతారాధన సన్నగిల్లినది. పురోహిత వర్గము కూడ సత్యాన్వేషణ మార్గమున పురోగమించినది.

హెచ్. కర్మ విచ్ఛేదనము :

1. కర్మలు: వీరశైవులు కర్మ నిరాసనము గావించి క్రియా శరాసనమును చేపట్టిరి. అగ్రవర్ణాలవారు తమ జన్మముచే అగ్రాసనమధిష్ఠించిరి. వీరిని కర్మకాండ పరిరక్షించినది. సంఘములోని వర్ణాశ్రమ ధర్మములు ఒక ప్రక్క, కర్మకాండ మరొక ప్రక్క జేరుటచే మానవతా వాదమునకు దూరమయినది. ఇందు కర్త, కర్మ ఒక్కరుగా రూపు దాల్చిరి. అందుచే క్రియా నిస్తేజమయినది. ఇట్టి కర్మలు నాలుగు రకములు.

పుత్ర, పశు, స్వర్గాది ఫలములను కలుగజేయు పుత్రకామేష్టి యిత్యాది యజ్ఞములు కామ్యములు.

సురాపాన యిత్యాదివి 'నిషిద్ధ' కర్మలు

సంధ్యావందన, అగ్నిహోత్రాదులు 'నిత్యకర్మ'లు

జాతేష్టి, విశ్వజిద్యాగాది శ్రౌతములు మరియు గ్రహణ స్నానాదికర్మలు 'నైమిత్తికము'లు. ఇష్ట కర్మలు ప్రత్యేకించి కలవు. 'అగ్నిసపర్య, తపస్సు సత్యము, వేదాధ్యయనము, అతిథిపూజ, హోమము' మొదలగునవి. పుణ్య, పాప, మిశ్రమ కర్మలతో పాటు మానసిక, వాచిక, కాయికమనెడి కర్మలు కూడ కలవు.

---

41. శ్రీపతి పండితాచార్యులు–శ్రీకర భాష్యం (1954 : పుట 96)

ప్రధానముగా కర్మలు వైదిక, లౌకికములని రెండు. అయినను వీనిని కర్మ పంచకములుగా పెంచుకొనిరి. అవి ఉత్క్షేపణము, 'అపక్షేపణము, ఆకుంచనము, ప్రసారణము మరియు గమనములు' అంతటితో ఆగక కర్మ ఫల భేదములను, కర్మ చండాలురను కూడ సృష్టించిరి. మానవ జీవితమును అడుగడుగునా ఫలాపేక్ష కర్మలతో నింపివేయుట జరిగినది. అదియు గూడ పుట్టుటతోనే ప్రారంభించిరి. ఇక అవి గిట్టు వరకును, గిట్టిన తర్వాత కూడ తప్పలేదు. "గర్భాధానము, పుంసవనము, సీమంతము, జాతక కర్మ, నామ కరణము, అన్న ప్రాశనము, చౌలము, ఉపనయనము, ప్రాజపత్యము, సౌమ్యము, ఆగ్నేయము, వైశ్వదేవము, గోదానము, సమావర్తనము, వివాహము, అంత్య కర్మలు ముఖ్యములు. సూక్ష్మ దృష్టితో పరిశీలించిన కర్మకాండ అధికము చేయబడి, క్లిష్టము చేయబడి, ఒక అగ్రవర్ణము మిగిలిన రెండు అగ్రవర్ణాల పైబడి నిత్య (పడి) రాబడిని ఏర్పాటును చేసికొన్నది. శూద్రులు పేదవారుగ నుండి కర్మ జీవులవారి నిత్య పరిశ్రమ వీరిది భాగ్య ఫలితము వారిది. ఇట్టి కర్మలు ఒక వర్గము యొక్క ఆదాయమును పెంచెను. కాని మరొక వర్గము దాని పీడనకు గురియైనదని గుర్తించలేక పోయినది. దీనితో సంఘము భిన్న ధృవములుగ విడిపోయి దూరమయినది.

## 2. యజ్ఞ యాగాది క్రతువులు :

యజ్ఞ యాగాది క్రతువులు హింసాయుతమయి, కాలహరణమయి ధనవ్యయముతో కూడుకొన్నవి. కర్మలన్నియు మంత్రప్రోక్తములయినవి ఆ మంత్రములు బ్రహ్మణుల ఆధీనములు ఎటొచ్చి తర్వాత రెండు అగ్రవర్ణములవారు ప్రథమ అగ్రవర్ణము కొరకు జీవించుచుండిరి. చివరకు శూద్రులను మూడు అగ్ర వర్ణాలవారు తమ కోసము వారు పుట్టియున్నారన్న భావనను కలిగించిరి. ఈ సంఘములో సహజీవనము లేదు. అందులో సమతా దృష్టి అసలు మృగ్యము.

"క్రియా విశేష బహులాంభోగైశ్వర్య గతింప్రతి"[42] యని శ్రీ విద్యా

42. విద్యా ప్రకాశానందగిరి స్వాములు - గీతామకరందము (1985 : పుట 281)

ప్రకాశానందగిరి స్వాములు తెలియజేసిరి. స్వర్గాది భోగములను, ఐశ్వర్యములను అభిలషించి వాని కొరకు అనేక యజ్ఞయాగాదుల నాచరించుచు కర్మ కాండయందు మునిగిపోవుదురు. వారు యత్నించినది శాశ్వితమైన దైవ సుఖము కొరకు కాదు. క్షణిక ప్రాపంచిక సుఖము కొరకు మాత్రమే. యజ్ఞములలో పంచమహా యజ్ఞములను సెలవిచ్చిరి. అవి 1 దేవయజ్ఞము-హోమము, 2 పితృయజ్ఞము-తర్పణము, 3 నృయజ్ఞము-అతిథి పూజ. 4 బ్రహ్మ యజ్ఞము-వేదాధ్యయనము, 5 భూత యజ్ఞము - ప్రాణులకు అన్నమిడుట.

వైదిక మత పరిస్థితిలోని కర్మకాండను ఖండించి యజ్ఞయాగాది క్రతువులను నిరసించి, అహింస నాచరించి, క్రియ నుద్ధరించి, మంత్ర తంత్రములకు బదులుగా అనుభవమునకు ప్రాధాన్యతనిచ్చి సాటి మానవుని తోటి మానవునిగా దర్శించునట్టి సమతా దృష్టిని నింపి బసవేశ్వరుడు వీర శైవమతమును వ్యాప్తి చేసెను.

"క్రియా జ్ఞాన సమాయుక్తం వీరశైవస్య లక్షణం" అన్న వాక్యము ప్రమాణము. అందువలన "పల్లాపురాణ కర్మక్కె మోదలు"[43]అని బి.సి.వి. జవళి వివరించారు. నిత్య కర్మల స్థానములో క్రియల జేర్చెను. అహింస స్థానములో దయకు ప్రాధాన్యత నొసంగెను.

"దయ విల్లద ధర్మవావుదయ్యా ?
దయవేబేకు సకల ప్రాణి గళల్లియూ
దయవేధర్మద మూలవయ్య"

(Dr. H.M. Sadasivaiah - A Comparative Study of Two Virasaiva Monasteries - Ch. 2-45 Page)

దయయే ధర్మమని, సకల ప్రాణుల మీద దయగలిగియుండవలయునని, దయయే ధర్మమునకు మూలమని ఉద్ఘోషించెను.

అనుభవమునకు ప్రాముఖ్యత నొసంగి దాని ప్రాచుర్యమునకు కృషి గావించెను.

---

43. బసవరాజ చెన్న వీరప్ప జవళి-ధర్మ భండారి బసవణ్ణ నవరు
(1963 : పుట 60)

"అయ్యా, నిమ్మ అను భావిదింద ఎన్నతను హాళాయిత్తయ్యా।
అయ్యా, నిమ్మ అను భావిదింద ఎన్నమన హాళాయిత్తయ్యా।
అయ్యా, నిమ్మ అను భావిదింద కర్మ ఛేదనవాయిత్తు !"44

—బసవేశ్వర వచనము–510

అయ్యా, మీ అనుభవముతో శరీరము నశించిందయ్యా! అయ్యా, మీ అనుభవముతో మనస్సు నశించిందయ్యా। అయ్యా, మీ అనుభవముతో కర్మ చ్ఛేదనము జరిగింది అని బసవేశ్వరుడు స్పష్టపరచెను.

ఈ సూత్రమునకనుగుణ్యము "సత్క్రియలవశ్యముగా చేయవలెననియు" (124వ పద్యము), "క్రియగాన జంగమ లింగము నియతిం బూజింప" (156వ పద్యము) వలయునని, "క్రియ బఱిగి యెఱిగి యుండినయుక్తి యుక్తుండు పతితుడని" (248వ పద్యము) శివతత్త్వసారములో శ్రీ మల్లికార్జున పండితారాధ్యులు పేర్కొనిరి. పాల్కురికి సోమనాథుడు బసవపురాణములో కర్మలను తీవ్రముగా ఖండించెను. "కర్మ మార్గంబగుగాక బ్రహ్మంబుధి" (47వ పుట), "కర్మ జన్మంబు దుష్కర్మంబని" (41వ పుట) యనియు, "కర్మమునకు కర్తృత్వద్ధి లేదనియు", "నీవు వేదవాదినిగాపు వెఱకర్మ వాదినీపేరని" నిరసించెను. "కృతం కర్మ శుభాశుభమ్మనెడి" చిటి పొటి వాదముల్ చెల్లవనెను. కర్మంబు బుద్ధ్యనుసారి యని తేట తెల్ల పరచెను (వాద ప్రకరణము. పండితారాధ్య చరిత్ర). అధిక సాదృశ్యములు బసవ పురాణము నుండి గైకొనుట జరిగినది. యథావాక్కులు అన్నమయ్య సర్వేశ్వర శతకములో "భవచ్ఛిద్భక్తి సద్వహ్ని .... .... .... గర్మంబు ఔలుచు దత్త్వం బెన్న"యని 81వ పద్యములో వివరించెను. వీరశైవ మతము కర్మ ఖండనకు పాటుపడి మానవులందరు క్రియలందు సమానమనెడి భావన కల్గించినది.

ఐ. స్త్రీ సమస్య :

వీరశైవము స్త్రీలకు వ్యక్తి స్వాతంత్ర్యమును, మత స్వాతంత్ర్యమును

44, బసవరాజ చెన్న వీరప్ప జవళి–ధర్మ భండారి బసవణ్ణ నవరు (1963 : పుట 71)

కల్పించినది. అనుభవ మంటపములో అక్క మహాదేవి, నీలాంబిక మొదలగువారు ధార్మిక అంశముల చర్చలలో పాల్గొనుచుండిరి. ముఖ్యముగా ఉన్నత వర్గములోనివారు రజస్వల సమయములందు మూల కూర్చుండునట్లు చేసిరి. కాని వీరశైవ మతస్థుల ఇండ్లలోని స్త్రీలు రజస్వల సమయములో కూడ శివ పూజ చేసికొనవచ్చును.

"పారతంత్ర్యంహి నారీణా ముక్తం స్వర్గేషు కర్మసు
ఐహికేష్వపి మోక్షార్థె నస్వాతంత్ర్యం విషన్యతే
తస్మా దవశ్యం నారీణాం దీక్షాదేయా బుధోత్తమైః''45
—కారణ-2-70వ శ్లోకము.

రజస్వలయైన సమయములో కూడ స్త్రీలు శివ లింగమును ధరింపవచ్చును.

ఇట్టి మత స్వాతంత్ర్యము వైదిక మతములో లేదు. యజ్ఞోప వీతమును స్త్రీలు ధరింపరాదు. వీరశైవ మతము స్త్రీ పురుషుల నిరువురను లింగ ధారణకు అర్హులను గావించినది.

"దీక్షా పవిత్రతాంగత్వాత్ లింగ స్పర్శేన దుష్యతే
రజోవత్వాది కాలేషు కార్యాపూజా ప్రయత్నతః
ప్రసవ ప్రముఖాపత్సు పూజా భంగోన దోషదః''46
—కారణ-2-77వ శ్లోకము.

జె. మూఢాచారములు - విశ్వాసములు :

''పునరపి జననం పునరపి మరణం'' అన్నది వైదికము. మానవుడెన్నో జన్మలెత్తి కర్మ పరిపక్వము తర్వాత మోక్షము పొందునని వైదికుల అభిప్రాయము. దీనికి భిన్నముగా వీరశైవములో "ఏకేన జన్మానా ముక్తిః'' యని నిర్ణయించిరి. అదియు కైలాస ప్రాప్తము, ఏట్టి పరిస్థితులలోను వీరశైవులకు పునర్జన్మ లేదు. భక్తులతో పాటు వీధి వీధులలోని వారికి, నగర మంతటికిని కైలాస ప్రాప్తి కల్గించినటుల బసవ పురాణములో అనేక కథలు కలవు. మరణించిన వారిని గురించి పండుగ చేయు విషయము

45. కాశీనాథశాస్త్రి-కారణాగమః (1955 : పుట 23)
46. అదే ( పుట 24)

మకుటాగమములోని తృతీయ పటలములో 8,9 సూత్రములందు వర్ణింపబడినది. తీర్థ సేవనము అనవసరము. మూఢాచారములకు, విశ్వాసములకు స్వస్తి పలకడము జరిగినది. భవిష్యత్తు జాతకము చూడపనిలేదు. అమావాస్య పున్నమలు, తిథి వారములతో మంచివి చెడువి లేవు. శుభ, అశుభ శకునములు అశాస్త్రీయములు. శకునమనగా 'కలిగించేదని' అర్థము. అవయవము అదరుట, పక్షుల, జంతువుల శకునాలు ఇత్యాదివి అసంబద్ధములు స్వప్నాలను విశ్వసింప పనిలేదు. సాముద్రికము, జ్యోతిష్యము, పుట్టు మచ్చలు శాస్త్రము, అంకెల శాస్త్రము, గ్రహణములు, ఉపవాసములు పుష్కర స్నానములు - ఇవన్నియు మూఢ విశ్వాసములతో కూడిన ఆచారములు వీర శైవము వీనిని పూర్తిగా ఖండించినది.

కె. సులభ తంత్రములు :

ఆధ్యాత్మిక చింతనను కలుగజేయు అష్టావరణములు గలవు. గురు లింగ జంగమములు సమాజమునకు సంబంధించినవి. పాదోదక ప్రసాదములు ఫలితములు. విభూతి, రుద్రాక్ష మంత్రములు - ఉపాసనా సాధనములు.

ప్రవర్తనకు సంబంధించిన నైతిక విభాగము కలదు, అందు పంచాచారములు గలవు. అవి లింగాచార, సదాచార, శివాచార, గణాచార, భృత్యాచారములు.

తత్త్వ విభాగమునకు సంబంధించినవి. షట్ స్థలములు. స్థలమనగా అన్నింటికి మూలభూతమైన బ్రహ్మయని అర్థము. భక్త, మహేశ, ప్రసాది, ప్రాణలింగ, శరణ, ఐక్యములు. ఇవి క్రియ విశ్వాసమునకు నిశ్చయము నిష్ఠకు అర్పణము సావిధానమునకు, యోగము స్వానుభవమునకు, బయలు సుజ్ఞానమునకు, నిర్లేపము సమరస భావమునకు మార్గములు.

ఇవి అందరికిని అందుబాటుతోనున్న సులభ తంత్రములు. ఎట్టి వ్యయమును కలిగించనివి. వీని వివరణములు ఆయా సందర్భములలో నొసంగబడినవి.

సర్వ మత నవనీతము ,

వీరశైవమునకు పూర్వమున్న మతములలో ఏదో ఒక్క అంశమందు

మాత్రమే సమతా దృక్పథము గోచరించును. అట్టి ఉన్నత గుణముల సమాహారము వీరశైవ మతము. అదియే విశ్వమత సారము. వాని ప్రభావ ఫలితములను పరిశీలించెదను.

ఎ. బౌద్ధము :

బౌద్ధమతమునందు ఆర్య అష్టాంగ మార్గములు కలవు. వీని యందలి ఔన్నత్యమును గ్రహించి వీరశైవము యొక్క అష్టావరణములుగా రూపు దిద్దు కొనినవని భావింపవచ్చును.

1. అష్టాంగ మార్గములు :

1. చకిత 2. శ్రద్ధ 3. భాషణ 4. కర్మ 5 సమాధి 6. భావన 7. ప్రజ్ఞ 8. జీవనోపాధి.

అష్టావరణములు :-

1. చకిత 2. శ్రద్ధ 3. జంగము 4. పాదోదక 5. ప్రసాద 6. విభూది 7. రుద్రాక్ష 8. మంత్రములు.

2. బౌద్ధ మతములో ఆరు నియమములు కలవు.

1. శరణము ఆరింటిని స్మరించుట 2. మత పాఠములు వినుట 3. ఎనిమిది శీలములను గమనించుట 4. వర్షఋతువు తర్వాత వస్త్రముల నొసంగుట 5. పుణ్య క్షేత్రములను దర్శించుట 6. స్థూపములను పూజించుట

వీని మూలతత్త్వములను గ్రహించి వీరశైవము షట్ స్థలముల ఏర్పాటుకు ప్రయత్నించినది. అవి 1. భక్త 2. మహేశ 3. ప్రసాది 4. ప్రాణలింగ 5. శరణ 6, ఐక్యములు.

3 బౌద్ధము యొక్క త్రిశబ్ద (రత్న)ములుగా పేర్కొనబడిన

"బుద్ధం శరణం గచ్ఛామి," "ధర్మం శరణం గచ్ఛామి," "సంఘం శరణం గచ్ఛామి" అనునవి వీరశైవములో "గురు, లింగ, జంగములు"గా ఏర్పడిన వనుటలో విప్రతిపత్తి లేదు. బుద్ధుడు గురువుగా, ధర్మము-లింగముగా, సంఘము-జంగమములుగా నేర్పడినవి.

"The Buddhistic Organisation was known as Sangha "The Sangha is represented as a man holding lotus in his

hand, the symbol of stainless purity."[47]
ఇది 'దాసోహం' నకు దారి తీసియుండవచ్చును.
4. బౌద్ధుల పంచారామములయిన
1. భీమేశ్వర లింగారామము 2. కైలాస ఆరామము 3. అమరారామము 4. దాక్షారామము. 5. కుమార ఆరామము. ఇవియే తర్వాత తర్వాత వీరశైవుల ఆరామములయినవి.

"There is a strong view that Saivite temples of Pancharamas were built on the ruins of Buddist stupas. The one five-storeyed was closed to the ground story"[48]
యని బి. ఎస్. ఎల్. హనుమంతరావు నిరూపించియున్నారు.
5. బౌద్ధమతము స్త్రీలు పురుషులతో పాటు సమానమను విషయములో కొంత వెనుకంజ వేసినది.

"Yet it is difficult to say whether the Buddha fully accepted the equality of women with men."[49]
కాని వీరశైవము ఒక అడుగు ముందుకు వేసి స్త్రీలకు సమానతను, సంఘ గౌరవమును కలిగించినది.
6. బుద్ధుడు జన సామాన్యమైన పాళీ భాషలో మత బోధనలను ప్రవచించెను బసవేశ్వరుడు కూడ కన్నడ భాషలో వచన రూపములో గానము చేసి మత వ్యాప్తి చేసెను.
7. వ్యక్తి స్వయం వికాసము కొరకు, సంఘములోని కృత్రిమమైన అసమానతలను తొలదించుటకు రెండు మతములు ఒకే సంధాలో నడచినవి.

---

47. Dr. H.M. Sada Sivaiah - A comparative Study of Two Virasaiva Monesteries (1967 : Page 80)
48. B.S.L. Hanumantha-Rao - Religion in Andhra (1969-70 ; Page 130)
49. S.B. Shapet - Essay in 'SRI BASAVESVARA' (1967: Page 175)

8. బుద్ధుడు నొక్కి చెప్పిన "అహింసా పరమోధర్మః" బసవడు ప్రవచించిన 'దయవిల్లద ధర్మవావుదయా! యను రెండింటియందును - దయగలిగి యుండుట పరమ - ధర్మమని తెలియుచున్నది.

బి. జైనము:

జైనమతములో ఉత్తమ లక్షణముల తత్వములను కొన్ని స్వీకరించి వీరశైవము తన కనుగుణముగా తీర్చి దిద్దుకొన్నది.

1. జైన సన్యాసులను 'శ్రమణు' అందరు. వీరశైవ భక్తులను 'శరణు' అందురు. వారి వసదులే వీరికి మఠముల స్ఫూర్తినిచ్చినవి.

2. "జైనుల 24 తీర్థంకరుల వచనములు నిధి ఆగమములు. వీరశైవల వచనములు కూడశైవాగమముల సంబంధి"[50]

3. జైనమందలి పంచసూత్రములైన 1. జ్ఞాన 2. ధర్మ 3. చరిత 4. తపస్య 5. వీరములను వీరశైవములో 1. లింగాచార 2. శివాచార 3. సదాచార 4. భృత్యాచార 5. గణాచారములుగా రూపుదాల్చినవని యూహింపవచ్చును.

4. జైనమందలి అహింసా వాదమును, సత్య నిరతిని వీరశైవము యథాతముగా స్వీకరించినది.

5. "వ్యక్తి ఆస్తి సేకరణ విషయములోజైన మతము యొక్క భావమును పరిశీలించి" ధర్మ విచారణచేసి వీరశైవమతము ఆస్తిసేకరణను కొట్టివేసినది ఉచితసంపాదనతో 'దాసోహం' ను విధించినది.

6. జైనమత బోధనలు ప్రాకృత భాషలో రచింపబడినవి. వీరశైవ మత రచనలు సులభ కన్నడ భాషలో వచన క్రియలో రచింపబడినది.

7 జైన శ్రమణుడు ఉపవసించి నిలుచుండి వృక్షమువలె ఆహారమును తీసికొనక ఆత్మత్యాగమును గావించుకొనవచ్చును. "A monk was allowed to commit suicide by Practising Pavagamana or

50. B.S Kulakarni - Essay in 'SRI BASAVESVARA' (1967:Page 399)

standing motionless like a tree without any food till death overtook him."[51]

యని హెచ్. యు. సదాశివయ్య ఆత్మత్యాగ విధానమును తెలియజేసినారు. ఇట్టి ఆత్మత్యాగమును మూలసూత్రముగా గ్రహించి వీరశైవము మతరక్షణ కొరకు దీనిని అనుష్ఠించినది.

8. Jainism emphasises voluntary effort. There is no place for Divine grace in Jainism..

వీరశైవము దీనిని ఊతగా గైకొని వ్యక్తి ఒక శక్తిగా వృత్తిపై జీవించుచు భగవదేచ్ఛకు తావీయక 'శ్రమైక జీవన సౌందర్యమునకు' బహుధా ప్రాధాన్యత నొసంగినది.

వైదిక, బౌద్ధ, జైనముల తర్వాత శైవమత శాఖలగు పాశుపత, కాలముఖ, కాపాలిక, కాశ్మీరు శైవము, శైవ సిద్ధాంతములనుండి ఏయే అంశములను గ్రహించినవో పరిశోధింపవలయును.

సి. పాశుపతము :

1. పాశుమత, స్థాపకుడయినలకులీశ శివాచార్యులు దండము. 'సిట్రాన్' (దూది, నిమ్మకాయ) మరియు ఖడ్గము ధరించుచుండిరి. ఈ ఖడ్గమును ధరించు లక్షణమును వీరశైవ మతము స్వీకరించినది.

2. శివుని లింగ స్వరూపునిగా పూజించుట రెండింటియందును సమానము.

3. పాశుపతులు ఆత్మత్యాగమునందు విశ్వాసము కలిగియుండిరి. కావున వీరిని మహేశ్వరులందురు. వీరశైవము కూడ ఈ లక్షణమును స్వీకరించి వీర మహేశ్వరులుగా పేర్కొన్నది.

4 పాశుపతులు బూడిద లేక భస్మమును రోజుకు మూడు పర్యాయములు పూసికొందురు. వీరశైవులు కూడ విభూతిని ధరించి త్రికాల పూజకు సిద్ధపడిరి.

5. పాశుపతుల యమ నియమములలోని గురువు ప్రభావమును వీర

51. Dr. H.M. Sada Sivaiah - A comparative Study of Two Veerasaiva Monasteries (1967 : Page 84)

శైవము గ్రహించి అష్టావరణములోని ప్రథమ అంశమైన గురువును ఏర్పాటు చేసికొన్నది.

డి. కాపాలికము :

కాపాలికులు భక్తులను శివశరణులు అందురు. వీరశైవము కూడ భక్తులకు అట్లే నామకరణము చేసినది. శరీర త్యాగములందు ఇరు మతాల వారికి విశ్వాసమున్నది. కాపాలికులు మనుష్య లేక జంతువుల యొక్క రక్తమాంసములను శివునకు సమర్పించెడి ఆచారము కలదు. ఈ ఆచారము వీరశైవమందును చిఱుతొండడు తన కొడుకును భైరవుడైన జంగమమునకు ఖండించి వండి పెట్టిన సంఘటనలో కన్పించును. కర్నూలు జిల్లాలోని త్రిపురాంతకము నందు తలలను నైవేద్యముగా సమర్పించుకొన్నట్లు శిలలు అనేకము దర్శనమిచ్చును.

ఇ. కాశ్మీరు శైవము :

1. ఆత్మ పరమాత్మలకు భేదములేదనియు అనగా భక్తునకు, శివునకు భేదము లేదనెడి గుణమును వీరశైవము గ్రహించెను.

2. కాశ్మీరు శైవములోని (గూఢభావన)ను యథా తథముగా వీరశైవము స్వీకరించినది.

3. ఆత్మ పరమాత్మలో అను సంధానమును పొందుటకు అనేక అవస్థలు పొందవలయుననియు, చివరకు 'ఐక్యమగు'ట అను భావమున ఇరువురు ఏకాభిప్రాయములు.

4 ఇరు మతములు శివుడు-భగవంతుడు ఒక్కడే అను సిద్ధాంతమును అంగీకరింతురు

5. దళితులైన శూద్రుల విముక్తిలోను, విశ్వమానవ సౌభ్రాతృత్వమును సమతను చాటి చెప్పుటలోను, ఏకాభిప్రాయమును కలిగియున్నవి.

6 "రెండు మతములు కూడ శైవాగమములను ప్రాతిపదికగ గట్టి పునాదులు వేసినవి" అని డా. హెచ్.ఎం. సదాశివయ్య అభిప్రాయపడుచున్నారు.

ఎఫ్. శైవ సిద్ధాంతము :

1. శైవ సిద్ధాంత మందలి అపార, అచంచలమైన శివభక్తిని వీర

శైవము స్వీకరించినది. అరువది ముగ్గురు నాయనారులు బసవేశ్వరుని కాలం నాటికి పురాతనుల స్థాయికి చేరినారు. వారి ప్రాభవ ప్రభావముల ముద్ర వీరశైవముపై కలదు.

"ఎల్లా పురాతనరు బెరెదు భక్తి భిక్ష వన్నిక్కెదరొ"

"నిమ్మ పురాతరాణె", "నిమ్మనంబిద శరణర డింగరగనాను"

"ఓర్వ మహేశ్వరం పురాతన విరచిత గద్య పద్య గళం".

అని బసవేశ్వరుని వచనములలో పురాతనుల ప్రసక్తి చాలకలదు. అదే విధముగా చాల వచనములపైన తిరువాకము ప్రభావము కూడ ఉన్నదని తెలుపుచు

"Many passages from Vachna Sastras contain not only the ideas found in the Tiruvacam of Manikkavacar and other Saiva saints but are also couched in similar words so as suggest borrowing" అని విశ్లేషించినారు.

జి. అద్వైతము :

1. అద్వైతము నుండి జీవుడు, దేవుడు ఒక్కరే అన్న భావమును వీరశైవ మతము స్వీకరించినది.

2. అద్వైతములోని షట్ చక్రములు వీరశైవములోని షట్స్థలములుగా రూపాంతరము చెందినవని తత్త్వజ్ఞుల అభిప్రాయము.

1. మూలాధార చక్రము భక్త స్థలముగను 2. స్వాధిష్టాన చక్రము మహేశ్వర స్థలముగను, 3. మణి పూరము ప్రసాది స్థలముగను 4. అనాహతము ప్రాణలింగ స్థలముగను, 5. విశుద్ధము శరణ స్థలముగను, 6. సహస్రారచక్రము ఐక్య స్థలముగను ఊహింపవచ్చును.

హెచ్. విశిష్టాద్వైతము :

ఇందలి భక్తి ప్రాధాన్యతను వీరశైవము గుర్తించినది, భక్తి యున్నట్లు ఋజువగుటకు త్యాగమవసరము. అట్టి త్యాగము వీరము చేతనే సాధ్యము కనుక వీరశైవము అయినది.

వైదిక మతము నుండి దేవుడు ఒక్కడను భావమును, బౌద్ధమతము





నుండి సమతను, జైన మతము ద్వారా అహింసను, శైవ మత శాఖలైన పాశుపతుల యొక్క లింగ, భస్మధారణలను, కాలముఖులనుండి పాండిత్యమును, కాపాలికుల నుండి ఆత్మత్యాగమును, శక్తిమతము నుండి శక్తిని, కాశ్మీరు శైవము నుండి సౌభాతృత్వమును, శైవ సిద్ధాంతముల భక్తిని, అద్వైతము యొక్క మోక్ష సాధనమును స్వీకరించి విశ్వమత సారమయినది.

విశ్వమతసారము

ప్రపంచములోని మతములు జీవిత విధానమునుండి పుట్టినవి. అవైదికముగా చెప్పబడు వీరశైవము కాలక్రమేణ వైదిక భావన పరిధిలోనికి ఆకర్షింపబడినది. బసవణ్ణను వృషభావతారముగా కాలక్రమములో వీర శైవులు భావించుట మొదలుపెట్టిరి. వైదిక ఆచారములను పాటించుచు వీర శైవ స్ఫూర్తిని కలిగిన ఆరాధ్య బ్రాహ్మణులు జన్మించిరి

చారిత్రక పరిశోధకులు తంత్రవాదాలను ప్రాథమికముగా ప్రాచీన భౌతిక దృక్పథము నుండి పుట్టినవని, ఇవి అవైదికములని దేవీప్రసాద్ చటోపాధ్యాయ 'లోకాయత' అనే తన గ్రంథములో నిరూపించెను. ఆయన శైవ తంత్ర దర్శనములను గురించి ఎంతో విస్తారముగా చర్చించెను. కాని వీరశైవమును గురించి, బసవని గురించి ఎక్కడ ప్రసక్తి చేయక పోవటమును గుర్తించవలెను. బహుశ కన్నడ దేశములోను, సరిహద్దు ప్రాంతాలలోను మాత్రమే ఒక శాఖగా మిగిలిపోయిన వీరశైవమును గురించి చటోపాధ్యాయకు సమగ్రమైన పరిశీలనయుండకపోవచ్చును. ద్రావిడ వైజ్ఞానిక పరిశోధకులు 'శివారాధన విధానము' దక్షిణ దేశము నుండే ఉత్తర దేశమునకు వ్యాపించినదని అందురు. సింధులోయ నాగరికతలో దొరికిన పశుపతి, మహాదేవ సంకేతాలను గురించి విశేష పరిశోధన చేసినవారు ఇవి అప్పటికే మధ్యధరా సముద్ర నాగరికతలో నుండిన వృషభారాధన పద్ధతికి చెందినదని అంటున్నారు.

ఋగ్వేదములోనే వృషభ ప్రసక్తి యున్నది.

"చత్వారి శృంగోత్రియో అస్య పాదా
ద్వే శీర్షే సప్త హస్తాసో అస్య
త్రిధా బద్ధో వృషభోరోర వితి
మహాదేవో మర్త్యా మా వివేశ" ॥

— ఋగ్వేదము (4-58-3)

ఈ మంత్రములో చెప్పబడిన వృషభానికి, పురాణాలలో చెప్పబడిన 'నంది' వాహనానికి సంబంధమున్నను అర్ధ కక్ష్య పేరు. శివా శివుల లాస్యానికి, తాండవానికి ప్రారంభమును సూచించు నాందిని ఘోషించు వాడు నంది. ఈ నంది రావణుని శపించినట్లుగా రామాయణములోనున్నది. జైనులు మహావీరుని కూడ వృషభావతారముగనే వర్ణించిరి. ఈ పరిణామ మును గమనించిన 'వృషభము సృజన శక్తికి, స్వచ్ఛతకు, జ్ఞానమునకు, క్రమమునకు ప్రతీకగ' కనిపించుచున్నది. ఇతర ప్రమాణాల ద్వారా కూడ ఈ అంశమును స్థాపించవచ్చును.

ఇటీవల జరిగిన పరిశోధనల వలన వీరశైవ దర్శనములోని 'లింగ ప్రాధాన్యము' మౌలికముగా 'లోకాయతుల' నుండి జన్మించినట్లు తెలియ వచ్చుచున్నది.

లోకాయత సిద్ధాంతము ప్రత్యక్ష ప్రమాణమును అంగీకరించును. కాని అనుమాన ప్రమాణమును కాదు. అనుమానము అనగా లింగ సాధ్య ప్రమాణాల నడుమ ఒక సర్వకాలికమైన వ్యాప్తిని అంగీకరించుట యని అర్థము. ఇచ్చట లింగమనగా 'మాధ్యమిక ప్రమాణము' అని అర్థము. వస్తువునకు గల ధర్మమును గుర్తించుటకు మనిషి ప్రయోగించు శబ్దము మాధ్యమిక ప్రమాణమని, వస్తువు ద్వారా జరిగే అర్థ బోధ సాధ్యమని లోకాయతులు భావించెదరు. కాని ఈ రెంటి నడుమ ఒక నిత్య సంబంధ రూపమైన వ్యాప్తి కలదనివారు గుర్తించరు. ఎందుకనగా ఈ వ్యాప్తిని ఏ ఇంద్రియానుభవముతోనూ స్థాపింపలేము. ఉదాహరణకు ధూమాగ్ని న్యాయమును పరిశీలించండి. ధూమము ఉన్న చోట్లలో అన్నిటి అగ్ని ఉందని నిరూపించలేము. అందుచేత ధూమము లింగము (గుర్తు) అగ్ని సిద్ధము కాదు సాధ్యము.

ఈ కారణముచేత లోకాయతులలోని ఈ బౌద్ధిక తర్కమును నైయా యకులు, వైశేషికులు, శబ్ద నిరూపణములో వాడుకున్నారని మనము సుల భముగా గుర్తింపవచ్చును. అందుకే శబ్దము 'లింగి' అని వైశేషికుల మతము. మీమాంసకులు శబ్దమునకు 'అభిదానమని' పేరు పెట్టిరి. అనగా సంపూర్ణముగా ఒకవస్తువు తత్త్వాన్ని ధరించినదని అర్థము. ఇక్కడ శబ్దము బట్టి మాధ్యమికము కాదు. దీనిపై తాంత్రికులు ప్రబోధించిన నూత్న విష యం శబ్దము లింగి కాదు. అభిదానము కాదు, వ్యంజనమని. వస్తువు

శబ్దముగా అభివ్యక్తి పొందగలదని అర్థము. అల్లమ ప్రభువు కథలో చెప్పిన లింగము స్వయం వ్యక్తమయిన జ్ఞానమునకు ప్రతీక. వస్తు వాచకమైన మాధ్యమికము కాదు. కాబట్టి అల్లమ ప్రభువు కాలమునకు భావ వాదచ్ఛాయలు వీరశైవము చుట్టూ వ్యాపించినవని అర్థము చేసికొనవచ్చును.

గిరిజన పరిశోధకులు కొన్ని అద్భుతమైన విషయములు చెప్పిరి సంస్కృతములో 'లాంగలము' అనే శబ్దము ఉన్నది. దీనికి నాగలి, మడక అను అర్థములతో పాటు శిశ్నమనే అర్థము ఉన్నది. సూత్ర వాఙ్మయములోను, మహాభారతములోను ప్రయోగములున్నవి. పి. సి. బాగ్చి అను పండితుడు "శిశ్నమను మౌలికార్థము నుండి నాగలి అని అర్థము-తోక అర్థము వ్యాపించాయి"[52] అని అంటున్నారు.

అసలు 'లాంగల' శబ్దము అస్ట్రో ఏషియాటిక్ భాషా కుటుంబము లోనిదని చెప్పుచు సంతాలి ప్రజలు 'ల' అనే మాటను త్రవ్వుట, రంధ్రము చేయుట అనే అర్థములో వాడుదురని అక్కడ నుండి 'లాంగల' అను శబ్దము పుట్టినదని కూడ భావించుచున్నారు.

దీనిని గురించి దేవిప్రసాద్ చటోపాధ్యాయ ఇలా అన్నారు. "Obviously there is something more in these than mere superficial similes or comparisons The idea of sowing and digging are fused with the idea of coition".[53]

లింగ శరీరమనే మాటను రూపాంతరము చెందు అతిసూక్ష్మ శరీరము అనే అర్థములో తొలుత సాంఖ్యులు వాడిరి. వీరశైవములో శరీరమునకేగాక సూక్ష్మ జగత్తుకు ప్రతీకగా లింగము, స్థూల జగత్తుకు ప్రతీకగా శరీరము రూపుదిద్దుకొన్నవి.

---

52. P.C. Bagchi-Pre Aryan and pre Dravidian culture in India (1929 : Page 10)

53. Devi Prasad Chatopadhyaya-Lokayata (Page : 318)

## అ ధ్యా య ము - 3

### దళిత జనుల 'కాయక' సిద్ధాంతము

(పండ్రెండవ శతాబ్దములో దళిత జనుల వృత్తులకు తగినంత గుర్తింపు లభించినది. కాయకము యొక్క రెండు విధములైన నిర్వచనములు.భిన్న మతములు విస్మరించినను నాయనారుల యొక్క వృత్తి ప్రభావముతో బసవేశ్వరుడు కాయక సిద్ధాంతమును రూపొందించిన విధము, లక్షణములు పరిశీలించెదను. దళితులకు సమాజములో సమాన గౌరవముతో పాటు ఆర్థిక సమానత కలిగించుటకై ఏర్పడిన దాసోహం యొక్క నిర్వచనము, భేద ములను చర్చింతును. ప్రధానముగా కాయక సిద్ధాంతము దళిత జనుల సాంఘిక, ఆర్థిక సమత్వము కొరకు ఎట్లు తోడ్పడినదో అధ్యయనము చేయుట ఇచటి నా ప్రయత్నము.)

### కాయక నిర్వచనము :

"క-ప్రత్యయము. కాయ-'చి' అనేధాతువు నుండి ఉత్పన్నము. ఘఞ్ ప్రత్యయము చేర్చిన కాయమగును. సాధారణార్థములో అనేక అవయవముల కూర్పు".

కాయకము అనగా శరీర సంబంధమైన అనియు, కాయికము అనగా శరీరముతో చేయబడునదనియు అర్థము. Kayaka - 1. Relating to the body, performed with the body అనియు 2. Work, Profession, Pursuit, practice rite, observance[1] అని 'కిటిల్' కన్నడ నిఘంటువు - 432వ పుటలో అర్థ వివరణ చేసినారు. Sir Monier Williams Sanskrit - English Dictionary "Kayaka belonging or relating to the body, Kayika performed with the body"[2]

అని అర్థములు."కాయకము-కుల కాయకము - a profession or trade,

---

1. Kittle's-Kannada-English Dictionary (1969 : P. 432)

2. Sri Monier william's-Senskrit-English Dictionary (1970 : p. 274)

art జీవనము అనియు, కాయకము - among the Jangamas అని Charles Philip Brown అర్థములనొసంగెను. కాయకమనగా అర్థవంతమైన పలుకుబడి యందలి ఒక తెగయని జె. కృష్ణమూర్తి నిర్వచించి యున్నారు. డా॥ వి. నరసింహారెడ్డి కాయక సిద్ధాంతమును ఇట్లు నిర్వచించిరి. "ఏ వృత్తియైనను సమాజమున సమాన గౌరవము పొందెడి స్థితిని వీరశైవము కల్పింప ప్రయత్నించినది"[4]

ఎ. 'పనియే పూజ' సంబంధించినవి :

1, "Kayaka is Kailasa, work is worship"[5] అని కుమారస్వామిజి నిర్వచించారు.

2. "To work is to worship" అని యం. యమునాచార్యులు తెల్పారు.[6]

3. డా॥ హెచ్. తిప్పేమద్రస్వామి స్వార్థరహితమైన పని కాయకమనియు అట్టిపనియే పూజయని వివరించుచు, "When work becomes a selfless means to achieve the end it shall be Kayaka and work becomes worship"[7] అని ఉద్ఘాటించియున్నారు.

4 "Work is Heaven[8] అని జస్టిస్ బి.ఎం. కలగటి నిర్ణయించారు

5. టి.జి. కల్గాటి "Work is worship Heaven is with him

3. Charles Phillip Brown-Telugu-English Dictionary (1987 : p. 273)

4. డా. వి. నరసింహారెడ్డి-పాల్కురికి సోమనాథుని కృతులు-ఒక పరిశీలన (1974 : పుట 1432)

5. Kumaraswamiji-Essay in 'Sri Basavesvara' (1967 : Page 58)

6, M. Yamunacharya-Essay in 'Sri Basavesvara' (1967 : Page 65)

7. H. Thipperudraswamy-Essay in 'Sri Basavesvara' (1967 : Page 197)

8. B.M. Kalagate-Essay in 'Sri Basavesvara' (1967 : Page 165)

who works'"[9] పనియున్న చోట స్వర్గమున్నదని పేర్కొన్నారు.

6. "**Work is worship, irrespective of one's status or professions, whether a Guru or a Linga or a Jangama, everyone should learn to labour with a sense of detachment. Dependence on others is a tabu in this religion**"[10]

అనియు గురు లింగము జంగములు పనిచేయవలయుననియు ఎ.ఎల్. శివరుద్రప్ప విశ్లేషించియున్నారు.

బి. 'వ్యక్తి-వృత్తి'కి సంబంధించినవి :

a. "Kayaka is not mere occupation, or mere Physical labour. It denotes the profession of a person who consciously identifies his work as a part of his religious life"[11] అని వృత్తి శారీరక శ్రమగాక మత సంబంధమైన కృత్యమని డా. ఎం. చిదానందమూర్తి చక్కగా నిర్వచించియున్నారు.

b. డా. ఎం.ఎస్. సుంకపూర్ పని వలన పొందు బహుమతుల కన్నా దాని నియుతికి ప్రాముఖ్యత ఉన్నదని తెల్పుచూ, "Work which stressed the primary importance of the sense duty rather than of its rewards."[12]

అని బసవేశ్వరుని అభిప్రాయమును బహిర్గతము చేశారు.

c. "The Kayaka that everyone should earn his living

---

9. T G. Kalghate-Essay in 'Sri Basavesvara' (1967 P. 189)
10. A.L. Shivarudrappa-Essay in 'Sri Basavesvara' (1967 P. 368)
11. Dr. M. Chidenenda Murthy-Essay in 'Sri Basavesvara' (1967 : Page 112)
12. M.S. Sunkapur-Essay in 'Sri Basavesvara' (1967 : Page 137)

by work done with the sweat of his brow, but also in spirit of dedication to God"[13]

అనియు కాయకములో శ్రమ చోడ్చి సంపాదించుకొనవలయుననని దానిని భగవంతున కంకితము చేయవలయునని ప్రొ॥ ఆర్మ మాడో మెనిజిస్ వివరించియున్నారు.

d. అర్.టి. జంగమ్ పని పిలువకును, దాని నుండి ఆదాయమునకును గల ప్రాముఖ్యతను తెలుపుచు ఇట్లు ఉద్ఘాటించారు. "Basavesvara foresaw the value of work and the income it and of living on a hand to mouth basis in those days, several centuries back."[14]

e. "Kayaka means honest bodily labour to maintain oneself."[15]

అని ప్రొఫెసర్ ఎస్. రాఘవాచార్ సెలవిచ్చారు.

f. ఐ.యం. కాయకమును వ్యాఖ్యానిస్తూ

"The Karma Yoga profounded in Geethopanishad, took a simplified form and assumed on the level of social practice called Kayak"[16] అని వ్రాసిరి.

G. 'మనిషి శ్రమనే కాయకం అన్నారు. ఈ బొందెతోనే కైలాసాన్ని పొందవచ్చని హెచ్.యస్. బ్రహ్మానంద వివరించారు. (దే॥ కవిత - దళిత జన జీవిత చిత్రణ) వ్యాసము

ఈ నిర్వచనములను జాగ్రత్తగా పరిశీలించిన కాయకమనగా నిజాయితీగా

---

13. Armando Menezes--Essay in 'Sri Basavesvara' (1967 : Page 215)
14. R.T. Jangam -Essay in 'Basava Journal' December (1984 : Page 42)
15. S.S. Raghavachar-Essay in 'Sri Basavesvara' (1967 P. 377)
16. IM-Essay in 'Sri Basavesvara' (1967 : Page 259)

పని చేయుచు, వృత్తిలో జీవించుచు, తగినంత సంపాదించి, అందులో కొంత భాగమును వీరశైవ మతము కొరకు వెచ్చించ వలయునని వ్యక్తమగుచున్నది.

భిన్న మతములలో వృత్తి-నాయనారుల వృత్తి ప్రాధాన్యత :

1. భిన్న మతములలో వృత్తి ప్రాధాన్యత ఎంత వరకు ఉన్నదో పరిశీలింపవలసియున్నది.

2. నాయనారుల వృత్తి ప్రాధాన్యతను కూడ అధ్యయనము చేయవలెను.

1. భిన్న మతములలో వృత్తి :

ఎ. వైదికము :

వర్ణాశ్రమ ధర్మములను పాటించి, కర్మ కాండను నిర్వహింపవలయునని బోధించినది. బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులుగా విభజించి కర్మ మార్గమును ప్రబోధించినది. కర్మమునే ధర్మము అని తెల్పినది "స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః"-స్వధర్మము శ్రేయస్సును కలిగించుననియు, పరధర్మము భయమును పుట్టించుననియు వివరించినది. ధర్మము అనగా వ్యక్తి చేయవలసిన పని. చాల విశాల దృక్పథముతో నిర్వచింపబడినది. అగ్రవర్ణముల వారి జోలికి ఇతర దళితులైన శూద్రులు పోకూడదని భావము అంతర్గతముగా నుండవచ్చును.

" కుర్వన్నేవేహ కర్మాణి జిజీవిషేచ్ఛతగ్ం సమా: ।
ఏవం త్వయి నాన్యథేతో అస్తి న కర్మ లిప్యతే నరే ॥
— ఈశ-ఉ-2

(డా॥ పు. శ్రీరామ చంద్రుడు (సం) ఈశ ఐతరేయ కఠోపనిషత్తులు పుట-2) ఇచ్చట వృత్తియను మాట కనిపింపదు. శూద్రులను సేవకులుగా గావించి వారి వృత్తి ప్రాధాన్యతను గుర్తింపలేదనవచ్చును.

క్రీ.పూ. వేయి సం. ప్రాంతములో వ్యవసాయమునకు ఇనుప పనిముట్లు కావలసివచ్చినవి. ''ఇక్కడ స్థిర నివాసము అను అర్థము నిచ్చే వైశ్య ఆర్యుణ్ణి యజుర్వేదము పేర్కొంటున్నది. ఆర్యులలో క్షత్రియులు యుద్ధమునకు అంకితమయిరి. ఇకపోతే శూద్రులు సమాజమున కంతా సరిపడే అదనపు ఉత్పత్తి చేస్తూ "ప్రేమాభి మానములు కరువైన చీకట్లో

గ్రమగ్గి''[17] రని కంభంపాటి సత్యనారాయణ తెలిపారు. ఋగ్వేదపు సమాజములో కనిపించేవి రెండే విభాగములు. అవి క్రమముగా నాలుగు వర్ణములుగా నేర్పడినవి "అట్టి శూద్రులు అన్ని రకములయిన పనులు చేస్తూయుండాలని, ఏ ఆహారమైన వారికి చాలునని, వారు సర్వ కర్మోపజీవు''[18] లని మహాభారత వివరణను ఏటుకూరు బలరామమూర్తి ఉటంకించుచున్నారు.

"బ్రాహ్మణులలో చాల మంది ఉద్యోగులూ, భూస్వాములున్నా అనేక మంది అయుధాలను చేత పట్టి యుద్ధాలకు వెళ్ళేరు. వీరు తమ విద్యా విభావాలతో మర్యాదలు నిలబెట్టుకొన్నారు.''[19] అని కంభంపాటి సత్యనారాయణ వివరించుచున్నారు. ప్రభువులు కూడ అనేక కాలముల నుండి వచ్చిరి. బ్రాహ్మణులు వారి నుండి దానము పడుదురు. మొత్తము మీద సమాజములో చాల మార్పు వచ్చినది. మారని దల్లా శ్రమ జీవుల పరిస్థితి వారెప్పటిలాగ అర్ధాకలితో పైవాళ్ళ కోసం ఉత్పత్తి చేస్తూనే ఉన్నారు.

ఈ చతుర్వర్ణ విభాగములో పీడన దోపిడి లేదని కాదు. అదొక తరహా వర్గ వ్యవస్థ. మత పరముగా పీఠమలంకరించిన "బ్రాహ్మణులు ప్రత్యేక సౌకర్యాలు అనుభవిస్తారు. వారు పన్నులివ్వ నక్కర లేదు. శక్తియున్న రాజ్య సింహాసనమలంకరించిన రాజ లాంఛనములు అలాట, వట్టం భేరీ, శంఖం, కాహళం, అడపం, అందలం, ఆతపత్రం అనుభవిస్తూ ఉన్న క్షత్రియులు పన్నులు వసూలు చేస్తారు. వారూ పన్నులివ్వరు. ఇక పోతే వైశ్యులు భూ యజమానులు. ఇక శూద్రునిదే చాకిరీ అంతా!"[20] అని కంభంపాటి సత్యనారాయణ శూద్రుల నికృష్ట జీవితమునకు కారాణము తెలిపియున్నారు. నాడు అగ్రవర్ణములకు హారములైన గ్రామాలు ఎట్లు దానము ఇవ్వబడినవో

---

17. కంభంపాటి సత్యనారాయణ-ఆంధ్రుల సంస్కృతి చరిత్ర ||
(1988 : పుట 60)
18. ఏటుకూరు బలరామమూర్తి-ఆంధ్రుల సంక్షిప్త-చరిత్ర
(1989 : పుట 16)
19. కంభంపాటి సత్యనారాయణ-ఆంధ్రుల సంస్కృతి చరిత్ర |
(1988 : పుట 162)
20, కంభంపాటి సత్యనారాయణ-ఆంధ్రుల సంస్కృతి-చరిత్ర (పుట 101)

కొన్ని ఉదాహరణముల పరిశీలించండి.

నాడు బ్రాహ్మణులనుభవించిన ప్రత్యేక సౌకర్యాలలో మరికొన్ని కలవు. క్రీ. శ. ఒకటవ శతాబ్దములో "సహమణుని అల్లుడు రషభ దత్తుడు దేవుళ్ళకూ, బ్రాహ్మణులకూ 16 గ్రామములు దానమిచ్చినట్లు, ఏటా లక్ష బ్రాహ్మణ్యానికి సమారాధనలు జరుపుతున్నట్లు, 8 మంది బ్రాహ్మణులకు వివాహము చేయించినట్లు,3 లక్షల గోవులు, ఎంతో బంగారము బ్రాహ్మణులకు దాన మిచ్చినట్లు 'నాసిక్'లో దొరికిన ఒక శాసనము తెలుపుతుంది" 21 అని కంభంపాటి సత్యనారాయణ వివరించారు.

మరొక ఉదాహరణలో 'వాసిష్ఠీ' పుత్ర చాంతమూలుడు కోట్ల కొలది బంగారు నాణెములను, వేల కొలది ఆవులను దానము చేశాడని మాఠరీ వీర పురుషదత్తుడు నాగార్జున కొండలో చెక్కించిన శాసనములో నున్నది. కడపటి శాతవాహన రాజుల యొద్ద రాజుగానుండి, రాజ్యాధికారము స్వీకరించి, అశ్వమేధ యాగము చేసిన మొదటి రాజైన వాసిష్ఠీ పుత్ర చాంతమూలుని కుమారుడు వీర పురుషదత్తుడు. ఈ విధముగా ఉత్పత్తికి కారణమగు శ్రమ దూరముగ నున్న''22 దని ఏటుకూరు బలరామమూర్తి తెలియజేయు చున్నారు.

బి. బౌద్ధము-సన్యాస జీవితము :

క్రీ.పూ. ఐదవ శతాబ్దములో వైదిక మతమునకు వ్యతిరేకముగా అవతరించిన బౌద్ధమతము "జ్ఞానమునకు, ప్రవర్తనకు, సన్యాసమునకు ప్రాధాన్యత నొసంగినది. బౌద్ధులు షట్సూత్రములను పాటింపవలయుననియు అందులోగల మూడవ సూత్రములో అష్ట శీలములు కలవనియు తెలిపియున్నది''23 అని బి ఎస్.ఎల్. హనుమంతరావు వివరించియున్నారు. వీరు

21. కంభంపాటి సత్యనారాయణ-ఆంధ్రుల సంస్కృతి-చరిత్ర (పుట 77)
22. ఏటుకూరు బలరామమూర్తి-ఆంధ్రుల సంక్షిప్త చరిత్ర (1989 : పుట 40)
23. Dr. B.S.L. Hanumantha Rao-Religion in Andhra (1969-70 : Page 103)

ఆరామముల నిర్మించి సేవచేయుటకు ప్రయత్నించిరేకాని ప్రత్యేకించి వృత్తి ధర్మమును పేర్కొనలేదు. జీవన భృతిని గురించి ఐదవ శీలములో చెప్ప బడినది. కాని వ్యక్తి యొక్క శక్తిని వినియోగించుటకు ప్రయత్నించ లేదనే చెప్పవలయును.

క్రీ.శ. ఏడవ శతాబ్దములో బౌద్ధ సన్యాసుల సుఖజీవన విధానమును చైనా యాత్రికుడు 'ఇత్సింగ్' ఈ విధముగా వర్ణించెను. రాజులచే బహూ కరింపబడిన రెండు వందల గ్రామముల నుండి వచ్చే ఆదాయముతో బ్రాహ్మణులు తమ జీవితమును గడిపేవారు. అనగా వీరిని పోషించుటకు అనేక వేలమంది శ్రమ పడేవారు. వేలమంది శ్రమించి గడించిన అదనపు పంట వీరికి భక్తముగా నుండేది, "అందువలన బ్రాహ్మణులు శ్రమించ నవసరముండేది కాదు. వీరు తీరిగ్గా కూర్చొని శుష్కమైన ఆలోచనలు చేయ గలిగినారు. బహుశ అదే 'గతితార్కిక ఆలోచనల'లోని ప్రత్యేకతకు దారి తీసింది. ఇతర విహారాల కథలు కూడ ఈ విధముగనేయున్నవి"[24] అని దేవి ప్రసాద్ చటోపాధ్యాయ విశదీకరించారు.

సి. జైనము-శ్రమణ జీవితము :

జైనము శ్రమణులకు ప్రవర్తనా నియమావళిని క్రోడీకరించినది. పంచ సూత్రములలో "వ్యక్తి ఆస్తి అనుఅంశమును ప్రప్రథమముగా చర్చించినది. ఒకరి జీవనమును తీసికొనరాదనియు మరొకరి ఆస్తిని అక్రమించ రాదనియు తెలుపుచు స్వంత ఆస్తి ఉండకూడదని శాసించిన"[25] దని డి.డి. కోశాంబి వ్యక్తి ఆస్తికి సంబంధించిన చట్టమును వివరించినారు. ఆస్తిలేని వారి సంగతిని ఆలోచించినది కాదు.

పదకొండవ శతాబ్దములో జైనమతము కర్ణాటక, ఆంధ్రలలో ఉచ్ఛ స్థితిలో నుండినది. రాజాశ్రయములోనున్న జైన మతమునకు వసదులు అసంఖ్యాకములు. జైన దేవాలయములు కూడ అధికముగా నుండేవి.

---

24. దేవి ప్రసాద్ చటోపాధ్యాయ-భారతీయ తత్వ శాస్త్రం (1989 : పుట 156)

25. D.D. Kosambi-The culture and Civilization of Ancient India (1987 : Page 105)

డి. అద్వైతము-నిష్క్రియ :

మతత్త్వమునకు, జ్ఞానమునకు ప్రాధాన్యత యొసంగినది కాని సంఘమును మరచిపోయినది 'బౌద్ధమతము "హిందువుల ప్రధాన శత్రువుగ శంకరాచార్యులు భావించిర''ని కె.ఎ. నీలకంఠశాస్త్రి పేర్కొన్నారు, (A HIstory of South India-P. 428)దీనితో అద్వైతము తన ఉనికిని నిలబెట్టుకొనుట కష్టమైనది.

2. నాయనారుల విశిష్టత :

తమిళనాడు, కర్ణాటక ఇరుగు పొరుగు దేశములగుటచే రాజకీయ, మతపరమైన సంబంధమును కలిగియున్నవి. సాంస్కృతిక, సాంఘిక పరిస్థితులలో సామ్యము ఉండెను. దాని పర్యవసానము రెండు దేశములలోని భక్త్యోద్యమములలో సామ్యత సాధ్యమని పరిశోధకుల అభిప్రాయము. తమిళనాడులోని శైవ సిద్ధాంత వ్యాప్తికి 63 గ్గురు నాయనార్లు కారణమని చెప్పవచ్చును. "ఈ నాయనార్లు 7వ శతాబ్దము నుండి 9వ శతాబ్దము వరకు జీవించా"[26] లని ఎ. సుందరరాజ్ థియోడోర్ తలంచారు. "Sixty three Nayanars are the first who promoted Social Philosophy of 'Dignity of Labour'. They did their labour with true love and sincerity''[27]
అని డా ఎస్. విద్యాశంకర్ అభిప్రాయపడినారు.

''నాయనారులలో తిరునీలకంఠనాయనారు కుమ్మరి. మాహేశ్వరులకు భిక్షా పాత్రలుచితముగా నొసంగు మహానుభావుడు. అతిభక్త నాయనారు మొదటిగా దొరికిన చేపను శివార్పితము చేయుచుండెను. తిరుకురుప్పతొండడు రజకుడు, శివ భక్తుల వస్త్రములను ఉచితముగా నుతుకును ఖడ్గ విద్య నేర్పుచు లభించు ద్రవ్యముతో ఏనాది నాధుడు శివ భక్తులకు ధన మొసంగును. పంచముడైన నందనారు నరములు, చర్మము సంపాదించి

26. A Sunderaraj Theodore-Essay in 'Sri Basavesvara' (1967 : Page 227)

27. Dr. S. Vidya Shankar-Essay in 'Sri Basava Journal (December 1984 : Page 32)

శివాలయములోని వాయిద్యములను చిత్రముగా నిర్మించువాడు". బసవేశ్వరుడు నామనార్ల ప్రభావముతో వృత్తి ప్రాధాన్యత గ్రహించి, వీర శైవమత ప్రాచుర్యమునకు తీవ్ర కృషి గావించెను.

"In the Arjunawada incription Basavesvara has been described as a devotee of the Puratanas''[28]
అని ఆర్.సి. హిరేమఠ్ వివరించినారు.

బౌద్ధాది మతములందు గల సంఘము-వ్యక్తి;వృత్తి ఉత్పత్తుల మధ్య సంబంధము కొంత బలహీనముగా నుండినదని ధృవీకరించక తప్పదు. నాయనారులు సంఘటిత వ్యవస్థకు పునాదలు వేసిరి. సాంఘిక శాస్త్ర ప్రకారముగా "Society in sociology is a group composed of men, women and children that has established patterns of Co-operation by means of which its members are able to survive and reproduce''[29]

(New standard Encyclopedia : Page 516)

3. ఉత్పత్తి శక్తి :

సంఘములోని ప్రజల సుఖమయ జీవితమునకు ఉత్పత్తి అధిక ప్రాధాన్యత కలిగియున్నది. ఉత్పత్తి శక్తులలో అతి ముఖ్య శక్తి మనిషి సంపదలను సృష్టించగల శక్తి అతనికి ఉన్నది. అట్టి ఉత్పత్తిలో అతనికి నేర్పు ఉన్నది. కళాత్మక ప్రతిభ ఉన్నది. మరియు నైతిక స్ఫూర్తి ఉన్నది. అన్యాయమును ఎదిరించే చైతన్యమున్నది. ఇవన్నియు సమాజ పురోగమనములో ప్రముఖ పాత్రవహించును. "ఒక మనిషిని వేరొక మనిషి దోచుకోవడము అభివృద్ధిని ఆటంకపరుస్తుంది. దానిని రద్దు చేసినప్పుడే అభివృద్ధి. ఇక్కడ ఉపయోగించబడినది శూద్రుల శ్రమయేగాని బానిసల శ్రమకాదు. అంతేకాదు తన ఇష్టము వచ్చిన వృత్తివనికి పోగల స్వాతంత్ర్యము శూద్రునికి లేదు. అందుచేత దీనిని 'ఫ్యూడల్ పూర్వదశ'

28. R.C. Hiremath--Essay in 'Sri Basavesvara' (1967 : Page 18)

29. New Standard Encyclopedia Volume 12 (Page 516)

అనవచ్చును."30 అని కంభంపాటి సత్యనారాయణ ఆనాటి సంఘమును విశ్లేషించారు: ఇచట "All my life and my strength were given to the first cause of the world-the liberation of Mankind" అన్న లెనిన్ మహాశయుని భావములు మరువరాదు. ఇది రాబోవు తరముల వారికి ప్రేరణను కలిగింపగలవు.

వైదికాది మతములలోని వృత్తులు చేయు శూద్రులను నిర్లక్ష్యము గావించిన విషయము, బాధ కలిగించినను నాయనారులలోని శూద్రులు వృత్తిలో పాల్గొనుచు ఒసంగిన స్ఫూర్తి బసవేశ్వరుని ఆలోచనలపై ప్రగాఢ ప్రభావమును చూపినది.

4. కాయ, కాయిక శబ్దములు :

భిన్న మతములలో కాయ, కాయిక శబ్దములు ఏ అర్థముతో ప్రయోగింపబడినచో పరిశీలింతము. ఎ. భిన్న మతము : "కాయ' భక్తి అనునది భక్తితత్త్వంబున మొదటి మెట్టని సామాన్యముగా భావింతురు. ఆ భక్తి కాయికము, వాచికము, మానసికము అని స్థూల దృష్టికి త్రివిధముగా నుండును. అనగా ఒక్కొక్క దానికి ఒక్కొక్క మహర్షి మతంబును నారదులవారు ఉదాహరించుచున్నా"31 రని దొడ్ల వేంకటరామిరెడ్డిగారు తెలియజేయుచున్నారు.

యోగశాస్త్రము :

కాయమనగా "వ్యక్తి శరీరము అందముగా తేజోవంతముగా ఉంటుంది. మృదువుగా నవకముగా ఉంటుంది. మరియు బలముగా వజ్రమువలె కఠినముగా నుప్పొంగుతుంద"ని డా. బి. వెంకట్రావు 'యోగాసనము'లో వివరించారు.

జైన మతము -

దీని సంబంధముగా నమస్తమైన ద్రవ్యాలను రెండు రకములుగా విభజించినారు. 1 అజీవ ద్రవ్యం, 2. జీవ ద్రవ్యం జీవ ద్రవ్యములో

30 కంభంపాటి సత్యనారాయణ-ఆంధ్రుల సంస్కృతి-చరిత్ర I (1988 : పుట 114)

31. దొడ్ల వేంకట రామరెడ్డి నారద భక్తి సూత్రములు (1953 : పుట 16)

కాలము, ఆకాశము, ధర్మము/చలనము పుద్గలనము చేర్చబడియున్నవ"[32] ని దేవీ ప్రసాద్ చటోపాధ్యాయ విపులీకరించారు. బసవేశ్వరుడు కాయకమే కైలాసమను సిద్ధాంత రూపకల్పనకు, వీరశైవ మతమునకు సంబంధించిన తత్త్వశాస్త్రములను ఆశ్రయించి శరణ ధర్మ చట్రములో బిగించుటకు ప్రయత్నించియుండును. ఇందులకు తగినట్లుగా సిద్ధాంత శిఖామణి, చంద్రజ్ఞాన ఆగమములను ప్రమాణములుగా స్వీకరింపవచ్చును.

ఒకటి: ''పరస్వయా తనుజ్ఞేయాఽ దేహ కర్మాభిమానినః
తయా స్వకాయో లోకోఽయం తదాత్మత్వ నిరూపణాత్ ॥
కాయం వినా సమస్తానాం నక్రియా నచభావనా
న జ్ఞానం యత్తతోయోగీ కాయవానేవ సంచరేత్ ॥"[33]

(సి.శి-16-36)

దేహాభిమాన, కర్మాభిమానములతో శూన్యుడైన శివయోగి ఏ శరీరముతో జనులకు తెలిసియున్నాడో ఆట్టి శరీరమునకు ఆ శివయోగియే ఆత్మయని తెలిసికొని శరీరముతో పాటే ఆ శివయోగి సకాయుడనిపించుకొనును.

శరీరములేకున్న సర్వులకు క్రియలు సంభవింపవు. భావసము సంభవింపదు. జ్ఞానము సంభవింపదు. అందుచేత శివయోగము శరీరముతోనే సంచరింపవలయును.

రెండు : ''అనుగ్రహాతి యల్లోకాన్ స్వకాయం దర్శయన్నసౌ
తస్మా దేవ సమాఖ్యాతః కాయ నుగ్రహ నామకః[34]

(సి.శి-17-5)

జ్ఞానాకార సంపన్నుడైన శివయోగియు తన శరీరమును చూపించువాడయి ప్రాకృత జనులననుగ్రహించు నెడ ఇతడు - కాయానుగ్రహమని చెప్పకొమను. దీనినే 'కాయానుగ్రహ' స్థలమందురు.

---

32. దేవీ ప్రసాద్ చటోపాధ్యాయ-భారతీయతత్త్వశాస్త్రం (1989 : పుట 146)

33. కాశీనాథశాస్త్రి-సిద్ధాంత శిఖామణి (1982 : పుట 203)

34. అదే (1982 , పుట 214)

మూడు : "శివస్య పరరూపస్య సర్వాను గ్రాహిణో ఽర్పనే
త్యాగో దేహాభిమానస్య కాయార్పణ ముదాహృతం"35
(సి.శి-17-30)

సర్వమును అనుగ్రహించువాడును, పరశివ స్వరూపుడు అయిన శివయోగి శివలింగ పూజతో, దేహాభిమాన త్యాగమునే 'కాయార్పణ' మందురు.

ఈ విధముగా 'కాయ' శబ్దము శివయోగులకే పరిమితమైయుండెను. తర్వాత శివశరణుల శీలము వివరించు సందర్భములో ప్రథమముగా ప్రయోగింపబడియుండును. దీనినే బసవేశ్వరుడు స్వీకరించియుండవచ్చును.

బి. వీరశైవ తత్త్వములో : చంద్ర జ్ఞానాగమమునందు 'కాయ' 'కాయిక' శబ్దములు ఎట్లు ప్రయోగింపబడినవో పరిశీలింతము.

ఒకటి : "గురోరిష్ట లింగస్య చలస్యైవ ప్రసారతః
కాయ శోధనమే తద్ధి శీలం స్యాత్పంచ వింశకం36
(9-పటలము . 82 శ్లోకము)

గురు ఇష్ట లింగ జంగమములను పొందుటకు కాయ శోధనము తగినది ఇది ఇరుబది యైదవ శీలము.

రెండు : "కాయికం పంచధా ప్రోక్తం ముక్తి ప్రాప్త్యైక సాధనం
అథ మానసికం వక్ష్యే శీలమేక మనాః శృణు"37
(9.87)

ముక్తి మార్గమునకు కాయికమే సాధనమని వివరింపబడినది.

మూడు: "గురోః శివస్య భక్తానాం నిందానాకర్ణనం హియత్
తచ్చాతుర్వింశకంప్రోక్తం కాయికం తు తతం శృణు"38
(9-81)

గురువును శివునిగా నెంచి భక్తుడాతని నిందను వినకుంట, కాయికమును పాటించుట జరుగవలయును.

---

35. కాశీనాథశాస్త్రి-సిద్ధాంత శిఖామణి (పుట 219)
36. కాశీనాథశాస్త్రి-చంద్రజ్ఞానాగమః (1956 : పుట 63)
37. అదే (పుట 63)

పండిత త్రియములోని శివలెంక మంచణ్ణ యొక్క
కాయ జీవ భావములను పరిశీలింతము.

నాలుగు:- "కాయ విద్దు కాంబువదు-గురుస్థల
జీవ విద్దు కాంబువదు-లింగస్థల
భావ విద్దు కంబువదు-జంగమస్థల"[39]
కాయముతో చూచునది గురుస్థల మనియు.జీవముతో చూచునది
లింగ స్థలమనియు,భావముతో చూచునది జంగమస్థలమనియు
ఎంచబడునని తన వచనములో వివరించెను.

5. వానప్రస్థ -యోగముల ఖండన :

ఈ కాయక నిర్వచనము లు బసవేశ్వరునకు ఎంతో సంతృప్తిని ఆత్మ విశ్వాసమును కలిగించినవి. ఇక చేయవలసినది వానప్రస్థమును యోగమును ఖండించిన యెడల కాయకమే కైలాసమును సిద్ధాంతమునకు సంపూర్ణత సిద్ధించును.

వి.కె.జవళి ఇట్లు అభిప్రాయపడిరి:

"Kayaka means an, Occupation, a profession, a vocation, Labour, work, duty or any employment under taken as a means of self realisation. It is opposed to the idea of meditation in a forest: running away from the Society: it is opposed to Sanyasa or remunication and it is opposed to beggary and dependence on others for a living. Kayaka cuts at the root of the traditional Varna or Caste order of Society and Asrama or compartmental stages of life. Kayaka is not Karma"[40]

38. కాశీనాథశాస్త్రి-చంద్రజ్ఞానాగమః (1956 : పుట 63)

39. భూసనూర మఠ-వచన సాహిత్య సంగ్రహ (1965 : పుట 141) (సం)

40. V.K. Javali-Essay in 'Sri Basavasvara' (1967 : Page 139)

వైదిక మతములోని తపస్సును, సన్యాసమును, కులస్థానమును, కర్మను పరిత్యజించి దాని స్థానములో కాయకమును అధిష్టింపజేసెను.

"This conception of work without looking for the result as found in Isa Upanishad is the basis on which Bhagavadgita stands and in it, it is called Yoga, while Basaveswara calls it Kayaka"[41]

అని టి ఎన్. మల్లప్ప ఫలాపేక్ష రహిత కృత్యమునే యోగమని ఆ యోగమనే కాయకమని పిలిచెనని చక్కగా విశ్లేషించిరి

6. వృత్తి స్థానము :

ఆ నాటి సంఘములో వృత్తి యొక్క స్థితిగతులను అధ్యయనము గావింపవలయును "నాడు ఉద్యోగము లౌకిక స్థితిలోనై మత సంబంధముగా నుండెను"[42] అని బి.సి.వి. జవళి తెలియజేయుచున్నారు. కొన్ని వృత్తులు నీచమనే భావము ప్రబలియుండెను. ఈ భేదమును వ్యత్యాసమును తొలగించి అన్ని వృత్తులవారు సమానమని బోధించెను, సాంఘికముగా, మత పరముగా రాజకీయముగా సమాన గుర్తింపు, గౌరవము కలుగునట్లు కృషిచేసి సాధించెను. సమస్త వృత్తులు లౌకిక హితము కొరకు మాత్రమే కాదనియు, అవియే కైలాసమనియు, వృత్తిని త్రోసి వచ్చిన కైలాసము కానరాదనియు వివరించెను. కాయకము ఆధ్యాత్మిక ప్రగతి మార్గమునకు సాధనమనియు, లౌకిక ఆధ్యాత్మిక భేద భావము లేదనియు బసవేశ్వరుడు ప్రచారము గావించెను ఏ చిన్న ఉద్యోగముకాని, వృత్తికాని నీచము కాదనియు సమానమనియు సంఘ సంపదకు, ఐక్యతకు అన్ని వృత్తులు సమాన భాగస్వాములనెడి అభిప్రాయమును కలిగించినది.

"మరొక సాదృశ్యమును పరిశీలించిన శైవ నాయనార్ల ప్రభావము కలిగిన జేదర దాసిమయ్య చాళుక్య జయసింహునియాదరణను గణింపక బహుమతిగా నొసంగ నిర్ణయించిన వస్త్రమును జంగముడు కోరగనే నిచ్చి

41. T.N. Mallappa-Essay in 'Sri Basaveswara' (1967 : Page 88)

42. బసవరాజు చెన్న వీరప్ప జవళి_ధర్మ భండారి బసవణ్ణ నవరు (1963 : పుట 101)

వేసెను. రాజా శ్రమమునకన్న తన వృత్తి గొప్పదని గుర్తించినట్లు గమనింపవచ్చును."43

బసవేశ్వరుని వచన సాహిత్యములో కాయకము యొక్క అర్థమును పరిశీలింతము.

ఎ. "కాసి కమ్మారనాద, బీసిమడివాళనాద,
హాసనిక్కి సాలిగనాద, వేదవనోది హారువనాద!
కర్ణదలి జనిసిద వరుంటె జగదొళగె ?
ఇదుకారణ కూడల సంగమదేవ ! "44

— 86 వచనము —

కాసి కమ్మరివాడు, బట్టలను ఉదికి మడివాళువాడు, వేదము చదివి బ్రాహ్మణుడయ్యేను చెవులలో ఎవరు పుట్టినారు ? చెవులలో పుట్టుట అనగా రెండవసారి జన్మ మెత్తుటయని అర్థము. 'జన్మనాజాయతే శూద్రః కర్మణా భవతి ద్విజః' అని ప్రమాణము. ఈ కర్మ కాయకష్టమే తప్ప కుడి చెవిలో గాయత్రి నూదుట కాదని అర్థము. అనగా బ్రాహ్మణుడు మాత్రము ఎట్లు పుట్టెనని ప్రశ్న.... ఇవి వృత్తుల వర్ణములు కాదు. సంఘ నిర్మాణములో ప్రతి వృత్తి సమాన భాగస్వామ్యమును వహించునని బసవేశ్వరుడు స్పష్ట పరచెను.

బి. "సెట్టి ఎంబెనేసిరియాళన? .... .... .... ....మాదార
నెంబెనే చెనయ్యన?"

-బ.వ-88-పుట 78

ఏ కాయకమునైనను చేసినను జీవింపవచ్చును. సిరియాళుడు, కక్కయ్య చెన్నయ్య వేరువేరు వృత్తులను స్వీకరించి విశ్వసించుచు నిర్వహించి ధార్మిక సమాజములో ఉన్నత శివ శరణ స్థానము నలంకరించిరి.

**కాయక లక్షణములు :**

కాయకమును వివరించిన తర్వాత దాని లక్షణములు పరిశీలింతము.

43. H. Deveerappa (Editor) Vachanas of Basavanna (1967 : Pages 455, 456)

44. డా. యల్. బసవరాజు-బసవ వచనామృతము (1981 : పుట 76)

కాయకమును చిత్తశుద్ధితో నిర్వహించిన నులియ చందయ్య దాని లక్షణముల నిట్లు పేర్కొనెను.

" .... .... .... కాయక దింద బందదు లింగక్కెర్పిత వల్లదే
దురాశ యింద బందదు అనర్పిత.
ఇదు కారణః సత్యశుద్ధ కాయకద నిత్యద్రవ్య వాదర
చందేశ్వర లింగక్కె నైవేద్య సందిత్తు కేళయ్యా!"45
-శూ. సం-14-15 మత్తం

కాయకముతో నార్జించిన దానిని లింగమున కర్పింపవలయుననియు, దురాశలో సంపాదించినది అనర్పితమని చందయ్య వివరించుచు కాయక లక్షణములను పేర్కొనెను.

1. కాయకము సత్యముగా నుండవలయును.
2. కాయకము శుద్ధముగా నుండవలయును.

బసవేశ్వరుడు ప్రతిపాదించిన 'కాయకమే కైలాసము'లో కాయకమనగా నిర్వచింపబడినది: కాని వృత్తి కైలాసమగుటకు ధార్మిక సమాజముపై దాని ప్రభావ మెట్లున్నదన్న విషయము అధ్యయమున చేయవలయును. ఇచట మరల నాయనార్లు జ్ఞప్తికిరాక తప్పరు. వారి అన్న దానవ్రతము వీరశైవము పై ప్రభావము జూపినది. అనగా బసవేశ్వరుని ఆకట్టుకొన్నది

నాయనార్లలో అగ్రవర్ణాలవారున్నారు.

1. కాలి నాయనారు కవి. 2. సోమసిమారర్ సోమయాజి 3. శిఱ పులి నాయనారు నిత్య అగ్నిహోత్రి. వీరు శివ భక్తులకు దాసానుదాసులై నిత్యము అన్నదానము చేయుచుండిరి. క్షత్రియులలో 1. నరసింగముని యార్-తిరుముసైపాడిరాజు, 2. ఇడంగళి-కుడుం బాళూరు క్షత్రియుడు. 3. నెడుమార (నిస్ద్రశీర్) మధుర నివాసి. వీరు కూడ శివ భక్తులకు దాసాను దాసులై అన్న దాన వ్రతమాచరించుచుండిరి. వీరిలో ఇడంగళి నాయనారు ఒక శివ భక్తునకు ధాన్యాగారమునే అప్పగించెను, వైశ్యులలో అమర్నీతి శివదాసుడై అన్న, ధన, వస్త్ర, కౌపీనముల, మల్లికామాలలను

45. గూళూరు సిద్ధవీరణాచార్య-శూన్య సంపాదనె (1930 : పుట 253)

అర్పించుచుండెను. రైతులలో మానక్కంజార్, మునైలడువార్-అన్న మొసంగిరి. మూర్ఖనాయనారు ఉన్న ధనమును భక్తుల సేవకు వినియోగించి చివరకు ద్యూతములో సంపాదించిన ధనముతో సేవించెను. కోట్పుల నాయనారు వేళాల జాతికి చెందినవాడు. తాను యుద్ధములో సంపాదించిన ధనమును శివాలయమునకె దాచియుంచగా బంధువులు ఖర్చుచేసితిని నందులకు పెద్దలతో పాటు పసిగుడ్డును కూడ వదలక వధించెను. నేసె నాయనారు కంప్లికి చెందిన నేతగాడు. శివ భక్తులకు వస్త్రముల దానము చేయుచుండెను.

'అర్థార్థము వ్యవసాయము, అర్థము భక్త హితార్థము' అని కాయక శ్రమార్జిత విత్తమున కుపయోగమును కూడ సూచించినది.

దాసోహం :

సత్య శుద్ధ కాయకము ద్వారా సంపాదించిన ధనములో కొంత భాగమును గురు లింగజంగమముల సేవ కర్పింపవలయును. దానినే 'దాసోహం' అందురు. ఇది దా—సః—అహం-అను మూడు శబ్దముల యొక్క సముచ్చయము.

దా — అనగా - అర్పణ, పరిశుద్ధమైన,
సః — అనగా - సొమ్ము,
అహం — అనగా - తనది.

అని అర్థ వివరణము.

"ఆణవ, మాయు, కార్మికయనెడి త్రివిధమలముల ; తను, మను, ధన అను వంచనాత్రయముల : తమ, మను, ధన-అనెడి త్రివిధ భవిగల; అన్న, ఐశ్వర్య, యవ్వన అనెడి త్రివిధ సురాపానముల;అంగ, మన, కామ అనెడి, త్రివిధ భంగముల; కనకము, కాంత, మన్ను అనెడి వహార్థ త్రయముల; జ్ఞాతృ, జ్ఞాన, జ్ఞేయ, అనెడి త్రిపుటముల; విత్తేషణ, దారేషణ పుత్రేషణ అనెడి ఈషణత్రయముల జాతి, జనన, ప్రేత, రజ, ఉచ్ఛిష్ట అనెడి పంచ సూతకముల; మసణ పురాణప్రసూతి, పిత్త, స్వామభావ సమ్యక జ్ఞాన అనెడి పంచ వైరాగ్యముల; జాతి, వర్ణ, ఆశ్రమ, శీల, గోత్ర, నామము లనెడి అరు భ్రమల; కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యములనెడి

అరిషడ్వర్గములు; సంస్థిత, తృణీకృత, వర్తన, క్రోధ, అతిచారిణి, గంధ చారిణి, పాసినికుల, ఛల, ధన రూప, యవ్వన, విద్య, రాజ్య, తపస్సును (మాణిసి) విడిచి, 'మహత్తు'ను సాక్షాత్కరింపజేసికొనుట దాసోహం"46 అని ప్రొ. ఎస్.ఎన్. పాటిల్ చాల చక్కగా విశదపరచియున్నారు.

ఎ. దాసోహ నిర్వచనములు :

1. "పని చేసి సంపాదించిన ధనముతో గురు లింగ జంగములను సేవించిన దాసోహం అందు"47 రని టి.ఎన్. మల్లప్ప చెప్పారు.

2. వి.కె. జవళి "కాయకముతో సంపాదించిన దానిని జంగమున కర్పించిన ఆ జంగమము సంఘాభ్యుదయమునకు వినియోగించును. దీనినే దాసోహమం"48 దురని వివరించారు.

3. "దయ, దాతృత్వము, కరుణ, అహింసా భావములను ప్రేమను సహజముగా కలిగియుండి మానవ సేవను మహేశ్వర సేవగా భావించుటను దాసోహం అందు"రని కుమారస్వామిజి విశ్లేషించారు. -Essay in 'Sri Basavesvara'—(1967 : Page 55)

4. "ఉచిత కృత్యముతో సంపాదించిన ధనముతో సోదరునివలె సంఘమును సేవించుటను దాసోహతత్త్వ ప్రాముఖ్యత"49యని డా. హెచ్.ఎమ్. సదాశివయ్య తెలిపియున్నారు.

"నాను పరసేవెయ మాడువెనయ్యా జంగమ దాసోహకెందు" జంగమ దాసోహము కొరకు ఇతరుల సేవ చేయుదునని, కైకూలి చేయుటకైనను సిద్ధముగా నుండవలయునని"50 బసవయ్య నిర్ణయించారు. "అంగత్రయ

46. ప్రొ. యస్.యస్. పాటిల్_బసవపథ (అక్టోబరు 1982 : పుట 28)
47. T.N. Mallappa-Essay in 'Sri Basavesvara' (1967 : Page 88)
48. V.K. Javali-Essay in 'Sri Basavesvarc' (1967 : Page 140)
49. Dr. H.M. Sadasivaiah-A comparative Study of Virasaive Monasteries (1967 : Page 69)
50. బసవయ్య-బసవపథ (జూన్ 1983 : పుటలు 9,10)

దల్లి లింగత్రయ సంబంధవాదల్లి జంగమ దాసోహ''మని చెన్న బసవేశ్వరుడు అభివర్ణించాడు.

కాయకముతో వృత్తి వైశిష్ట్యమును చాటి చెప్పి సంఘ ఏకీకరణ సాధించెను, కైలాసమని చెప్పుటలో సంఘాభ్యుదయమునకు కృషి గావించెను. '"Socialism based on work according to your capacity and receive according to your needs-this is the concept of Kayaka Dasoha"[51] Lobour theory of Value ఈ సందర్భములో ప్రస్తావింపవలసియున్నది. "Labour theory of value upon which Karl Marx and Engelsbased some of their important conclusions it leaves no surplus value for any employee"[52] అనియు వివరింపబడినది. దీనితో సంక్షేమ రాజ్యాశయము నెరవేరగలదు. "A welfare State is one which aims at the Maximum happiness of the maximum number of People"[53] అని బెంతమ్‌గారి యొక్క నిర్వచనము.

ఇది అంతయు వాస్తవమైన "If this is true Basava must be considered as the fore runner of Socialism''[54] అని కుమారస్వామిజి స్పష్టపరచినారు.

దాసోహము చేయు పరమ సద్భక్తుని యొక్క లక్షణములను బసవేశ్వరుడు వివరించుచూ

''కృషికృత్య కాయకదిందాద తేను ?
తను మన బళలిసి తందు దాసోహద మాడువ

51. B.B. Kanavi-Basava Journal (Sept. & Dec.) 1988 : P. 3)
52. Kumar Swamiji-Essay in 'Sri Basavesvara' (1967 : Page 58)
53. B.B. Kanavi-Essay in Basava Journal (1968 : Page 3) (Sept & Dece)
54. Kumara Swamiji-Essay in 'Sri Basavesvara' (1967 : Page 58)

పరమ సద్భక్తున ....అతన తను శుద్ధ, అతనమన శుద్ధ
అతన నడెశుద్ధ, నుడిశుద్ధ
- 83వ వచనము- (డా. ఎల్. బసవరాజు-బసవవచనామృత
(1981 - 73)

అతని శరీరము, మనస్సు ప్రవర్తన, మాట శుద్ధమైనవిగా నుండునట.

బి. దానోహ భేదములు :

ఉరులింగ పెద్ది-బసవేశ్వరునకు పూర్వమున్న శివశరణుడు దానోహ మందలి నాలుగు భేదములను వివరించెను:

బి (ఎ) ప్రపంచములోని ప్రతి మనిషిని శివునిగా భావించి సేవించుట.
బి (బి) తాను సంపాదించిన దానిని భక్తునకు సమర్పించుట.
బి (సి) తాను-భార్య, పిల్లల, స్నేహితులను ప్రేమించినట్లుగా, సేవించి నట్లుగా ఇతరులకు అర్పించుట.
బి (డి) తాను సంపాదించిన దానిలో ఎంత ఎక్కువ వీలైన అంత ఎక్కువ సమర్పించుట''ని డా. హెచ్.యం. సదాశివయ్య వివరించారు.

(A comparative Study of Two Virasaiva Monasteries- Page 55)

1. కాయకములో సమూతదృక్పథ అధ్యయనము :

వృత్తి మహాత్మ్యమును ఉగ్గడించి సేహాభావమును ఉద్ఘోషించిన బసవేశ్వరుడు 12వ శతాబ్దపునాటి శివశరణుని యొక్క ధార్మిక సమాజ స్థాపనకు కొన్ని నియమములను అమష్టింప వలయునని పేర్కొనెను.

"1 ప్రతి ఒక్కరు చెమటోడ్చి సంపాదింపవలయునవియు
2. ప్రతి ఒక్కరు తమకు తగిన వృత్తిని చేపట్టవలయుననియు
3. ప్రతి ఒక్కరు కనీస అవసరములకు మాత్రమే సంపాదింప వలయు''55నని కుమారస్వామిజి పేర్కొన్నారు. మరియు
4. Doing any kind of work entriches and benefits the Society.

55. Shri Kumara Swamiji-Mirror of Veerasaivism (1960 : Page 98)

5. It is not a capitalist kind of work.

6. Work to be treated, as a kind of dedication or a kind of Spiritual or religious offering.

7. It has repeated emphasis on Physical labour

గాంధి ప్రతిపాదించిన పని విభాగమను వాదనను "It is not merely a division of labour, it is also a division of labourers" అని డా. బి.ఆర్. అంబేద్కర్ వివరించారు.

"Religion often encourages laziness and Parasitism in the name asceticism. Basava Proclaimed in Unmistakable terms that the Kayaka was the purest path to Salvation. ________________ Kayaka is dedicated work; Dedication is of two kinds--One's own profession; dedication of the fruits of one's labour to the Society"[56]

మతపరమైన దానములు వ్యక్తులను సోమరుల జేసినవనియు, నిజాయితీ వత్తి, అంకిత భావముగల కాయికమే కైలాస సమాజమని డా. ఎం. చిదానంద మూర్తి వర్ణించారు.

2. "Thus in the new society which Basava founded, idleness and beggary had no place. Since everyone had to work, the economic structure of the society became naturally strong. The sense of dignity of labour promoted the feeling of equality.

శ్రమ యొక్క హుందాతనము, సమానత భావమును పెంపొందించిన"[47] దని ఎం.ఎస్. సుంకపూర్ ఉగ్గడించారు.

---

56. Dr. M. Chidananda Murthy-Essay in 'Sri Basavesvara' (1967 : Page 112)

57. M.S. Sunkapur-Essay in 'Sri Basavesvara' (1967 : Page 137)

3. Carlyle says "Work is worship". A Sivasarana says, "work is Heaven". The body of Sivayoga should never exert in vain. The Karma theory which has given rise to caste system-Basava condemms vehemently any discrimination on the basis of birth, sex or occupation. He advocated freedom of occupation and dignity of labour".
శివశరణుని శరీరము వృథాగా నాశనము కారాదని, వృత్తిలో స్వేచ్ఛను, శ్రమలో గౌరవమును ప్రసాదించె"[58]నని వి.కె. జవళి ఉద్ఘోషించిరి.

4. They stand on an ethical and spiritual plane as against just a materialistic plane on which the others stand".
నాస్తికులవలె గాక శివ శరణులు నీతి శాస్త్రసంబంధమైన, ఆత్మసంబంధమైన కక్ష్యలో నిలబడెదరు.

5. "శ్రమయే దైవమని" రాళ్ళను కొట్టువానియందు కూడ దేవుళ్ళు కలరని విశ్వకవి రవీంద్రనాథ ఠాగూరు వర్ణించుచు, "He is there where the tiller is tilling the hard ground and where the path-maker is breaking stones. He is with them in sun and shower and his garment is covered with dust. Put off thy holy mantle and even like him come down on the dust soil"[59]
కఠినేలను దున్నువానిలో, రాళ్ళను పగులగొట్టి దారి వేయువానిలో భగవంతుడున్నాడని వివరించారు.

6. Ruskin యొక్క, 'Unto this Last' and its three teachings ను జీర్ణించుకొన్న గాంధీజీ ఆ బోధనాత్రయమును ఇట్లు విశదీకరించారు.

---

58. V.K. Javali-Essay in 'Sri Basavesvara' (1967 : Page 140)

59. Rabindra Nath Tagore 'Geetanjali' (1966 : Page 9)

a. "That the good of the Individual is contained in the good of all.

b. That the Lawyer's work has the same value as barbers in as much as all have the same right of earning livelihood from their work.

c. That a life of a labour i.e.; the life of the tiller of the soil and handicrafts man is the life worth living"
అని బి.బి. కనావి శ్రమలోని ప్రాముఖ్యతను వివరించారు. వ్యక్తి యొక్క మంచి తనము అందరి మంచిని కోరుటలోను వకీలు యొక్క పని ఎంత విలువైనదో నాయీ బ్రాహ్మణుని యొక్క విలువ అంతేననియు, నేల దున్నువాని యొక్క జీవితము, చేతి వనులు చేయువాని యొక్క జీవితము ఒక్కటేననియు భావము.

"The Occupation assumes an independent existence owing to division of labour. Everyone believet his craft to be true one"[60]
అని కారల్‌మార్క్స్ మరియు ఫ్రెడిరిక్ వివేచన చేశారు.

లింగధారణ మత సమతను, కాయకము సాంఘిక సమతము, దాసోహము ఆర్థిక సమతను సాధించినవి-నిర్ధారింపవచ్చును.

2. ధార్మిక సమాజము-లక్షణములు :

వీరశైవ మత పంచాచారములను బట్టి ఆనాటి ధార్మిక సమాజమును కొంత వరకు తెలిసికొనవచ్చును. వ్యక్తి యొక్క విలువలు, వృత్తి గౌరవము ఆనాటి సమాజమునకు దర్పణము పట్టగలవు.
వీరశైవులకు నీతి ప్రధానములగు సదాచారములు కూడ విహితములైయున్నవి.

"1. లింగాచారము : లింగ పూజ నిష్ఠుడైయుండుట.

60. Karl Marx and frederiek-Selected works I
(1977 : Page 80)

2. సదాచారము : పర ద్రవ్యము, పరస్త్రీలను కోరకుండుట, ధనార్జనను గురు లింగ జంగమముల సంతృప్తికై వెచ్చించుట.

3. శివాచారము : శివాధిక్యతను పాటించుచు, శివశరణుల ధర్మము ననుసరించి వ్యవహరించుట.

4. భృత్యాచారము : శివ భక్తుల కందరకును తాను భృత్యుడనని భావించుచు విధేయుడై యుండుట.

5. గణాచారము : శివనింద వినకుండుట, ప్రతిఘటించుట: ధర్మ రక్షణకు కంకణ బద్ధుడగుట,'' యని

యం. శంకరయ్య వీరశైవ దర్పణములో (జులై 1988-పుట 39) వివరించారు.

3 కాయకద స్వాముల పాత్ర :

శివ శరణులు వీర వ్రతాచారమునకు ఒకింత భంగము కలిగించిన సమాజము లోన భూయిష్టమగును. అందుచే వీర మహేశ్వర వ్రతమును శివ శరణులెట్లు పాటించుచున్నారో పర్యవేక్షించుటకు, తప్పుచేసిన వారిని శిక్షించుటకు కాయకద స్వాములు నియమింపబడిరి.

డా. హెచ్.ఎం. సదాశివయ్య కాయకదస్వాముల వివరములనిట్లు తెలియ జేయుచున్నారు.

"The Kayakada Swamis-means a Swami who does work. But the wandering monk went from village to village, supervised the conduct of the people and set right the injustices they came across, by following the principle of Satyagraha, a nonviolent way of making the guilty person realize his guilty and rectify it accordingly. In many cases the guilty person was made to pay compensation to the aggreieved party''. (A comparative study of Two Virasaiva Monasteries 62 Page.)

"కాయకద స్వామి అనగా పనిచేయువాడని అర్థము. ఈ సన్యాసి ఒక గ్రామము నుండి మరియొక గ్రామమునకు పోవుచు ప్రజల వర్తన

మును పర్యవేక్షించి, అన్యాయములను, సత్యాగ్రహము, అహింసల ద్వారా సరిదిద్ది తప్పు చేసిన వ్యక్తి మార్పు చెందునట్లుగా చేయును''.

ఈ కాయకద స్వాములు ఆరు మంది ఆరు విధములైన పనులు జేయుదురు.

1. గంటకాయకద స్వామి (గంటను కొట్టుచుండును). 2. ముల్లెవిగె కాయకదస్వామి (మేకుల చెప్పుల వేసికొనును). 3. కనికాయకదస్వామి (నాలు గింటిపై నిలబడును). 4. గద్దెకాయకదస్వామి (మౌనముగా ఎవరితోను మాట్లాడక రోజుల తరబడి కూడలి వద్ద కూర్చొని ఏమియు తీసికొనక యుండును). 5. మంగళకాయకద స్వామి (పళ్ళెములో కర్పూరమును వెలిగించుచుండును). 6. తెక్కెకాయకదస్వామి. (ఇంటిస్తంభమును పట్టుకొని వ్రేలాడుచుండును.

గంట కాయకద స్వామి ఒక గ్రామమునకు వచ్చి మఠపతి, మఠదయ్య ద్వార మతాచారములు పాటించు విధానమును తెలిసికొని వీధులలో గంట వాయించుచుండును. ధార్మిక నాయకులు వచ్చి తాము వీరశైవము యొక్క సిద్ధాంతమును పాటింతుమని మాటఇత్తురు. వారి నిజాయితీని విశ్వసించిన గంట కాయకదస్వామి గంట వాయించుట నిలిపి ఆ గ్రామములో భోజనము చేసి మరొక గ్రామమునకు పోవును.

ఒక నెల తర్వాత గద్దె కాయకదస్వామి అదే గ్రామమునకు విచ్చేయును. మఠపతిని, మఠమయ్యను ప్రజల ప్రవర్తనను గురించి విచారించుకొనును. మఠపతి ఎటువంటి ఫిర్యాదు చేయకపోయిన గద్దెకాయకద స్వామి మరొక గ్రామమునకు వెళ్ళును. కొన్ని కుటుంబములవారు మత ప్రవర్తనా నియమావళిని పాటించుటలేదని చెప్పిన ప్రధాన వీధిలో రెండు చేతులతో గంటలు వాయించుచు గద్దెకాయకదస్వామి కూర్చుండును. ఆ కుటుంబమువారు వచ్చి తాము కూడ తప్పక మత నియమములను పాటించెదమని మాట ఇచ్చిన గద్దెకాయకదస్వామి గంటలు వాయించుట నిలుపును. కాని ఇందుకు వారు కొంత దక్షిణను సమర్పించుకొనవలెను.

మరొకనెల తర్వాత ముల్లవిగ కాయకదస్వామి అదే గ్రామమున కేతెంచును. మత నియమముల పాటించని వారు తమ తప్పును సరిదిద్దు కొనక పోయినచో ముల్లవిగ స్వామివారి ఇండ్ల ముందు చీల పైన మన్న

పాదుకలపై నిలుచుండును. ఎప్పుడైతే వారు తమ ప్రవర్తనను సరిదిద్దు కొందుమని ప్రతిన చేయుదురో అప్పుడు తన కాయకమును ముగించును. అందుకు జరిమానాగా ఒక రూపాయను పుచ్చుకొనును. మఠమునకు వెళ్ళి భోజనము చేసి ఇంకొక గ్రామమునకు వెళ్ళును.

తర్వాత ఒక నెలకు తెక్కె కాయకదస్వామి అదే గ్రామమునకు వచ్చును. మఠపతయ్య ద్వారా ఒక కుటుంబము ఇంకా తప్పుడు ఆచారములను వదులు కొనలేదని గ్రహించి ఆ ఇంటిలోని వారందరు వచ్చి మతనియమములను ఖచ్చితముగా పాటించెదమని శపథము చేయువరకు ఆ ఇంటి యొక్క స్తంభమును కౌగలించుకొనియుండును. చివరకు ఆ ఇంటివారు ప్రవర్తనా నియమములను పాటించెదమని మాట ఇచ్చిన తర్వాత తన కాయకమును విరమించి, అ ఇంటిలో భోజనము చేసి, దక్షిణను స్వీకరించి ఇంకొక గ్రామమునకు వెళ్ళును.

ఒక నెల తర్వాత మంగళ కాయకదస్వామి అదే గ్రామమునకేతెంచును. ఆ గ్రామములోని ప్రజలందరు పంచాచారములను సక్రమముగా పాటించుచున్నారని మఠపతయ్య ద్వారా కనుగొని కర్పూరమును ఒక పళ్ళెములో వెలిగించి ప్రతి ఇంటికి పోవుచు వారిని దీవించును. ఐచ్ఛికముగా నిచ్చు వారి నుండి మాత్రమే దక్షిణ స్వీకరించును.

ఈ స్వాములు వీరశైవ మతము యొక్క పంచ పీఠములకు చెందిన వారు గంటకాయకద స్వామి 'రంభాపురి' మఠమునకు చెందిన 'రేవణ సిద్ధ' పేరుని చెప్పును. గద్దె కాయకదస్వామి 'ఉజ్జయిని' మఠమునకు చెందిన 'మరుళ సిద్ధస్వామి' పేరును తెలుపును. ముల్లవిగ కాయకదస్వామి 'శ్రీశైల మఠమున'కు చెందిన 'ఏకోరామేశ్వరస్వామి' పేరును ఉటంకించును. తెక్కె కాయకదస్వామి 'కేదారనాథ్' మఠమునకు చెందిన 'పండితారాధ్యుని' పేరు వినిపించును. మంగళ కాయకదస్వామి 'కాశీ' మఠమునకు చెందిన 'విశ్వారాధ్య' పేరును ఉచ్చరించును. ఈ విధముగా కాయకద స్వాములు ప్రధాన మఠములకు వెళ్ళి మాస నివేదికలను సమర్పింపవలయును.

తీవ్రమైన శిక్షలు, బహిష్కారము అవసరమైనచో ప్రధాన గురువులు ఆ వ్యక్తికి చెందిన మఠశాఖల ద్వారా అమలు పరచుచుందురు. మఠము నేరస్థునిగా గుర్తించిన వ్యక్తితో ఇతర లింగాయతులు ఎటువంటి సాంఘిక

సంబంధములు పెట్టుకొనరాదు. లింగధారణ, వివాహము, మరణ సమయ ములందు ఏ లింగాయతులు పాల్గొనరాదని కట్టడి చేయబడుమ.

"Thus Veerasaivism was healthy growth on the soil of Hinduism because it attempted many useful reforms neither sex, nor social status nor caste disqualifies a person from attaining salvation; and hence in the eyes of a Virasaiva the 'Untouchable' and the 'Weaker Sex' are potentially the religious and Social equals of the members of the highest castes"[61]

అస్పృశ్యుడు, అల్పుడును మత, సాంఘిక, స్థాయిలో ఉన్నత వర్గము వారితో సమాను''లని డా. హెచ్. సదాశివయ్య ఉల్లేఖించుచున్నారు.

12వ శతాబ్దములో బసవేశ్వరుని 'కాయకమే కైలాసము అన్న సిద్ధాంతము ఆర్థిక వ్యత్యాసములను తొలగించి, అందరిని ఒకే దైవము క్రింద చేర్చి, కుల భేదముల నిర్మూలించి ఎల్ల శివ శరణులు లింగము ఎదుట సమానమని ఋజువు చేసినది.

"Work became Kayaka, capable of Uniting all under God, for all stand as equals before the Linga"[62]

అని ఎసుందర రాజ్ థియోడర్ విశ్లేషించినారు.

---

61. Dr. H.M. Sadasivaiah-A comparative Study of Twa Virasaiva Monasteries (1967 : Page 67)

62. A. Sundera Raj Theodora-Essay in 'Sri Basavesvara' (1967 : Page 284)

అధ్యాయము 4

మత సంఘర్షణలు-రాజకీయ సంస్కృతి :

(ఈ అధ్యాయమున రెండంశములున్నవి. దొరికిన చారిత్రక ఆధారమును బట్టి, వీరశైవ రచనలలో ప్రస్తావింపబడిన అంశములను బట్టి-భిన్న మతములతో వీరశైవ మతము పొందిన సంఘర్షణ, తత్ఫలితములను వివరించుట మొదటిది.

వీరశైవ కవుల రచనలలో కనిపించు వర్గ, వర్ణ సంఘర్షణలు నిరూపించుట రెండవది.)

"భక్తిని మించిన కర్మ సిద్ధాంతము, వర్ణాశ్రమ ధర్మములలోని చెడు ప్రభావము, కుల భేషజము, జన్మతః లభించు ఔన్నత్యము ప్రధానమైన లోపము. బౌద్ధము అల్పసంఖ్యాక వర్గములో మిగిలిపోయినది. జైనము సామాన్యులపై పట్టు కోల్పోయినది. కౌల, కాపాలిక, గణపత్య, సౌరశాఖలను అనుసరించువారు మధు ప్రియులై, మాంస భక్ష్యకులై, స్త్రీ లోలురైరి. కాల ముఖులు గుడుల నిర్మాణములోను, విగ్రహ పూజలోను పాల్గొని"[1]రని డా. యం. చిదానందమూర్తి వివరించుచున్నారు.

"గ్రామీణ ప్రాంతాలలో భూయజమాని వర్గము, నగరాలలో నిర్మాణము పొందిన వాణిజ్య వర్గమూ తలెత్తి, ప్రజానీకము పరమదరిద్ర స్థితికి లోనవడంతో, కొత్త విశ్వాసాలు, కొత్త ఆరాధన పద్ధతులు, క్రొత్త ఉద్యమాలు ప్రారంభమయ్యాయి. ఈ ఉద్యమాలు ప్రభువులా, సామంతులా, అధికార్ల దృష్టిని కూడా ఆకర్షించాయి. విభిన్న మతస్థుల వాదోపవాదాలలో నెగ్గినవారి మతాన్ని తాము స్వీకరించేవారు. దీని ప్రభావము ప్రజా సామాన్యము మీద చాలా ఎక్కువగా ఉండేద"[2]ని కంభంపాటి సత్యనారాయణ తెలియజేయుచున్నారు.

---

1. Dr. M. Chidananda Murtny-Essay in 'Sri Basavesvara' (1967 : Page 110)
2. కంభంపాటి సత్యనారాయణ-ఆంధ్రుల సంస్కృతి-చరిత్ర-1 (1988 : పుట 192)

జైనమత స్థానములో వీరశైవ మత స్థాపనకు సుగ్గలాదేవి (చాళుక్య జయసింహుని II (క్రీ॥ శ॥ 1018-1042) భార్య) సంఘర్షణతో మత సంఘర్షణలు ప్రారంభమయినవి. వైదిక మత విధ్వంసనములో అనంతపాలుని ఆస్థానములోనున్న శ్రీపతి పండితారాధ్యులు (క్రీ॥ శ॥ 1072) విజయవాడలో అగ్నినాకర్షించుటచే వైదికులకు కనువిప్పుకల్గెను. రామానుజాచార్యులు ప్రచారము గావించిన వైష్ణవ మతమును ఖండించుచు, శివలెంక మంచన (క్రీ॥ శ॥ 1140) సంఘర్షణ మొదలైనది. బసవేశ్వరుడు (క్రీ॥శ॥ 1133-1167)లో ప్రభుతతో సంఘర్షణ వీరశైవ మతమునకు చైతన్యమును కల్గించినది. అదే కాలములో శ్రీ మల్లికార్జున పండితారాధ్యులు (క్రీ॥శ॥ 1100-1170)లో బౌద్ధమత నిర్మూలనమునకు ప్రయత్నించెను. చివరగా వైదిక, వైష్ణవ మతములను ఖండించుచు సంఘర్షణపడిన పాల్కురికి సోమనాథుడు వీరశైవ మత వ్యాప్తికి జీవితమును ధారవోసెను. ఇవన్నియు సామాన్యమైన సంఘర్షణలుకావు రాజ్యములను కూడా తారుమారు చేయగలిగిన విప్లవములుగను, పోరాటములుగనూహింపవచ్చును.

ఎ. జైన-వీరశైవమత సంఘర్షణ :

చాళుక్య జయసింహ II కర్ణాటక రాజ్యమును పరిపాలించుచుండెను. జయసింహుడు జైవ మతమును అవలంబించు వ్రతము కల్గియుండెను. ఆ రోజులలో "ఒక శరణుడు - సాంఖ్య తొండడను వాడు జైనుల మధ్య నివసించుచు అంతర్గతముగా శివుని ధ్యానించుచుండెడివాడు. ఈ విషయము తెలిసిన ప్రజలు తీవ్రముగా శిక్షింపయత్నింప శివుని ప్రార్థించి సాంఖ్య తొండడు కైలాసమునకేగెను. ఒక స్త్రీ వైజకవ్వ జైనుడైన భర్తనుకాదని శివుని ధ్యానించుచుండ భర్త ఈ విషయము గ్రహించి రాజ దండమునకు గురిచేసెను. ఇటువంటి సంఘటనలు, బసవేశ్వరునికి పూర్వము జరిగిన"[3] వని యస్.సి. నందిమఠ్ తెలియజేయుచున్నారు.

జయసింహుని భార్య సుగ్గలాదేవి వీరశైవ గురుపులు, ప్రథమ వచన కారుడైన తేడర దాసయ్య శిష్యురాలు. ఈ సంగతి తెలిసి రాజు రాణిని

3. S. C. Nandimath -A Hand book of Virasaivism (1979 : Page 153)

జైన మతము స్వీకరింపకున్న తనను విడిచి వెళ్ళిపొమ్మని శాసించెను. ఒక మహారాణి పరిస్థితే నిటులున్న నాటి సామాన్యుల దుస్థితి వర్ణింప అలవికానిది చివరకు మత వాదనకు సభ ఏర్పాటుచేయబడెను. ఆమె అధిక కోపోద్రిక్త యయ్యెను. 'దాసయ్య పాద పద' ముద్దాసియొత్తుచు సేవించుచుండెను. (బ.పు_6_427_428 ప ॥)

దాసయ్య వాదమును ప్రారంభించి, జైనులతో మీకు కల్గినది జీవమో, ఆత్మయో తెలుపుడని ప్రశ్నించెను. నాస్తికులైన జైనులు ఈశ్వరుని అంగీకరింపరు. అందుచే వారు ప్రత్యుత్తరము ఈయలేకపోయిరి. దాసయ్య శివ జీవ భేదమును శివుని విశిష్టతను వివరించెను. మంత్ర, తంత్ర మాయా మంత్ర మహేంద్రజాల, అద్వైత శూన్య కర్మ విద్వేషమును తర్కించిరి. (428 పు ॥) వేద వేదాంత న్యాయ వైశేషిక దృష్టులతో రామనాథుడే కర్తయని దాసయ్య నిరూపించెను. ఇందులకు సుగ్గలాదేవి ఎంతేని తోడ్పడుచుండెను.

"సుగ్గలదేవి యౌత్సుక్యంబు దనర
నగ్గురు దేవువాన నగ్గించుచుండు"

దాసయ్య వాదములో జయించెను. (బ.పు-6-429 పు ॥) బల్లహుని సంతోషమున లింగ సహితునిగా చేసి 'పటిక లింగంబును' ఆ పట్టణములో 'ఉత్తరేశ్వరుని'గా ప్రతిష్ఠించెను.

"సుగ్గలాదేవి క్రీ॥శ॥ 1029లో పాశుపత మతాచార్యుడైన బ్రహ్మరాశి పండితునకు దేవపురిలో దైవసేవకు కొన్ని భూములు దానము చేసెను. క్రీ॥శ॥ 1036లో జయసింహుడు దేవాలయ పునరుద్ధరణకు కాలముఖ మతాచార్యులైన లకులీశ్వర పండితునకు భూదానముచేసె"4నని జి.యస్. దీక్షిత్ తెలియజేయుచున్నారు. జైనము సర్వనాశనమయ్యెను. 'పొట్లచెరువు' లోని 700 జైనాలయములు నాశనం గావింపబడెను. ఇట్లు వీరశైవము ఉద్ధరింపబడజొచ్చెను.

వీరశైవ, జైనమత సంఘర్షణ ఒక ఉద్యమము ఇది నిరంతరము సాగిన పోరాటము. ఏకాంతరామయ్య (అబ్బలూరు శాసనములో) తల

4. G.S. Dikshit-Essay in 'Sri Basavesvara'
(1967 : Page 121 & 122)

నరుకుకొని తిరిగి ఏడు దినములకు పొంది, జైన పరీక్షలో నెగ్గెను. గోపూరి బ్రహ్మయ్య జన సమయుల మంత్రి తంత్రముల ఖండించె శివాలయముల స్థాపనకు కృషి చేసెను.

"మంత్రి తంత్రములచే మట్టిఁ గాల్చినఁగు
మంత్రి కుతంత్రి కుమాయాపహారి
వసుధనీత్రైయున్న వటముపై నపుడ
భసితంబు సల్లి యెప్పటి యట్ల నిలిపి."

—బ.పు-6-425 పుట

పొడ్డల దేపు బాచయ్య బసవణ్ణ సమకాలికుడు. శివరాత్రి జాగరణకై సౌరాష్ట్రమునకు వెళ్ళుచుండెను. బిజ్జలుడు ఇది సహింపలేదు. బాచయ్యను కరుణించి "సౌరాష్ట్ర నాథుడు నాశ్చర్యంబెలర్పఁ, దివిరి కొట్టరువు గాదియ వచ్చికొనచు భువి బ్రతిష్ఠుండయ్యె"

—బ పు-6-460 పుట

బి వైదిక-వీరశైవమత సంఘర్షణ :

బెజవాడను పరిపాలించు అనంతపాలుడు (క్రీ॥శ॥ 1072) ఒక చాళుక్య రాజు. ఇతని గురువు శ్రీపతి పండితారాధ్యులు. ఆ కాలములో యుద్ధముల కన్నా వాదములు బలమై తర్వాత సంఘర్షణలు జరుగుచు, పోరాటములకు దారి తీయుచుండెను. శ్రీపతి పండితారాధ్యులు "ప్రతి దినమూ భోగశేఖర మందిరములో శివుని మొక్కి శివభక్తులకు మహిమలు బోధించుచుండెను. ఈ బోధనలను వినజాలని పరవాదులు శ్రీపతిని దోషిగా నెంచి రాజునకు ఫిర్యాదు చేసిరి. వాదము కొఱకు ఏర్పాటు చేయబడిన-సభలో పండితారాధ్యులు జయించెను. పరవాదులు శ్రీపతి పండితునకు నిప్పు లభింప కూడదని శాసించిరి అది విని పండితారాధ్యులు కోపోద్యుక్తుడయి మల్లేశ్వరుని గుడికి వెళ్లి తన చీనాంబరములో అగ్ని నాకర్షించి అచ్చటనున్న జమ్మి చెట్టుకు కట్టి అగ్నిస్తంభన గావించెను. అట్లు ఒక వారము పరవాదులు అగ్ని లేకుండా బాధపడి"5రని శ్రీ కాశీనాథశాస్త్రి తెలిపిరి.

నాటి పరవాదులు బహుశః వైదిక ధర్మమును పాటించువారై యుండిరి

5. కాశీనాథశాస్త్రి-శ్రీపతి పండితారాధ్యర కాలనిర్ణయ (1959 : పుట 45)

యజ్ఞ యాగాది క్రతువులను నిర్వహించుట అధికముగా నుండెను. కర్మకాండ తీవ్రమయ్యెను. అవి ఈ సంఘర్షణలతో కొంత నిరోధింపబడెను.

మరొక సంఘటనలో శ్రీపతి పండితారాధ్యులు అస్పృశ్యుడైన డోహర కక్కయ్యతో విందారగించెను. ఇదియు వర్ణాశ్రమ ధర్మమునకు వ్యతిరేకమైనది.

రాజు, ప్రజలు వీరమహేశ్వరాచారమును అంగీకరించి, సాంఘిక, ఆర్థిక, సాంస్కృతిక సంస్కరణములు ప్రవేశపెట్టి యుండవచ్చుననుట సంభావ్యము. శివాలయములు అనేకములు నిర్మింపబడి యుండవచ్చును. దీనిని గుర్తించి శివ తత్త్వసారములో మల్లికార్జున పండితారాధ్యులు.

"ఒక్కడ దైవము శివుడని,
నిక్కము సేయుటకు ముడిచె నిప్పుల చీరన్
స్రుక్కక శ్రీపతి పండితుఁ
డక్కజముగా విజయవాడ నలజిమ్మి శివా" !
— 406వ పద్యము.

అని వర్ణించెను.

సి. వైష్ణవ-వీరశైవమత సంఘర్షణ :

"రామానుజాచార్యులు వైష్ణవ మతమును ప్రారంభించిరి. సుమారు నూరు సంవత్సరములు జీవించి దక్షిణ దేశ మంతటా వైష్ణవ మతమును ప్రచారము చేసెను."[6] అని శ్రీ ఏటుకూరు బలరామమూర్తి తెలుపుచున్నారు. ఇదే కాలములో రామానుజులకు దీటుగా శివలెంకమంచన వీర మహేశ్వరాచారమును ప్రచారముగావించెను. ఇతడు 'సకలాగ మాచార్యుని' కుమారుడు మంచనతంత్రి వృత్తులను దీపిక, కామికాగమములకు వృత్తికలను రచించెను.

మంచన విరభక్తుడు. కాశిలోన "తప్పక శివునకుఁదని పదివేళ్లు ముప్పూట ప్రచారము ఋజించి యప్పుడు పడయు"
—బ.పు-6-467 పుట

వీరమహెశ్వర పదమే యుత్తమని ఈశ్వరుండొక్కరుండే కర్తయని

6. ఏటుకూరు బలరామమూర్తి-ఆంధ్రుల సంక్షిప్త చరిత్ర (1989 : పుట 102)

ప్రతిష్ఠించెను. దీనికి అన్య సమయులు ఓర్వలేక వాదమునకు దిగి 'తమ శాస్త్రంబు లెత్తి, భ్రమగొనియొక్కొక్క ప్రశ్న' వేసిరి. వారితో శివలెంక మంచన భట్టారకుడు వాదమునకు దిగి

"నిపుణతమై సకల పురాణశాస్త్ర
విపులార్థ వాదముల్విఖ్యాతి వెలయఁ"

బసవ పురాణము-6-468 పు

అన్య సమయుల జయించెను. అంతేకాదు హరిని గొని వచ్చి అతనితో విశ్వేశ్వరునకు మ్రొక్కించెను. విష్ణువు గొప్పవాడయిన అవతారముల ధరించడు. మల మూత్రములకు నిలయమైన భూదేవిని వివాహమాడదు శివుని యొక్క ఆద్యంతముల చూడ కల్గియుండెను. విష్ణువు మహాత్మ్యము ను కలిగియున్న హాలాహలమును భక్షించియుండును.

లెంక అనగా రక్షించువాడని అర్థము. ఆంధ్ర కర్ణాటక దేశము లోగాక బసవేశ్వరునకు పూర్వము సమకాలికుడైన శివలెంక మంచన ఉత్తరాదిన వీరశైవ సంస్కృతిని ప్రచారము గావించెను. జీవన సరళి ధార్మిక సంఘము మారుటకు ప్రయత్నములు జరిగినవని అర్థము చేసికొన వలయును. ఏ రాచరికముపై ధ్వజము ఎత్తక పోయినప్పటికి బసవణ్ణకు కొంత వరకు ఆదర్శమయ్యెను. కన్నడ భాషలో శివలెంక మంచన వచనముల కూడ రచించెను.

కర్ణాటక దేశములో క్రీ॥శ॥ 8 నుండి 12వ శతాబ్దములలో రాష్ట్రకూటులు మరియు చాళుక్యులు పరిపాలించిరి. నాడు జైన మతము ఉచ్ఛస్థితిలో నుండెను. నాగదేవుని తర్వాత భార్యయైన అత్తిమబ్బె. 'పొన్న, రచించిన 'శాంతి పురాణ' వ్యాప్తికి తోడ్పడెను. ఆమె వసదులను నిర్మించి అజిత పురాణము' రచించుటకు 'రన్న'ను ప్రోత్సాహించెను చాళుక్య రాజుల చివరి కాలములో జైన మతము పతనము కాసాగెను.

బౌద్ధ మతము గుల్బర్గాజిల్లాలో బాగుగా వ్యాప్తిచెంది యుండెను. బౌద్ధులకు 'బెల్‌గామ్' ప్రముఖమైన కేంద్రము. అచ్చటనే అల్లమ ప్రభువు వృద్ధిలోనికి వచ్చినది. దండనాయక 'రూప భట్టయ్య' అచ్చట ఒక విహారమును నిర్మించెను. దంబల్‌లో బౌద్ధ మతము క్రీ॥శ॥ 1129 వరకు సాగినది.

దక్షిణ కెనరా, మంగుళూరులో నాథ పంథ సంప్రదాయము యుండెను. కాలముఖులు కొన్ని ప్రాంతాలలో మత వ్యాప్తి జేయుచుండిరి

డి. యుగ పురుషుడు :

బసవేశ్వరుడు క్రీ॥శ॥ 1133-1167లో శంప్రదాయమైన బ్రహ్మణ కుటుంబములో జన్మించెను. 'బాగవాడి' నాడులలో వైదిక మతమును పాటించుచుండిరి. "కాకతీయ రెండవ ప్రోల రాజు బిజ్జలుని నమకాలుడు. బిజ్జలునికి సహాయముగా తన సైన్యమును పంపి కళ్యాణి నగరాన్ని పశ్చిమ చాళుక్యరాజుల నుండి స్వాధీనం చేసుకోవడంలో ప్రోలరాజు సహాయ పడ్డాడు"7యని ఏటుకూరు బలరామమూర్తి తెలియజేసిరి. కాలచూరి బిజ్జలుడు II కళ్యాణిలో సుస్థిర ప్రభుత్వ స్థాపనకు బసవణ్ణను ఎన్నుకొనుటలో ఆశ్చర్యము లేదు. తన ప్రభుత్వమును మతముసుగులో కొంతకాలము నిలబెట్టవలయునని కోరిక వెల్లువలా వస్తున్న వీరశైవ మత ప్రబోధకుడు ప్రధాన మంత్రి భండారియైన ప్రజలు రాజు పక్షమున నుందురు. జమ ఖర్చులు వ్రాయు వాడగా చేరి నూటొక్క పొన్నెలు సంపాదించు బసవణ్ణ యొక్క మంత్రాంగము, రాజనీతి బిజ్జలుని ఆకర్షించెను

కళ్యాణ కటకము వీరశైవులకు కేంద్రమైనది. అటు పురాతన భక్తుల తోను, ఇటు నూతన భక్తుల ధార్మిక జీవనములోని జాగృతి ప్రతి అంశము నందు చోటు చేసికొన్నది. అది శంకరుని వలె, [redacted] కొలది సంవత్సరములు మాత్రమే జీవించినను, తన జీవితమును, బంధువులను వీరమహేశ్వర వ్రతమునకు అంకితము చేసెను.

బసవడు కలిగించిన జాగృతి క్రింద అంశములలో గమనింప వచ్చును.

1. ప్రజలు వర్ణాశ్రమ ధర్మములలో నలిగి ధనమును వృథాచేయుచు కాలహరణ గావించు రోజులవి. కర్మకాండ పేరుతో దోపిడి చేయుచున్న కాలమది.

బసవేశ్వరుడు ఎనిమిది సంవత్సరముల ప్రాయంలోనే 'వడుగు'ను తిరస్కరించెను.

---

7. ఏటుకూరు బలరామమూర్తి-ఆంధ్రుల సంక్షిప్త చరిత్ర (1989 : పుట 110)

"కర్మ పాశంబు లొక్కట దెగ నీల్గి
కర్మంబు తొల్లి దాఁగట్టుకోఁదగునె"

—బసవ పురాణము I ఆ-41 పు.

జాతి గోత్రాలను నిరసించుచు

"జాతి గోత్రా తీతు సద్గురు జాతు
జాతి గోత్ర క్రియా శ్రయుఁజేసెదెట్టు?"

—బసవ పురాణము I ఆ-42 పు.

2. అస్పృశ్యులు దుర్భర జీవితమును గడుపుచుండిరి. బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులు వారిని హీనముగా జూచిరి. దీనిని నిర్మూలించుటకు బసవణ్ణ అస్పృశ్యుడైన శివనాగమయ్యతో కలిసి భుజించెను ప్రభువు ఆమాత్యులు-ప్రజలు భేషజములకులోనుగాక ప్రజారంజక పాలనకు నడుము కట్టిరని నిర్ణయించు కొనవలయును.

3. బ్రాహ్మణ్యాన్ని త్యజించి వీరశైవుడైన 'మధువరస' యొక్క కుమార్తెను అస్పృశ్య శివశరణుడయిన 'హరలయ్య' కుమారుని కిప్పించి వివాహము జరిపించెను. ఇట్టి సంఘర్షణ ఫలితములను ఈ విధముగా అన్వయించుకొనవచ్చును. "పీడనకు, అణిచి వేతకు గురియైన వర్గానికి చెందిన మానవాళికి న్యాయం జరిపించేందుకై అవకాశం గలిగిన"8దని ఏంగెల్స్, 1843 సంవత్సరములో ఉద్ఘాటించాడు. ఇటువంటి అభిప్రాయమునే బసవేశ్వరుడు ఏనాడో వ్యక్తము చేసెను.

4. ఏ రాజకీయ చరిత్రలో లేనటువంటి మత సంబంధమయిన "అనభవ మంటపము' ఏర్పడినది. ప్రతి శివశరణుడు తన అనుభవమును ఇతరులతో చర్చించి మంచిని గ్రహించి సూత్రీకరించుట ఇందలి విధానము, ఆ అనుభవములను శివశరణులు వచన రూపములో రచించిరి. నిజ జీవితము యొక్క అనుభవములు సాహిత్య రూపములో స్థిర రూపము దాల్చుటచే సామాన్యుడు మాన్యుడగుటకు కారణమయ్యెను.

---

8. English Lecturer in 1843, ప్రజాశక్తి (దినపత్రిక) 9-5-1988 : పుట 4)

ప్రజాహిత కార్యక్రమములలో-సిద్ధ రామేశ్వరుడు ఇత్యాది శివశరణులు బావులను త్రవ్వించుట, చెరువులను కట్టించుట జాగృతిలోని భాగ పరంపరలు. స్వల్ప కాలములో ఒక మతము ఇంతటి గాఢ ప్రభావమును జూపుట అర్హమైన విషయము.

ఇ. బౌద్ధ వీరశైవ మత సంఘర్షణ :

దాదాపుగా క్రీ॥శ॥ 1029 నుండి వీరశైవ మతము తన ఆధిక్యత కొఱకు పోరాటమును ప్రారంభించినది. నాడు కర్ణాటకమున ఉచ్ఛ స్థితిలోనున్న జైనమును ఓడించినది. 50 సంవత్సరముల తర్వాత విజయవాడలో వైదికముతో పోటీపడి నెగ్గినది. ఆ పిదప 70 సంవత్సరములకు ఉత్తర భారతములో వైష్ణవ మత ప్రాశస్త్యమును తగ్గునట్లు జేసినది. క్రీ॥శ॥ 1167లో కళ్యాణ కటకము వీరశైవ మత సంఘర్షణ ఫలితముగా నాశనమయినది. నూటఏబది సంవత్సరముల కాలములో చరిత్ర పుటలనే పూర్తిగా మార్చివేసినది. వర్ణ, యజ్ఞ, కర్మ రాహిత్యములైన నూతన సమత్వ ధార్మిక సంఘమును స్థాపించినది.

శ్రీ మల్లికార్జున పండితారాధ్యులు క్రీ॥శ॥ 1100_1170 సంవత్సరములలో జీవించెను. శ్రీపతి పండితారాధ్యుల వాద సంఘర్షణము తర్వాత కృష్ణా తీర ప్రాంతములో జరిగిన మరొక విప్లవము. ఇది బౌద్ధ మతమునకు వ్యతిరేకముగా జరిగినది.

వెలనాటి చోళుని గురులైనబౌద్ధుడొకడు ఆస్థానములో పండితయ్యతో వాదించి ఓడిపోయెను. పండితయ్య ఒక వాదమును చేకొని దాని స్వరూప స్వభావములను ముందుగా తెలిపిన తరువాత వేద వాక్యముల మదహరించి ఆ వాక్యము వాదనకెట్లు వ్యతిరేకముగానున్నదో స్పష్టము చేసి పురాణ, ఇతిహాసముల నుండి ఐతిహ్యాను సంధించి 'శైయా యుక' పద్ధతిని అనుసరించెను. బౌద్ధ గురువు చంపబడెను. రాజు పండిత్యను తీవ్రముగా శిక్షించుటచే రాజ వంశనాశనమగునట్లు, పట్టణము భస్మీ పటలమగునట్లు

---

9. ఏటుకూరు బలరామమూర్తి-ఆంధ్రుల సంక్షిప్త చరిత్ర
(1969 : పుట 110)

శపించెను. ఇది శాపముగాదు, వాస్తవమునకొక అంతర్యుద్ధము. కొద్ది సంవత్సరముల తేడాతో కళ్యాణ కటకము, చందవోలు బుగ్గిపాలయినవి.

మల్లికార్జున పండితారాధ్యులు చెప్పినది శివశాసనముగా నుండెను. రాజ్య వ్యవస్థలు మారిపోయెను. ప్రతిరాజు వీరశైవమునకు తల వొగ్గక తప్పలేదు. ఇచట క్రీ॥శ॥ 1176-1182 సంవత్సరముల మధ్య జరిగిన పల్నాటి యుద్ధమును మరువరాదు. "కన్నడ రాజధాని కళ్యాణ కటకము బూడిద పెంట ఐన విషయము రెండవ ప్రోలరాజు గమనించాడు. అప్పు డప్పుడే కుదుట పడుతున్న కాకతీయ రాజ్యము మత ద్వేషాలతో నాశనం కాకుండా కాపాడాలంటే ఉప్పెనవలె వస్తున్న వీరశైవ మతమునకు తల ఒగ్గుట మంచిదని భావించాడు. అంత వరకు అనుసరిస్తున్న జైనమతమును వదలి తాను కూడ వీరశైవ మతమును స్వీకరించా"[9]డని ఏటుకూరు బల రామమూర్తిగారు వివరణ.

ఫలితములు :

మత సంఘర్షణలు అంత మొందినవి. రాజాశ్రయులైన వీరశైవ మంత్రులు, గురువులు తన్మత వ్యాప్తికి దోహదము గావించిరి. కాని చివరకు రక్తపాతము తప్పలేదు. కాని చరిత్రలో సంస్కృతిలో వృత్తి వైభవమును, సాటిమనిషిని గౌరవించుట సంభవించిన బృహత్పరిణామములు బసవేశ్వరుడు, మల్లికార్జున పండితారాధ్యులు తర్వాత పాల్కురికి సోమ నాథుడు క్రీ॥శ॥ 1240-1323ల మధ్య జీవించి రాజాశ్రయము లేకయే సాహి త్యమున వీరశైవ మత తత్త్వములను, తన దైవములైన వారి గాథలను పురాతన నూతన భక్తుల చరిత్రలను నాటి ధార్మిక సమాజపు స్థితి, గతులను రచించెను. ఓరుగల్లులో 'కృతకలింగములు' ధరించిన వారిని 'సహజ లింగ సంగతు'లుగా జేయుట, ప్రధాన రాజమార్గములోని ప్రథమ ప్రవేశద్వారము గవనిపైనున్న 'లక్ష్మి విగ్రహము'ను నాశనము చేయుట మాత్రము స్వల్ప సంఘర్షణలుగా కనిపించును.

9. ఏటుకూరు బలరామమూర్తి-ఆంధ్రుల సంక్షిప్త చరిత్ర (1989 : పుట 110)

## అధ్యాయము-5

## శివ శరణుల జీవన చిత్రణ:

(శివ శరణుల జీవిత విధానము యెఱుంగుటకు కొందఱిని ప్రతినిధులుగా నెన్నుకొనుట ముఖ్యము. సాధారణముగా నాయనారులను పురాతన భక్తులందురు, వారి జాగృతి పోరాటము బసవేశ్వరునకు ముందున్న శివ శరణులకు స్ఫూర్తి ఇచ్చినది. బసవేశ్వరుని కాలమునాటి శివ శరణులు ఈ స్ఫూర్తితో చైతన్య వంతులై సాంఘిక సమానతా సాధనకు నిరంతర కృషి సలిపిరి.

అ. నాయనారులలోని (ఎ) నందనాయనారు, (బి) అడి భక్త నాయనారు (సి) ఇరువదాండి.

ఆ. నూతన శివశరణులైన (ఎ) డోహర కక్కయ్య, (బి) కెంభావి భోగయ్య.

ఇ. 12వ శతాబ్దపునాటి (ఎ) మడివాలు మాచయ్య జీవితములో వృత్తి యొక్క ఔన్నత్యము (బి) మోళిగ మారయ్య కథలో ఆర్థిక సమానత, (సి) నులియ చందయ్య కథలో పనికి తగిన ప్రతి ఫలము. (డి) ఆయదక్కి మారయ్య కథలో భార్య లక్కమ్మ యొక్క సంపదను నిలువ చేయరాదనెడి ఆర్థిక విధానము. (ఇ) మేదర కేతయ్య కథలో ధనము కన్నను వృత్తి ప్రాముఖ్యతలను పరిశీలింప వలసియున్నది. ఈ శివ శరణుల జీవితములు వీరశైవ మత పునర్భవమునకు తోడ్పడిన విధము అధ్యయనము చేయవలయును.)

## అ (ఎ) నందనాయనారు:

ఇతడు అస్పృశ్యుడు. చోడ దేశమున 'ఆదనూర'ను పల్లెలో నివసించుచుండెను. "చెప్పులు కుట్టుచూ శివాలయములలోని వాద్యములకు వలయు తోళ్లను ఉచితముగా సిద్ధము చేయుచుండెను. త్రికాలముల యందు స్నానము గావించి శుచియై విభూతి దాల్చి నిజ కుటీరమున పార్థివ శివ లింగమును ప్రతిష్ఠింపుకొని శివనామ సంకీర్తనలతో ప్రొద్దు పుచ్చుచుండెను."[1] అని డా. మ.న. జవరయ్య వివరించారు.

---

1. డా. మన. జవరయ్య. దలిత వర్గద శరణరు-ఒందు అధ్యయన (1990 : పుట 10-12)

ఒక రోజు 'తిరుప్పంగూరు'నకు వెళ్లి స్నాన మాచరించి గోపురము కడనే నిలుచుండి క్షేత్ర స్వామిని మనసారా ధ్యానించెను. ఆలయములో పూజ జరుగుచుండగా శివలింగము భక్తునకు కనబడక పోవుటచే అడ్డముగానున్న నందిని కాస్త ప్రక్కకు జరుగమని శివుడు కోరెను.

చిదంబరములో 12 సం. గుడి చుట్టు ప్రదక్షిణము చేయగా శివుడు కలలో కన్పించి 'అగ్ని ప్రవేశముచేసి పరిశుద్ధుడగుమని' ఆజ్ఞాపించెను. అటువంటి కలయే చిదంబర క్షేత్రములోని బ్రాహ్మణు లెల్లరకు కల్గెను. తర్వాత "నందనారు భక్త్యావేశముతో శివకీర్తన చేయుచు అగ్ని గుండమున దుమికి పరిశుద్ధ దేహముతో బయటకు వచ్చెను. అప్పుడు అతని శరీరముపై మూడు వేళ్ల వెడల్పులో జనివారము యుండెను.''2అను కథను నారాయణ అయ్యారు వర్ణించుచున్నారు.

ఈ జీవితములోని గమనార్హములు 1. డోలువాయించు అస్పృశ్యుడు 2 ఆ వృత్తికి సంబంధించిన చర్మము యొక్క ఉద్యోగము. 3. కఠోర తపోనిష్ఠ, 4. ఆ జాతి యొక్క 12 సం. ఆందోళన, 5. చివర ముఖ్యమైనది. మూడువేళ్ల జనివారము యుండుట కవి కల్పన.

బి. అడిభక్త నాయనారు :

ఇతడే అడి భక్తుడు. చోళ దేశములోని నాగ పట్టణ సమీపమున గల 'నులైప్పాడి' అను చిన్న పల్లెలో తీరమున చేపలు పట్టి జీవించుచుండెను. జాతి బేస్త, చదువులేదు, వేరే పని చేయలేడు.

'మఱియొండు గాయకం బెఱుఁగమిఁ చేసి'  
''నిదియ నేమముగా గ నితర మత్స్యముల  
అంగడి బోకార్చి యందుల లబ్ధి  
జంగమారాధనల్ సలుపుచు లీల''

—బసవ పురాణము-4-317 పుట

నియమములుః వలవేసినపుడు పడిన మొదటి చెపను 'శివప్రీతి యని

2 డా. మ.న. జవరయ్య-దలిత వర్గద శరణరు-ఒందు అధ్యయన (1990 : పుట 169-171)

పోవ' విడుచుచుండెను. తన దేవుడైన శివునకు సమర్పించి, తన జీవితమునకు పాకులాడక యుండెను.

ఒక రోజు ఒక బంగారు చేపపలలోపడెను. దానిని శివ ప్రీతికి వదిలెను. అదే చేప ప్రతి పర్యాయము పడుచుండగా ఆ రోజు ఇంటికి వచ్చెను. మరుసటి రోజు అదే చేపబడిన 'వలఁజేతఁబట్ట నావ్రత మిదియనుచు' ప్రతిన జేసెను. అటులని వల విసరగా శివుడు ప్రత్యక్షమై ప్రమథేంద్ర పదవి యొసంగ నిచ్చుడును. నా నిరంతర పరమానందు సుఖము, లానుచు నున్నట్టి యడి భర్త బంట'యని పాల్కురి సోమనాథుడు పేర్కొనెను. (బ పు-4 318) (1) కాయకనిష్ట (2) భక్తి సాధనలు విలక్షణమైనవి.

ఆ (సి) ఇరువదాండి కథ :

చోళ రాజ్యములో 'కరువూరు' నగరమున ఎరిపత్తనాయనారు నివసించుచుండెను. 'నిత్యము ఒక భయంకర పరశువును భుజమున దాల్చి శివభక్తులకు కీడు కలిగించువారిని శిక్షించిన తన శివస్వామికి శ్రమ తగ్గునని' అతని విశ్వాసము.

1. శివకామి యాండారు అను వృద్ధ బ్రాహ్మణుడు శివాలయమునకు పోవుచునుండ రాజు యొక్క పట్టపు ఏనుగు అతని పూసెజ్జలాగుకొని క్రింద పడవేసెను. శివకామి అర్తనాదము విని ఎరిపత్తనాయనారు ఆ మదించిన యేనుగును, మావటి వాండ్రి సంహరించెను.

''శివ భక్తులకు నెగ్గు సేయు పాతకుల
సవిచారము నఁ జంపునట్టి నేమంబు''

—బ.పు—4-243 పుట.

ఎరిపత్త నాయనారుది 'ప్రభుత తప్పును శిక్షించిన అపరిమిత ప్రతాపానూన కీర్తిగలవాడు.' తద్వారా శివ భక్తులను రక్షించు వ్రత మాచరించెను

2. మా వటీల వలన సంగతి తెలిసి రాజగు పుగళ్ నాయనారు ఎరిపత్త నాయనారు కడకు వచ్చెను. 'భృత్యాపరాధ స్వామినో దండ'యని ఖడ్గము నిచ్చి చంపుమని కోరెను. ఎరివత్తు తన ఖడ్గముతో తన తలను నరుకుకొనుటకు సిద్ధపడగా శివుడు ప్రత్యక్షమయ్యెను. క్షమా గుణము, త్యాగ గుణము ఈ వీరా చారమున కనబడుచున్నవి.

**ఆ (ఎ) డోహర కక్కయ్య :**

ఉత్తర కర్ణాటకలో దోహరులను అస్పృశ్యులు కలరు. కల్లి దేవపుర శాసవములో "చిక్క కక్క-చెన్న హోన్న "అనియు, అదే శాసనములో చీర చోళ నంబి కక్క చెన్న'అని కక్కయ్య చెన్నయ్యల ప్రసక్తి గలదని"3ని డా॥ మ.న. జవరయ్య వివరించారు.

ఒక రోజు పురాణభట్టు హరి మహాత్మ్యమును గూర్చి పురాణమును చెప్పుచుండెను. ప్రజలందరకు హరియే దైవమని, వేరు దైవము లేదను భావన కలుగజేసెను. అది విని కక్కయ్య ఆభట్టును డొంకలో పొడిచి, తల తిరిగి పొట్టలో పెట్టి విడిచెను. అది కొంత సేపటికి పురుగుల పోక మయ్యెను అతని హరి కూడా రక్షించి బ్రతికింపలేక పోయెను. ఇతని జీవితములో ఈ కథ కంటె దళిత వర్గము యొక్క శరణ సంఘటితమైన ఆందోళన ప్రధాన మైనది. ఇతని జాగృతి పోరాట కృషిని యెల్లరు కొనియాడిరి.

1. శ్రీపతి పండితారాధ్యులు కక్కయ్యను ఒక ఉత్సవ సందర్భమున ఇంటికి ఆహ్వానించుటచే తోటి బ్రాహ్మణులు గేలిసేసిరి. ప్రతిగా శ్రీపతి పండితారాధ్యులు అగ్నిని వస్త్రములో బంధించెను.

2. తన కంటె చిన్నవారైన పూర్వుల స్మరించుట భక్తి గౌరము లొసంగుట బసవేశ్వరాదులు కూడ పాటించిరి.

"అవ్వను నమ్మ మాదర చెన్నయ్య
బొప్పను నమ్మ డోహర కక్కయ్య
అణ్ణను నమ్మ కిన్నర బొమ్మయ్య
ఎన్ననే తక్కరి యరి కూడల సంగయ్య"4

3. కక్కయ్య ప్రసాదము కొఱకు బసవణ్ణ అతని ఇంటి వద్ద 12 సం॥ కాచుకొని యుండవలసి వచ్చినదట.

---

3. డా. మ.న. జవరయ్య. దలిత వర్గద శరణరు-ఒందు అధ్యయన (1990 : పుట 43)

4. ప్రొ. బసవనాళ (సంపాదకరు) బసవణ్ణ నవర వచన గళు (1962 : పుట 200)

4. అట్టి ప్రసాద మహిమతోనే నాగలాంబిక కొడుకును కన్నదట.

5. మల్లికార్జున పండితారాధ్యుల వారు ఇట్లు ప్రశంసించిరి.

"అంబలి మున్నని నైవేద్యంబు సూపి .... .... ........ .... ముక్తి చేకొనబడె చెన్నయ్య" "మాలడు కాడెముఁను మహాదేవుని కొలచి ముక్తుడయ్యెన్" శివతత్త్వసారము-472వ పద్యము.

"మన్నించు బ్రీతి మాదర చెన్నయ్య భక్తియ
మనమున జీకొనె"

—శి.సా 478 వ. వ.—

ఆ (బి) కెంభావి భోగయ్య :

ఇతనిది కలబుర్గి జిల్లా కెంభావియను గ్రామము. అతని జీవితములో సంభవించిన రెండు సంఘటనలతో వ్యక్తిత్వము నిర్దుష్టముగా తెలియును. విభూతి, రుద్రాక్షలను ధరించి శరణ ధర్మమును పాటించు ఒక అస్పృశ్యుడు

1. ఒక శివ శరణుడు పెయ్య శవమును కొనివచ్చి వండి పెట్టుమని భోగయ్యను కోరెను. "భోగయ్య ఘారాన్న లవణ యుక్తముగ మాంసంబు సారంబుగా వండి" పెట్టి సేవచేసెను. అగ్రహారంలోని భూసురులు కాంచి ఆగ్రహమొందిరి. భోగయ్య వారికి

"అరుమగ మీయట్టి యాగ్రజన్ములకు
హర భక్తులిండులు సొరగరాదని"

—బ.పు-7-525 పు_

సమాధానమొసంగెను. చాల మంది అడ్డువచ్చిరి. అయినను ఒక శివ శరణుడు శరణ ధర్మమును పాటించుట క్లిష్టమైనది. ఇతడు ఆత్మ స్థైర్యముతో పరమానురాగుడై జంగమార్చన సేయుచు మత వ్యాప్తి కెంతయు తోడ్పడెను.

2. రాజు కొండెములు విని భోగయ్యను పిలిపించగా వైదిక మత వ్యవస్థ యొక్క మౌలిక స్వరూపమును రాజ్య సభలో ప్రశ్నించెను. వర్ణ సాంకర్యము జేసెనని రాజు దేశ బహిష్కరణ శిక్షవేసెను. భోగయ్యతో పాటు శివ దేవాలయములు శివలింగములు రాజ్యమును వదలి పెట్టి పోయినవి.

రాజు యొక్క శాసనమును మానవునితో పాటు దేవుడు కూడ లెక్క చేయలేదు అర్థాత్ రాజ శాసనము సత్య దూరమైనదని ఋజువైనది.

భోగయ్య శివశరణ ధర్మమును పాటించి మూఢ వ్యవస్థలోని లోపములను రాజు ఎదుట ఎత్తి చూపి సమాన గౌరవము పొందుటకు ఆందోళన గావించెను. అందు చేతనే మల్లికార్జున పండితారాధ్యులిట్లు పొగిడెను.

"కెంభావి భోగిదేవుని
వెంబడిఁ జని వచ్చి వీడు పీఠంబుల లిం
గంబులు వడి విప్రులు లీ
లం బొగడగ నిట్టి తత్సాంత్వము గలదే !"
—శి.సా-418 వ.వ.

ఇ. శివ శరణులలో మూడవ వర్గము వారు బసవేశ్వరుని సమకాలీనులు:

ఎ. మడివాలు మాచయ్య :

ఇతడు దళిత వర్గమునకు ప్రతినిధి. వృత్తి చేత చాకలి. ఇతని జీవితములోని కాయకలబ్ధి 2. బిజ్జలుని పూజ్యత, 3 బసవేశ్వరుని ఆగ్రహించుట, 4. విమర్శల అధ్యయనము జేయవలెను.

1. కర్ణాటకలోని బీజాపూర్ జిల్లాలో 'హిప్పరిగె' అను పుర నివాసి', సద్భక్తి వితతుల 'రుమాలు దట్టి పచ్చడము' అను వరిశుభ్రముగా నుతికి, మడివాలు చేసి వీరిచ్చు 'అల్పవేతనములతో సంతృప్తి చెందుచుండెను. ఇట్టి కాయకలబ్ధితో దాసోహం చేయుచుండెను. సద్భక్త సేవ శివుని సేవగా భావించెను. మాచయ్య ఒక శ్రేష్ఠమైన అనుభావి. వీరి వస్త్రములు తెచ్చునపుడు ఎవరూ తాకకుండునట్లు గంట వాయించుచూ తాకిన నరుకుదునని కఠారమును బట్టి వీధులగుండా పోవుచుండెను. సంత కేగుచు గేలిచేసి తాకిన కుహనా బ్రాహ్మణుని తన నరికెను.

దళితుడై యుండినను మాచయ్య పాటించిన ఉండిన వీర వ్రతాచారము ప్రశంసింప తగినది. జంగములపై గల భక్తి, న్యాయ పాలన, అకుంఠిత దీక్ష యొక్క నోసి వీరత్వము పురోహితులకు సమస్యయైనది.

2. బిజ్జలుడు కొండెములు విని మాచయ్యను చంపుటకు భద్రగజమును పంపెను. మాచయ్య ఆ ఏనుగును మడియించి "ఎప్పుడు నా మీద నేనుగుఁ

గొల్లిపె, నవ్వసుధేశు క్రొవ్వడతుఁ'' బొమ్మనెను. వార్త ఎఱింగి బిజ్జలుడు బసవేశుని ఆశ్రయించెను. వసుధేశుని కొనిపోవ మాచయ్య బిజ్జలుని మన్నించెను.

ఈ సంఘటనలో వీరవ్రతాచారమును పాటించు ఒక దళితుని, ఒక శూద్రుని పోరాటము రాజు కంటె గొప్పదన రుజువైనది. బసవేశ్వరుని సత్కరించి నటుల మాచయ్యను కూడ సత్కరించుట నాటి ధార్మిక సమాజములో సమతా పోరాటమునకు వేగుచుక్క.

3. బసవణ్ణ శివశరణుల కర్థమిచ్చుచు సేవ చేయుచుండెను. 4,64,000 గీతములను బసవణ్ణ రచించెనట. ఈ గీతములను మాచయ్య విని

"చెల్లబో ! దీనులఁ జేసి శరణుల కెల్లను
దావొక యిచ్చు వాడయ్యెను"

—బ.పు. 4–252 పుట–

అని బసవని కోపించెను. శరణ ధర్మ వ్యాపనలో బసవణ్ణకు ఎంతటి బరువులు బాధ్యతలు గలవో అంతటి ప్రాధాన్యత మాచయ్యకును గలవు. ప్రధాన మంత్రి, చాకలి అని కాక ఇద్దరూ శివశరణులుగా వీరశైవ సమాజములో సమాన స్థాయిగల వారుగా నిరూపింపబడింది. సాంఘిక సమానత్వమునకు మాచయ్య జీవితము ఒక తార్కాణము.

4. "ఎన్న కాయవ శుద్ధవ మాడి దాత మడివాళ
ఎన్న మనవ నిర్మళవ మాడిదాత మడివాళ
ఎన్నంతరంగవ బెళగి దాత మడివాళ
ఎన్న బహిరంగవ బిడిసి దాత మడివాళ
కూడల సంగమ దేవ ఎన్న నిమగె యోగ్యన
మాడి దాత మడివాళ !''"[5]

—శూ.సం-9-38 వచనము—

యని మాచయ్యను బసవణ్ణ ప్రస్తుతించెను. "మాచయ్య నిష్ఠకాయకము అతి ప్రసిద్ధమైనది. ప్రభు దేవర, బసవన్న, చెన్నబసవన్న ఇతనిని స్తుతించిరి"[6] అని డా. హెచ్. తిప్పేరుద్రస్వామి తెలిపియున్నారు.

5. గూళూరు సిద్ధవీరణాచార్య–శూన్య సంపాదనె (1930 : పుట 176)
6. డా. హెచ్. తిప్పేరుద్రస్వామి–శరణర అనుభవసాహిత్య (1963 : పుట 100)

మల్లికార్జున పండితారాధ్యులు మాచయ్య భక్తి నిట్లు వర్ణించియున్నారు.

"కడుగడు రౌద్రంబున జత
వడు మదకరిఁ జంపి యప్పడ పడ యడెభువిను
క్కడఁగియు ఓజ్జలు డడుగుడు
మడివలు మాచయ్య భక్తి-మహిలోఁ గలదే!"

—శివతత్త్వసారము 440 ప.

పాల్కురి సోమనాథుడు మాచయ్య చరిత్రకు చతుర్థాశ్వాసములో ప్రాధాన్యత నొసెంగెను.

"అఱలేని వీరవ్రతాచార యుతుడు
శ్రేష్ఠుడు జంగమ ప్రసిద్ధుడు న్యాయ
నిష్ఠురాలాప మహిష్ఠ మండనుడు.
'భవిజన సంసర్గ పథ పరిత్యాగి
ప్రవిమల తత్త్వానుభవ సుఖాంబోధి

—బ.పు. 232 వపు.

'కులజుండు నతడే యకులజుండు నతడె
కులము లేకయు నన్ని కులములు నతడె,

-బ.పు.-237 పుట

ఇ (బి) మోళిగ మారయ్య :

ఇతడు కాశ్మీర దేశపు రాజు. ఇతని భార్య పేరు మహాదేవి. జీవితములోని నాలుగు ప్రధాన అంశములను పరిశీలించిన పిదప ఆర్థిక సహాయములో భండారి బసవేశ్వరుడు, మోళిగ మారయ్య ఇరుపురును సమానమని ఋజువు కాగలదు. అ సంఘటనలు (1) కాయకలబ్ధి (2) ఆర్థిక సహాయము (3) సంఘర్షణ (4) ప్రస్తుతి.

కర్ణాటకలోని 12వ శతాబ్దపు మతాందోళనలు జాగృతి కొఱకు జరిగినవి. సమత్వ ప్రతిష్ఠకు జరిగినవి. పోరాటమునకు ఆకర్షింపబడి కాశ్మీరు రాజు సర్వము పరిత్యజించి శివశరణ ధర్మ వ్యాపనములో భాగస్వామి అయ్యెను.

1. జీవనము శ్రమతో కూడుకొన్నది. అడవిలో కట్టెలు కొట్టి వానిని అమ్మి కాయకలబ్ధి పొంది దాసోహముగావించుచుండెను. ఆ ధనముతో

జంగములకు అంబలిని సమర్పించును. ప్రీతితో నర్పించిన అంబలి రుచికరమైనది. "కాంచి పట్టణ చోళరాజు అర్పించెడి మృష్టాన్నము కన్నా అధిక ప్రీతిగా ఆతని గుబ్బమును కాయు మాదర చెన్నయ 'అంబలిని' శివుడు ప్రీతిగా గ్రోలుచుండెను."[7] అని డా॥ మ.న. జవరయ్య వివరించుచున్నారు. అంతే రుచికరమైనది మారయ్య అంబలి కూడాను. ఇతడు సంతృప్తి జీవి. తన కాయకమునకు పేదరికమునకు ఎప్పుడును బాధపడలేదు. ఇది ఒక మహోన్నత వ్యక్తిత్వము. కాయక వ్రతమును పాటించుచు శివ శరణుడు 'రాజా? పేదా? అన్నది కాదు ప్రశ్న'. ఆ కాయకము ఎంతటి సత్యమైనది, ఎంతటి శుద్ధమైనదనునదే బేరీజు వేసికొనవలయును.

2. పేదవాడయిన మారయ్య యొక్క జంగమ సేవా రాధనను విని బసవన్న ఆర్థిక సహాయము చేయనెంచెను ఒక రోజు మారయ్య ఇంటికే తెంచి వెయి బంగారు మాడలను పూజా మందిరములో వడగము క్రింద యుంచి అంబలిని గ్రోలి వెళ్ళిపోయెను. మారయ్య ఇది గ్రహించి ఆ ధనము స్వీకరింపక కట్టెల మోపులోని 'ఒక్కొక్క విడియ నియోగించి మొక్క'. శ్రీపాద జలములతో బంగారము కాగా వానిని సమర్పించెను. పేదవాడయ్యు ఉచితముగా లభించిన ధనమును దొంగ తనము చేయుట వలన లభ్యమైనదిగా నెంచి తిరస్కరించెను. 'శివ శరణులకు ఆదర్శమూర్తి శ్రమించి నిజాయితీగా సంపాదించెవలయునసెడి సిద్ధాంతము ఆనాటి ధార్మిక సమాజములో ఎల్లరు సమానముగా పాటించుచుండిరి.

బసవన సిగ్గుపడి పశ్చాత్తాపముతో
"అభయంబు వేడుచు వడుగుల మీద
సభయాత్ముడై యున్న జయ్యాన నెత్తి"
—బ.పు.5.360 పు.

కౌగిలించుకొనెను. ఈ సందర్భములో గుర్తింపవలసినది ఒక ప్రధాన మంత్రి ఆర్థిక పుష్టికి కట్టెల మోపు అమ్మకొను శివశరణుని ఆర్థిక సృష్టియేమియు అల్పముకాదని నిర్ధారింపవచ్చును. సూక్ష్మముగా యోచించిన ఒక పేదవాని

7. డా. మ.న. జవరయ్య దళిత వర్గద శరణరు_ఒందు అధ్యయన (1900 పుట 94)

వీరశైవ తత్త్వజ్ఞానము భండారి తత్త్వజ్ఞానముతో సంఘర్షించి అంత కన్నా గొప్పదని ఋజువైనది నా అభిప్రాయము.

పాల్కురికి సోమనాథుడు మోళిగ మారయ్యను మిక్కిలి కొనియాడెను. సామాన్యమైన శివశరణుని యొక్క మాన్యమైన ధర్మా చరణము బహు ధాశ్లాఘనీయము.

'స్వచ్ఛ సదాచార సంవ్రత పూర్తి'

—బ.పు. 5-పుట 354

'సవిశేష జంగమార్చన పరతంత్రుడనియు'
'కర్మా పహరుడు లింగ ప్రాణ మధ్య'

—బ.పు. 5-పుట-355

'గతి దయా భావి సంగయదేవః

—బ పు. 5-పుట 360

ఇ (సి) నులియ చందయ్య :

నులియ చందయ్య అతి సామాన్యుడు గడ్డి (మేడి)తో తాళ్ళు పేను వాడు. నిజమైన కాయక లబ్ధితో జంగమార్చన చేయుచుండెను. చందయ్యకు లింగ పూజ కన్నను కాయకము మిన్న. పనిచేయుచుండ ఇష్ట లింగము నీటిలో పడిపోయెను. కాని పనిని నిలువలేదు.

1. పనియొక్క విలువ తెలిసికొనెను. లింగము మనుష్య రూపములో వెంటరాగా కాయక నిబంధనము తెలియజేసెను.

''గురు వాదరు కాయక దిందవె జీవన్ముక్తి
లింగవాదరు కాయదిందవె సిలెయ కురుహు హరివుదు
జంగమ వాదరు కాయక దిందవె తన్న వేషద పాశహరివుదు
గురువాదరు చరసేవెయ మాడ బేకు
లింగ వాదరు చర సేవెయ మాడబేకు
జంగమ వాదరు చర సేవయ మాడ బేకు
ఇదు చందేశ్వర లింగద అరివు కేళా ప్రభువె"8

—శూ.సం. 14-30-వచనము.

8. గూళూరు సిద్ధవీరణాచార్య-శూన్య సంపాదనె (1930 పుట 257)

గురు, లింగ, జంగములు కాయకముతోనే ముక్తి పొందెదరని చందయ్య నాటి సంఘపు బాధ్యతలను గుర్తుచేసెను.

2. ఆర్థిక సూత్రములో పని విలువ ముఖ్యమైనది. చందయ్య పనికి తగిన ప్రతి ఫలమును మాత్రము స్వీకరించుచుండెను. ఒక తాడు విలువ కంటె ఎవ్వరైనను అధికముగా నిచ్చిన తిరస్కరించును. ఒక సారి బసవణ్ణ ఒక త్రాడునకు 1000 బంగారు నాణెములు యిచ్చి పంపగా ఒక్క నాణెమును స్వీకరించి మిగిలిన వానిని త్రిప్పి పంపెను. నేడు సంఘములో దోచుకొను పైనము కలదు. చందయ్య జీవన సరళిలో పనికి తగిన విలువ యనెడి ఆర్థిక సిద్ధాంతము నాటి శరణ ధర్మములోని సమతా దృక్పథమునకు మార్గమును సుగమము జేసినది.

## ౨ (డి) ఆయదక్కి మారయ్య :

ఆయదక్కి మారయ్య అల్పజీవి. నిత్య కష్ట కనిష్ట జీవి. ఒక గొప్ప శివ యోగి. పొలములో పండిన ధాన్యమును-బియ్యమును సంగ్రహించి అమ్మి దాసోహము గావించుచుండెను. ఇతర కాయకముల వలె తన కాయకము గూడా గొప్పదను భావన గలవాడు.

ఇతని భార్య లక్కమ్మ స్త్రీ శివ శరణులలో మహాత్మురాలు. జీవితములో తృప్తిని పొంది యుండెను. భవిష్యత్తుకొరకు అధిక ధానార్జన చేయరాదనియు, లభించిన కొద్దిపాటి ధనముతోనే తృప్తి, సంతృప్తి చెందవలయునను మనస్తత్వము గలది. బసవేశ్వరుడు రాజమార్గములో మారయ్య కొఱకై బియ్యము పోయించెను. మారయ్య వానినెల్ల ప్రోగుచేసి ఇంటికి తీసుకొని రాగా భార్య కోపించెను. అవి ఎచ్చట లభించినవో అచ్చటనే వదలి రమ్మని శాసించెను. శివశరణుడు ప్రతి దినము కాయకము చేసి తగినంత మాత్రమే సంపాదించవలయుననియు, రేపటి కొఱకు ప్రోగు చేయుట, దానియుంచుట సంఘ ద్రోహమనియు బోధించెను. ఇది కారల్ మార్క్స్ యొక్క ఆర్థిక సిద్ధాంతమును స్ఫురణకు దెచ్చు ఒక చక్కని ఉదాహరణ ఇది. ఒక నిజ జీవగట్టి నాటి దళిత సమాజము జాగృతి వైపు పరుగులు దీసినదనుటకు ఒక సజీవ చిత్రణ.

"మన శుద్ధ విల్లద వరిగెద్రవ్యద బడతన దల్లదె. చిత్త శుద్ధి దల్లి కాయక మాడు వల్లి సద్భక్తంగె ఎత్తనోడ దతత్త లక్ష్మి తానాగిప్పళు,

మారయ్య ప్రియ అమర లింగేశ్వర లింగదసేవె యుళ్ళన్నక్క"9

—శూ.సం. 12–36 వచనము.

"మన శుద్ధి లేక పోవుట ద్రవ్యము లేక పోవుట కాదు. చిత్త శుద్ధి యందు కాయకము చేయుట యందు సద్భక్తునకు ఎక్కడ పడితే అక్కడ లక్ష్మీతానై యుండునని మారయ్య ప్రియ అమర లింగేశ్వర లింగము సేవయని లక్కమ్మ భావించెను.

"భక్తంగె బడతన ఉంటె? నిత్యరిగె మరణ ఉంటె"?10

"భక్తుల బీద తనము యుండునా? నిత్యము వారికి మరణము ఉండునా?" యని లక్కమ్మ తన వచనములో తెల్పెను.

లక్కమ్మ కాయక నిర్వచనము సదా ఆమోద పాత్రము శివ శరణ ధార్మిక సమాజ దర్శనము.

"కాయక ద్లల్ల నిరుతనాదడె, గురుదరశన వాదడూ మరెయ బేకు. లింగ పూజెయాదడూ. మరెయ బేకు. జంగమ ముందిద్దడె యూ హంగు హరియ బేకు కాయకవే కైలాస వాద కారణ"11 అమరేశ్వర లింగ వాయి త్తాదరు కాయక్ దోళగు.

—శూ.సం. 12–1.వచనము.

"కాయకములో నిమగ్నమైన గురు దర్శనమైనచో మరచి పోవచ్చును. లింగపూజలో ఉన్నను మరచి పోవచ్చును. ఒక వేళ జంగమము ముందున్నను కాయకములోనే నుండవలయును. ఎందుకనగా కాయకమే కైలాసము కనుక"అని లక్కమ్మ వచనసారము.

ఇ (ఇ) మేదర కేతయ్య :

కేతయ్య చదువుకొవలేదు. వెదురు నరికి దాని దబ్బలతో బుట్టలల్లు కాయకము ఎన్నుకొనెను. ఈ దళిత జన వర్గ ఆర్థిక స్థితిగతులు అప్పటి హీన పరిస్థితులను తెలుపగలవు. జీవితములో సంభవించిన రెండు ప్రధాన సంఘటనముల వలన కేతయ్య నిరంతర పోరాటము తెలియనగును.

---

9. గూళూరు సిద్ధవీరణాచార్య-శూన్య సంపాదనె (1930 : పుట 230)
10. గూళూరు సిద్ధవీరణాచార్య-శూన్య సంపాదనె (1930 : పుట 226)
11. గూళూరు సిద్ధవీరణాచార్య-శూన్య సంపాదనె (1930 : పుట 223)

1. కాయకము ముందు ధనము అల్పము. అసలు పరిగణనలోకి రాదు "వెదురు నఱుకుచుండగా ముత్యములు రాలిన ప్రసంగము"[12] ఒక ప్రబంధము. అట్టి వెదురులు పుచ్చితవిగా భావించి పనికి రావని వదలిపెట్టెను. తన కాయకములో ముత్యములు కన్నా వెదురు ముఖ్యము. ఎంత విలువైనను కాయకము వదలిపెట్టి ముత్యముల కాశపడలేదు. ఇది నాటి దళిత ధార్మిక జీవనమునకు ఒక చక్కని సాదృశ్యము.

2. జీవన విలువలు: "వెదురు నరుకుతున్నపుడు పై నుండి క్రిందపడి ప్రాణములు కోల్పోయెనని తెలియగానే బసవణ్ణ నిర్జీవుడై పడిపోయెనట"[13] ఒక సామాన్య శివశరణుని ప్రాణము ప్రధాన బండారికి ప్రాణ తుల్యము. ఒకశివ శరణుని యొక్క జీవనము అతని ఒక్కడికే కాక యావత్తు శివశరణ సంఘమునకు సంబంధించినదని గుర్తింపవలయును. చావుకాని, బ్రతుకు కాని అందరి తోటిదని ఈ సంఘటన ఋజువు పరచగలదు. ఇది నాటి ఆదర్శ సమాజమునకు, సమతా దృక్పథమునకు వీరశైవము నిజమైన దర్శనముగా నిలిచిపోయినది.

ఒక వైపు శివశరణుల కాయకముతో దాసోహము చేయుచు సంఘము యొక్క సమతా స్థాపనకు కృషిచేయుచుండ "గ్రామములలో వీరశైవుల ప్రవర్తనను పరిశీలించుటకు ప్రత్యేక గణములుండెను. వారిని పంచాధికారులనిరి. మఠదయ్య, మఠపతి, గణాచార్య, గణ కుమార మరియు స్థావారక"[14]లని హెచ్. యం. సదాశివయ్య తెలియజేశారు. వీరితో పాటు కొందరు జంగములు గ్రామములో నిత్యము పర్యటించుచూ పర్యవేక్షించుచుండిరి. వీరినే కాయకద స్వాములందురు. ఇది యొక స్వయం పోషక, స్వయం పాలక వ్యవస్థ. ఆదర్శమునకు ప్రతీక.

---

12. గూళూరు సిద్ధవీరణాచార్య-శూన్య సంపాదనె (1930 : పుట 76)
13. గూళూరు సిద్ధవీరణాచార్య శూన్య సంపాదనె (1930 : పుట 76)
14. Dr. H.M. Sadasivaiah-A comparative Study of Two Virasaiva Monesteries (1967 : Page 61)

## అధ్యాయము 6

## వీరశైవ కవుల రచనలు-గ్రంథ సమీక్ష

(వీరశైవ కవుల రచనలను మూడు వర్గములుగా విభజించి చూడవచ్చును.

1. శాసనములలో కనిపించు వీరశైవము.

2. వీరశైవులకు బ్రహ్మ సూత్రసదృశములయిన బసవేశ్వరుని మరియు ఇతర కాయకుల వచనములు.

3. తెలుగులో వచ్చిన వీరశైవ కవుల రచనములు.

ఈ సిద్ధాంత వ్యాసము ప్రధానముగా తెలుగులో వీరశైవ కవుల రచనలను గురించి అయినను వీరశైవ కవితా తత్త్వమును గుర్తించుటకు మొదటి రెండు వర్గముల నేపథ్యము చాల అవసరము. అందుకనే తులనాత్మక నేపథ్యముతో ఈ అధ్యాయములో తొలుత శాసనములు, తర్వాత బసవేశ్వరుని వచనముల ప్రస్తావన జరిగినది.)

క్రీ॥శ॥ 12వ శతాబ్దము నుండి ఆంధ్ర దేశములో పాల్కురికి సోమనాథ మహాకవి మొదలైన కవులు వీరశైవ మతమును స్వీకరించి, తన్మత వ్యాప్తికొఱకు కావ్య రచనమ చేపట్టిరి. సోమనాథ మహాకవి నూతన వస్తు స్వీకారము గావించి-పురాతన,నూతన భక్తుల గాథలతో బసవేశ్వరుని కాలమునాటి సమకాలికభక్తుల గాథలను-ప్రజా భాషలో, సరళ ఛందస్సులో రచించెను.ఎన్నో వినూత్న సాహిత్య ప్రక్రియలను ఆవిష్కరించెను. వాని ప్రాచుర్యమునకు ఏ సాహిత్య, సారస్వత, వాఙ్మయ చరిత్రకారులు గాని, పరిశోధకులుగాని వలసినంత న్యాయము చేకూర్చలేదని ఒక అభిప్రాయము కలదు. ప్రతి సాహిత్యాభిమాని చింతించవలసిన విషయామిది. వీరశైవ పండిత త్రయములోని శ్రీపతి పండితారాధ్యులు, మల్లికార్జున పండితారాధ్యులు. వీరశైవ మత పీఠమయిన పాల్కురికి సోమనాథ మహాకవి, యథావాక్కుల అన్నమయ్య, 15వ శతాబ్దమునకు చెందిన పిడుపర్తి సోమనాథుని కావ్యముల సమీక్షింపవలయును.

### కవి :

కవి ప్రతిభ, వ్యుత్పత్తులను కలిగి రచనకు గడగవలయును.

"ధీరో మనీషిజ్ఞః ప్రాజ్ఞ స్సంఖ్యావాని

పండితః కవిః" అని అమర సింహుడు నిర్వచించెను.

"కవిః కవిత్వాధి విరూప మా సజత్" ద్యులోకమున తన రూపము కవిత్వ వశమున స్థిరపరచినాడు. (ఋగ్వేదము 10-124:7)

2. "నిరంకుశాః కవయ్యః" అనుటచే ఏ సంఘటనముపైన చిత్రించు స్వతంత్రము కలవాడు కవి.

1. కవి-కావ్యములు :

"కవతే సర్వం జానాతి, సర్వం వర్ణమతి, సర్వం

సర్వతో గచ్ఛతివా కవిః" అని శబ్ద కల్పద్రుమకర్త నిర్వచించినాడు. అట్టి కవి రస సిద్ధుడు కావలెననియు, 'రస సిద్ధాః కవీశ్వరాః[1] అని పండితులు పొగడిరని కె. వేంకట నారాయణరావు.' ఉటంకించినారు. కవులలో అనేక భేదములు కలవు. "శాస్త్ర కవులని, కావ్య కవులని, ఉభయ కవులుగలరు. అట్టి కవులు ప్రతిభ, వ్యుత్పత్తులతో గ్రంథ రచనలు గావించెదరని" రాజశేఖర ఆలంకారికుడు కావ్య మీమాంసలో పేర్కొన్నాడు.

కవి కర్మ కావ్యము, "నానృషిః కురుతే కావ్య"మనియు అట్టి కావ్యము "విశ్వశ్రేయః కావ్యం"అని కావ్య నిర్వచనమును, ప్రయోజనమును నిర్వచించిరి. కావ్యమునకు శబ్దార్థములు ముఖ్యమని వివరించుచు

"శాస్త్రే శబ్ద ప్రధానత్యమితి హాసేఽర్థ నిష్ఠతా
అభిదాయాః ప్రధానత్వా త్కావ్యం తాభ్యాం విభిద్యతే"

అని అగ్ని పురాణము 337-2 లోని శాస్త్ర, ఇతిహాస, కావ్య లక్షణములు వివరింపబడినవి. మరియు కావ్యములో నవరసములు చిప్పిల్లి యుండ వలయును.

"శృంగార హాస్య కరుణా రౌద్ర వీరభయానకాః
బీభత్సాద్భుత సంజ్ఞౌ చేత్యష్టౌనాట్యేరసాః" స్మృతాః

వీనితో పాటు అష్టాదశ వర్ణనలు తప్పని సరి.

---

1. కే వేంకట నారాయణ-ఆంధ్రవాఙ్మయ చరిత్ర-సంగ్రహము (1967 : పుట 17)

2. సాహిత్యము యొక్క ముఖ్యోద్దేశములు :

1. దేశభాషలలోనే వ్రాయుట, 2. ప్రజల ఆచారములను ప్రతిఫలింపజేయుట, 3. విశ్వ ప్రేమను కాంక్షించుట.

ఇక్కడ రెండు అంశములను పరిశీలింపవలసియున్నది.

ఎ. శాసనములలోని వీరశైవము

బి. వీరశైవ కావ్యములలో వీరశైవ మత తత్త్వము ప్రతిపాదింపబడిన విధము.

ఎ. శాసనములు :

1. క్రీస్తుశకము ఏడవ శతాబ్దము నాటి 'బుడమనారాయపాడు' శాసనములో "గొరవళ్ మెచ్చి

చెనిచ్చిరి.

నాడు వీరశైవులను గొరవలనిడివారు. శ్రీ ఖండవల్లి లక్ష్మీరంజనం? శ్రీ ఖాదిరాజుగారు ప్రాచీనాంధ్ర శాసనములలో వివరించెనని, "గొరవళ్" అనగా "Relating to the teacher, preceptor or a later form of GORVA-wandering Medicants of the Virasaiva cult"[2]అని డా. నండూరి వేంకట సత్య రామారావు తెలియజేశారు.

1. గుణ విజయాదిత్యుని శాసనములో (844-882)

"శ్రీ నిర వద్యు సిన్నుత్త జాతన ముస్టు
శివ పదవ (ర) రాజ్యసేవితున్డు
వణ్ణ రంగు పరమ మాహేశ్వరన్డు"

అనియున్నది. ఇందు 'పరమ మాహేశ్వరన్డు' అను పదము రాజునకు సంబంధించిన మతమని అభిప్రాయము.

3. మూడవదియగు ధర్మవరము శాసనములో (850)

".8 (మా)

2. డా. యన్.వి. సత్యరామారావు-ప్రాజ్నన్నయ యుగము- సాంఘిక జీవనము (1980 : పుట 25)

9 (మా)హేశ్వ పక్షపాతి-అనగా మాహేశ్వరుని మతమును-వీరశైవమును పాటించిన వాడు అని భావింపవచ్చును.

4. యుద్ధ మల్లుని బెజవాడ శాసనములో (927-934)

"గొరగల్గా కొరులందు విడిసి బృందంబుగొనియుండువారు
పరిగాక యబ్బారనాసి వచ్చిన పాపంబు గొండ్ర-

యుద్ధ మల్లుడు కుమారస్వామికి భక్తుడయి బెజవాడలో గుడిని. మఠమును నిర్మించెను. అందులో గొరగలు తప్ప ఇతరులు ఉండరాదని శాసనము వేయించెను. ఆనాడు గొరగల యొక్క ప్రాముఖ్యత తెలియవచ్చును.

వీరశైవ కావ్యములను రెండు విధములుగా విభజింపవచ్చును.

1. వీరశైవ మత లక్షణములను తెలుపు గ్రంథములు.
2 ఆ లక్షణముల ననుసరించి భక్తులగాథల గానము చేసిన కావ్యములు.

వైదిక మతోద్ధరణ కొరకు మహా భారతము రచింపబడినది. సంఘములో నూతన క్రాంతి కొరకు ధార్మిక సమాజ పునః సృష్టి జరుగ వలసియున్నది. వీరశైవ మత సంస్కరణలు, వృత్తుల ఉద్ధరణ, జాతి అభ్యుదయము నాకాంక్షించిన సాహిత్య సవనము.

వీరశైవ కావ్యసృష్టిలో నూతన వస్తు సంచయము, పామరులు గూడ అర్థము చేసికొను భాష, పాడుటకు అనువైన ఛందస్సులను పరిశీలింప వలసియున్నది.

వీరశైవ కవుల కావ్య వస్తువు రాజుల, రారాజుల చరిత్రలుగావు. శీల సౌభాగ్యము, భక్తి సంపత్తి నిండారిన దండి భక్తుల, సామాన్యుల జీవిత ఘట్టాలు కనిపించును. ఇవి ఏ సంస్కృత గ్రంథములకు అనువాదములు కావు. విశేషించి ఆ భక్తులలో శూద్రులు, దళితులు చాల మంది. ఈ కవులు ప్రజాభ్యుదయ వాదులు కనుకనే సామాన్య ప్రజలకు అర్థమగుభాష-అందమైన జాను తెనుగును ఎన్నుకొన్నారు. మణి ప్రవాళములో-మళయాళ సంస్కృత శబ్దముల కలయికతో పద్యములు అటనట కనిపించును. వీరి కావ్య శైలి ఉదాత్తముగా నుండి, స్వచ్ఛత నిండి, ప్రాణ భూతమయిన

చైతన్యమగుచున్నది. వర్ణనలు, ఉపయానములు, తెలుగు సామెతలు, జాతీయముల ప్రయోగము వదజాలము వ్యవహారమునకు సామీప్యములయిన భాషా ప్రయోగములు రచనా విధానములో జీవన విజ్ఞానమును సంతరించుకొనినది. స్త్రీ, పురుషులు పాడుకొనుటకు 'ఎలా వలెనున్న ఛందమును ద్విపదనెన్నుకున్నారు. వృత్తిలో శారీరక శ్రమ చేయువారు, శ్రమ అలుపు తగ్గించుకొనుటకు పాట అవసరము. పాడుకొనువారు దళితలే. "గద్యమున కన్న పద్యము ముఖస్థము చేయుటకు ఎక్కువ అనువుగా నుండునని"[3] ఖండవల్లి లక్ష్మీ రంజనము పేర్కొన్నారు. అందుచే సభల యందు, పర్వ దినముల యందు కలిసి మెలిసి పాడుకొనుటకు అనువుగానుండును.' ఒకే స్వర రచన (ధాతువు) తో సమాన గణములో నడిచే రెండు ఖండాలు (పంక్తులు) పాడవలెను. తర్వాత గురు కాలోపయుక్తమైన ప్రయోగం ఉంటుంది. ఆ తర్వాత వల్లవం అనే పేరున మూడు ఖండాలు-దానిలో మొదటి రెండు విలంబితముగాను, మూడవది ద్రుత కాలములోను పాడవలెన."[4]ని బాలాంత్రపు రజనీ కాంతరావు వివరించారు.

## 3. శ్రీపతి వండితారాధ్యులు (క్రీ॥శ॥ 1072) :

వీరశైవ మత ప్రవక్తలలో ఆద్యుడు. అనంత భూపాలుడు పరిపాలించు రోజులివి. బెజవాడలో మల్లికార్జునస్వామి దేవాలయములోని జమ్మి వృక్షముకడకేగి జమ్మిని ఆకర్షించిన కథ పూర్వపు అధ్యాయములో వివరింపబడినది.

వీరశైవ పండితత్రయములోను ఆద్యుడు. ఇతడు 'శ్రీకర భాష్యము'ను సంస్కృతమున రచించెను. వీరశైవ మత పరమయిన గ్రంథము, వేదాంత సూక్ష్మములను వీరశైవ సిద్ధాంత అనుసరణముగా భేదా భేదాత్మక భాష్యమును రచించెను. ఇందు నాలుగు అధికరణములు కలవు.

1. జిజ్ఞాసాధి కరణము. 2. జన్మాద్యధికరణము.

---

3. ఖండవల్లి లక్ష్మీ రంజనము-(సం)-శ్రీ సిద్ధేశ్వర చరిత్రము (1960 : పీఠక)
4. బాలాంత్రపు రజనీ కాంతారావు-ఆంధ్రవాగ్గేయకార చరిత్ర (1958 : పుట 59)

3. శాస్త్ర యోనిత్వాధికరణము. 4 సమన్వధికరణము.

ఆరంభములో వీరశైవ మతము యొక్క ప్రధాన తత్త్వములయిన లింగ రూపమును, ఆగమ ప్రాముఖ్యతను, భక్త సిద్ధిని తెలుపు శ్లోకముతో ప్రారంభమైనది.

"ఓం నమో లింగరూపాయ జగజ్జన్మాది హేతవే
నిగమాగమ వేద్యాయ భక్త సిద్ధి ప్రదాయినే".

—శ్రీకర భాష్యం-1. శ్లోకము-1 పుట

లింగ ధారణ సిద్ధాంత నిరూపణము, ఆగమ ప్రామాణ్య ప్రదర్శనము, ద్వైతమత ఖండనము ఇత్యాదులు బ్రహ్మజిజ్ఞాస అధికరణములో గలవు. మిథ్యాతత్త్వవాద ఖండనము, అవిచ్ఛిన్నత్వవాద ఖండనము నారాయణాది శబ్దములతో పరశివ పరత్వ నిరూపణములు జన్మాద్యధికరణములో నిరూపింపబడినవి.

శివుడనగా సర్వజ్ఞ మొదలగు ఆరు విధముల సద్భావ కథనం. సిద్ధాంత ప్రతిపాదనము మూడవ ప్రకరణమయిన శాస్త్ర యోనిత్యాధి కరణములో విచారింపబడినవి.

నాలుగవదియైన సమన్వయాధి కరణములో జగన్మిథ్యావాద ఖండనము ఇత్యాదులు తెలుపబడినవి.

4. నన్నెచోడుడు (క్రీ॥శ॥ 1120 నుండి 1150)

శ్రీ మానవల్లి రామకృష్ణ కవి 1910లో నన్నెచోడుని తెలుగు వెలుగులోనికి తెచ్చెను. ఇతడు "రాజ కవులలో ప్రథముడు, సూర్య వంశమునకు చెందిన చోడుడు. కాశ్యప గోత్రుడు. ఇతడు 'ఒరయూరున కధిపతి' అని తెలియుచున్నది. "ఆంధ్ర దేశములోని నరసరావుపేట కొణిదెన ప్రాంతమును పరిపాలించెనని"[5] ఏటుకూరు బలరామమూర్తి తెలియజేయుచున్నారు. ఈ కవిరాజ శిఖామణి ఆదికవి నన్నయ భట్టారకునకు సుమారు నూరు సంవత్సరములు తర్వాతివాడు. 'కలుపొన్న', 'కలుగోడ' ఈ రాజ కవి చిహ్నములు వీరి ప్రతాపమును బట్టి 'టెంకాణాధిత్యుడ'న్నది కూడ

5. ఏటుకూరు బలరామమూర్తి-ఆంధ్రుల సంక్షిప్త చరిత్ర
(1989 : పుట 107)

ుదము కావచ్చును. మల్లికార్జున పండితారాధ్యుని వలె, పాల్కురికి మనాథుని వలె శివాచార్యకత్వమును వహించి మత వ్యాపకుడుగా ప్రవ ంపలేదని భావింపవచ్చును.

"కాళిదాస, ఉద్భటుల కుమార సంభవ కావ్యములను ఆలంబన ంలుగా కొని, తెలుగున కుమార సంభవమును స్వతంత్ర కావ్యముగా ్మించెను"6 అని టి. భాస్కరరావు వివరించియున్నారు. ఇందులో ్రెండు అశ్వాసములు గలవు. దీనిని తన గురువగు జంగమ మల్లి ్జున శివయోగికి అంకితమిచ్చెను.

ఈ కావ్యమునందు వస్తువు, భాష, ఛందస్సులతో పాటు శైవ పార ్యమునకు నూతన పంథాకు సంబంధించిన అంశములు పరిశీలింతము.

"1. కృత్యాదిన షష్ఠ్యంత రచన.

2. అష్టాదశ వర్ణనలు నవరసములు.

3. దేశి కవితా పద్ధతులు-వస్తు కవిత

4. జానుఁ దెనుగు-కవన మహిమ.

5. శైవ పారమ్యము"7 అని నిడదవోలు వేంకటరావు తెలిపియున్నారు.

(ఎ) వస్తువు :

కావ్యారంభములో మహాదేవుని అభిమతంబు లొసంగుమని ప్రార్థించి ్న చోడుడు తన కావ్యములోని కథను ఒక్క మహాస్రగ్ధరలో తెలిపి పాఠ ు మన్ననలను బడసెను.

తి జన్మంబున్, గణాధీశ్వరు జననము, దక్ష క్రతు ధ్వంసముంబా
తి జన్మంబున్ భవోగ్ర వ్రత చరితయు దేవద్విషత్క్షోముఁన్ శ్రీ
త సంహారమ్ము, భూభృత్సుత తపము సుమాసుందరోద్వాహముఁన్‌ద
తి భోగంబుం గుమారోదయమున తఁడ నిందారకుంబోర గెల్పున్"

—కు.సం-1-68-13 పుట

టి భాస్కరరావు-స్ఫూర్తి శ్రీ వ్యాసావళి 1వ భాగము (కీలకము పుట 80)

వేదము వేంకటరాయశాస్త్రి-నన్నెచోడుని కవిత్వము (1959 : పుట 16)

అని కథా సారాంశము వర్ణింపబడినది.

"ఇందు పార్వతి పరిణయము వరకు పరమేశ్వరుడు నాయకుడుగను, తర్వాత తారక వధ వరకు కుమారస్వామి నాయకుడుగను కన్పించును కేవలము శృంగార రస ప్రధానమైనది కాదని"[8] వేదము వేంకటరాయ శాస్త్రి సమీక్షించియున్నారు.

తుది ఆశ్వాసములో వీర రసము ప్రధానమగును, అద్భుత బీభత్స భయానకములు ఉపాంగములు గను కవి చిత్రించెను ఉపాంగములలో వీరమునకు రౌద్రము సహాయకారి.

"ఆదికాలాగ్ని శిఖా కలాప మిది గల్పాంతాంత కాస్ఫోటకం
బది లోకత్రయ భీక్షణ క్షము సమద్యద్భైరవాడంబరం
బది సంహార హరోగ్రనేత్ర శిఖ శౌర్యాటోప వీరగ్రహం
బది నాఁ దారకుఁ దెత్తు దెంచెనతి రౌద్రాకారుడై పోరికిన్'

—కు.సం-12-119-339 పుట

తారకుని రౌద్రాకారము కళ్ళకు కట్టినట్లున్నది. అట్లే వీర రసోద్భలమునకు సహాయకారియైన బీభత్సము.

"ఆడెడి రూపులుం గలయు నానెడి గ్రద్దలుఁ, జవ్వలించి పో
రాడు పిశాచముల్ నెగసి యాడెడు నట్టలు, వానిఁ జిట్టుము
ట్టాడెడు భూత సంకులము నంగద నిల్వక చుట్టు చుట్టుగా
నాడెడు జంబుకాళిఁ"

—కు.సం-11-192-315 పుట

యని యుద్ధ భూమిని వర్ణించెను.

భక్తిగా శాంతి రసము అటనట కన్పించును. "షష్ఠ్యంతములు చెప్పుట నన్నెచోడునితోనే ప్రారంభమయినది. కథా ప్రారంభమునకు ముందున్న షష్ఠ్యంతములతో ఒకటవ పద్యములో 'శ్రీ కంఠమూర్తి కమల శ్లోకునకు తో ప్రారంభించి ఎనిమిదవ పద్యమయిన కంద పద్యములో అనుపమ చరితునకు మల్లికార్జున మునికిన్'తో ముగించెను.

8. వేదము వేంకటరాయశాస్త్రి-నన్నెచోడుని కవిత్వము (1959 : పుట 122)

ప్రతి ఆశ్వాసాంతమునకు వచ్చి అనంతర ఆశ్వాస ప్రారంభమునకు శివుని ప్రస్తావన వచ్చినట్లు కుదుర్చుకొని అచట శివునకు తన గురువు కృతి పతియైన జంగమ మల్లికార్జుననకు అభేదమును అన్వయించుచు పుష్టిని కూర్చు పద్యములను వసంత తిలకము, మాలిని ఇత్యాది వృత్తములలో శబ్దాలంకార వైచిత్రి కనబడు విధమున రచించినాడని"[9] వేదము వేంకట రాయశాస్త్రి షష్ఠ్యంతము ప్రాముఖ్యను వివరించినారు.

'సాహిత్యవేది గుణశక్తి వివేక యుక్తున్'

—కు.సం_4_123_89 పుట

'అమల పరమ యోగాయత్త సంశుద్ధ చిత్తున్'

—కు.సం_5_178_120 పుట

నన్నెచోడుడు శైవ కవి యని చెప్పుటకు ఇష్ట దేవతాస్తుతిలో శివుణ్ణి మూడు పద్యములలోను గణపతి, షణ్ముఖుడు, పార్వతిని ఒక్కొక్క పద్యములోను వర్ణించెను. వీరశైవ మత దాసోహంలోని ముగ్గురిలోని గురువు ప్రథముడు కావున జంగమ మల్లికార్జునుని మూడు పద్యములలో స్తుతించెను

అటులనే కవుల స్తుతిలోని పట్టికలో శివ కవులు గలరు. కాళిదాసు, భారవి, ఉద్భటుడు, బాణుడులను ఒక్కొక్క పద్యములో స్తుతించెను మరియు దేశి సత్కవుల సంస్కృతిని చాళుక్య రాజు మరువ లేదు

చ. "సురవరులం గ్రమంబున వచో మణి సంహతిఁ బూజ సేసిమ
స్తరమ తులం బురాణ కవి సంఘము నుత్తమ మార్గ సత్త్వవీ
శ్వరులను దేశి సత్కవుల''

—కు.సం_1_24 5 పుట

మనోముదంబున సంస్తుతి చేసెను.

'నన్నెచోడుడు సప్త సంతానముల పేర్కొనెను_ అందులోను కృతియే నుత్తమ సంతానమని విశ్వసించెను' (పుట 55). అందునుత్కృష్ట సంతానంబు సత్కృతియ కానిశ్చయించి, (ప్రథమా శ్వాసము 47వ పద్యము) కృతిపతియను రక్తియైన భాషాంగన దక్క నేలిన మహాత్త్వంబు లోకము నం బ్రసిద్ధిగాఁ బ్రబంధము (ప్రథమా శ్వాసము 48వ పద్యము) విస్తరించె

9. వేదము వేంకటరాయశాస్త్రి_నన్నెచోడుని కవిత్వము (1959 : పుట 189)

'నన్నెచోడుడు ప్రాప్రథముగా దేశిని, దేశి పదములను ప్రస్తావించెను. నన్నెచోడుని కవితలోని దేశి కొంత శిష్ట వ్యవహార భిన్నమయి, దేశీయ వ్యవహార సంప్రదాయ సిద్ధమయినది. సన్నిహిత దేశ భాషా సాహిత్య సంప్రదాయములలో గూడిన దనియు వగుటచే నన్నయ్య రచనా పద్ధతికి కొంత విలక్షణమైనదిగా కనబడుచున్నది.

నన్నెచోడుడు జాను తెనుగు ఎందులకో చెప్పియున్నాడు. "సరళముగాఁగ భావములు జానుఁ దెనుంగున నింపుపెంపుతోఁ మధు మృదు త్వరసంబునఁ గందళింపం (ప్రథమా శ్వాసము 35వ పద్యము) సువర్ణ బంధమ్ము ను భావ విశేషములోన తెల్పుటన్-(37వ పద్యము)". 'చతురోక్తుల నుతపద బహుగతల (39వ పద్యము) రచించెను.

కావ్య ప్రశస్తిలోను "సద్భక్తులు — — — — నోటి కొలదుల్ పురి కొల్పగఁ (ప్రథమా శ్వాసము 38వ పద్యము), 'చేన బండిన విత్తు చేనికే ఫలకాంక్ష — — తీర్థాళి కర్థిఁ దత్తీర్థోదకంబుల (ప్రథమా శ్వాశము 49వ పద్యము) కృతి కర్తృ వంశ వర్ణాదిలోను 'మిన్నులపై' బారుచున్న యేటిలఁ దెచ్చి వారాశి నించె భగీరథుండు. సతీపరమేశ్వరుల విహారములోను (ప్రథమా శ్వాసము-52వ పద్యము) "బేటం బేటముగా నిభంబు కరణిన్ బ్రేమతోఁ జేరి లా/లాటంలో (1-100) జాను గెనుగు కన్పించును.

సతీదక్షుల సంభాషణములో చక్కని జాను తెనుగు సాగినది. సతీదేవి దక్షునితో "అటి ముటి రుద్రునెంత చెడనాడెందు; సోమముఁ దాగ్రియున్కిమై యెఱుగక బీరెవో!"యని జానుదెనుగులో పల్కియున్నాడు. హిమవ ద్వర్ణనములో అజుడు తన విద్య మెఱయఁ గులాద్రి లొండ్లు వడసెఁగా కుర్వి దాల్పంగ భరమేదిని?" (తృతీయాశ్వాసము, 3వ పద్యము)లో కూడ జాను దెనుగు నిండుగా కన్పించును.

4. (బి) అష్టాదశ వర్ణనలు :

హిమ వంతంబున పరమేశ్వరు తపోవనంబునకు పుష్పాయుధుడయి వచ్చిన సందర్భములోని వన వర్ణన పొన్నలు పూచెనని చెప్పుచు అపద్యము నడకలోనే వృక్షములు హఠాత్తుగ పుష్పితములయినవి.

"పొన్నలు పూచె జొన్నలొగిఁ బూవకముందఱఁ బూచె గోగులా
పొన్నలు గొండ గోగులుమఁ బూవకముందఱఁ బూచె బూరుపుల్

పొన్నలు గొండ గోగులుమ బూరుపులువ్వొ్గి బూవ కుండగా
మున్నవనంబునం గలయ మోదుగ లొప్పంగ బూచె నామనిన్."

—కు.సం-4-91-82 షట—

పార్వతి పరమేశ్వరుల జలకేళి సందర్భమునను శివుడు వివాహము కొఱకు హిమ మతమునకు వచ్చిన సందర్భమున 'హసగిరిం బొందె రాజు దయాద్రి నెక్కె, ఇనుడు తేజస్వులగు వారికెల్ల ప్రొద్దు'. ఇట రవి శశిల వర్ణనలు అద్భుతములుగా నున్నవి. పార్వతి తపస్సు సందర్భమున వర్ష ఋతువును, హిమవంతుని వర్ణనములో నగవర్ణనను, శివ పార్వతుల వివాహ సందర్భములో పురవర్ణనను, కుమారుడు తారకుని యొద్దకు తగిన వానిని రాయబారిగ పంపుటలో దౌత్యము చక్కగా వర్ణింపబడినది

నన్నెచోడుడు తన ప్రబంధ రచనలో శయ్యా పాకములను చక్కగా కూర్చెను. మాట వెంట మాట కూర్పును 'శయ్య' యనియు, అర్థము పొందికను 'పాకమ'నియు అందురు. 'ఓలిన కడచన నరువది నాలుగు విద్యలు నేర్చెను'.

4. (సి) వస్తు కవిత :

వస్తువనగా అలంకార గ్రంథము లలో కవితా వస్తువని అర్థము. వేదాంత విషయములందు వస్తువనగా పరవస్తువన్న మాట. అనగా పరబ్రహ్మ పదార్థము. పరవస్తు ప్రధానమైనది వస్తుకవితయని వేదాంత భావనలో చెప్పవచ్చును. ఇచట కథ వస్తు సంబంధి. వాల్మీకి వస్తు కావ్యాబ్ధరవి యని పేర్కొన్నాడు. ఇది ఏక వస్తు ప్రతి పాదికమై కథా వస్తు ప్రాధాన్యముతో వెలయుచుండును. "ఇందులో Many Original things much Originality గలదు''అని వేదము వేంకటరాయశాస్త్రిగారు సెలవిచ్చారు.

(చూ. నన్నెచోడుని కవిత్వము : పుట 181)

శివుని కథలో గురువునకు సమాన ప్రాధాన్యత నిచ్చి ఎవరికి ఆధిక్యము లేకుండా చేసెను.

వస్తు కవి రాజ శిఖామణియగు నన్నెచోడుడు కథా పురుషుడగు శివుణ్ణి ఎన్నిటితోనో పోల్చి, ఎన్ని విధములుగానో వర్ణించెను. ఇష్ట దేవతా స్తుతిలో "రమణీయ శృంగార రజత పర్వతమునా శోభిల్లు శుద్ధ విస్ఫూర్తి

మూర్తి" (ప్రథమాశ్వాసము, 2వ పద్యము) అని వర్ణించెను. పరమేశ్వరుడు తపంబుజేయు సందర్భమున

"వలకెడు కారాకు లలితా స్థిచయముగా
సోలు కొమ్మలు పలుకేలుగాఁగ,
బాల పల్లవములు ప్రేలు కెంజడలుగాఁ
బెనగు తీగెలు దొడ్డ ఫణులుగాఁగ
గల కంఠ నికరంబు గళమున కప్పగాఁ
బుప్పొడి మేని విభూతి గాఁగ
ఫలములు వరదాన ఫలములుగా నలి
మాలికల్ రుద్రాక్ష మాలికలుగ
శంభు మూర్తి దాల్చి సహకార భూరుహ
చక్రవర్తి నవ వసంత వేళ
నతిశయిల్లుచుండె నక్కడగని మది
నుదరిపడి మనోజు డోసరింప"

—ఈ సం-4-101-84 పుట-

ఇందు తపస్సు చేయుచున్న శివుణ్ణి సహకార భూరుహముతో వర్ణించెను. "శంభుని మామిడి చెట్టుతో పోలిక. ఇట సమాన ధర్మములుండక మానవు. పలికెడు కారాకులు లలితాస్థిచయమట. ప్రేలాడు కొమ్మలు (ఈశ్వరుని) పలుకేలట. పల్లవములు ప్రేలు కెంజెడలు. చుట్టుకొన్న తీగెలు దొడ్డ ఫణలట – – – – పుప్పొడి అతని మేనియందలి విభూతి. అలిమాలికలు రుద్రాక్ష మాలికలని"10 డా. కోరాడ మహదేవశాస్త్రి వివరించియున్నారు.

మరియొక పర్యాయము నవమాశ్వాసములో వివాహానంతరము ఉమా సహితముగ హరుడు వెండి కొండకు వచ్చెననెడి సందర్భమున 'క్రౌంచారు' రీతి వచ్చెనని బోల్చెను. యుద్ధభూమి సరోవరమైనది. ఈ విధమయిన ఉక్తి వైచిత్ర కలది వస్తు కవిత.

---

10. కోరాడ మహదేవశాస్త్రి-కుమార సంభవము (పీఠిక) (1968 : పుట 40)

4. (డి) శివ పారమ్యము :

నన్నెచోడుడు పార్వతీ బాల్యవర్ణన ఘట్టమున

"గిరిసుత దొలు పలుకు లను
స్వర మొదవగఁనో నమశ్శివాయ సదాస్మ
ద్వర దాయ నమశ్శంకర !
శరణు ! మహాదేవ ! నీవ శరణ'న జొచ్చెన్"

—కు. సం-3-34-51 పుట—

పార్వతి తొలి పలుకులలోనే 'ఓం నమశ్శివాయ' అన్నదని కవి శైవ మత ప్రభావమును జూపినాడు.

"జంగమ మల్లికార్జునుడు శాక్తేయుడ'గుటచే మేనకా హిమ వంతలు శక్త్యారాధన జేసిర'ని వేదము వేంకట రాయశాస్త్రిగారు తెలిపియున్నారు.

ఇంతటి మహా ప్రబంధమున 'ఒక ఉపాఖ్యానము లేకుండుట చిత్రమే! అయినను ఒక్క స్తవము కనిపించును. అదియు "దారిద్ర్య విద్రావణా' అను మకుటము తోడిది. నన్నెచోడుడు యుద్ధములో వీర స్వర్గమంక రించుటకు పూర్వమే అథబగళాదేవి స్తోత్రమును కీర్తించియుండవచ్చునని 11 నిర్ధారింప వచ్చునేమో?

నన్నెచోడుడు తర్వాతి కవులకు కావ్య నిర్మాణ, రచనా పథకములను వివరించుటలో శ్రీకారము చుట్టెను. కవితా ధార అనర్గళమయినది. అందు లోను శైలి ద్రాక్షా పాకము. దేశీయ, వ్యవహార, సంప్రదాయ సిద్ధమైన దేశిని-పదములను, పలుకుబడులను, నానాడులను, స్వాభావిక వర్ణనల నుపయోగించి తన లోకానుభవము వెల్లడించెను. ఆగమ శైవము తమిళ దేశమున నుండుటచే 'శైవాగమ రహస్యవేత్త'యగునని భావింపవలయును పార్వతి శైవాగమ దీక్షలో ఒక సంవత్సరకాలము ఉండినదని కవి వర్ణించెను. శ్రీతో శ్రీకారము చుట్టిన కుమార సంభవమును మంగళ మహాశ్రీతో ముగించెను.

11. పాలవర్థుల శ్రీరామశర్మ-శ్రీదేవి రత్నాకరము (1981: పుట 555) (కూర్పరి)

నన్నెచోడుని గ్రంథాంతరము 'కళా విలాసము' "అందలి నాలుగు పద్యములను లభించినవి. అందు రెండు కంద పద్యములు, ఒక సీస పద్యములున్నవి"[12] అని వేటూరి ప్రభాకరశాస్త్రి ఉదాహరించిరి. 'మన్మథుండు అఖిల లోకములకు వెలుగొంగ, జీవుల మూల కంద మతని యిల పెచ్చి వెడలని యతడు గలడె''-ఇట్టి వర్ణనలు ఏ కవి జేయజాలడు.

నన్నెచోడుని కుమార సంభవము ఒక శైవ కావ్యమని ఋజువగుచున్నది. శివుని వస్తు కవితలో వర్ణించెను. గురువు అయిన జంగమ మల్లికార్జునుని వీర శైవ మత ప్రభావము నన్నెచోడుని పై కొంత వరకు కనిపించుచున్నది. కన్నడ వచన వీరశైవ సాహిత్య సారమును జీర్ణించుకొన్న మల్లికార్జున పండితారాధ్యులు నన్నెచోడుని కవితా భావములను కొన్నింటిని అనుసరించెను. ఆ మల్లికర్జున పండితారాధ్యుల భావములను పాల్కురికి సోమనాథ కవి స్వీకరించెను.

ఏ. వచనములు-సాహిత్య మాతృక :

పం్రడెండవ శతాబ్దము నాటి పరిస్థితుల కనుగుణ్యముగా వీరశైవ మతమును సంస్కరించి దాని పునరుత్థానమునకై బసవేశ్వరుడు తీవ్ర కృషి సలిపెను. మత తత్త్వములను వచన రూపములో బోధించెను. లింగమనే గురువు ద్వారా ఈ శూన్య రహస్యమును ఛేదించారు. ఈ వచనములు వీర శైవ సాహిత్యమునకు మాతృక వంటివి వీనిలో మానవతా దృక్పథము ఏ విధముగా ప్రతిపాదింపబడినదో కన్నడ భాషలోని మొట్టమొదటి జేడర దాసిమయ్య రచించిన వచనముతో ప్రారంభింతము.

"ఈ నేల నీ బహుమతి, దాని ఫలము కూడ !
ఈగాలి మనచుట్టూ ఉన్నది, నీ బహుమతి
నీ బహుమతుల అనుభవించుచు నిన్ను పొగడని
ఊర కుక్కల నేమనవలె ? ఓ రామనాథ దేవా!"

కన్నడ వచనములను నాలుగు విభాగములుగా జేయవచ్చును.

ఎ) ధర్మ సంబంధి బి) ప్రవర్తన సంబంధి
సీ) విప్లవ సంబంధి డి) వీరశైవమత సంబంధి
ఇ) కాయక సంబంధి

12. వేటూరి ప్రభాకరశాస్త్రి-ప్రబంధరత్నావళి (1976 : పుట 39)

5. (ఎ) ధర్మ సంబంధి :

1. 'దేవనొబ్బ నామ హలవు ! బసవ వచనామృత' (4)–5 పుట
   –దేవుడొక్కడే పేర్లు పెక్కులు
2. 'నంబి కరెదడో యెన్న నే శివను !'
   –బసవ వచనామృత-8-9 పుట
   –నమ్మి (బి)పిలచిన 'ఓ' యనడే శివుడు
3. 'నాద ప్రియనూ అల్ల ! వేద ప్రియనూ అల్ల! ! భక్తి ప్రియ!'
   –బసవ వచనామృత -9-10-పుటలు-
   –శివుడు నాద ప్రియుడూ కాడు,
   వేద ప్రియుడూ కాడు, భక్తి ప్రియుడు
4. "గోత్రనామవ బెన గొండరె
   మాతనోంకదె సుమ్మ నిద్దిదేకయ్య ?–!'
   –బసవ వచనామృత-85 75 పుట
   –గోత్ర నామము ప్రశ్నింవ నూర్పుచు
   నూరకుంటి రదేమయ్యా.
5. 'గురువి వల్లి సాయతను, లింగవల్లి సన్నిహితను,
   జంగమదల్లి సదర్థను, ప్రసాదదల్లి పరిణామి,
   ఇంతీ చతుర్విధ దల్లిసన్మతను..
   కూడల సంగయ్య నల్లి చెన్న బసవణ్ణను
   –బసవ వచనామృత-5-97వ పుట

గురువు నందు స్వాయతను, లింగమునందు సన్నిహితమును, జంగము నందు సద్భావనను, ప్రసాదమందు పరిణామము చెందినవాడు ఈ చతుర్విధములలో సన్మతను కలిగియుండవలయును.

6. 'నాళె బరువుదు నమగిందే బరలి
   ఇందు బరువుదు నమగీగలె బరలి
   ఆగీగ ఎన్న దిరూ, చెన్న మల్లికార్జునా !'
   –అక్క మహాదేవి వచనము
   –శివ శరణెయర వచనగళు-14-9 పుట

రేపు వచ్చునది ఈ రోజేరానీ. ఈ రోజు వచ్చునది మాకు ఇప్పుడే రానీ. ఎపుడో, ఏమో జరుగునని భయపడరాదు. అది ఇప్పుడు జరిగిన మంచిదని భావము.

7. "సూతక పాతక విరహిత వాదడె,
ఆతన తను సాక్షాత్ శివన తనుః,
ఆత నిత్య కేవల ముక్త నోడా,
కపిల సిద్ధ మల్లికార్జునా
శివ లింగ విడిద మాహేశ్వరను.
-సిద్ధరామేశ్వర వచనము
(సిద్ధ రామేశ్వర వచనగళు-60-61 పుట)

దోషములను, పాపములను విడిచిన వాడు సాక్షాత్తు శివుడు. ఆతడు కేవలము ముక్తినే చూచును.

"కొలువనే మాదిగ! హొలసతింబవనేహొలెయ"!
-బసవ వచనామృత-95-85 పుట

-చంపువాడు మాదిగయని, నీచము తినువాడు మాలయని పేర్కొనెను.

5. (బి) ప్రవర్తన సంబంధి :

1. "కామ వేకో - - - - లోభ వేకో

మోహ వేకో - - - మద మత్సర వుళ్ళవంగె
హృదయ శుద్ధ వెల్లియుదో?"
-బసవ వచనామృత-12-13 పుట

కామ, లోభ, మోహ, మద, మత్సరములున్న వానికి మనశ్శుద్ధి లేదయా!

2. 'కల్ల నాగర కండరె హాలనెరె ఎంబరు !'
దిటద నాగర కండరె కోలెంబరయ్య !'
-బసవ వచనామృత-79-70 పుట

-రాతి నాగుల జూచిన పాల నిడు మందురు. జాతి నాగుల జూచిన చంపండి అందురు.

3. "అర్చనె, పూజనే నేమవల్ల ; మంత్ర తంత్రనేమవల్ల;
ధూప దీపారతి నేమవల్ల;
పరధన పరస్త్రీ పరదైవంగళిగెరగదిప్పుదె నేమ,
శంభు జక్కేశ్వరవల్లి ఇపు కాణి రణ్ణా, నిత్యనేమ."
– సత్యక్క వచనము
–శివ శరణెయర వచనగళు-1-53 పుట

–అర్చన, పూజ, మంత్ర తంత్రములు, ధూప దీపారతి నియమములు కావు. పరధనమును, పరస్త్రీని, పరదైవమును కోరకుండుటయే నియమము.

5. (సి) విప్లవ సంబంధి : (హేతువాది) :

1. "ఎమ్మవరు బెసగొండరె శుభలగ్న వెన్నిరయ్య !

---

---

నాళిన దిన కిందిన దిన లేసెందు హేళిరయ్యా!"
–బసవ వచనామృత-26-23 పుట

–మా వారు ప్రశ్నించిన శుభలగ్నంబనుడయ్యా, రేపటికంటె నేడె శుభదినమని.

2. "శాస్త్ర ఘనవెంబెనె? కర్మవ భజిసుత్తిదె !
వేద ఘన వెంబెనె? ప్రాణివధెయ హేళుత్తిదె !
స్మృతి ఘన వెంబెనె? ముందిట్టిర సుత్తిదె !"
–ధర్మ భండారి బసవణ్ణనవరు-208-59 పుట –

–శాస్త్రమును గొప్పగా భావించుదమనిన కర్మను స్తుతించును. వేదము గొప్పదిగా భావించుదమనిన ప్రాణి వధను చెబుతున్నది. స్మృతులను గొప్పగా భావించుదమనిన జరిగిన విషయమును తెలుపును.

3. "హావడిగను మూకోటితియు-తన్న కైయల్లి హావు
మగనమదువెగె శకునవ నోడ హోహాగ!"
–ధర్మ భండారి బసవణ్ణనవరు-105-249 పుట –

బసవణ్ణ హేతువాది శకునములను తీవ్రముగా నిరసించెను.

5. (డి) వీరశైవ మత సంబంధి :

1. "హా లెంజలు పేయన !

ఉదక వెంజలు మత్స్యద !
పుష్ప వెంజలు తుంబియ ! ఎంతు పూజిసువె?''
-బసవ వచనామృత_60_51 పుట

.పాలు దూడ ఎంగిలి, నీరు మత్స్యముల ఎంగిలి,
పుష్పము ు తుమ్మెద ఎంగిలి అని పూజించుచున్నామా?

'శ్రీ గురువెతాయి తందెయాగి, లింగవె పతియాగి,
జంగమవె అత్తెమావందిరాగి, శివభక్తరె బాంధవరాగి
సత్య సదాచార వెంబ మనెగె కళు హిదరాగి
శరణ సతి ఎంబ నామ నిజవాయిత్తు!"
-అక్క నాగమ్మ వచనము
-శివశరణెయర వచనగళు_11_20 పుట-

శ్రీ గురువు తల్లి తండ్రియై, లింగము పతియై జంగమ అత్తమామమై, శివ భక్తులు బంధులై సత్య సదాచారవును ఇంటికి కళుహిదరాగి_శరణ సతియను పేర నిజమయినది.

2. 'భక్తర కులవ నెఱసిదరె నిమ్మరాణి వాసదాణె'
_బ. వ. 452
_భక్తుల కులమును ఎంచిన మీ ఇంటి వారిపై ఆన.

3. 'భవిగళకోట, భవిగళ ఒడనాట హోల్లి!
_ధర్మ భండారి బసవణ్ణనవరు_38 పు (పీఠిక)
-దుర్జన సంఘ వికాసమువ కడ్డు పడుదును-

4. జంగమవే లింగవె నగె, జంగమనె ప్రాణ వెనగె'
-ధ.భ.బ-839.21 పుట-

-జంగమములే నాకు లింగముతో సమానము. జంగమో నాకు ప్రాణముతో సమానము.

5. "నిమ్మ నంబిద శరణర డింగరిగె నామ''
నిమ్మ దాసర దాసియ దాస నానయ్యా"
—ద.భ.బ_336-341 వ_27 పుట—

_మీరు నమ్మిన శరణులకు డింగరి నేను మీ దాసర దాసునకు దాసుడ నేను.

6. "జ్ఞాన మూల గురుసేవె ఎంబెను.
ఐశ్వర్యమూల లింగార్చనె ఎంబెను.
మోక్షమూల, ఘట సంతృప్తి, ఎంబెను, అజగణ్ణ లింగవే!"

—ముక్తాయక్క వచనము

— శి.వ-5-34 పుట —

-జ్ఞాన మూలము గురుసేవ అగును. ఐశ్వర్యమూలము లింగార్చన మోక్షమూలము జంగమ సంతృప్తియగును.

7. "విప్ర మొదలు అంత్యజ కడెయాగి
శివభక్తరాదవర వొందే ఎంబె?"

—ధ.భ.బ.-94 పుట—

-విప్రుని మొదలుకొని అంత్యజుని వరకు శివ భక్తులయిన ఆమోదము పొందుదురు.

8. "హా ల నేమ హా లకెనెయ నేమ!
అంబలియ నేమ దాత మాదార చెన్నయ్య"

-ధ.భ.బ.-232 106 పుట-

-పాల వ్రతము, మీగడ వ్రతము ఉండ వచ్చును. కాని అంబలి వ్రతమున్న దాత చెన్నయ్య.

9 'నుడిగె తక్క నడెయ కండరె'

—బ.వ-13 పుట—

—మాటకు తగిన ప్రవర్తన ఉండవలెను.

10 'అయ్యా' ఎందడె స్వర్గ!
'ఎలవో' ఎందడె నరక

—బ.వ-29-26 పుట—

'ఆయ్యా' అనగా స్వర్గమనియు, 'ఒరే' అనగా నరకమనియు తెలిపెను.

11. 'పరస్త్రీ, పరధనవెంబీ జొబింగంజువె!'

—బ.వ-41-37 పుట

—పరస్త్రీ, పరధనమునకు వెఱతును.

12. "నుడిదరె ముత్తిన హారదంతిర బేకు
నుడిదరె మాణిక్యద దీప్తియంతిర బేకు!
నుడిదరె స్ఫటికద శలాకె యంతిర బేకు!

—బ వ-55-47 పుట—

-పలికిన ముత్యపు సరంబుగ, పలికిన మాణిక్యపు దీప్తిగా, పలికిన స్ఫటికపు ముక్కగా నుండవలయును.

13. 'సత్య నుడిపుదే దేవలోక
మిథ్యవ నుడిపుదే మర్త్యలోక, ఆచారవె స్వర్గ అనా
చారవె నరక !''

(A Comparative study of Two Virasaiva Monasteries 46 Page)

-సత్యము చెప్పిన దేవలోకము, అసత్యము చెప్పిన మానవ లోకము ఆచారము స్వర్గము, అనాచారము నరకమని ఉద్ఘాటించెను.

14 "నీకొట్టుద్రవ్య వనిమ గల్లదె మత్తొందుక్రియె మాడెను"

—ధ.భ.బ-708-41 పుట—

-బసవేశ్వరు భండారిగ యున్నను ధనమును భక్తుల కొరకు కాక వేరొండు క్రియలకు ఖర్చు పెట్టడు.

15. "ఇవ నారవ, ఇవనారవ, ఇవనారవ? నెందె నిసదిరయ్య
ఇవ నమ్మవ, ఇవ నమ్మవ, ఇవ నమ్మవ, నెందెనిసయ్య"

—ధ.భ.బ-92-105 పుట—

"కాగియొందు గుళ కండరె, కరెయదే తన్న బళగవెల్లవ?
కోళి యొందు కుటుక కండరె, కూగి కరెయదే తన్న కుల వెల్లవ?
శివ భక్త నాగి భక్త పక్ష విల్ల దిద్దరె,
ఆ కాగి, కోళి యింద కర కష్ట!

—బ.వ-63-53 పుట—

-ఇతడెవరు, యితడెవరు అనుట కన్న ఇతడు మనవాడు, ఇతడు మనవాడు అనుటలో గొప్ప తనమున్నది. కాకి, కోడి ఇంత ఆహారమును

చూచి తమ కులమును పిలచి పంచుకొనును. అట్లే శివ భక్తుడు భక్తుల పక్షము వహింపవలయును.

16. 'ఎన్నకాలే కంభ! దేహవే దేగుల!
శిరహోన్న కళశవయ్యా !'
—బ.వ-35-32 పుట—

-కాళ్ళు స్తంభములుగా, దేహమును దేవాలయముగా, శిరమును కలశముగా భావించి అర్పించవలయును.

17. "న్యాయ నిష్ఠూరి! దాక్షిణ్య పరనల్ల
లోక విరోధి! శరణ నారి గంజువ నల్ల
కూడల సంగమ దేవర రాజతేజదల్లిప్పనాగి"
—ధ.భ.బ-723-130 పుట—

-న్యాయము చెపుటలో నిష్ఠూర మగును. శిక్షించుటలో 'తన మన' లకు దయ జూపను. లోక విరోధమైన ఫరావాలేదు. శరణుడు ఎవ్వరికి భయపడడు.

5. (ఇ) కాయక సంబంధి :

1. "కృత్యకాయక విల్లదవరు భక్తరల్ల!
సద్య శుద్ధ విల్లదుదు కాయక వల్ల!
ఆసె యెంబువుదు భవద బీజ!
నిరాసె యెంబుదు నిత్య ముక్తి.
ఉరి లింగ పెద్ది గళ రసనల్లి వదర వల్ల కాళవ్వా!"
-కాళవ్వ వచన
_శి.వ 1_52

-కృత్య కాయుకము లేనివారు భక్తులు కారు, సత్య శుద్ధము కానిది కాయకము కాదు, ఆశ జన్మమునకు బీజము నిరాశ అనునది నిత్యముక్తి

2. 'దేవ సహిత భక్త మనెగె బందరె
కాయక వావు దెందు బెసగొండరె నిమ్మాణె."

(A Comparative study of Two Virasaiva Monasteries Page 52.)

-దేవుడు సహితము భక్తుని ఇంటికి వచ్చిన కాయకము ఏది అని అడుగ వలసిన పనిలేదు. ఈ సందర్భమున ఒక నిర్వచనము జ్ఞప్తికి వచ్చును. గొప్ప కళాకారుని యొక్క లక్షణములు చెప్పుచు లెనిన్ ఇట్లు ఉద్ఘాటించెను.

"A really great artician, he must have reflected in his work at least some of the essential aspects of the Revolution"[13]

## 6. మల్లికార్జున పండితారాధ్యులు (క్రీ॥శ॥ 1100-70) :

వీరశైవ పండిత త్రియములో తృతీయుడు, గౌరాంబ భీమనల కుమారుడు. దాక్షారామ నివాసి. అవాంతరయ్య అను ఆరాధ్య దేవరకడ వీరవ్రత దీక్షగొనెను. తర్వాత కర్ణాటక బసవేశ్వరుని యొక్క గాఢ ప్రభావమునకు లోనయ్యెను. వెలనాటి చోళుని కాలములో బౌద్ధ మత నిర్మూలనమునకు గడంగి వీరశైవ మత ప్రచారమును గావించెను.

శ్రీకర భాష్యములోని వీరశైవమును సంస్కరించెను. అందు చేతనే శివతత్త్వసార' గ్రంథ ప్రారంభములో శ్రీపతి వాకృతి ముఖ్య మహా పురుషులు' అని స్తుతించెను. "వీరి రచనల సంఖ్య దాదాపు 44 అని; అవి అలభ్యములని ఆరుద్ర తెలిపియున్నారు. ప్రధానమైన 1. లింగోద్భవ గద్య, 2. రుద్రమహిమ, 3. అమరేశ్వరాష్టకము, 4. పర్వతవర్ణన, 5. శతకము కూడ లభ్యములగుట లేదు.

## 'శివ తత్త్వసారము' :

ఇది తొలి తెలుగులోని స్వతంత్ర కావ్యము. శివతత్త్వమును ప్రబోధించిన తత్త్వశాస్త్రము. వీర మహేశ్వరాచారముతో నిండి పోయినది. ఇందులో మొత్తము 489 కంద పద్యములు కలవు.

నన్నెచోడ కవిరాజు శిఖామణికి సమకాలికుడు. నన్నయ భారతములోని కందములు, నన్నెచోడుని కుమార సంభవములోని కంద పద్యములు ప్రభావము వలన శివతత్త్వ సారమును కంద పద్యములలో రచించి యుండవచ్చును. శివతత్త్వసారము సరళమై శాశ్వతముగా స్మృతి పథములో నుండుటకు కారణమయినది. ఇది పాల్కురికి సోమనాథుని బసప

13. Lenin-'On Literature and Art' (1978 . Page 30)

పురాణ రచనకు కొంత తోడ్పడియుండ వచ్చుననిన అతిశయోక్తి కానేరదు: "ఒక విధముగా నాలోచించినచో అతివాద పార్టీ క్రమ శిక్షణకు ఒక స్మృతి లాంటిది. గ్రంథ సమాప్తిలో 'నమ్మిక భక్తి మానస -శుభము లొసంగుతన్' అని ముగించెను. కొంచెము జాగరూకతలో పరిశీలించిన ఇది అసంపూర్తి గ్రంథముగా తోచుచున్నది."యని నిడదవోలు వెంకటరావు వ్యాఖ్యానించారు. శతకమని చెప్పినను చతుర్థ పాదములో మకుట నియమముగాని, పద్యముల సంఖ్యా నియమముగాని కనిపించదు. విశేషించి వస్త్వైక్యమును తెలుపు గ్రంథము కాదు. అందుకు కవి సంకల్పము లేదు అని అనుకొనవచ్చును. వస్తువు యొక్క అంశముల శీర్షికలను బట్టి పద్యముల వరుస సంఖ్యను మార్పు చేయవలసియున్నదని భావించెదను.

6. (ఎ) గ్రంథ ప్రాశస్త్యము :

1. మల్లికార్జున పండితారాధ్యులు శివస్వరూపమును ఎంతో చక్కగా నిర్వచించెను.

"ప్రతిమ సదానందాత్మక
మతి సూక్ష్మము నీరూపము అతిలోక శివా"?

—13వ పద్యము

2. షష్ట్యంతముల పొందపరచి కావ్యాత్మను సిద్ధింప జేసెను. అదియును జయమగునని కాంక్షించెను.

'జయమగు వేదంబులకును
జయమగు బంచాక్షరికిని - జయమగు నిటలా
శ్రయమగు భసితం బునకును
జయమగు మహేశ్వరులకు సంతతము శివా

—18వ ప.

బహుశ ఈషష్ట్యంత లక్షణము కుమారల సంభవమును జూచి సంతరించుకొని యుండవచ్చును.

3. దక్షాధ్వర ధ్వంస ఘట్టమును చేర్చుట వలన కావ్యసిద్ధి కలిగినదని చెప్పవచ్చును. (కీ॥శ॥ 300-319వ ప.)

4. ప్రళయ వర్ణనము, గణాధిపుల ఆటలు, శివగణ వర్ణనము గావించి పండితయ్య కాల జ్ఞానమునకు దర్పణము పట్టెను (320-321 పద్యములు)

5. ప్రతి కవి యొక్క గ్రంథ రచన ఆశయములు రెండు; ఒకటి లౌకికము, రెండు పార లౌకికము. ఇచట వీరశైవ మత వ్యాప్తి లౌకిక మనుకొనక పార లౌకికములో శివుణ్ణి ఏ విధముగా ప్రార్థించెనో చూడండి:

"దేవా! సంసారాంబుధి
లో వెలువడ జేసి ప్రమథ లోకం బెలుగన్
నావాడు వీడు సుండీ
రావే నన్నుంపవే! గణములు నడుమన్"

—386వ ప.

6. (బి) మత తత్త్వములు :

1. పాశుపతము :

పతి రుద్రుడని (22వ ప.) జీవుల నేకులు పశువులని (24వ. ప.) పాశముల తన పశువుకును బంధ మోక్ష పద్ధతి సేయ కుశలునిగా (25వ.ప) పశువు పతి పాశ జ్ఞానమును విశ్లేషించియున్నాడు.

2. అద్వైత ఖండన :

'ప్రత్యక్ష జగద్భేదము సత్యంబై తోచుచుండ — — — — — అప్రత్యక్ష బాధయగునని అనుచిత వృత్తి నడతు రద్వైతులు' (35వ.ప.) యని ఖండించెను. వీరు ప్రమాణ శూన్యులని కూడ నిర్ణయించెను. (44వ.ప.)

3. జగత్కర్తృ విచారము :

జగత్కర్తృ విచారము గావించుచు 14వ పద్యములో వివరించెను. జగత్కర్తృ లక్షణములో

"భవనోత్పత్తి స్థితిలయ
వివిధ వ్యాపార ముఖ్య విభుడవు పశుబం
ధ విమోక్ష దక్షుడవు"—87వ పుట

అని వివరించెను.

4. తత్త్వ విచారము :

భవాది శబ్ద వివృతి తెలుపుచు 36 తత్త్వములకు ఉద్భవ స్థానమైన 'రజోగుణ సంగతి భవుడను నామంబునీకు బరగు మహేశా! (81వ.ప.)

6. (సి) భక్తి మహిమ :

"ఒక్కండీశుడని — — — —" 99వ పద్యములోని వేదోక్త సదాచార వాదనము అధికమని 101వ ప. శివభక్తి శివజ్ఞాన ధ్యానములు- - - - ఆనంద ప్రాప్తి కల్గించునని 104వ పద్యము అభి భాషించెను. భక్తి లేక ముక్తి లేదని 243వ పద్యములో తెల్పెను. భక్తి మహిమను 415వ పద్యములో వర్ణించెను? కావ్యాంతమున గల 489వ పద్యము అసంపూర్ణముగా కనిపించును. అందులోను శివభక్తియందు విశ్వాసము కలిగియుండవలెనని ఉద్బోధించెను.

6. (డి) భక్తుల చరిత్ర :

"తలలు తఱిగిన తలలను నరుకుడనియు 187వ పద్యము, 'పుచ్చిన కన్నులు క్రిమ్మర వచ్చుననియు' 188వ పద్యమున తెలుపుచు భక్తుల చరితను పేర్కొనినాడు. శివుణ్ణి పూజించి అచ్యుతుడు సుదర్శన చక్రము బడయుట, 392వ ప. శివనింద గావించిన వ్యాసుని పాద పుత్రుడు ప్రాణ వియోగ్నిని గావించి గణపదవిని పొందుట 394వ ప. మిగిలిన శివ భక్తులు రావణుడు, బాణుడు, కాట కోటడు, వీర శంకరుడు, శివ నాగయ్య, చిఱు తొండ, నంబి, మహా కాళయ్య, మొరటద వంకయ్య, గోవిందుడు, ఒడయ పిళ్ళై, శ్రీపతి పండితుడు, ఒడయ నంబి, ఉద్భటుడు, అరియను ముసిడి చౌడయ్య, మల్హణుడు మొదలగువారిని ఒక్కొక్క పద్యములో వర్ణించి పాల్కురికి సోమనాథునికి స్ఫూర్తి నొసంగెనని నిర్ధారింపవచ్చును. ఈ భక్తుల చరిత తరువాత అధ్యాయమున వివరింపబడినది.

6. (ఇ) శరణాభ్యుదయము :

వీరశైవులకు కర్మ సంస్కారములు లేవని 93వ ప. పేర్కొనెను. 'భక్తులకు జాతి లేదనియు (121వ ప.) వారిని కష్టములలో నాదుకోవలయుననియు (122వ.ప) వధకు అనర్హులనియు, జాత్యాది సూతకంబులు శివ భృత్యులకు పొందవని తెలిపియున్నాడు. 129వ.ప. శివ భక్తుల కెదురేగియథాశక్తి - - - -స్థితిజేయ వలయునని క్రోడీకరించెను. శివ నిర్మాల్యము మల దేహులకు నిషిద్ధమని 216వ.ప., శివభక్తుడు కాని పతిని త్యజింపవలయుననియు, శివభక్తి గల సతి, యాతని మీఱిచరింపవచ్చుననియు విప్లవము తెచ్చినాడు. 213వ ప. శివభక్తుల కొరకు త్యాగములు చేయ

వచ్చుననియు 278వ ప. వివరించెను. శివ భక్తుల దుర్గుణాలను వెదికేవాడు చండాలుడనియు (286వ ప.) శివ భక్తులు కాని పెద్దలతో సహవాసము చేయకూడదనియు, శివనింద చేయు పుస్తకములను తగుల పెట్టవలయు ననియు మల్లికార్జున పండితారాధ్యులు శాసించి అను శాసించెను'' అని ఆరుద్ర వివరించినారు. (చూ. సమగ్రాంధ్ర సాహిత్యము-సంపుటము 1)

శతకమంతయు తన భక్తితో మేళవించి వ్రాసికొన్న పద్య సంపుటముగా మాత్రమే ఈ గ్రంథమును గ్రహింపవలయును. ఉపమాలంకారములు 140వ ప. కాళిదాస కవితను పోలె హృద్యంగమముగా నున్నవి మోడున బోసెన జలంబులు యుక్తి (154వ ప.) నన్నయ వలె సంస్కృత పద భూయిష్టమైన రచన చేసినను సుబోధకత్వము కలిగి 'శివా, సర్వానందా రుద్రా, హరా, అజాలతో నిండియున్నది.

7. పాల్కురికి సోమనాథుడు (1240-1323) :

తత్త్వ విద్యా కలాప కలితాసారుడు, అన్యవాద కోలాహలుడు, ప్రత్యక్ష భృంగావతారుడు. పాల్కురికి సోమనాథ మహా కవి. ఓరుగల్లు దగ్గర గల పాల్కురికి ఈతని నివాస స్థానము. స్మార్త బ్రాహ్మణుడు రెండవ ప్రతాప రుద్రుని కాలములో జీవించియుండెను. ఇతడు వీరశైవ మతమునకు గురు పీఠము వంటి వాడు. "వీరశైవ మతమును కావ్య రూపములో సుస్థిరము చేయుటలోనేమి, కవితారంగమున క్రొంగ్రొత్త దారులు త్రొక్కుట యందేమి ఇతని కితడే సాటి. మతాభి మానము దేశాభి మానము సంగమించిన ప్రతిభాశాలి"యని తెలియ వచ్చుచున్నది.

"జైన మస్తక విన్యస్త శాతశూల కవిత బిజ్జలతల గుండు గండ, ప్రత్యక్ష భృంగేశావతార, అన్యవాద కోలాహ, తత్త్వ విద్యా కలాప" కవితా సార బిరుద శోభితుండు"- అను బిరుదుల పిడుపర్తి సోమనాథకవి ఉటకించెను (చూ. బసవ పురాణము: 1925 పీఠిక).

"ఇతి వృత్తము కన్నడ దేశీయమై జానుదెనుగులో, ఛందస్సులోని ద్విపద కవితా శాఖకు ప్రథమాచార్యునిగా కీర్తికెక్కెను. 'గోన బుద్ధారెడ్డి ద్వితీయా చార్యుడని', "సామాన్యులకు పఠన పాఠనీయములుగా నుండు

వట్లు రోకటి పాట వలె గాన యోగ్యమయినట్లు గావించె"[14] నని ఆచార్య పింగళి లక్ష్మీకాంతము వీరశైవ కవుల కావ్య లక్షణములను క్రోడీకరించి యున్నారు. ద్విపదవనే సోమనాథుడు ఉదాహరణ ప్రక్రియను గూడ తెనుగున సృజించెను. సంస్కృతమునందు ఉదాహరణమను పేరు కాళిదాసు కాలము నుండి వినవచ్చుచున్నది. రగడలతో కూడిన ఈ ప్రక్రియను సోమనాథుడు సంగీత సాహిత్య కూడలిగా నిర్మించి మత ప్రచారమున కను వగు రీతిగా మలచు కొన్నట్లు తెలియుచున్నది.

పాల్కురికి సోమనాథ మహాకవి తెలుగు, సంస్కృతము, కన్నడ భాషలలో కావ్యముల రచించెను. వీనిని పద్య, ద్విపద, రగడ, మిశ్రమ భాష్య గ్రంథములుగా విభజింపవచ్చును. ఇందులో వస్తువు, భాష, ఛందములు నవ్యతను దృష్టిలో నుంచుకొని గ్రంథములను సమీక్షింప వలసి యున్నది.

అనుభవసారము :

ఇది పాల్కురికి సోమనాథ మహాకవి ప్రప్రథమ రచనము. వీరశైవ మత వ్యాప్తికి తోడ్పడిన పండిత త్రయములోని మల్లికార్జున పండితారాధ్యుని 'శివతత్త్వసారము' ప్రేరణకావచ్చును. అప్పటికింకా బసవేశ్వరుని ప్రభావము కలుగలేదేమో అందుచేతనే బసవన్న ప్రసక్తి ఇందు కన్పించదు. కాని ఆరాధ్య సాంప్రదాయమైన, మార్గ వీరశైవ ప్రవర్తకుడయిన మల్లికార్జున పండితారాధ్యుని ప్రశంస కలదు. మరియు సోమనాథ మహా కవి కవితా గురువు కరస్థలి విశ్వనాథుని స్తుతియు ఇందు గలదు.

ఈ చిన్ని కావ్యమందు 243 పద్యములు కలవు. ఇది గోడగి త్రిపురారి యను భక్తున కంకితము. అద్వైత వేదాంతమున శ్రీ శంకరాచార్యుల వారి 'అపరోక్షానుభూతి' వలె నీ అనుభవ సారము వీరశైవ మతసారమును క్రోడీకరించినది.

సోమనాథ మహాకవి కావ్య ఉద్దేశ్యమును తెలుపుచు
'అనుభవ సారం బనగా

14. ఆచార్య పింగళి లక్ష్మీకాంతము-ఆంధ్రసాహిత్య చరిత్ర (1974 : పుట 110)

మనసిజహరు శుద్ధ భక్తి మార్గము వేదో
క్త విరూఢ ఋరాణ రహ
స్య నియుక్తిని విస్తరియేనది యెట్లనినన్.'
-30వ పద్యము-

మత విషయము :

1. గ్రంథారంభమున శ్రీ గురు, లింగ, జంగమములను స్తుతించి పాశు పతమును, శివుని ప్రాశస్త్యమును ప్రశంసించెను.

2. గురు, గురుస్థల మహత్త్వములు వివరింపబడినవి.

'గురు భక్తి దురిత నాశని-గుణనిధీ'అని
-41వ పద్యము-

వివరించుచు 'గురు హస్తాగ్రితనూజుల దద్గురు రూపముగాఁ దలపిమి గురు పాతక మండ్రు బుధులు గురు భక్త నిధీ' అని 50వ పద్య మకుటమును నిర్వహించి శతక వచనకు నాంది పలికెను.

3. శివ పూజావసర సావధానము లింగ స్థలములో, లింగస్థలము, భక్తుని గొప్పదనము చక్కగా వర్ణింపబడినది. నవ రసములను మేళవించి అద్భుతముగా వర్ణించెను.

"లింగార్చన క్రియా సంగతి శృంగార
రసమును నద్భుత రసము ఁదోప
ననయంబు జంగమార్చన సేయుచో శాంత
రసము భయానక రసము ఁదోప

---

---

జీవరాశి యెడలను కారుణ్య
రనము దోప" -61వ పద్యము-

4. భృత్యాచారమె భక్తియు - - - -ముక్తి పెంపును
పొంపున్-అని సదాచారములలోని భృత్యాచారమును వర్ణించెను.

5. భక్తి భావ క్రియార్చనా విధిని అనుభవపూర్వకముగా వివరించెను. వీరశైవ మతములో అనుభవమునకే ప్రాధాన్యత హెచ్చుయని స్పష్ట పరచెను.

"సాష్టాంగుడయి మ్రొక్కి నానంద జనితాశ్రు
సమితియె పాదమజ్జనము గాగ

---

---

సహజ భక్తి పరుడు జంగమ లింగపూ
జనము సేయనేర్చు సంతతంబు."

-208వ పద్యము

6. పాల్కురికి సోమనాథుడు ఇష్ట లింగార్పణ విధిని వివరించిన తీరు చూడండి.

"ముట్టడ నర్పిత వస్తువు
ముట్టక యర్పింపరాదు మును ముట్టకయున్

-226వ పద్యము

7. షట్స్థల వివరణమును ప్రారంభించి

"సహజ సజ్జన శివాచార నిర్లోభని
యుక్తి జంగమ భక్తి భక్త పదము
— — — — — — లింగైక్య
— — — —మివియ షట్ స్థలంబు లీశ్వరాంశ"

-238వ పద్యము-

అని ఎంతో చక్కగా వివరించెను.

8. శ్రీ గురు లింగ జంగమ విశిష్టయని ఉత్పల మాలతో నారంభించి సద్భక్తి వభలం జదివిన, విన్న, నాసక్తి వ్రాసిన, కవితా విశేషంబుల గారవించినను కరుణించు శివుండని మంగళ మహా శ్రీలతో ముగించెను.

3. బసవ పురాణము :

ఆంధ్ర సాహిత్యములో ప్రప్రథమ పురాణ కావ్యము. అదియు ప్రజా జాతి వృత్తముతో, భాషతో, ఛందముతో విరచింపబడిన ప్రథమ గ్రంథము వీరశైవ మతోద్ధారకుడయిన, అసంఖ్యాక వచన రచనము చేసిన, కర్ణాటక దేశమునకు చెందిన బసవేశ్వరుని చరిత్రను తెలుపుటకు ప్రాకారము చుట్టిన పుష్పరాజము. పూర్వులయిన అరువత్తు మూరు నాయనారుల యొక్కయు,

నూతనులయిన వీరశైవ భక్తుల యొక్కయు, సమ కాలీనులయిన శివ శరణుల కథలను అందిన చరిత్ర పోలిన కథా గ్రంథము. వీరశైవ మత ధర్మములను బోధించుచు పర సమయముల ఖండించిన మత గ్రంథము. "సోమనాథునికి పూర్వమున్న కావ్యములన్నియు సంస్కృత గ్రంథములకు అనువాదములే".

బసవ పురాణమునందు సప్తాశ్వాసములు కలవు, కావ్యము మొత్తములో 12,000 ద్విపదలు కలిగి 586 పుటల వరకు విస్తరించినది. ప్రథమాశ్వాసములో "శ్రీ గురు అని 'భ' గణముతో ప్రారంభించి, కావ్యమును ఆసాంతము వినిన వారికి ఆనంద సిద్ధి, సద్భక్తి వాసన మహిమ, భక్తుల కరుణ, లింగానుభవ నిత్య సుఖము కలుగు నిప్పి తార్థములని భక్తి వ్రాయించి, చదివెడు వారలకు.

"దురితము: లాపదల్ ద్రోహంబులెల్ల
హరియించునని" ఎపరే తమ యింటకేపార నిడికొన్న

నిహపరస్థితి కలుగునని అనుపమంబుగ సప్తమాశ్వాసమయెనని ముగించెను.

ఆశ్వాస ప్రకరణాంతమున ప్రయోగించిన ప్రయోగించిన 'అసంఖ్యాక మాహేశ్వర' అను విశేషణమునకు రెండవ ప్రతాప రుద్ర మహారాజు శ్రీశైల స్వామికి దానమిచ్చిన శాసనములో వాడిన 'అసంఖ్యాక మాహేశ్వ"15 అను విశేషణములు రెండును ఒక్కటియే అని భావిస్తాను. ఈ రెండు విశేషణములు పురాతన, నూతన భక్తులకు సంబంధించనిది. ప్రమథ గణంబుల సంఖ్యాత'యని మల్లికార్జున పండితారాధ్యులు శివతత్త్వ సారములోని 348వ పద్యములో తెలిపెను. అందుచేతనే "పూరాతన నూతన శినిసిద అసంఖ్యాక గణంగళ నామాది ప్రశస్తి సహితం"16 అని తాళికోట శాసనములో నున్నదని డా ఎం. కలబుర్గి తెలియజేయుచున్నారు. భక్తులెల్లరు ప్రమథ గణంబులో జేరినట్లు భావించవచ్చును.

---

15. పోతుకుచ్చి సుబ్రహ్మణ్యశాస్త్రి శ్రీశైల స్థల పురాణము (1978 : పుట 83)

16. డా. ఎం. కలబుర్గి-శాసనగళల్లి శివశరణరు (1978 : పుట 15)

7. (1) ప్రథమాశ్వాసము :

ఇందులో శిలాదుని తపస్సు నందికేశ్వరుని అవతారమునకు కారణమైనది. అట్టి నందికేశ్వరుడు మర్త్యమున వీరశైవ మతోద్ధరణమునకు బసవేశ్వరునిగా జన్మించెను. ఈ సందర్భమున పాల్కురికి వీరశైవ మతమును ఇట్లు నిర్వచించెను.

"ఇది శ్రుతి స్మృతి మూలమిది ధర్మశీల
మిది విమలాచారమిది తత్త్వసార
మిది సుమహత్త్వమిది కవితార్థత్వ
మిదియాది పథమని"

-26 పుట-

తెలిపెను.

2- బసవేశ్వరుడు వడుగు వలదని తండ్రితో వాదించిన ఘట్టములో

"శూలి భక్తులకెత్తు కేలది త్రాటి
మాలల కెత్తుట మఱి తప్పుగాదె"

-41వ పుట-

"అకులస్థుడై యున్న యభవుని భక్తు
నికి నే కులంబని నిర్ణయించెదవు?
కావున నెన్ని మార్గములను వడుగు
గావింపరాదు"

-42వ పుట-

అని ఖండించి తృణీకరించెను.

2. శుభ కార్యములను-అందునా బసవేశ్వరుని పెండ్లి వర్ణించు ఘట్టములో అభిరమ్యమును ప్రదర్శించెను. వీథుల అలంకరణ, కోలాటమును దర్శించి గీతములాలకించండి.

"మకర తోరణములు-మణి తోరణముల కట్టి
వీధుల కస్తూరి యలకుc
డెలిమి ముక్తా ఫలంబుల ముగ్గులిడుడు"

-49వ పు-

"కోలాటమును పాత్రి గొండ్లి పేరణియు
వేణు వీణా వాద్య వితతు మ్రోయగా
ఆనంద గీతంబుల గ్గించు వారు"

—50వ పు.—

4. పాల్కురికి సోమనాథునకు బసవేశ్వరునిపై గల భక్తి తాత్పర్యములు హిమ వన్నగ సన్నిభములు. ఆ పేరు, ఆ ఊరు తలపు లోనికి రాగానే ఆవేశము శివ గంగాఝురిని వస్తురూప నిర్వహణలో గమనించండి.

నారదుడు కైలాసమున కేగుటతో ప్రారంభమై సంగమ దేవుడు బస వేశ్వరునకుఁ బ్రత్యక్ష మగుటతో ముగియును.

7. (2) ద్వితీయా శ్వాసము :

బసవేశ్వరుడు బిజ్జలుని కడ దండనాయకుడైన వివరణ, అల్లమ ప్రభు వృత్తాంతము, బసవేశ్వరుని మహిమను శివుడు పార్వతి కెరింగించుట కలదు

1. కళ్యాణంబునందు బసవేశ్వరుని రాకను పుణ్యాంగనలు పుర వీధులలో నెట్లు దర్శించిరో చూడండి!

''చూడగ వచ్చెద సుదతి ! నేవనుచు
మూకలోనికిఁ బోకు ముగ్ధ నీవనుచు''

—65వ పు.—

కంటినే మోక్షంబుఁ గంటిగా కనుచుకనిరి.

2. వీరశైవుల పదాచార శీల లక్షణములు బసవేశ్వరుని బాసలో

"శివరాత్రి నిత్యంబు చెల్లించు బాస
చీమంతయైన వంచింపని బాస
పరసతిపై దృష్టి పఱపని బాస
పర ధనంబు కాస పడకుండు బాస"

—71వ పు.—

పేర్కొనినాడు.

3. కవి హృదయములో ఒక సంఘటన మథింపబడి చక్కని భావా మృతము ఆవిర్భవించును. భక్తిలో పారవశ్యము చెందే జలమునకు, చిచ్చునకు, గాడ్పునకు వ్యత్యాసము లేక సమత్వమును సిద్ధింప జేసెను.

"వడి బాలు జలమున కొడలెల్ల గాళ్ళు
వడి గాలు చిచ్చున కొడలెల్ల నోళ్ళు
వడి వీచు గాడ్పున కొడ లెల్ల తలలు"
-87వ పు.-

4. సోమనాథ మహాకవి తన అనుభవసారములోని భావములను యథాతథముగా స్వీకరించెను. ఉదాహరణముగా 200వ పద్యమైన మానినీ వృత్త భావమునే

"లింగ గభీరులు లింగ విచారులు లింగ విహారుల్
లింగ మతుల్"-200వ ప.

"లింగ గంభీరులు, లింగా కారణులు''
-బ.పు-2-93 పు-

ప్రమథుల వర్ణనలో వ్యక్తీకరించెను.

5. సోమనాథ మహాకవికి భక్తుల పేర్లను ఎన్ని పర్యాయములు తలచినను తనివితీరదు. అందులోని భక్తులు

"కరికాలుడు, గుమ్మర గుండయ్య
మాకాట కోటయ్య''

ఇత్యాది భక్తులు తర్వాతి ఆశ్వాసములలోఁ గూడ కనిపించెదరు.

6. మరొక ప్రత్యేకత - ప్రతి ఆశ్వాసాంతమున ఒకే విధమయిన పాదములు కలవు.

''ఇది యసంఖ్యాత మహేశ్వర దివ్య
పద పద్మ సౌరభ భ్రమరాయమాణ''

---

---

---

చను బసవ పురాణమందు కథయంది
సను పంచమంబుగ ద్వితీయాశ్వాసము
-121,122వ పుటలు-

ఇటువంటి రచన బోలిన రచన రంగనాథరామాయణములో ''అసమాన లలిత

శబ్దార్థ సంగతుల — — — —సందోహదోహళాచారమైన బరగు"17యని ప్రతికాండాంతము నందును గోచరించును. దాదాపు అన్ని ద్విపద కావ్యములలోను ఇట్టి రచన ఒక సంప్రదాయము కావచ్చును.

7. (3) తృతీయాశ్వాసము :

ఇందు బసవని కథ కొద్దిగాను, సూర్యాస్తమయ చంద్రోదయ వర్ణన, పురాతన నూతన సమకాలీన భక్తుల కథలు కొన్ని గలవు.

1. బసవని భక్తి తేజమునకు సూర్యుడు సిగ్గుపడి

"బసవని భక్తి ప్రభాపటలంబు
దెసల వసుంధర దివి దీటు కొనగ
దినకరుడాత్మ తేజంబు దఱుగు
డునుమది లజ్జించి చని యపరాబ్ధిఁ
బడియెనో యన్నట్లు భానుండు గ్రుంకె''

—131వ పు.—

అస్తమించెనట. దీనితో బసవనిపైగల భక్తి అపారమని తెలియనగును.

2. జాన పదుల ఇండ్లలో తల్లి పాపను కంటికి రెప్పలాగా రక్షించుకొనును. బెజ్జమహాదేవి కథలో బెజ్జమహాదేవి పాలు త్రాగని కొడుకుతో

"నా కుఱ్ఱ? చన్నేల రాకుడ్వ వైతి
నీ చెమటయుఁజూచి సెత్తురు నవుదు''

—156వ పు.—

అని అన్నపుడెంతటి అద్భుత భావము!

3. శ్రీశైల క్షేత్రమును వర్ణించుటలో పాల్కురికి సోమనాథ మహాకవి విచిత్ర రూప సృష్ట-ప్రత్యగాత్మ స్పర్శ వేదులను, బిల్వవనమును, రుద్రాక్ష లింగ జంగమ, గాయకులను నాట్యహర్మ్యముల, ఖగముల, సూకరములు ప్రకృతిలోనున్నవి.

"రుద్రాక్ష శైలముల్ రుద్రాక్షతరులు

—211వ పు.—

17. రంగనాథుడు-శ్రీరంగనాథ రామాయణము (1968 : పుటలు 76,77)

గాయక గుల్మముల్, గాయకలతలు
–212వ పు.–

నాట్య మృగంబులు, నాట్యపక్షులును
నీడలు తిరుగని నిత్య వృక్షములు
–213వ పు.–

ఆకృజంబగు గడియార వృక్షములు
–214వ పు.–

చాల చిత్రమైనవి.

7. (4) చతుర్థాశ్వాసము :

ఇందు మడివాలు మాచయ్య కథతో పాటు తేడర దాసయ్య, శంకర దాసి, సిరియాళుడు, హలాయుధుడు, మరికొందరు భక్తుల కథలు కలవు.

1. మడివాలు మాచయ్య సద్భక్త, సంఘము యొక్క మాసిన వస్త్రముల ఉతుకుచు సత్య శుద్ధ కాయకమును నిర్వహించుచుండెను. మాచయ్య మహిమను గాంచి బిజ్జలుడు భయంపడి బసవన్న తోడుంగ వెళ్ళెను. అప్పుడు బసవన్న మాచయ్యతో బిజ్జలుని క్షమించి రక్షింపుమని కోరెడు ఘట్టములో

"అక్కడ సాష్టాంగుడై యున్నాడు
పక్షికి దొడనేల పాశుపతంబు?"
–251వ పు.–

పక్షిపై పాశు పతాస్త్రమును ప్రయోగింపవలదనెను. ఆనాడు ఒక ప్రధాన మంత్రి ఒక సామాన్యమైన శివశరణునకు విన్నవించుటలోని అంతర్థాము సమతా దృక్పథమే.

2. మొదటి సారిగా శంకరదాసీ కథలో పాల్కురికి సోమనాథ మహాకవి 'కాయక లబ్ధి' అను మటాను ప్రయోగించెను.

3. సిరియాళుని కథలో సహజత్వముట్టిపడుచున్నది. సిరియాళుని భక్తికి మెచ్చి శివుడు

"అలరి చందన నంగ నాప్త వర్ధంబు
నల తిరు వెంగాణి నంగఁదత్పఖుల

— — — — గంచేడు వాడలు గైలాసమునకుఁ
గొని పోయె"

-275వ పు.-

7. (5) పంచ మాశ్వాసము :

ఇందులో కన్నడ బ్రహ్మయ్య, మోళిగ మారయ్య ఇత్యాది భక్తుల కథలు గలవు. బసవేశ్వరుని కథ కొలదిగా నున్నది.

1. "తనకాద్రి యరయునే కాకి గుణంబు
నిమ్ముల గుణ మరయునే పరుసంబు"

-360వ పు.-

బసవయ్య మారయ్య భక్తికి మెచ్చి సంతోషించిన సందర్భములో పాల్కురికి సోమనాథుడు చక్కని ఉపమల అలంకరించెను.

2. కన్నడ బ్రహ్మయ్య కథలో బ్రహ్మయ్య ఒక భక్తుని గృహములో దొంగ తనము జేసెడివాడు కాడు. పిసినారుల ఇండ్లలో దొంగిలించి తెచ్చిన ధనముతో జంగమ సమారాధన జేయుచుండెను. ఒక పర్యాయము బిజ్జలుని భండారమునకు కన్నము వేయుగా భక్తి మహిమతో

"ముట్టిన త్రివ్విన మెట్టిన రావు
పట్టిన కైదువుల్వసిడి మ్మయంబు"

—367వ పు.—

అయ్యెను

7. (6) షష్టాశ్వాసము :

ఇందులో బసవన్న కథ స్వల్పమును కానరాదు. ఏ కాంతరామయ్య పైజకవ్వ, తెడర దాసిమయ్య, శివలెంక మాచయ్య కథలు గలవు.

1. ఏకాంత రామయ్య వీరశైవ మతము నుద్ధరించిన ప్రథమ విప్లవ వాదియని, మిగుల ప్రతాపుడని తెలియవచ్చుచున్నది.

"సమయ కోలాహలు దమిత జైన ప్రతాపి
యతులిఁ శివ సమయ ప్రతిపాలుఁ
డతిశయ వీరభద్రావ తారుడని"

-399వ పు-

2. శివలెంక మంచయ్య వీరశైవ పండిత త్రియములో ద్వితీయుడు,' ఏక ఏవ రుద్రో' "ఏకోరుద్ర ఉచ్యతే"యని వీరశైవమును నుగ్గడించుచు వైష్ణవ మతమునుఖండించి కాశిలో విష్ణువుచే శివునకు నమస్కరింపజేసెను. ఇటువంటి శ్రుతి వాక్యములు సోమనాథ మహాకవి పాండిత్యమునకు నికషోపలములు.

7. (7) సప్తమాశ్వాసము :

ఇయ్యది చివరి ఆశ్వాసము. ఇందు శివనాగుమయ్య, ఉద్భటుడు మొదలగు వారి కథలతో బాటు బసవన్న విషమారగించి సంగమేశ్వరమున కేగుట, జగదేవ దండనాయకుడు అల్లయ్య మధువయ్యలు బిజ్జలుని సంహరించుటతో బసవ పురాణము ముగియును.

1. శివనాగుమయ్య కథలో బ్రాహ్మణ వర్గమును ఏ విధముగా దూషించెనో గమనింపుడు.

"మాలల యీ బ్రాటి మాలల వచ్చి
మాలల మాటలు వోయినే వినగ''

—494వ పు.—

2. బసవన్న విషమారగించు ఘట్టములో అటనట నీతులు పొందు పరచబడినవి.

''పోల దుర్జన తోడి పొందున కంటె
జాల మేలండ్రు సజ్జన విరోధంబు''

—559వ పు.—

''జాను తెనుగును స్వీకరించి దేశీయ ఛందస్సు నాదరించి చరిత్రక వ్యక్తుల కథలను స్వీకరించి నాడే ప్రజా ఉద్యమానికి శ్రీకారముచుట్టాడని''18 ముదిగొండ వీరభద్రశాస్త్రి వివరించారు.

వృషాధిప శతకము :

శతక సాహిత్య ప్రక్రియలో మల్లికార్జున పండితారాధ్యుని 'శ్రీగిరి మల్లికార్జున' మకుటముతో నొక శతకమును రచించెను. కాని నేడ దలభ్యమగుటచే 'బసవా! బసవా! బసవా! వృషాధిపా!' అను మకుటముతో రచంచిన

18. కె.కె. రంగనాథాచార్యులు (సం) తెలుగు సాహిత్యం-మరోచూపు (1981 : పుట 42)

'వృషభాధి శతకమే మొట్ట మొదటిగా సెన్నదగినది. ఇది చంపకోత్పల మాలా వృత్తములలో రచించిన 108 పద్యములును, చివర చెప్పబడిన ఫల శ్రుతి పద్యములతో కలిపి మొత్తము 109 పద్యములు కలవు. ఇందలి శైలి సరళముగానున్నను, అటనట క్లిష్టమైన సంస్కృత పదములున్నవి. నామ, గుణ, స్తుతులను పాటించెను.

టీకతో 50 పుటల లఘు కావ్యము అమూల్యము. శతకము 'శ్రీగురు లింగమూర్తి సవిశేష మహోజ్వల కీర్తి సత్క్రియో' అని ఉత్పల మాలతో ప్రారంభమయినది. వీరశైవులు ఉత్పల మాలను అభిమానింతురు.

(ఎ) జంగమ భక్తి :

పాల్కురికి సోమనాథ మహాకవి జంగమ భక్తి వివరించుచు
"జంగమానక్త, 4ప., జంగమక్షేత్ర 5 ప.
జంగమ సమక్షము 6 ప., జంగమ ప్రాణ 10 ప.
జంగమోత్సంగ 12 ప. జంగమ వితాన దయా
విహితావ గాహయని-14 ప.
బసవేశ్వరుని ప్రస్తుతించెను.

(బి) లింగ భక్తి :

సోమనాథ మహాకవి లింగ భక్తిని వర్ణించెను. వీరశైవ మత అష్టా వరణములలోని తృతీయావరణము.

'లింగ నిరూఢ 42 ప , లింగమూర్తి 47 ప. యని బసవేశ్వరుని శరణు వేడెను.

(సి) బసవ భక్తి :

బసవేశ్వరునిపైగల అపార భక్తితో పారవశ్యము చెంది పాల్కురికి పలు భాషలయందు ప్రస్తుతించెను.

'ఖ్యాత యశః ప్రపూరిత జగత్త్రితయాయనమో నమోమహా పాతక'యని సంస్కృతములోను -50 ప.
"పరమనెయన్నె యాండవనె పన్నగ తాసె యనాథ నాథనే'
యని తమిళములోను -56 ప.
'హసులెయ యెన్న రక్షిసువుదారయ దెన్నవ నీత

నెందుమ,- - - - - - - - - న్ని సువుదు'యని
కన్నడ భాషలోను -57 వ.
'దేవ పరా తుమ్హీచ గురుదేవ ప్రాణానుత్తరీ
తుమ్హీచగో'అని మహారాష్ట్రములోను 581 వ. మణి ప్రవాళములోను
ప్రస్తుతించెను.

## (డి) భక్త రక్షణము :

వీరశైవ మతమున పంచాచారములు కలవు. అందు భక్త రక్షణ ప్రధానము. ఇందు జొన్నల రాశి ముత్యములైన కథ-(67వ పు.) గొల్లెత కథ (68వ ప.) మిండ జంగమయ్య బసవేశ్వరుని భార్య గంగాంబ పట్టు చీర కోరిన కథ (69వ ప.), సిద్ధరాముడు శివుని హృదయమున బసవేశ్వరుని గాంచుట (70వ ప.), అంత్యజుడైన శివనాగుమయ్యా హస్తమును బసవేశ్వరుడు పట్టి అమృత ధారలు ప్రవహింపజేసిన కథ (71వ వ.) బసవేశ్వరుడు బిజ్జలరాజు బొక్కసమును ఖాళీచేసెనని కొండెములు చెప్పుట (72వ వ.) బసవేశ్వరుని యోగనిద్ర (73వ ప.), బసవేశ్వరుని మూడవ కన్ను ఇమ్మని చెప్పుట (74వ ప.), బసవేశ్వరుడు భార్య చెవి కమ్మను దానమిమ్మని చెప్పుట (75వవ.), బోయవాండ్రు శివ ప్రసాదమును భుజించుట (76వప.) శివుడు హాలాహలమును త్రాగుట (77వప.) బసవేశ్వరుడు నిత్యమును 1,96,000 జంగమములకు గణార్చన చేసిన కథ (78వ ప.) మడివాలు మాచయ్య కథ (79వ ప.) శంకర దాసిమయ్య పరమత దేవతా విగ్రహముల భస్మము చేయుట (80వ ప.), సకలేశ్వర మాదిరాజు కాలవాదమును ఖండించుట (81వ వ.) కిన్నెర బ్రహ్మయ గొటియ కథ (82వ ప.) కక్కయ్య (83ప ప.) బాచిరాజు (84వ ప.), అల్లమ ప్రభువు జంగముల కొరకు వండిన పదార్థమంతయు నారగించుట (85వ ప.), మాదర చెన్నయ్య అంబలిని శివుడు త్రాగుట (86వ ప.) మోళిగ మారయ్య కథ (87వ ప), కలకేతు బ్రహ్మయ్య కథ (88వ ప), ముసిడగ చౌడయ్య కథ (89వ ప) కన్నడ బ్రహ్మయ్య కథ (90వ వ) బిబ్బ బాచయ్య (91వ ప) సుంకరి బంకయ్య (92వ వ), తెలుగు జొమ్మయ్య (93వ ప), చెన్న బసవేశ్వరుడు (94వ ప) సురియ చౌడయ్య (95వ ప.), చొప్పయ్య (96వ ప.) మొటుడ వంకయ్య (97వ ప.)

కల్లి దేవయ్య (98వ ప) హలాయుధుని కథ (99వ ప.) అరియమ రాజు (100వ ప.), పండితుని కథ (101వ ప.)లు కలవు.

ఫలశ్రుతిలో 'పఠించువారికి, వినువారికిన్ గలుగు శ్రీయును వాయువు భక్తి ముక్తియున్"యని వివరించెను.

ఇట్లు, శతక ప్రక్రియను ప్రవేశపెట్టి ప్రజలలోని మరికొందరిని ఆకర్షించెను. బసవ పురాణములోని భక్తుల కథలను పునః పునః ప్రజా బాహుళ్యమునకు చేరవగునట్లును, అవి వారి హృదయాలలో చెరగని ముద్రను వేయుటకు-అనగా వీరశైవ మతము యొక్క వ్యాప్తికి లక్షణ, లక్ష్యములు కలిగి కంఠస్థము చేయుటకు అనువుగా నుండునట్లు పాల్కురికి సోమనాథ మహాకవి ప్రయత్నము జేసెను.

<u>చతుర్వేదసారము :</u>

ఇదియును శ్రీ పాల్కురికి సోమనాథ మహాకవి అనుభవసారము వంటి కావ్యము. చతుర్వేదసారములో 'వీర మాహేశ్వర మత సిద్ధాంత నిరూపణమును' మరియు శివుడు పరదైవమని స్థాపించుటయును గలదు. బసవ లింగయను మకుటముతో 18 పద్యములు రచింపబడినవి. 'హరదత్తాచార్యుడు, రచించిన చతుర్వేద తాత్పర్య దీపిక కొంత వరకు మార్గదర్శకము కావచ్చును. తాళ పత్రములలో 350, 357 పద్యముల వరకు యున్నవి ముద్రిత ప్రతిలో 301 పద్యములు మాత్రమే కలవు. దీనికి కృతి భర్త మరియు శ్రోత బసవన్నయే. అనుభవసారమున గోడగె త్రిపురారినిని, ఇందులో బసవన్నను శ్రోతలుగా ప్రవేశపెట్టుట నూతన సాంప్రదాయమునకు నాంది పల్కెను. రాజు, మంత్రులు, విద్యా పరీక్ష, అధికారులు లేరు కాబట్టి సంభవించినది. ఇది స్తవ రూపమైన ప్రబంధము. పాల్కురికి సోమనాథ మహాకవి పశుపతి శబ్దము, ఓం నమః శబ్దము, వృషభ శబ్దముల నుండి బసవ శబ్ద యుత్పత్తిని సాధించెను.

<u>ఎ. శివ లింగ భక్తి :</u>

లింగాయతుడు శివ లింగము ధరించుట ప్రథమ ధర్మము. అందు చేతనే

'బిడ్డల కిడెడు పేర్మెంత యనుచునీ
పేరు నాలింగంబు నార
వోలి నా బొమ్మున మాలిమి నుండిన

దైవ మనుచు నిన్ను దాల్చినాడు'.

-191వ వ.-

బి. పాల్కురికి సోమనాథ మహాకవి శ్రీశైలమున నివసించియుండెను అందుచేతనే శ్రీ పర్వతము పేరు చెప్పగనే పాల్కురికి మనసు కృష్ణాతరంగ అంతరంగమగును. శ్రీ పర్వతమున కుత్తరపు దిశగా "బసవ పురస్థాప్య పర్వతోత్తర ముఖసీతుండు పాల్కురికి సోముడవగ" వర్ధిల్లెను.

సి. పాల్కురికి వీర మాహేశ్వర మత లక్షణమును నిర్వచించెను.

'వర వీర భక్తి సవైదికంబుగను
విరచించితివి చతుర్వేదసారమున'అని పండితారాధ్య చరిత్రలో భక్తులన్నట్లు కవి చెప్పుకొనెను.

డి. శివానుభవ సూత్రాది కొన్ని సందర్భములందు సూక్ష్మ విషయ వర్ణనలలోను నాతని స్వీయానుభవము కవితా యుక్తి ప్రకటితమయి ఉత్తమ కావ్యముగా జేసినది.

పండితారాధ్య చరిత్ర :

ఇది అపురూప దివ్య, ద్విపద కావ్యము. సాహిత్యములో ఈ చరిత్ర ప్రక్రియ ప్రప్రథమమైన ప్రబంధము. పాల్కురికి సోమనాథుని యొక్క ద్వితీయమైన అద్వితీయ కావ్యము. అమూల్యమయిన, విపులమయిన డా॥ చిలుకూరి నారాయణరావు గారి పీఠికతో లభించు అరుదైన కావ్యము. ఇందు గల కవితా వస్తువు "శీల సౌభాగ్యము భక్తి సంపత్తి నిండారిన దండి భక్తుల సామాన్య జీవిత ఘట్టములే గలవు. కథా చరిత్ర పురుషునకు సంబంధించినది. దీనికి ఏ సంస్కృత కావ్యము మూలము కాదు. సర్వ స్వతంత్ర గ్రంథము. అంతేగాక భిన్నత్వములో ఏకత్వము గలదు. సోమనాథ మహాకవి యొక్క పండితారాధ్య చరిత్ర తొలి విజ్ఞాన సర్వస్వము ఇతని సాటిరాగలవారు అచార్య హేమేంద్రులే.

ఇట్లు ఛందమున నేమి, బంధమున నేమి భావమున నేమి, సంభావ్యాను భవమున నేమి, దీనికి చివరకు మహైశ్వర్యమున నేమి బసవ పురాణమునకు దీటైన పురాణము తెనుగున లేదని చెప్పక తప్పదు. పండితారాధ్య, చరిత్రము ఇతిహాసముగా, బసవ పురాణము సర్వదేశి పురాణ భక్తి కథా

ష్ఠూలమ్ముగు నొక ఆది పురాణముగా సృష్టించి పాల్కురికి సోమనాథ మహాకవి తెమగు నాటపారాశర్యుడయ్యెను"19నని మూలంపల్లిచంద్రశేఖరశర్మ ఉద్ఘాటించినారు.

భారత ఖండము :

మహాకవి తిక్కన యొక్క మహాభారతమును సోమనాథ మహాకవి పఠించియుండవచ్చును. అందువేతనే

"హరి హరుడను శబ్దార్థ మెర్గమని"
-బసవ పురాణము-సప్తము-522 పుట.
హరిహరు డొక్కడేయని వల్కనిట''
-పండితారాధ్య చరిత్ర-
వాద ప్రకరణము-676 పుట.

'నోరి కొలంటిని నిను ప్రస్తుతింతు'నని పేర్కొనినాడు. పైన పేర్కొనిన హరి హరుడను శబ్దములను బట్టి తిక్కన భారత రచన తర్వాత క్రీ.శ. 1280-1340 ప్రాంతమున పాల్కురికి సోమనాథ మహాకవి జీవించియుండు"నని తిమ్మావజ్ఝల కోదండ రామయ్య అభిప్రాయము. (చూ. పండితారాధ్య చరిత్ర 1974 : పీఠిక)

ఈ కావ్యమున ఐదు ప్రకరణములు కలవు. అవి 1. దీక్షా 2. పురాతన 3. వాద, 4. మహిమ, 5. పర్వత ప్రకరణములు. మొత్తము ద్విపదల సంఖ్య అసంఖ్యాతము.

పై ప్రకరణములలో మల్లికార్జున పండితారాధ్యుల చరిత్ర, బసవేశ్వరుని చరిత్ర మరియు పురాతన, నూతన భక్తుల కథలు కలవు.

దీక్షా ప్రకరణము :

బసవ పురాణమును ఆశ్వాసములుగా విభజించి, చరిత్ర కావున ప్రకరణములుగా విగడించెను. అందులోను పండిత త్రియములో ఒకరు కావున చరిత్రయని పేర్కొనుట పబబుగానున్నది. మరియు మల్లికార్జున పండితా

19. మూలంపల్లి చంద్రశేఖర శర్మ-(వ్యాసము) తెలుగులో పరిశోధన (1983 : పుట 102)

రాధ్యుల వారు మన ఆంధ్రుడగుట విశేషము. ఈ కావ్యమును పాండిత్య పరిపాకములో రచించెను.

ఎ. భక్త ప్రశస్తి :

కృతి పతి నిరూపణములో 'బసవ దండనాయకుని జావొంద మత్కృతి స్వామి గావించి నుత పురాతన భక్త నూతన వితతి లింగంబుగా వీక్షించి కొలిచి'యని భక్త ప్రార్థన గావించి, కృతిపతి ఫలితముగా-ఖండితైశ్వర్య ప్రకాశ దనరుగా జెప్పి గురుస్తోత్రములో చెన్న మల్లికార్జునునకు పండితయ్యకు అభేదమును కల్పించి భక్త ప్రశంసలో-శ్రీ పర్వత క్షేత్రవాసులను తెలిసి, భక్తానుగ్రహణముతో 'నిజాపాంగ హర్షాశ్రు కణంబుల రాఁ "గురు మల్లికార్జున పండితారాధ్యుల చరిత్ర మర్థి వర్ణింపు"మని భక్తులు కోరగా ప్రబంధ కృతి స్వీకారము జేసి, "బసవ శోత్రుడనని, పాల్కురికి సోమనాథుడని-కవీశ్వర నామంబు ప్రకటించె శోత్రగా సురార్యను గావించెను కావ్యకథాను క్రమణిక, కుకవి నింద ఇత్యాది మర్యాదలను జేర్చి రచనకు గడంగెను.

బి. భక్తులు :

సోమనాథ మహాకవి విభూతి, రుద్రాక్ష, పాదోదక, లింగార్చన, లింగ ధారణ, ప్రసాద స్వీకార మహిమలను వివరించెను. ఇది శ్రీపతి పండితారాధ్యుల శ్రీకర భాష్యమును బోలియున్నది. ఘంటా కర్ణుడు మొదలగు భక్తుల కథలు గలవు. ప్రకరణాంతమున ద్విపదలు బసవ పురాణములోని ఆశ్వాసాంత ద్విపదలను తలపించుచున్నవి.

పురాతన ప్రకరణము :

పండితయ్య కథతో బాటు నాయనారుల కథలు గలవు.

ఎ. నాయనారుల దీక్ష :

పండితయ్య లింగావసర వేళ పుష్పములతో పూజించెను. పాల్కురికి సోమనాథునకు పుష్పములపైగల అపార ప్రేమను చాటుచున్నది.

"కల వీర పుష్పముల్, చేవంతి, విరజాజులు
మల్లికా పుష్పముల్, మారేడు పత్త్రి"

-మొదటి భాగము-263 పుట-

ఇత్యాదులు కలవు.

బి. దసరయ గారు :

పాల్కురికి సోమనాథ మహాకవికి భక్తులపై గల గౌరవాభిమానముల పారము. అందుచేతనే 'దసరయగారు' అని సంబోధించెను. ఇదే విధముగా బసవ పురాణములో భక్తులను గౌరవముగా 'గారు' అని సంబోధించెను.

సి. గురు భక్తి :

సోమనాథ మహాకవి గురు భక్తి యొక్క తీరును గమనించండి!

"గురు భక్తి యఘ పయోధర మారుతంబు
గురు భక్తి మదవన స్ఫూరిత దావాగ్ని

---

---

గురు భక్తి భవ గజ క్రూర సింహంబు"

—మొదటి భాగము-319 పు.-

వాద ప్రకరణము :

పాల్కురికి సోమనాథ మహాకవి వృద్ధాప్యములో గూడ పర సమయముల తీవ్రముగా ఖండించెను. వీరశైవ మతోద్ధరణ జీవిత ధ్యేయముగా భావించెను. దీనిని వాద ప్రకరణమనుటతో పాటు 'వాదసారము'ను ప్రత్యేక గ్రంథముగా భావింపవచ్చును. ఇందు వేద, కర్మ, కాల, వేదాంత, సాంఖ్యయోగ, చార్వాక, బౌద్ధ, జైన వాదముల నిరసించుట సంభవించినది.

ఎ. వేద వాద నిరసన :

వేద వాద నిరసనములో పాల్కురికి సోమనాథుడెంతటి తీవ్ర స్థాయి జేరెనో పరిశీలించండి.

'వేదంబు దైవ మేనియును
జెప్పుమా తను బ్రహ్మ శిరము గోల్పడునే?
తప్పేమి?"

"జెప్పు మా కుక్కలై శివుని పెన్కఁ జనునె?"

—మొదటి భాగము-537వ పు.-

వాదించు సందర్భములో ప్రతి వాదమును పూర్తిగా నిరసించి, తర్వాతి వాదమును తదనుగుణముగా

'కాల వాదివ, యెన్నగా నీ మతంబు''అని ప్రారంభించును-

-మొదటి భాగము-549-పు.-

బి. శివశక్తి :

శివుని గరళ ధారణము, దక్షాధ్వర ధ్వంసము, మహాతాండవ లీలలు వర్ణింపబడినవి.

మహిమ ప్రకరణము :

ఎ. శివ మహిమ :

ఇందు దేమయ, దేవయలు బౌద్ధుని సంహరించుట, గణ మాలిక, రుద్ర గణ సంకీర్తనము, బసవేశ్వరుడు కప్పడి సంగమేశ్వర గర్భమును జొచ్చుట ఇత్యాది ఘట్టములు గలవు.

"అభవుదలంచిన యాశ్వేతమునియు
నభవు దలంపని యద్వైత మునులుఁ
బరమేశు గొలిచిన బాణాసురుండుఁ
బరమేశుఁ గొలువని బ్రహ్మసుతుండు.''

-రెండవ భాగము-42 పు.-

బి. గణ మహిమ :

సోమనాథ మహాకవి ఆంధ్ర సాహిత్యములో ప్రథమముగా గణ మాలిక వర్ణన గావించెను. వీరభద్రునితో పాటు

"కర్ణ ఘంటా కర్ణ గజకర్ణ శంఖ-
కర్ణ ద్వికర్ణ, త్రికర్ణ సహస్ర''

-రెండవ భాగము-72 పు.-

కర్ణ ఇత్యాదుల వారును, శార్దూల ముఖ, సింహ ముఖముల వారును యుండిరి.

సి. కీర్తన :

పాల్కురికి సోమనాథుడు శివభక్తులను యెన్ని వర్యాయములో

కీర్తించెను. వారిని బసవపురాణములో వలె పండితారాధ్య చరిత్రలోను కీర్తించెను. యోగాచార్య గణ సంకీర్తనములో

"తిరునీల కంఠుడు దిరు వక్క
తిరు మూల దేవండు దిరునాళ్ళ బోవ
__________________________
__________________________
గన్నప్ప తాపసి గరయూరి చోడు"లని
—రెండవ భాగము 82 పుట—

వర్ణించినాడు. ఈ సంవర్తన ప్రక్రియకు సోమనాథ మహాకవియే ఆద్యుడు.

పర్వత ప్రకరణము :

పాల్కురికి సోమనాథ మహాకవి దీని నొక ప్రకరణముగా రచించినను, స్వతంత్ర కావ్యముగా మండనోపును. దీనిని పరుస ప్రకరణమనినను తప్పులేదు.

ఇందు పండితయ్య పర్వత దర్శనము, గౌత మాది ముని కృత శ్రీగిరి ప్రశంస, పరుస నడ కల-జంగమ, విరక్తుల, శివయోగుల, జోగుల నడ కలతో బాటు కన్నడ, ఆరవదేశ పరుసలు, మృగవ్యాధునికథ, ఆట పాటలు, భరత శాస్త్ర, లక్షణములు విపులముగా వర్ణింపబడినవి.

ఎ. సంకీర్తన :

శ్రీ పర్వతోత్పత్తి సంకీర్తన కథనములో గేయ రచనకు అనాడే సోమ నాథ మహాకవి బీజ వ్యాపనము గావించెను. పర్వతుని తపస్సు మెచ్చుకొని శివుడు ప్రత్యక్షమై నిలిచి

"__________________________ నీకును గ్రహము
గావింతు గావింతు గావింతు గరుణ
భావింతు భావింతు భావింతు నిన్ను"
—రెండవ భాగము-259 పు.—

బి. చెంచు గుణములు :

సోమనాథ మహాకవి ఒక విషయమును వర్ణించునెడ సామాన్య అంశ ములను మాన్యములుగా భావించి వివరించును. చెంచు ధర్మాత్ముల

నడకలలో వారి ధర్మ గుణమును పరిశీలించండి!

"                                                  విసన కఱ్ఱలును
-----------------------------------------
గంధంబు చిప్పలుఁ గరవడంబులును
గంధంబు చెక్కలుఁ గప్పడంబులును
మఱియును నుచితాభిమత పదార్థములు ।"
బెఱుకల కావళ్ళఁ బెంపారఁ (దె) చ్చి"
—రెండవ భాగము-351 పుట..

అడిగిన చోట నడిగిన వారికి అడిగిన వస్తువుల నర్థినిచ్చుచుండిరట.

Thus "Palkuriki Somana has declared in the introduction to his works than he under took to write in Janu Tenugu and Dwipada metre. Because the Sanskrit style adopted by the Champu writers could not easily be under stood by the general masses" యనికోరాడా రామకృష్ణయ్య వివరించినారు.

8. యథావాక్కుల అన్నమయ్య (1280-1340 )

భక్తిరస ప్రధానమయిన, వీరశైవ మత సంప్రదాయానుసారియగు సర్వేశ్వర శతకమును యథావాక్కుల అన్నమయ్య అను వీరశైవ కవి రచించెను. దీనిని రచన కాలము క్రీ.శ. 1300వ సం॥ యుండనోవును. సుప్రసిద్ధ వీరశైవకవి సార్వభౌముడగు పాల్కురికి సోమనాథుని గ్రంథము నుండియే ఈతడు తన భావములను గ్రహించినట్లు విశదమగును.

అన్నమయ్య ఆరాధ్య బ్రాహ్మణుడు. ఆత్రేయస గోత్రుడు యజుర్వేద శాఖాధ్యాయి. ప్రారంభమున గోదావరి తీరముననున్న పట్టెవ గ్రామమున వీరభద్రస్వామిని సేవించుచుండెను. ఇతడు ఒక రాత్రికి శ్రీశైల యాత్రకు వెడలి మల్లికార్జునస్వామిని సేవించితిరిగి, వచ్చుచు వల్నాటి సీమలో జెట్టి పాలెము దాపున కృష్ణా తీరమందు విశ్వామిత్ర ఆశ్రమమగు సత్రశాలయను పుణ్య స్థలమున శ్రీ మల్లేశ్వరస్వామిని సేవించుచు, అచటనే కొంతకాలముండి

---

20. డా॥ నేలటూరి వేంకట రమణయ్య-వాఙ్మయ వ్యాస మంజరి (1967 : పుట 60)

ఈ సర్వేశ్వర శతకమును రచించియుండును. అన్నమయ్య సోమనాథుని అపరవయస్సులో బాలుడై యుండవచ్చును. కవియే తన గ్రంథమును 'స్తవముగానే పరిశీలింపవలయు'నని కోరెను. తెలుగు శతక కర్తలు మకుట నియమమే తప్ప సంఖ్యా నియమమును పాటింపలేదు. కాని ఒక్క వ్రిసన్న రాఘవములో మాత్రము 200 పద్యములున్నవి. అన్నమయ్య మాటలలోనే

"దాత్రిన్ భక్త జనానురంజకముగాఁ దత్త్వప్రకాశంబుగాఁ
జిత్రార్థాంచిత శబ్ద బంధురముగాఁ సేవ్యంబుఁగా సజ్జన
స్తోత్ర నందముగా శంఖాన్వితంబుగా శోధించి సర్వేశ్వర
స్తోత్రంబన్నయ చెప్పె"

—138 ప.—

సర్వేశ్వర శతకము :

త్రిమూర్తులలో నొకడు, శైవ మత వ్యాపకుడు, సర్వలోకేశ్వరుడైన వాడు, మహేశ్వరుడు-లింగాకార స్వరూపము. అందుచే నిందలి పద్యములు మత్తేభ, శార్దూల వృత్తములలో నడచినవి. ఇందలి పద్యముల సంఖ్య139. చివరి ఐదు పద్యములు శివ సంబంధి కావు. గ్రంథము యొక్క పుటల సంఖ్య 24. పీఠికతో కూడు కొనియున్నది.

"శ్రీ కంఠుం బరమేశు నవ్యయు నిజశ్రీ పాద దివ్య ప్రభా
— — — — — — — — — నిన్ను మదినాహ్లాదింతు— — — —"

అని శార్దూలముతో ప్రారంభించి

"— — — — — — — — — ప్రాకామ్యస్తవ మొప్పఁ జెప్పె — — —
శ్రీకారాధనమై వసుంధర వయింజెన్నొంద సర్వేశ్వరా"

యని ముగించెను.

ఎ. మత విషయము :

1. వీరశైవ ధర్మములో పాదోదకము పవిత్రమైనదని వర్ణించుచు "పలు తీర్థంబులఁ గ్రుంకు కంటె మహిలో భక్తాంఘ్రి పానీయముల్ తలమీదజింకించు కోదగున్"

—23 ప.—

యని మహిమను ఉద్ఘాటించెను.

2. శివ భక్తుల శక్తి మహాత్మ్యమును తెలుపు సందర్భములో
"కరుణం జేకొని రేని రౌరవ పద గ్రస్తాత్ము దేవేంద్రుఁగాఁ
బరగం జేయుదు, రాత్మలో"

—36 ప.—

అని వర్ణించెను.

3. అన్నమయ్య వీరశైవమతము యొక్క ముఖ్య లక్షణమైన అద్వైత తత్త్వమును
"అమరన్-భక్తులకెల్ల నీవ హృదయంబై యుండుట న్వారి,
సౌఖ్యము నీ సౌఖ్యము
వారి కూర్మియు సమగ్రంబైన నీ కూర్మిత"

—40 ప.—

యని జీవునకు, దేవునకు భేదము లేదని వక్కాణించెను.

4. యథావాక్కుల అన్నమయ్య గొప్ప శివయోగిగా తలంపనగును.
"చెదరంబాఱు దళ వ్రిభంజనములన్ శిక్షన్ సుషుమ్నంబునం
గుదియం బట్టి చరింపకుండ శశివర్కుం గట్టి - - - -
రసాబ్ధిఁ దేలునని"

—48 ప.—

విశద పరచెను.

5. ఈ వీరశైవకవి అష్టా వరణములలోని లింగారాధనము, జంగ మార్చన తత్త్వము తెలుపుచు
"లింగారాధన జంగ మార్చనములోలిన్ భక్తి కంగంబు పొ
ణాంగ వ్యాప్తియునై స్ఫురించు"

—64 ప.—

ననియు వివరించెను.

6. యథావాక్కుల అన్నమయ్య పంచాక్షరీ మంత్ర మహాత్మ్యమును వివరించుచు
"భవ దుఃఖాంబుధి దాట జూచు తఱిఁ దత్పం చాక్షరీ మంత్రము
త్సవ లీలం గడు శుద్ధుడై జపము వాంఛంజేయు"

—116 ప.—

వానికి సౌభాగ్యము కలుగునని విశద పరచెను.

"నమః అనగా అంగమునకు
శివ అనగా లింగమునకు
అయ అనగా సంబంధము

దీనినే 'తత్త్వమని'లో కూడ వివరింప వచ్చును.

తత్ అనగా లింగము
త్వం అనగా అంగము
అని అనగా లింగాంగ సామరస్యము"ని అర్థము.

-పాల్కురికి సోమనాథుని కృతులు-ఒక పరిశీలన
-367 పు-

7 తొలి జన్మలో శివుని గొలువని వారు దురాత్ములని అన్నమయ్య విశేషించి తెలిపెను.

"ఖలులై, యాచకులై, విశుద్ధ వికటా కారాంగులై వంగులై
..........................................................................
..........................................................................జాత్యంధులై, మందులై
తొలి జన్మంబున మిమ్ము "గొల్వని దురాత్ముల్ వారు
సర్వేశ్వరా !"

-123 ప.-

'దురాత్ముల్'అని పేర్కొనెను.

8. అమల జ్ఞాన విభాస భాసురతమైన అష్టాంగ పూజా విధికంటె కూడ
"..........................................................................ని
క్కము ని భక్తుల గోష్ఠి చాలఁగడు వకన్ ఘోర సంసార దుః
ఖములెల్లంబెడ వాపనిన్ను వెలయంగాఁ జూపు"

-130 ప.-

నని శివ భక్తుల మహిమను అక్షర జ్యోతులతో ప్రకాశింప జేసెను.

బి. సాహిత్య విషయము :

యథా వాక్కుల అన్నమయ్య శివుని, శివ భక్తుల మహిమను, పంచాక్షరి అష్టావరణములు మహాత్మ్యమును వర్ణించెను. కవితాధార గంగా ప్రవాహము

లె యున్నను, ఉపమలు కనివించును, కొన్నింటిని పరికించండి.

"కనవుం బెంచిన చేను బోలుc"

-75వ. ప-

"ఈగకు దుర్గంధముగాక సహ్యమగునే కస్తూరి"

శివ కవియగు మహాకవి కాళిదాసు యొక్క దీప శిఖను-"నిర్మల ౦భాగ్య విధాన దీప శిఖయై'యని స్మరించుట విశేషము.

-92 వ.-

జగ ద్రక్షణ దక్షుని గొనియాడి, జడుండంచు నిరాకరింపగ జన్మంబు ాఫల్యంబు గావించుకొనెను! యథావాక్కుల అన్నమయ్యవి శివ వాక్కులు. రి లీలానంద సర్వేశ్వర శతకమ లభ్యము.

పిడుపర్తి సోమనాథకవి (1510)

ఇంతకు పూర్వము తెలిపిన కవులందరు 11, 12, 13 శతాబ్దములకు ంచినవారు. అనుభవ మంటప అధ్యక్షుడైన అల్లమ ప్రభువు లీలను ర్శించుటకై 15వ శతాబ్దమునకు చెందిన సోమనాథుని కావ్యమైన 'ప్రభు ంగ లీల'ను (ద్విపద) పరిశీలింతము. బసవ పురాణము పాల్కురికి సోమ ాథుని బసవ పురాణమునకు చంపూ కావ్యము సూత్రనె.

సవ పురాణము :

ఇయ్యది పాల్కురికి సోమనాథ మహాకవి ద్విపద బసవ పురాణమునకు ంపు రచన. ఇందు ఏడు ఆశ్వాసములు గలవు. దాదాపు 2220 పద్య ద్యములు ఉన్నవి. పుటల సంఖ్య 356. శైలి సరళము,హృద్యంగమము.

. ప్రార్థన :

1. సోమనాథకవి పీఠికలో

"శ్రీ మల్లికార్జునం దేవం చిద్ఘనం సురవందితమ్
జ్ఞానదం సర్వ భక్తానం గుణాతీతముపాస్మహే"
యని శ్రీ మల్లికార్జున దేవుని స్మరించెను.

2. ఇష్ట దేవతా ప్రార్థనాదికముతో 'ఇష్టదైవము'గా పాల్కురికి సోమ ాథ కవిని తలంచి

"శ్రీ భసిత త్రిపుండ్రక పరీత విశంకట ఫాలుఁ జూట జూ
టీభర దారు నిర్మల వటీపట్టాల వృత దేహునక్షమా
లా భరణాంగు బసవాక్షర పాద పవిత్ర వక్త్రుఁ జి
చ్ఛోభిత చిత్తుఁ బాల్కురికి సోమయదేశికుఁ బ్రస్తుతించెదన్"

తన ప్రబంధమును అంకిత మిచ్చుట సబబుగా నున్నది.

బి. సీస రగడలు :

1. పిడుపర్తి తన ప్రబంధమును చంపూకావ్యముగా రచించినను రగడలను విస్మరింపలేదు. బసవేశ్వరుల గజారూఢునిం జేసి పురంబునకుఁ దోడ్తెచ్చు సందర్భమున అష్టోత్తర శతనామావళివలె రచించెను.

రగడ : "పుణ్యాంగనలును బురముల గలిగిన
పణ్యాంగనలును బసవనిఁ గనుగొన

------------------------------------------------

మిట్టి మహాత్ముని నిపుడు గంటిమి
పుట్టుపు సఫలము పొందెను మంటిమి

------------------------------------------------

------------------------------------------------

జంగమ భక్త వశంబున వెలసెన్"

-ద్వి. ఆ-45 పు-17 ప.-

2. పిడుపర్తి రచనలో షష్ఠాశ్వాసము నందు సీస మాలికను గూడ ప్రయోగించెను.

"అప్రతిమాకారుడగు లింగ మూర్తికి
బ్రతి చరించెడి హరి హాత్తకు లెనయు?

------------------------------------------------

యఖిలంబు లోఁగొన్న యట్టి లింగమునకు
లింగ మధ్య స్థుతా లెంగు లెనయ ?

ష.ఆ.-290-291 పు.326 ప.-

3. అటులనే బసవన్న విషదూరంగించు సందర్భమున సీస మాలిక రగ

డలను బ్రయోగించి పాల్కురికి ఉద్యమ వ్యాప్తిని స్ఫురింపజేసెను. గ్రంథ సమాప్తములో గద్య గలదు.

## ప్రభు లింగ లీల :

ఇది ద్విపద వీరశైవ కావ్యము. దీనిని రచించిన వాడు పిడుపర్తి సోమనాథకవి. ప్రభు లింగ లీల యనగా 'సాకార నిరాకార నిరంజన మూర్తియై వర శివున కభేదముగఁ దదంశముగ నవతరించిన అల్లమ ప్రభు' లీలలను వర్ణించునది. కన్నడ భాషలో 'అల్ల-ఇల్ల' శబ్దములు 'కాదు-లేదు' అని అర్థములు కల్గిన శూన్యార్థ వాచకములు. ఇందులో 25 గతులు, 192 పుటలు గలవు.

## ఇందలి కథను పరికించండి :

అనుభవ మంటప అధ్యక్షుడు అల్లమ ప్రభువు మాయను జయించిన వృత్తాంతము ప్రథమ, ద్వితీయా శ్వాసములలో గలవు. అనంతరము ప్రభువు గొగ్గయ్య, ముక్తాయి, సొన్నలాపురి సిద్ధరామయ్యయను వారిని కరుణించి వారికి లింగాంగ సామరస్య రహస్యముల బోధించి తరింపజేసిన లీలలు, అక్క మహాదేవి చరిత్రము, గోరక్ష సిద్ధుడు, కొందరు మునులు, ఒకకిరాతుడు, బసవేశ్వరాదులను తరింపజేసిన విధము మూడు, నాలుగు ఆశ్వాసములలో వర్ణితములు. ఇంక పంచమాశ్వాసములో శూన్య సింహాసనము మెక్కుట, ప్రభువు విందారగించుట, భావ లింగ గతి, వీరశైవ మహిమ గతి వర్ణింప బడినవి.

దీనికి మూలము చామరసు కవివర్యుడు కర్ణాటక భాషలో రచించిన ప్రభులింగ లీల. ఇతడు తన కావ్యమును 25 గతులుగ విభాగించి వేయి నూట పదకొండు పదములలో రచించిన గ్రంథము. దీనికి వీరశైవ వాఙ్మయమున మహోన్నత స్థానమున్నది. చామరసు క్రీ॥శ॥ 1416-1446 ప్రాంతమున విజయనగర రాజ్యమును పరిపాలించిన ప్రౌఢ దేవరాయల కాలము వాడు. ప్రభులింగ లీల యందలి కవితత్త్వ విచారమును గమనింపుడు:

1. అల్లమ ప్రభువు విట వేషమున వచ్చు సందర్భమును పిడుపర్తి సహజముగా వర్ణించెను.

"చలువఁ బెట్టిన యట్టి సన్నపు దుప్పటము
వలసి మొల్లముగాగ వలె వాటు వేసి

---

విట వేషధారియై విచ్చేసె"

—4 గతి, 29 పు.—

2. వీరశైవ మతములో భర్త తన మతమును పాటింపకున్న భార్య ఆతనిని విడిచి పుచ్చవచ్చునని లేదా మాట మీర వచ్చుననియున్నది. రాజైన తన భర్త వీరశైవ మతమును పాటింపనందులకు కినిసి అక్కమ మహాదేవి ఆతనితో

"వినుము, ఘన లింగ సంగతి గాకున్న నాకు
వాన గూడ దేను నిన్నొల్ల నా యిచ్ఛఁ
జనియెద"

—10వ. గతి 79 పు.—

నని నిష్ఠురము లాడెను.

3. లింగ పూజా మహిమలోని నిర్మలత్వమును అల్లమ ప్రభువు సిద్ధ రామయ్యకు ఎంతో చక్కగా వివరించెను.

"పది వ్రేలు త్రోవలఁ బాఱు చిత్తంబు
పదిలంబుగా నిష్ఠ పదమున నిలిపి

---

లింగంబునకు నీకు లేదు భేదంబు"

అని అద్వైత తత్త్వమును 13వ గతి, 106 పుటలో పిడుపర్తి వ్రిబోధించెను.

4. అంగ లింగ సంగతులకు తాను జ్ఞానియై యుండునని అల్లమ ప్రభువు గోరక్షణనాథునకు తెలియజేయు సందర్భమును పిడుపర్తి వర్ణించిన విధమును చూడుడు.

"అంగ లింగ జ్ఞానులైన వారలకు
సంగతి షట్ స్థల జ్ఞానియై యుండు"

—19వ గతి, 148 పు.—

5. శంకరుడు గిరిజకు వీరశైవ ధర్మంబును వివరించునెడి పిడువర్తి అల్పాక్షరములలో అనల్పార్థమును సాధించెను.

"వీరశైవ మనంగ వేదవేదాంత
సార మెట్టన్నను షడ్దర్శనములు

---

జీవహింపలకు శివుడు మెచ్చడు

---

భావ మద్వైతమై వరగు సత్క్రియలు

---

ఏక పరబ్రహ్మ మేనని నమ్మి

---

పట్టిన వ్రతములు భంగంబు నొంద
నట్టి లింగైక్యంబు నధిగ మింపుదురు

---

లింగ మంబంబునఁ గీతెంచి యెల్లపుడు
జాత మృతాదిక సకల సూతకము
లేత అంటదము సోక నీక యుండుదురు
శివుని నుద్దేశించు చేయు పాకములు
భవులఁ జూడగ నిరు భవులకు నిడరు"

–25వ గతి, 189, 19 పు.–

పిడువర్తి సోమనాథుడు ఫలశ్రుతిలో నిట్లు చెప్పెను.

"నీకృతి జదివిన నీకృతి వినిన
నీకృతి వ్రాసిన నిష్ఠార సిద్ధు
లర లేక కృప నిచ్చు నల్లమ ప్రభువు".

## అధ్యాయము 7

## వస్తు-రూప-నిర్వహణ

(వీరశైవ కవులు వస్తు, రూప, నిర్వహణము నందును అతి స్వతంత్రులు. వస్తువులోని శైవ పారమ్యమును రూపము యొక్క భక్తుల జీవితములను నిర్వహణములోని జాను తెనుగు, ఛందోవరణమును చర్చించుట ఇందలి ఉద్దేశ్యము. ప్రాధాన్యత వస్తువునకు యొసంగబడినది. పాల్కురికి కావ్యములలోని అనేక కథలను మరియు ఇతర వీరశైవ కవులలోని కథల పరిశీలన ఇచటి ముఖ్యోద్దేశ్యము.)

పురాణమునకు క్రొత్త అర్థమును కల్పించిరి. సర్గము, ప్రతి సర్గము ఇత్యాది పౌరాణిక లక్షణములను వదలి పురాతన భక్తుల కథలను పురాణముగ చెప్పుట వీరశైవ కవులకు చెల్లినది. జైనులు కూడ యిటులే సిద్ధుల కథలను పురాణములుగా బేర్కొన్నారు. కనుక వస్తువు దృష్ట్యా వీరి మార్గము అతి నూతనము.

ఎ. వీరశైవ కవుల కథా వస్తువులు :

నేను పరిశీలించుచున్న వీరశైవ కవుల రచనలందు కథ దివ్యమైనది కాదు. లోక సామాన్యమైన జన జీవితము ఇందు ప్రధానము. అట్లు కాక నిష్ఠ పురాణములందు వస్తువు ఒక ధర్మ సూక్ష్మము. రూపము ప్రతీక నిర్వహణ నిరలంకారము. ఒక ఉదాహరణ ద్వారా చర్చించుతము.

భారతమునందు 'ధర్మాధర్మ' వివేచన వస్తువు 'కౌరవ పాండవ జీవితము' రూపము. వారి నడుమ 'సంఘర్షణ' నిర్వహణ. ఇట్లే రామాయణమున 'దాంపత్య ధర్మము' వస్తువు. 'సీతారాముల సంయోగ వియోగములు' రూపము. నిర్వహణ 'రావణునితో యుద్ధము'. ఇందు వలన భారత రామాయణములందు కించిత్ సామాన్య వస్తువు ఉన్నది. అదియే 'ధర్మము' అది రాజ ధర్మమైనచో భారతము, దాంపత్య ధర్మమైనచో రామాయణము.

ఇట్లు వీరశైవ భక్తులందరి కథలలోను సూత్రి సదృశమైన వస్తువు ఒకటి ఉన్నది. అదియేశైవ పారమ్యము. తన్ని రూపకమైన రూపము భక్తుని జీవితము ప్రతి శివ భక్తుడును ఒక పరీక్షకు లోనగుము. ఇదియే శైవ పారమ్య నిరూపకమగు నిర్వహణ. ఈ మూడింటి మధ్యన సమన్వయము సాధించునది శైవ కవిలోని 'అనన్య భక్తి'. శివస్పంద రూపము ప్రకాశించు

వారిలోని నవనవోన్మేష ప్రతిభ అనంత రూపములతో, భిన్న గతులతో నానా రసా విష్కరణ సమర్థములైన ప్రకరణములతో ఒకే 'శివతత్త్వ'మును సహస్ర ముఖముల కీర్తించును. దీనికి ఒక ఉదాహరణము ఇత్తును.

ఎ (1) శివస్పందము :

మనకు తెలిసిన శతకము లెన్నియో ఉన్నవి. వీనిలో మకుట మనగానే సాధారణముగా ఒక్క పదము స్వీకరింపబడును. అట్లు కాక 'వీర శైవ వ్రత దీక్ష'నున్న పాల్కురికి గాని, పరమ మహేశ్వరుడైన ధూర్జటి కాని యతి అక్షరము ద్వారా చిత్తస్థుడైన ఈశ్వరుని ఏకాక్షరమునందు బంధించి శతకము మొత్తము చివరి పాదములోని ఆ అక్షరమునకు యతి మైత్రిని పాటించిన వైనము కనుగొన్నచో 'శివ స్పందము' అనగా నేమో అర్థమగును.

వృషాధిప శతకమునందు మొదటి పద్యము చూడుడు.

'శ్రీ గురు లింగమూర్తి సవిశేష మహోజ్జ్వల కీర్తి సత్క్రియో
ద్యోగ కళా ప్రపూర్తి యవదూత పునర్భవ జూర్తి పాటితా
భ్యాగత సంశ్రితార్తి కవి పండితగాయక చక్రవర్తి దే
వా! గతినేవె మాకు బసవా! బసవా! బసవా! వృషాధిపా!

ఇచ్చటి చివరి పాదమున 'వా' అన్న మొదటి అక్షరము నాలుగవ గణాద్యక్షరమైన 'వా' తోయతి మైత్రి పొందినది.' కనుక తక్కిన పద్యము లన్నింటను పదాద్యక్షరమున 'వ' కార ధ్వని రావలయును.

దే/వమమ్ము భరింపుమయ్య! బసవా!

రెండవ పద్యము.

లింగత/త్త్వప్రద నీవెదిక్కు బసవా!

మూడవ పద్యము.

'వీ ప్సాయాం ద్విరుక్తిః' అన్న మాట శివ కవులయెడమిక్కిలి సత్యము, 'బసవా! బసవా! బసవా! వృషాధిపా!' అన్నప్పుడు మూడు మార్లు ఎలుగెత్తి' పిలిచిన అనుభవము కలుగుచున్నది. దీర్ఘప్లుత స్వరములతో ఆరోహణ క్రమములో ఈ శబ్దముచ్చరించిన సోమనలోని 'ఆర్తి' ప్రత్యక్షమగును.

ఊపున రుక్తిలోని భాగమే అనుప్రాస. 'మూర్తి-కీర్తి- ప్రపూర్తి-జూర్తి-సంశ్లితార్తి-చక్రవర్తి

ఒకటవ పద్యము

'బసవ' అను శబ్దము ఎంత మహిమాన్వితమైనదో పాల్కురికి ఇట్లు చెప్పుచున్నాడు.

'బసవని శరణన్నః బావక్షయంబు'
'బసవని శరణన్న ఫలియించు గోర్కి'
'వేయేల తగ బసవా యనఁ బరగు
నీ యక్షర త్రయంబిటు లోక్క మాటు'

-బ.పు-19 & 10 పటలు

పై వర్ణనమ గమనించినచో 'బసవ' శబ్దము వ్యావహారికమైన వ్యక్తి నామము కాదని శైవునకది మోక్ష ప్రదమైన దీక్షానామమని, మంత్ర సదృశమని గుర్తింపవచ్చును. ఈ మంత్రాక్షర సంపుటిచేతి ఉద్భవమైన సృజనేచ్ఛ శివస్పందమే యగునని యింతవరకు నేను పేర్కొన్నది. ఈ స్పందమున్న శివభక్తునకు బసవని పేరెత్తగానే వీరావేశము వచ్చును. సోమనాథుడు 'పండితారాధ్య' చరిత్రలో నిట్లు చెప్పుచున్నాడు.

"భవి కృతారంభ సంభవ ధాన్యనిచయ
భవి నిరీక్షణ రసపాక వితాన
భవి హస్తగత ఫల పత్ర శాకాది
భవి గృహ క్షేత్రాంఘ్రిస ధన వర్జితుడ
భవజన దర్శన స్పర్శనాలాప
వివిధ దానా దాన విషయ దూర గుఁద"

-పం.చ-దీ.ప్ర-21 పుట

అని ఇట్లు ప్రమాణము చేయుటలో శివస్పంద నిష్టతుడైన పాల్కురికి సోమన జీవితమున ఏనడవడి పాటించెనో స్పష్టమగును. ఆధునిక సాహిత్య విమర్శపరిభాషలో నిట్లు ఒక ఆలోచనాబద్ధమగు జీవితమునకు కట్టుబడుటను 'నిబద్ధత' అని పిలుచుచున్నారు పాల్కురికి సోమన, ఇతర శైవ కవులు మాహేశ్వర వ్రతులు నిరంతర శివ పంచాక్షరీ జపము చేత ప్రక్షాళితమైన అంతస్సు కలవారు.

ఎ (2) శైవ పారమ్యము :

ఇంతకు ముందు చెప్పినట్లు శివుడు తప్ప పరదైవము లేదనుటయే శివకవుల వస్తువు. అందుచేత శివ మహిమను అత్యద్భుతముగ చాటుటయే వారి వస్తువు. అప్పటికి ఉన్న వైదిక మతమునందు యే శాస్త్ర ప్రమాణమో వానినే నాధారముగా గ్రహించి పండితారాధ్య చరిత్రలో విభూతి రుద్రాక్ష, పాదోదక, లింగార్చన, లింగధారణ, ప్రసాద స్వీకార ఇత్యాది శివ మహిమా వైభవమును దీక్షా ప్రకరణములో ప్రవచించెను.

పండితారాధ్యుడు వీర వ్రతాచార్యుడుగా నడచుచుండగ సైవలేని భూసురులు.

"పండితయ్యా! నీవు పౌరాణికుడవు"
'భూతియు రుద్రాక్షములుఁ దాల్పనగునె
నీతియె లింగ సన్నిహమైయున్కి?
పాదోదకంబుఁ బ్రసాదంబుఁ గొనఁగ'

—పం.చ దీ.ప్ర-31 పుట-

యని ప్రశ్నించిరి.

2. (ఎ) విభూతి మహిమ :

ఈ ప్రశ్నలకు సమాధానముగ పండితయ్య విభూతి మహిమను గురించి ప్రస్తావించెను. 'అద్యులను మీరు చూడలేదా? వినలేదా? చదవలేదా? ఇతరులనియా? ఇక ప్రమాణముల వినుడని శ్రుతి స్మృతులలో ప్రమాణము నుద్ఘాటించెను. కొన్నింటిని పరిశీలించండి.

'భూత్యైన ప్రమదితవ్యమ్'

—యజుర్వేదము

'త్రిపుండస్య చ ధారణం'

—అధర్వణము

'నచ పునర్వా ర్తత'-నారాయణోపనిషత్
'విరజా విపాప్మా'-భీమాగమ సూక్తి
'స ఏష భస్మజ్యోతి'-మానవ పురాణ సూక్తి

—పం.చ-దీ.ప్ర.31, 32 పుటలు-

ఇత్యాది ప్రమాణములనకేకములనుదాహరించి భస్మ ధారణము పవైదికమేయని నిరూపించెను. దీనిని బట్టి పాల్కురికి సోమనాథుడు ఈ శాస్త్ర ప్రమాణములనెంత పరిశోధించి పట్టినాడో ఆశ్చర్యము కలుగును.

2 (బి) రుద్రాక్ష మహిమ :

ఇటులే రుద్రాక్ష మహిమను గురించియు శృతి ప్రమాణమును పఠించెను.

'ఏతాని రుద్రాక్షాణి'-యజుర్వేదము

'రుద్రాక్ష ధరత్యచిహ'-లింగమత్స్య పురాణములు

-పం.చ.దీ.ప్ర-42 పుట-

ఇంత మాత్రమే గాక రుద్రాక్ష భూషణుడుగా శివుడు వర్ణింపబడెననియు చెప్పి రౌద్రి మంత్రములో వెలసిన పంచాక్షరీ విద్యను రుద్రాక్షనుమ ధరించి పఠించవలయునని శాస్త్ర ప్రమాణము-అని చెప్పెను.

2 (సి) పాదోదక మహిమ :

'అథాతో మహా దేవస్య'
'పరం పాదోదక విధిః
'నయం మే శిరస్య భ్యత, ;
ఋతగ్ సత్యం పరంబ్రహ్మ-యను

-పం.చ-దీ ప్ర-46 పుట-

యజుర్వేద మంత్రమును ప్రమాణముగా నుడివెను. ఇంత మాత్రమే కాక పాదోదకము పురభిదమట. పాశజలహరమట. పాదోదకము త్రాగుటచే అశుచి శంకలేదు ఇంకా కొన్ని ప్రమాణములను వివరించుచు

'సర్వ మంగళ మాంగళ్యమ్
సర్వ పావన పావనమ్
సర్వ తీర్థ ఫలం సద్యః
ప్రాప్యతే మూర్ధ్ని ధారణాత్'

-పం.చ-దీ ప్ర-48 పుట

అను ప్రమాణమును వివరించెను. శివ పాదాంబువు ఉత్పాత ప్రశమన మట. సర్వరోగ ప్రభేదనమట. మరియు ఇష్ట సిద్ధి ప్రదాయకము కూడ!

2 (డి) లింగార్చన మహిమ :

లింగార్చన మహిమము గుఱించి శ్రౌతస్మార్త విధులను శోధించి పండితయ్య ఇట్లనెను.

'ధ్యానా దర్చనా ద్ధారణా దపి' అనగా లింగార్చన ధ్యానము చేత అర్చనము చేత ధారణము చేత చేయవలయునని అర్థము. విష్ణ్వాది దేవతలు, మునులు, సంసార తారకమైన శివపూజను వీరభక్తి స్థల చిత్తులయి సల్పిరి,

'మరుతో మర్చయంత'
'రుద్రియత్తే జనిమ చారు చిత్ర'
'నవాపి గుహ్యమ్'-అని వేద మంత్రములు.

విష్ణువు, బ్రహ్మ, ఇంద్రుడు తమ తమ పదవులు పొందుటకు 'సుయజా యజా మహే' యని అర్చించినారు.

ఈశ్వరుణ్ణి ప్రపత్తి ఎందుకు వేడవలయును? కారణమును చెప్పెను.

'విర జాన లజం భస్మ'
'గృహీత్వా చాగ్నివో త్రిజమ్'
'సముద్ధూల్య సదాచార్యమ్'
'ప్రణిప త్యాత్మ విద్యయా'
'సంసార సాగరం ఘోరం'
'లంఘ యామ్యహ మాత్మవః'

-పం.చ దీ.ప్రి-50 పుట-

అని గర్భగతుడైన అర్భకుడును తలచునట. ఈ ఘోర సంసార సాగరమును తరించుటకు ఒక్క ఈశ్వరార్చన తప్ప వేరు మార్గము లేదు. ఇది పునరావృత్తి మోచనమైన విద్య. దీని చేత పునర్జన్మము ఉండదు. ఈశ్వరునకు ఒక పువ్వును సమర్పించినచో ఆ పువ్వే జనని జఠర కఠోర పిఠరాటనము హరించుననిన 'నానా కుసుమము'లను సమర్పించు వాని కెంత పుణ్యము కలుగును? ఒక్క తుమ్మి పువ్వుతో పూజ చేసి విష్ణువు విష్ణుత్వమును ద్రోణ పుష్పముల పూజ చేసి బ్రహ్మ బ్రహ్మత్వమును పొందిరి. శ్రీ వృక్ష దళములలో పూజించి శ్రీదేవి శ్రీత్వమును బడసినది.

2 (ఇ) లింగధారణ మహిమ :

ఇదియు ఋగ్వేదము నందు కలదని ఇట్లు చెప్పెను.

'అనుభవ రోగ భిదమ్'
'అయంమే విశ్వ భేషజః,
'అయం శివాభిమర్శనమ్
అయం మ్మాతా అయం పితా
అయం జీవాతు రాగమత్
ఇదం తప ప్రవస్పరణమ్'

–పం.చ–దీ.ప్రి-52 పుటలు–

యని చాటుచుండగా ముంజేతి కంకణమునకు దర్పణమెందులకు? ఈ ఋతు సంహిత గూఢ వేదాంతమయముయి యున్నది.

ఇక రుద్రోపనిషత్‌లో ప్రథమాను వాకము నందే

'యాతే రుద్రః
శివా తనూ రఘోరా
అపాప కాశినీ'–యను మంత్ర భాగమున్నది పండితయ్య

'అపాప కాశినీ వపుః' అనుటకు వ్యాఖ్యానము చెప్పుచున్నాడు.

'శ్రితం తేన' అను మహాస్తోత్ర విన్యాసమునందు 'శిష్టాః ప్రసిద్ధా భగవ న్నపాప' అని చెప్పెను. అనగా భవుని భక్తులు శిష్టులు, ప్రసిద్ధులు, అపాపులు.

'మత స్త్వదీయా సవహాయ భక్తా
అన్యా నశిష్టాః ఇతి నిశ్చినోమి' అని చెప్పుట వలన.

ఈ మహాస్తోత్ర సూత్రార్థమును బట్టి శివ భక్తులు పాపరహితులెట్లైరి? అఘోరాంగుడైనట్టి–అనగా మహా లింగమూర్తి యైనట్టి శివునితో అవినాభావ సంబంధము వలన అపాపు లందరిలోను అఘోరుడైన శివుడు ప్రకాశించుచుండును. కావున నిరంతర లింగ సహితులు పాప రహితులు.

2 (ఎఫ్) ప్రసాద మహిమ :

శివ ప్రసాద స్వీకారము వైదిక మార్గ మెట్లగును? అని ప్రశ్నింపగా పండితయ్య.

'అనర్హం మమ నైవేద్యమ్' అను ఆగమ వాక్యములకు అర్థము చెప్పుచున్నాడు. లింగార్పిత శేషము అగ్ని హోత్రునకు, పితృ దేవతా కార్యములకు పనికి వచ్చునా? అని అడిగిన బ్రాహ్మణులకు నైవేద్య శబ్ద మునకు అర్థ విచారణ చేసెను.

నైవేద్యము నానార్థ సూచి. దీనికి ముఖ్య గౌణార్థములను నిశ్చ యింపజాలక రహస్యార్థమును ఎట్లు చెప్పగలము? నిర్మాల్యము షడ్విధమని ఆగమ ప్రమాణము. దేవస్వము, దేవతా ద్రవ్యము, నైవేద్యము, నివే దితము, చండ ద్రవ్యము మరియు బహిఃక్షిప్తము.

దేవస్యమనగా దేవుని సొమ్ము, భూములు, గ్రామములని అర్థము. దేవతా ద్రవ్యమనగా ధన ధాన్య వస్త్ర గోధన భూషణములు ఛత్ర ధ్వజాది వస్తువులు. నైవేద్యమనగా దేవుని కొఱకు సంకల్పితములై తొలుత శివున కల్పింపబడిన అన్నపానాదులు. అమర గణాది ప్రతిష్ఠితమయిన లింగముల నిర్మాల్యమునకు చండ ద్రవ్యమని పేరు. పూర్వ సంధ్యా సమర్చన వేళలో మిగలిన నిర్మాల్యమును బహిః క్షిప్తమందురు. అట్లు కాక ప్రాణ, రత్న, అచండ లింగములకు సమర్పించిన అన్న పానాదికములు నివేదితములు. ఇవి శరణులకు మిక్కిలి అర్హములు. అంత మాత్రమే గాక షడ్విధాహార సముదాయ జలపుష్ప ఆహారములు శివార్పితములు, చరాచర భూత జాల మంతయు శివమయమే, కనుక శివ ప్రసాద మనర్హమను వాక్యము మల దేహులకు, లోభ మానసులకు కూడవర్తింపదు. వారు కూడ శివ నిర్మాల్య భక్షణము చేత పవిత్రులగురు అని వివరించి ప్రసాద సేవనము కూడ అర్చన, ధారణములతోఁ బాటు వీరశైవ వ్రత భాగమని సిద్ధాంతము జేసెను.

ఇట్టి శివపారమ్యముతో సంబంధముగల శివ పరీక్షకు నిలిచి కైలాస మరిగిన పురాతన, నూతన శివ భక్తుల కథలను పరిశీలింపవలయును.

బి (1) గురు భక్తికి సంబంధించిన కథలు :

గురు భక్తుడ్య కథ తన గురువైన 'మల్లన' పాదముల నాశ్రయించి త్రిసంధ్యల నర్చించుచుండెను. పొరపాటున గురువుగారి పాదుకలను తన పాదములతో తగులుట చేత ఆ పాపమును భరింపలేక తన పాదముల ఖండించుకొనెను. ఇది తెలిసి గురువు శిష్యుని పాదముల నతికించెను. పోయి గొల్చు గురువుగారి ఉన్న తావననుమనే కాదు బాధించు త్రిశూలపై గురునామ

ధ్యానముతో కూర్చుండి మిగిలిన శిష్యులకు లేని గురుభక్తిని నిరూపించిన కథ ఇది. (పురాతన ప్రకరణము) (పం. చ.)

గురు భక్తాండారి కథ :

ఇతడు గురు భక్తి పుణ్య సత్త్వముడు ఒక నాడు నగర వీథులలో తిరుగాడుచుండ భక్తురాలైన ఒక వేశ్య గాంచి ఆమె సౌందర్యమునకు ముగ్ధుడై ఆమెతో కూడుటకు నిశ్చయించుకొనెను. కాని ఆమె తిరస్కరించెను. విడువక వచ్చుచుండుటచే ప్రౌఢవతి కథలు చెప్పి మోక్షసాధనకు కృషి చేయుమనెను. చివరకు నీ గురులింగము నాయింట నున్నాడని చెప్పగనే గురు భక్తాండారి పాప క్షాళనమునకు శరీరమును ఖండ ఖండములుగా కోసికొనుటకు నిశ్చయించుకొనెను. కన్నుల పెరిపై చుకొనుచుండ గురు లింగము శిష్యులతో పాటు వచ్చి రక్షించెను. (పురాతన ప్రకరణము-పం.చ.)

బి (2) జంగమ భక్తి కథలు :

చిఱు తొండనంబి లేక భక్త సిరియాలుని కథ :

ఇది అందఱికి తెలిసిన కథ. జంగమార్చనకై కొడుకును చంపిన తల్లిదండ్రులకు సంబంధించినది. జంగమ దేవర కొడుకును పిలువమని ఆజ్ఞాపించెను. తల్లి పిలువగనే ఆహారముగా వండి వడ్డించిన కొడుకు బ్రతికి వచ్చెను.

(శివతత్త్వ సారము 400 పద్యము, బ.పు-చ.అ)

మడివాలు మాచయ్య కథ :

ఐదవ అధ్యాయమున తెలుపబడినది. (శి.సా 440 ప., బ.పు-చ-అ. వృషాధిప శతకము, చెన్న బసవ పురాణము)

సంగమేశుని కథ :

జంగమ రూపమున వచ్చిన సంగమేశుడు బసవేశ్వరుని మూడవ కన్ను అడిగెను. బసవేశ్వరుడు అద్దము చూపింపగా అందులో సంగమేశునకు మూడవ కన్ను కనిపించెను. (బ.పు-ప్రథమా ఆశ్వాసము)

చొక్క నాయనారు :

జంగమార్చనలో సర్వము పోగొట్టుకొనగా ఆపదలో నుండి నక్కలను గుఱ్ఱములుగా మార్చెను. (బ.పు-తృ-ఆ)

మిండ జంగమునకు బసవడు గంగాంబ ధరించిన చీరనిప్పించెను. (బ.పు-తృ.ఆ) బసవడు ముగ్ధ సంగయ్యను లంజరికమునకు పంపెను. (బ.పు-తృ.ఆ) జంగముడు కాపుకొమటకు పాకను కాల్చిన తర్వాత కొన్ని చిత్తనములను కాల్చి ఆహారముగా సమర్పించిన దంగుళి మారయ్య కథ (బ.పు-చ.ఆ) ప్రతిదినము వేయి మంది జంగమముల నర్చించిన చిఱుపులి కథ (బ.పు-చ.ఆ).

కన్నద బ్రహ్మయ్య కథ :

జంగమార్చనకై యితర మతస్థుల ఇండ్లను దోచుచుండెను. ఒక పర్యాయము బిజ్జలుని భండారము దోచెను. కన్నద బ్రహ్మయ్య కన్నము వేసిన చోట గోడ రాళ్లును, ఇసుకయు రత్నరాసులుగా మారిపోయెను. (బ.పు-పం.ఆ, వృ.శ) జంగమము పూజా సమయమున ముగ్గులు పెట్టుటకై ముత్యాల పొడిని కోరగా బసవన్న జొన్నల రాశిని ముత్యాలగావించెను. (బ.పు-ప్ర.ఆ).

దసరయ్య కథ :

జంగమ వేషధారియైన మొండి చేతుల వానికి చేతులు మొలిపింప జేసి డాంబికులు సిగ్గు పడునట్లు చేసెను. (పండితారాధ్య చరిత్ర)

బి (3) లింగ భక్తి కథలు :

సురియ చౌడయ్య కథ :

లింగమూర్తి ప్రసాదము తినకున్న తల నఱుకు కొందునని చెప్పి శివునకు ఒక్కొక్క ముద్దను కత్తి చేత ధరియించి తినిపించిన శివ భక్తుడు. కటకమునకు చెందినవాడు (శి సా 423., బ.పు-పం.ఆ;వృ.శ 95 ప.)

దొంగలు ధరించిన వంకాయలను బసవణ్ణ లింగములుగా జేసెను. (బ.పు.ప్ర.ఆ) కళ్యాణ కటకమునందు లింగాభిషేకము నీరుపారగా బురుద అయ్యెను. ఒక గొల్లెత జారిపడ బోవుచు 'బసవన్న' రక్షింపుమనెను. బిజ్జలుని సభలోనున్న బసవన్న అచ్చట నుండియే ఆమెను కాపాడెను. (బ.పు-ప్ర.ఆ).

శివుడు తన హృదయమున సిద్ధరామయ్యకు బసవని చూపించిన కథ (బ పు-ద్వి.ఆ) లింగపూజా సమయమున అపచారము గావించి భార్యను వదలి పెట్టిన నక్క సైనారు కథ (బ.పు.తృ-ఆ) లింగమూర్తిని తన్న కొడుకుగా నాడించిన బెజ్జ మహాదేవి కథ (బ.పు-తృ.ఆ) శివుడు భక్తుడైన వెట్టివాని వేషమున పిట్టవ్వకు తట్టలు మోసిన కథ (బ.పు.చ-ఆ)

ఏలేశ్వ కేతయ్య కథ :

అన్ని జంతువులను లింగ సన్నిహితులుగా జేసిన భక్తుడు. పర మతస్థులు పొలమును, ఇంట ధాన్యమును నాశనము జేసిరి. అయినను లింగ భక్తి కలిగియుండుటచే విత్తనములు వేయకయే పొలమును పండించెను. (బ.పు-ప.ఆ)

సవరద నాచయ్య :

ఇతని భార్యకు ఇద్దరు కవలలు ఉదయించిరి. లింగము లేక పుట్టిన ఒక కొడుకును నిర్దాక్షిణ్యముగా పారవైచెను. (బ.పు_స.ఆ).

శివుడు విషము త్రాగినాడని, ఎట్లు బ్రతుకునని బాధపడి ఘన జలాంతరమున ప్రాణములు చాలించుటకెత్నించిన రుద్ర పశుపతి కథ. శివునకు కల్గిన వాయు దోష నివారణకు సర్వము అర్పించిన నాట్యనమ్మి త్రండి కథ. శివుని నవ్వించుటయే ధ్యేయముగా పెట్టుకొనిన కళియంబనయనారు కథలు బసవ పురాణమున తృతీయాశ్వాసములో గలవు. శివునిచే నిత్యము మోడసు గొనుచుండు చిఱుత్తొణయనుని కథ (బ.పు-చ.ఆ)

బి (4) పాదోదక మహిమ కథలు :

మోళగ మారయ్య కథ :

జంగముల పాదోదకముతో కట్టెలను బంగారు కడ్డీలుగా మార్చెను. (బ.పు; పం.ఆ వృ.శ. 8,7. పద్యము) ఐదవ అధ్యాయమున ఈ కథ వివరింపబడినది.

సామవేది కథ :

యజ్ఞము చేయు సమయమున అంత్యజుని రూపములో వచ్చిన శివుని కొలిచి తరించెను. ఆ పాదములు కడిగిన నీటిని పాదోదకమనియు, అంబి

కాధవుడు నీటియందు కానబడుటచే లింగోదకమనియు, శివుడు ప్రసన్న దృష్టితోఁ జూచుటచే ప్రసాదోకమనియు త్రివిధంబు. (పండితారాధ్య చరిత్ర దీక్షాప్రకరణము)

బి (5) ప్రసాద మహిమ కథలు :

మాదర చెన్నయ్య కథ :

నిత్యము 'అంబలి'ని శివునకు నైవేద్యముగా సమర్పించి ముక్తి పొందెను, (శి సా. 419 పద్యము, వృ.శ-89 పద్యము)

శివ ప్రసాదమును ఇతరులు భుజింపరాదు. ప్రసాద మహిమ తెలుపుటకై బసవేశ్వరుడు విషము త్రాగిన కథ (శి.సా. 433. పద్యము, బ.పు-సప్తమాశ్వాసము) శిష్యులను పరీక్షించుటకై ఆది శంకరాచార్యులు విషము త్రాగుట ఇటువంటి రూపమే.

శివార్చనకు పుష్పములు కోయుచు నదిలో కాలుజారి పడిపోగా శివుడు రక్షించిన తిరు చిట్టంబలుని కథ. (బ.పు-ద్వితీయా శ్వాసము).

నిమ్మవ్వ కథ :

శివ ప్రసాదమును తిన్నందుకు కొడుకును చంపెను. తిరిగి పొందుటకు ఇష్టపడలేదు. (బ.పు-చ.అ) ఈకథ తొమ్మిదవ అధ్యాయమున వివరింపబడినది

గొడగూచి కథ :

నిత్యము లింగమునకు పాలు సమర్పించుచుండెను. గొడగూచిని కరుణింప లింగము చేయిసాచి పాలు గ్రోలుట తప్పనిసరి. తండ్రి సత్యముమ తెలిసికొనుటకు ప్రయత్నించగా లింగము గొడగూచిని లోనికి తీసికొనెను. అమ్మాయిని పట్టుకోపోగా జడ మాత్రమే దొరికెను. (బ.పు-తృ అ)

దీపద కళియూరు కథ :

నూనెతో దీపముల వెలిగించు వ్రతము కలవాడు. ఒక రోజు నూనె లభింపక పోగా జడను వత్తులుగా జుట్టి వెలిగించుకొనెను. (బ పు-తృ అ) ఇటువంటిదే కడమల నంబి కథ (బ.పు-చ.అ) చందనము, గుగ్గిలము, బియ్యపు ఆహారమును అర్పించు వ్రతము కలిగి అవి లభింపక పోవుటచే ఆత్మార్పణమునకు సిద్ధపడిన ఎణుమూర్తి నైనారు. గుగ్గులు కళయారు,

అరివాళునైనారు కథలు (బ.పు చ అ) లో గలవు.

**అది భర్తుని కథ :**

ఇతడు చేపలను పట్టును. మొట్ట మొదట లభించిన మత్స్యమును శివ ప్రసాదముగా నదిలో వదలి పెట్టుచుండెను. ఒక రోజు స్వర్ణమత్స్యము లభింప దానిని వదలి పెట్టెను. ఇంక చేపలు లభింపలేదు. రోజు అట్లే జరుగుచుండ శివుడు ప్రత్యక్షమయ్యెను. దీనిని ఐదవ అధ్యాయమున వివరించితిని.

**అరియమ కథ :**

ఇతడు బ్రాహ్మణునకు అన్నము పెట్టెను. బ్రాహ్మణుడు ఒక మెతకు క్రింద పడుటచే అన్య దైవమును స్మరించెను. తోడనే అరియమ భూసురుని పొట్ట వ, చ్చెను. రాజు అరియమును శిక్షించుటకు ఆజ్ఞాపించెను. లింగము తన గర్భమును తెరచి లోనికి తీసికొనెను. భటులు అతనిని లాగగా కట్టు బట్టమూరెడు పైకి వచ్చెను. (శి సా 412 పద్యము, బ పు-ష,ఆ,వృ.శ 100 పద్యము) ఇటువంటి ప్రసాద మహిమ కథలు గొబ్బూరు బిబ్బ బాచయ్య కథ, శ్వపచయ్య (మాంసము వండువాడు (కథ) బ.పు./సప్త శ్వాసము) లు గలవు.

**ఘంటా కర్ణుని కథ :**

శివ నిర్మాల్యమయిన పుష్పమకరందము నాకర్షించిన సూర్యుని కుష్ఠరుజాపీడితునిగా శపించెను. భీతుడు ప్రసాద పుష్పోదరంబువగల కీటకము శిరమును భక్షింపు చుండినను తలపై ధరించిన కథ (పండితారాధ్య-చరిత్ర దీక్షా ప్రకరణము)

**దుర్వాసుని కథ :**

శివ ప్రసాద అవశేషమును భుజించి మిగిలిన దానిని సర్వాంగములకు అలుము కొనుమని దుర్వాసుడు శ్రీకృష్ణునా జ్ఞాపించెను. శ్రీ కృష్ణుడు శరీరమునకు పూసికొని అరుకాళ్లను తృణీకరించెను. తోడనె దుర్వాసుడు శ్రీ కృష్ణుని శపించెను. (పం,చ దీ.ప్ర)

**కొరెండ్ల స్మారసాని కథ :**

ఈ కథ తొమ్మిదవ అధ్యాయములో వివరింపబడినది.

తిరునాళ్లపోవ కథ :

ఇతడు శివ భక్తుడు. పం|డెండు సంవత్సరముల పాటు జెనుమెట్ట పురి అభవుని దర్శింప ప్రయత్నించెను. యజమాని అనుమతివ్వగా భక్తుని కరుణించి మోక్షమును ప్రసాదించెను. (పం.చ-దీక్షా ప్రకరణము)

శ్వేతుని కథ :

చిత్రమయినది. నేల జారిన ఒక్క పుష్పమునే శివార్పితము చేసి నందులకు ఒక్క రోజు స్వర్గ సుఖములు పొందుటకు యత్నించెను. ఇటు వంటిదే ఓహిళుని కథ. (పం.చ-పు.ప్ర)

బి (6) విభూతి-రుద్రాక్షల మహిమ :

ముసడి చౌడయ్య కథ :

శివునకు ముసిడి పండ్లను ప్రసాదముగా సమర్పించి భుజించెను. భస్మము చల్లి చనిపోయిన వృద్ధ శివ భక్తుని, సమాధిచేసిన ఎద్దును, చని పోయిన బాలికను బ్రతికించెను. (శి.సా. 413 పద్యము) (బ.పు-పం.అ) (వృ.శ-89 ప)

ఏణాధి నాథుని కథ :

ఇతడు ఏలూరి నివాసి. విభూతి రుద్రాక్షలను ధరించిన వారిని సేవించు నియమము. భావి యగు సేనాధిపతి ధరించిరాగా వానిని సంహ రించెను. ఇటువంటి మహిమలు గలవే చేదివల్లభుని కథ, కరయూరిచోదుని కథ, విభూతి రుద్రాక్షలు ధరించినవాడు తమ సేవకుడైనను పాదములు కడుగుచుండ నీరుపోయకుడిన భార్య రెండు చేతులను ఖండించిన కళి యంబనైనారు కథ. (బ.పు-చ.అ) ఇటువంటిదే ఇరువదాండారి కథ. ఈ కథ ఐదవ అధ్యాయములో వివరింపబడినది. విభూతి నీళ్లతో జైనులు కాల్చిన మట్టి చెట్టును బ్రతికించిన కోవూరి బ్రహ్మయ్య కథ. (బ.పు-ష.అ).

బెలిదేవి వేమనారాధ్యుని కథ :

అల్పాయుష్కుడై మరణించిన రాకుమారుని భక్తుల పాదోదకము, ధూళి విభూతితో బ్రతికించెను. (పం.చ-పు.ప్ర-430-446) ఇటువంటిదే కదిరె రేమయ్య కథ (పం.చ-పు.ప్ర-467-475)

చేటల వేమయ్య కథ :

సిద్ధుని రస ఘుటికన్న తన నుదుటి విభూతిచే మిన్నగా గావించి విభూతి ఘుటికను సిద్ధున కెచ్చెను. (పం.చ-పు ప్రి 47549)

ఇంత వరకు వివరించిన కథలు అష్టావరణముల మహాత్మ్యమునకు ఉద్దేశించినవి. ఇక గణాచారమునకు సంబంధించిన కొన్ని రూపములను పరిశీలింతము.

బి (7) హర భక్తుల కోర్కెలు తీర్చునవి :

మొఅటద వంకయ్య కథ :

హర భక్తుల కోర్కెలను తీర్చ నియమము కలవాడు. అర్ధరాత్రి వచ్చినను సరియే. గొడ్డుటావును పితికి హర భక్తులకు పాలు ఇచ్చెను. (శి.సా-402 పద్యము, బ-పు-ద్వి.ఆ, వృ.శ_97 పద్యము)

శివ భక్తహీనుడైన కొడుకు గర్భములో నుండగా వానిని వెడలించిన కొట్టరువు చోడుని కథ (బ.పు.చ ఆ) గర్వించిన సిరియాళుని, శివుని కూడ వెలిపెట్టిన హలాయుధుని కథ (శి.సా-487 పద్యము: బ.పు-చ.ఆ;వృ,శ-99ప)

కలకేత బ్రహ్మయ్య కథ :

కలకేతఅనగా వస్తువును కల్పించు విద్య, దుగ్గళవ్వ సుతుడు కోరగనే మూడు పుట్ల ధాన్యమును ఇచ్చెను. (బ.పు.పంచ ఆ) తనగుదియను రాళ్ల ప్రోగునకు తాకించి ధనరాశిగా మార్చి తీసికొని పొమ్మనెను. (వృ.శ-88 పద్యము)

బి (8) శివనింద సంబంధ :

శివ నింద విన్నతోడనే భవాని తన శరీరమును యోగాగ్నికి సమర్పించెను. చివరకు శివునిలో అర్ధాంగమును పొందెను. (శి.సా-393 ప) వ్యాఘ్రపాదుని కథ ఇటువంటిదే (శి.సా-394 ప) శివపూజకు పుష్పములు కోయుచుండగా అట్టి భక్తుని చంపజూచిన చోడ (చేది) రాజు ఏనుగును చంపి బ్రతికించిన ఇరుదత్తుని (ఇరువవాండాది) కథ (శి.సా.439 ప)

మావటీని చంసి నిష్కారణముగ తనను చంపి జూచిన ఏనుగును చంపిన బాపూరి బ్రహ్మయ్య కథ (శి.సా-441; బ.పు-చ.ఆ)

శివ పూజకు సిద్ధము జేసిన పూలను వాసన చూచినందులకు భార్య చేతి ...ను ఖండించిన నరసింగ నాయనారు కథ (బ.పు-చ.అ) రాజ్య మెల్లక ...ం దాల్చిన తిరుపాలుని కథ, తిరునావకపు రీతుని గొల్చిన తిరుకుర్వి కథ ... తాను శివుని కొల్చిన తిరుమూలుని కథలు బసవపురాణములో చతుర్థా...ముున గలవు. ఒడయనంబి అహంకారమును పోగొట్టిన కలికామ దేవుని (బ పు చ.అ)

...) శివరాత్రి మహాత్యమునకు సంబంధి :

...మిండ నాయనారు కథ :

పండ్రెండు సంవత్సరములు నియమము సల్పిన భక్తుడు. అతని ...ంట ఒడయనంబి వాల్మీకేశులు పారిపోయిరి. (బ.పు.చ)

...లదేవు బాచయ్య కథ :

ప్రతి శివరాత్రికి సోమనాథుని సేవించుచుండెను. బిజ్జలుడు కోప... సౌరాష్ట్రమున కేగుమనెను. ప్రతీహారి రూపమున సోమనాథులే వచ్చి ...మును లభింపజేయగా కటకమున పూర్వపు గుడిస్థానములో సోమనాథునకు ...ణాలయము కట్టించెను. (బ.పు.ష అ)

...) హీనకులజులు పర భక్తులయిన గొప్పవారు :

మాదర దూడయ్య శివభక్తుడు. అతడు స్నానము చేసిన నీరు యింటి ...ందర నిలిచి బురద అయ్యెను. ఆ బురదలో పొర్లిన బ్రాహ్మణుడు తేజో...పుడయ్యెను. ఇటువంటిదే బానస భీమయ్య కథ. గుడ్డవ్వ కథ ...ృదవ అధ్యాయములో పరిశీలింపబడినది. (బ.పు. సప్తమాశ్వాసము)

అష్టావరణముల ప్రాధాన్యత కలిగి పరమత ఖండనకు లోడ్పడిన ...ములును గలవు.

...1) వైదిక మత నిరసన :

...గి భోగయ్య కథ ;

ఇతడు బ్రాహ్మణుడు, ఒక శివభక్తునకు పెయ్య మాంసమును వండి .... అగ్రహారములోని బ్రాహ్మణులు దూషించిరి. ఆతనితో ఊరిలోని

లింగములు వెళ్ళిపోయెను, ఈ కథ ఐదవ అధ్యాయమున వివరింపబడినది.
శి.సా-418, 485 పద్యములు : బ,పు-వ,ఆ]

కల్లిదేవయ్య కథ :

ఇంకా చిత్రమయినది. హావినహళ్లి నివాసి పాము కరచిన వానిని బతికించుటకు బ్రాహ్మణుడు ముట్టిన బిందెను పాతిపెట్టి క్రొత్త బిందెతో అర్ఘ్యము తెచ్చి బతికించెను. మహాకాళము అను సారమేయముతో వేదమును పల్లింపజేసెను. (బ.పు-స.ఆ; వృ.శ-98 పద్యము) ఇటువంటిదే జగదేవ దండనాయకుని కథ. వైశ్యులు దూషింపగా కుంచములను లింగము జేసిన పల్లేశు మల్లయ్య కథ. (బ.పు-వ్రి.ఆ)

) (12) బౌద్ధమత ఖండన :

వీరశంకురుని కథ :

శివభక్తి కలిగి వీరహోమములో తలను కోసివేల్చుచుండెను. తలను తిరిగి పొందుట తప్పనిసరి. ఒక రాత్రి కలలో బౌద్ధుడు కనిపింవగా శ్రీశైలములోని హటకేశ్వరము వద్ద పెన్నముపై కూర్చుండెను (శి.సా-398; బ.పు-ష.ఆ)

) (13) జైన మత ఖండన :

ఏలకవ్వ కథ :

చిత్రమైన కథ. భర్త శివభక్తుడుకాడు. ఆతనిని రోసి శివాలయము జేరెను. భర్త వెంట పడగా శివుడు ఆమెను రక్షించుటకు పురుషునిగా మార్చెను. (శి.సా-417 పద్యము) జైనుడైన భర్త శిక్షింపగా ఇల్లువెడలెను జైనాలయమునకు కొనిపోగా తీర్థంకరుల విగ్రహములు లింగములయ్యెను ఈ పైజకవ్వ కథ తొమ్మిదవ అధ్యాయమున వివరింపబడినది. (శి.సా-422 పద్యము; బ.పు, ష,ఆ]

ఏకాంత రామయ్య కథ :

చెప్పాబు విడువక శివాలయము సొచ్చిన జైమని శిరమును తెగ వ్రేసెను. జాత్యంధుడయిన ఇరత్తాండి చెరువు నుండి నీరు తెచ్చి అభిషేకించిన కథ మరియు సోమన్న కథలు పార్వతిదేవి పాలు త్రాగిన పిళ్ళ

సైనారు జినరాజు పుండు మాన్పిన కథ, రాళ్ళతో శివుని పూజించిన సాంఖ్య తొండని కథ, నిడుమారుడు, నమినంది హిరియ నాచయ్య కథలు కూడ (బ.పు.ష.అ) కలవు.

బి (14) వైష్ణవ మత ఖండన :

శంకర దాసయ్య కథ :

జంగమార్చన తత్పరుడు. శివుడాతనికి మూడవ కన్ను అనుగ్రహించెను. జగదేకమల్లుడు ప్రతిష్ఠించిన విష్ణు ప్రతిమను భగ్నము జేసెను. (శి.సా-421 వ; బ.పు-ష.అ) (వృ.శ.-80 వ)

శివలెంక మంచన కాశిలో శివునకు పడివేళ్ళు సమర్పించి మరల పొందుచుండెను. పర సమయుల జయించి విష్ణువుచే విశ్వనాథునకు మ్రొక్కించెను. (బ.పు-ష.అ)

సోహర కక్కయ్య కథ :

విష్ణువే గొప్పయని జెప్పిన పురాణ భట్టు తల తఱిగి పొట్టలో పెట్టెను. కక్కయ్య ప్రసాదము స్వీకరించియే బసవేశ్వరుని అక్క నాగాంబికకు చెన్న బసవేశ్వరు కొడుకుగా జనించెను (బ.పు-స.అ) (వృ.శ-94 వ.) ఐదవ అధ్యాయమున వివరింపబడినది.

బి (15) కాలవాద ఖండన :

ఆరు వందల సంవత్సరములు జీవించిన సకలేశు మాది రాజయ్య కథ (శి.సా-422 పద్యము, బ.పు-తృ.అ).

ఇవి కాక భక్తికి సంబంధించిన కథలు గలవు. వానిని క్లుప్తముగాఁ బేర్కొనెదను.

శివభక్తిలేని తండ్రిని చంపిన చండీశుడు (శీసా-391 వ.) శివుని పాదములకు కన్నుల నర్పించి సుదర్శన చక్రమును పొందిన అచ్యుతుడు (శీసా-92 వ) కన్నుల నర్పించిన కన్నప్ప శీసా-424 వ తలల తఱిగి పూజించి దేవేంద్ర పదవి పొందిన రావణాసురుడు శీసా-395 వ ఇటువంటి వాడే జంబూరి మహాకాళయ్య (శి.సా-401 వ.) చేతుల నర్పించి పొందిన బాణుడు (శి.సా-396 వ.) గొఱియపాలు శివుని పై పిడకులుచుండ-నిష్ఠరము

లాడిన తండ్రిని చంపిన కాటకోటడు (శి సా 488-బ.పు వ్రి.ఆ) హుంగళలో సోమవారము రెండు కన్నులు సమర్పించి తిరిగి పొందిన శివనాగయ్య (శి.సా-399) బసవేశ్వరుడు ఇతని వ్రేళ్లను చిదిమి అమృతమును కురిపించెను. తల నర్పించి మూడు నాళ్లకు పొందిన గోవిందుడు (శి.సా-402, 403) ప్రకాశిత భక్తితో కైలాసమున కరిగిన వరగొండ చక్రవర్తి (శి.సా-404 ప.) శివలింగముతో కూడిన ఒడయపిళ్ళె (శి.సా-405 ప.) నిప్పులను చీర ముడిచిన శ్రీపతి పండితుడు (శి.సా 406 ప.) ఆరవ అధ్యాయములో చూడనగును. తంబికథ (శి.సా-407 ప.) శివుని నమ్మి పిలువగా 'ఓ' యని పల్కించిన కిన్నెర బ్రహ్మయ్య (శి.సా-408 ప.) బ.పు-పం.ఆ వృశ-82 ప, పండితారాధ్య చరిత్ర (మలయరాజు (శి.సా-409 ప.) హాలీలాస్తవముతో కైలాస మరగిన ఉద్భటుడు శి.సా-410 ప.) కడవలు చరచగా శివుడు నాట్య మాడెను-కుమ్మర గుండయ్య (శి.సా-411 ప.) ఒక పర్యాయము భర్తపై భార్యకు అనుమానము కలిగెను. కప్పెర నిచ్చి వారినిద్దరిని శివుడు కలిపెను. (బ.పు-చ-ఆ) వేశ్య తన వీపున వక్షస్థలమును ఆన్చి ఉండగా 36 శ్లోకములతో శివుని సంస్తుతి చేసి ఎల్లరు కైలాసమున కరిగిన మల్హణుని కథ (శి.సా-415 ప.) పం.చ.) అంబన (శి.సా-425 ప.) మృగములను జంపి శివలోకమున కంపిన తెలుగు జొమ్మయ్య (శి.సా-426 ప, బ.పు.పం.ఆ) పసిడి వాన కురిపించిన కరికాల చోడుడు (శి సా 427 ప ) గుగ్గులు మహిమ జూపిన ఓహిళుని కథ (శి.సా-430 ప, పండి.చ. (పాండ్యుడు (శి.సా-434 ప.) భక్తితో పాడుచు చేతి తాళములతో కైలాసమేగిన శంకరుడు (శి సా-435 ప.) పంతమున గుఱ్ఱముల, సతుల, పరిజనములతో కైలాసమరిగిన కుమారపాల ఘూర్జరుడు (శి.సా-437, పం.చ) శివునాడించిన చేరమ చక్రవర్తి (శి.సా-443 కన్నడు జమ్మయ్య (శి,సా-444 ప,) వీరచోడుడు (శ,సా-479 ప,) విక్రమ చోడ మహారాజు నిర్మించిన బంగారు గుడి కంటె మిన్నగా రత్నములతో నిర్మించిన పూసల నాయనారు (బ.పు.చ.ఆ).

ఈ రూపములన్నియు భిన్న మార్గములలో రచింపబడినను కేంద్రబిందువైన శివ భక్తి ఎల్లరకు సమానము. ఇది అందరికి సంబంధించిన సమతా గుణము, ఇక వీని నిర్వహణ ఎట్టిదో పరిశీలింపవలయును,

సి. నిర్వహణము :

పాల్కురికి సోమనాథుడు వీరశైవతత్త్వమును ప్రతిపాదించు సూత్రములను పండితారాధ్య చరిత్రయందును తన్నిరూపకమగు కథలను బసవ పురాణమునను గ్రహించెనని స్థూలముగ చెప్ప వచ్చును. వృషాధిపశతకమునందును పై రెండు గ్రంథములలోని కథలు స్మరింపబడియున్నవి శివతత్త్వసారము నందు శైవమతాచార వైభవము కీర్తింపబడియే యున్నది ఐనను కథా పూర్వక దృష్టాంతములతో పురాతన భక్తుల మహిమలను కీర్తించుట ద్వారా సోమన వస్తు రూప సమన్వయమును సాధించెను. ఇదియే నిర్వహణము.

ఇచ్చట సోమన గ్రహించిన భాషను గుఱించి, ఛందమును గుఱించి, శిల్పమును గుఱించి ప్రస్తావించుట అవసరము. రూపములను అంశము క్రింద ఇవన్నియు వచ్చును. దీనిని గుఱించి పూర్వపరిశోధకులు ప్రస్తావించియేయున్నారు. ఐనను మరికొంత చర్చింపవలయును.

సి (1) జాను తెనుగు :

వృషాధిప శతకమునందు 'బలుపొడ తోలు చీరయును పావవెపెనల్ గిలుపారు కన్ను' ఆఱువది రెండవ పద్యమునందు గల భాషను జాను తెను గందురు. ఇక బసవ పురాణమున

"ఉరుతర గద్య పద్యోక్తుల కంటె
సరసమై పరగిన జానుఁ దెనుంగు"

యని వివరించి

-ప్ర.ఆ, పుట-8-

'అల్పాక్షరముల ననల్పార్థ రచన' చేయుటయే వివేకమని గ్రహించెను. 'జాను తెనుగు విశేష ప్రసన్నత (పం.చ1 ; భాగము-18 పుట) కూర్చును. బౌద్ధ, జైన కవుల ప్రాకృత భాషాభిమానము దీనికి నేపథ్యమున మాతృకగా నున్నది. ప్రజా సామాన్యమునకు అర్థమగునట్లు చెప్పుటయే జైన, బౌద్ధులు పెట్టిన భిక్ష. -- కన్నడ శివశరణులు కూడ తమ వచనములను అతిసులభమగు భాషయందే రచించిరి. బసవని భాషయెటువంటిదో సోమన భాషయు అట్టిదే. ఆధునిక కవిభాష వంటిది.. ఇందు ఉద్రేకము తప్ప రసస్థితి లేదు. కనుక శబ్దము ఒక ప్రవాహముగా దూకుచు వచ్చుట గమనింపవచ్చును అభ్యుదయ విప్లవ కవిత్వము వ్రాయుచున్నవారు కూడ ఇట్లే ఒక వల్లవిని

లేదా పాద భాగమును పునరుక్తము చేయుట గమనింపవచ్చును.

'బాపురే! జంగమ ప్రాణలీన!'
'నల్లవో! జంగ మానవరత ప్రాణ!'

—పం.చ.దీక్షా ప్రకరణము-246 పుట

'మరో ప్రపంచం
మరో ప్రపంచం
పిలిచింది!'

ఇట్లు పునరుక్తి చేయుట వలన శ్రోతలో భావము గాఢముగా నాటుకొనును.

తర్వాత నిరలంకారముగ భాషయుండుట కూడ ఉద్యమ లక్షణమే!

'తొలి కోడి కనువిచ్చి-నిలిచిమైవెంచి
'కొక్కొరోకుఱ్ఱని' కూసినడ.

—బ.పు.-

'కల్లినాథుని చేతి కరవాలమనఁగ.
'కల్లినాథుని పీర కర్ణిక యనఁగ'

—పం చ దీక్షా.ప్ర.-246-పుట-

సాధారణముగ సోమన రచన ఉపమ కాని, ఉత్ప్రేక్ష కాని మాలగా కాని నుండ నుండును.

ఇట్లు ఉపమను అనుపమంబుగాఁ జెప్పుట జానపద కళాకారుల లక్షణము బుఱ్ఱ కథలయందు ఈశైలియున్నది.

సోమనాథుడు కావ్యకళలను గురించి ఇంకను చాల విషయములు వివరించెను. సత్కృతియనగా తొమ్మిది రసములు, అష్టాదశ వర్ణములు, ముప్పదియారు అలంకారములు, డెబ్బది రెండు భావములు ఉండవలయునని పండితారాధ్య చరిత్రలోఁ జెప్పెను.

"జాతులు రచనా ప్రణీతులు గావ్య
నీతులు రీతులు నేతులుట్టంగ"

—పండి-చ-దీక్షా ప్ర. పుట-19-

వీర కవులు కొనియాడునట్లుగా కవిత్వముండ వలయునని చెప్పెను, సోమన రచనయందు పౌరాణికమే తప్ప ప్రబంధ శిల్పము లేదు "రచన నన్నయ భాషకు సమీపముగా నుండునని" డాక్టరు హెచ్.యస్. బ్రహ్మానంద పేర్కొనినారు.

ఇట్లే తన కావ్య కళా ప్రౌఢి యెట్టిదో చెప్పుచున్నాడు.

"పటు గద్య పద్య ప్రబంధ సామ్యముగఁ
గావ్య కళా ప్రౌఢి గల్పింతు"

-పండి.చ-దీ.ప్రి.20 పుట-

వని చివరకు 'తిన్నని సూక్తుల' ద్విపద రచింతుననెను.

తిన్నని సూక్తులనగా అందరును అర్థము చేసికొనునట్టి నిరలంకార ములైన, ఆప్తవాక్యశైలిలోనని యర్థము. డా॥ చిలుకూరు నారాయణరావు గారు సోముని నవీన గుణములను ఇట్లు గ్రహించినారు అవి ఇరువది ఐదు. వానిని సంగ్రహించి మనము ఇట్లు చెప్పవచ్చును.

1. కథా వస్తువులో కొ్రత్తదనము.
2. శ్రుతి, స్మృతి వాక్యములను సంధించుట.
3. అలంకారనముల సంయమనముతో వాడుట.
4. ద్విపదను కావ్యోపయోగిగా మార్చుట.

సి (2) ఛందోవరణము :

ఇది ఒక గంభీర విషయము. ద్విపదకు గానయోగ్యతయున్నది. మాత్రా ఛందస్సు కావున భిన్న రీతులలో విఱువ వచ్చును. దీని నాధా రముగ ద్విపదను నన్నయ్య, తిక్కన్న, శ్రీనాథ నాచన సోముని వలె అనంత శయ్యలందు నడిపించుటకవకాశము దొరికినది. ఎట్లు నడిపించినను ద్విపదను ఉద్యమ ప్రచార ఛందస్సుగా స్వీకరించినాడు తప్ప శిల్పము కొఱకు కాదు. సోమనాథుని హాస్య రస పోషణ, వ్యాకరణ ఉల్లంఘన విష యము కూడ పునరాలోచింప తగినది. జనుల వ్యవహారమును, పలుకుబడి, మాండలిక పదజాలమును ఆయన యథాతథముగ నిక్షిప్తము చేసెను. కనుక సామాజిక వాస్తవికత సోమన రచనలో ప్రధానమైన అంశమని

గుర్తింప వచ్చును. సమతాదృక్పథమునకు ఈ వస్తు రూపములు మిక్కిలి సహకరించినవి.

చివరగా తక్కిన రచనలను గురించి ఒక మాట చెప్పవలయును. సర్వేశ్వర శతకము ప్రాబంధిక శైలిలో పుట్టినది తప్ప సోమన రచనల వలె మతోద్యమ ప్రేరణతో పుట్టినది కాదు. కనుక దానియందలి రూపము ప్రజా సామాన్య సంగ్రాహ్యము కాదు. ఒక్క ప్రభులింగ లీల మాత్రమే మరల ద్విపదలో పుట్టినది. కాని అందు కూడ సోమన రచనలోని పౌరాణిక ప్రసన్నత లేదు.

పాల్కురికి సోమనాథుని శైలిని ఎవరును అనుకరించక పోవుట ఆ శైలి ఆయన తోడనే అంతరించుట వీరశైవ ఉద్యమ గతికి ప్రతి బింబముగా నున్నది. వీరశైవము తక్కిన వైదిక హైందవ ప్రవృత్తిలో చాల వఱకు మిశ్రితమైగా సోమన నిర్వహించిన ద్విపద కావ్యశైలి కూడ అతనితోనే అస్తమించినది. తర్వాత కవులు కూడ సోమనను స్మరించినవారు కాదు-మన దేశములో వైదిక మతము తాకిడికి తాళలేక విఫలములైన అనేక ప్రజా ఉద్యమముల వలె మార్గశైలి ముందు సోమన శైలి రాహుగ్రస్తముగా మిగిలిపోయినది.

ఆధునిక యుగముననే అభ్యుదయ విప్లవ వాదులు శివ కవులను వేమ నను, గేయ కవులను ప్రకాశములోనికి తెచ్చిరి. "మీదు మిక్కిలి నన్నయ్య కోరిన 'జగద్ధితము' కన్న శివ కవుల 'జగద్ధిత' దృష్టియే మేలని" కె. వి. రమణారెడ్డి ప్రతిపాదించారు. ఇప్పుడిప్పుడే పాల్కురికి సోమన కవిత్వమును గురించి విశ్లేషణ మొదలయినది. ఇంత వఱకు వీరశైవ కవులను దేశి వాఙ్మయమును, జన జీవితమును, జానపద కళా రూపములను ఆచార వ్యవహారములను లిఖితము చేసిని వారుగానే పరిశోధకులు గుర్తించుచు వచ్చిరి. కాని శైవ కవి ఇట్లు చేయుటకు తత్త్వ దృష్టి కారణమని గుర్తించుట జరుగలేదు.

శైవునకు ప్రపంచమంతయు శివమయమే. పండితయ్య చెప్పినట్లు "చరా చర జగత్తంతయు సత్యము, ఏదియు మిథ్య కాదు". కనుకనే సోమ నాథులు లోకము నంతయు తమ కావ్యములందు నిబంధించిరి. ఇదియే వీరశైవ కవుల వస్తు రూప నిర్వహణ ప్రక్రియ.

## అధ్యాయము – 8

## వీరశైవ సాహిత్యములో కనిపించే జనసంస్కృతి :

(వీరశైవ మత తత్త్వము ఒక నూతన సంఘ వ్యవస్థకు పునాదులు వేసినది. క్రొత్తగా రూప కల్పన జేసిన ఒక ఆదర్శ సమాజమునకు వీర శైవ సాహిత్యము దర్పణము పట్టినది.

ఆనాటి సమాజములోని జన సంస్కృతి ఉత్కృష్టమైనది. అందలి విభాగములగు

1. రాజులు, మంత్రులు, పురోహితులు
2. వ్యావసాయిక జీవితము
3. వ్యాపారము–ధనము విలువ
4. జాన పదులు–గిరిజనులు పరస్పర సంప్రదాయములు
5. కుల వృత్తులు
6. భిక్షకులు–సమాజములో వృత్తి పరమైన ఉనికి

అనెడు అంశముల పరిశీలనము ఈ అధ్యాయములోని ప్రయత్నము.)

## కుమార సంభవము :

### 1. రాజులు, మంత్రులు, పురోహితులు :

క్రీ.పూ. 2000 సంవత్సరముల నుండి ఈ వర్ణాశ్రమ ధర్మములు పాటింపబడుచు ఉండవచ్చును. పురుష సూక్తములోని 'బ్రహ్మణోస్య ముఖ మాసీత్' అను మంత్రములో బ్రహ్మ ముఖము నుండి బ్రాహ్మణులు, బాహు వుల నుండి రాజులు, ఊరువుల నుండి వైశ్యులు, పాదముల నుండి శూద్రులు జన్మించిరని వివరింపబడినది.

" - - - బ్రాహ్మణులను సృజించి రాజులను సృజించి రాజులను వైశ్యులను శూద్రులను గ్రమం బొనరంగఁగల్పించె నాజాతులకు నోలినతని ముఖము బాహుల, నూరులుఁ బదములు సంభవ స్థానంబులగుటయుఁ''[1] అని శివుడు పార్వతికి వర్ణాశ్రమాచారంబుల నెఱింగించె–మహా భారతము–అనుశాసనిక పర్వము పంచమాశ్వాసము–5 వ.

---

1. తిక్కన–శ్రీ మదాంధ్ర మహా భారతము–7వ సంపుటము (1962 : పు 155)

మంత్రులనగా మంత్రాంగము నెఱపెడివారని అర్థము. వీరిని గురించి "సర్వము పపన్న యతి కౌటిల్యః, కార్య సామర్థ్యాది పురుషా సామర్థ్యం కల్యతే, సామర్థ్యతిశ్చ"[2] అని కౌటిల్యుడన్నారు. ఆలోచన చెప్పగల వారు మంత్రులని, ఇతరుల మాత్యుని వివరణయున్నది.

పురోహితులు-పౌరోహిత్యము జేయువారు లేక యజ్ఞ యాగాది క్రతువుల నిర్వహించుచు కర్మ కాండ చేయించుచు పురమునకు హితము గూర్చువారని అర్థము.

ఎ. రాజ చిహ్నములు :

షణ్ముఖునకు తారకాసురునకు యుద్ధము జరుగుచుండెను. పరమేశ్వరుడు శక్త్యాద్యనేక రాజ చిహ్నముల దయజేసెను. తల్లి పార్వతియు

'వజ్రమయ వర్మ భర్మ మయ మయూర వాహ కుక్కుట ధ్వజ, ధవళాత పత్ర, పంచమహా శబ్దాద్యనేక రాజ చిహ్నంబులు పేర్కొనబడినవి. (10 ఆ. 116 వచనము 266 పుట)

బి. రాజ సభ :

రాజ్యమును వివిధ స్థాయులలో పరిపాలించు వారి వివరములున్నవి. కుమార తారక యుద్ధ సందర్భమున పరిస్థితులను సమీక్షించుటకు ఒక సభ ఏర్పాటు చేయబడినది. ఆ సభలో

'అనంత మండలిక, మహా సామంత, దండనాయకామాత్య"
భృత్యాద్యఖిల జనములు' యుండిరట

(11 ఆ. 33 వచనము 288 పు)

సి. చరితార్థము :

రాజును మంచిగ ప్రీతితో సమస్త జనులు కొలుచు చుండిన అట్టి రాజు ధన్యుడగునని తెలుపుచు

'మంచిగఁ బ్రీతిఁ బాయక సమస్త జనంబులు ధన్యుఁగొల్వఁజీ
వించిన ధనుఁడా మహిమ వీడిన జీవము మేనల్చునా'-(10 ఆ 198 వ 280 పు)

2. డా. పుల్లెల రామచంద్రుడు-భారతీయ విజ్ఞాన వేత్తలు (1983 : పుట 59)

మహిమ కోల్పోయిన తర్వాత సేవకుడయి మనుట నీచమనియు, ఆర్జించిన కీర్తి నిలుచునట్లు యుద్ధములో చచ్చుట మేలని రాజు, కవిరాజుయైన నన్నెచోడ కవిశిఖామణి అన్నాడు.

డి దేవాలయములు :

ఇవి సాధారణముగా స్వర్గ సోపాన విలసితములు మణి గణ ఖచితములు (7 ఆ 115 వ) పండిత వరులైన భూసురులు నగరములో నివసించుచుండిరి. అందున రాజాస్థానములలో సంబంధ బాంధవ్యములు కలిగిన విప్రులు విధగా వేదాచార్యులు, వేదాధ్యయన తత్పరులు. (7 ఆ-117 వ.) వీరు శివ ధ్యాన నిరతులు (7 ఆ-117 వ).

ఇ. జీవితను :

నన్నెచోడుని కాలములో రాజు తన సేవకులకు జీతము ఇచ్చే పద్ధతి అమలులో నుండెను. కోశాగారము నుండి ధనమును దెప్పించి కుప్పగా బోసి ఎవ్వరెవ్వరి కెంత ఇవ్వాలో ఆలోచించి ఇచ్చేవారు.

"భావజ విభుదలి శుకపిక
సేవక తతికెడరు దీర జీతము సేయం
గా వెలిఁ బోసిన పసిడుల
ప్రోవులు నాఁ దమ్మిలెలఁ బూచె ఔదాగై"

-(4 ఆ 92 వ 82 పు)

మన్మథుడు తన సేవకులైన తుమ్మెదలు, చిలుకలు, కోకిలలు ఇత్యాదులకు జీతము లిచ్చుటకు కుప్పబోసిన బంగారు నాణెములవలె తామరలు పూచాయని భావము. ఎడరు లేక యనుట వలన సకాలములోజీతములందక బాధపడు వారున్నారని, అలాంటివారు జీతము లందిన రోజున ఈ కాలములోని వారి వలె ఆనందించేవారని భావింపవచ్చును.

రాజగు నన్నెచోడుడు జీ(వి)తముగా జొన్నలిచ్చే విధానమును ప్రవేశపెట్టారు.

ఎఫ్. యుద్ధ భూమి :

యద్ధ భూమిలో గుడారములు వేసికొనుచుండిరి. (11 ఆ 3వ 287 పుట) దేవ గణాధీశ్వరునితో పాటు వివిధ శస్త్రాస్త్రములు ధరించిన యోధులు దక్ష

ప్రజాపతిపై యుద్ధము చేయుట కేతెంచిరి.

> "స్థూల సమున్నతాంగులు చతుర్భుజ ఫాలత లాక్షశూలకా
> పాల కఠోర కార్ముక కృపాణ ధరుల్"
>
> (2 ఆ 62 వ 35 పు)

శూలములను, కార్ముకములను, కృపాణములను ధరించిన సైనికులుండిరి. కుమారునకు, తారకాసురునకు జరిగిన యుద్ధములో విలుకాడు, సవడికాడు కొంతంబు కాడు, ఈటి కాడు, చురియకాడు, గుంటుకాడు యుండిరి. ఈ వివరణ 11 ఆ. 110 వ. 302 పుటలో నున్నది. కవదొనలు, విండ్లును, కత్తలంబులు, గుత్తములు, గరవాలములు పలకలు, ఈటె, అడ్డరములు యున్నవి. ఇంతటి సవివరమయిన శస్త్రాస్త్రములను వర్ణించిన కవి మరి యొకడు కానరాడు. అదియు రాజగుటచే సులభమయినది. కుమార తారకులు తమ బలముల కుంజేయి వీచిన సుర అసుర వీరులు తాకిన యుద్ధ ఘట్టములో

> "పరశులు గొంతముల్ గదలు భల్లములమ్ములు విండ్లుగంకటుల్
> సురియలు వజ్రముష్టులు౯ డ్రిశూలము లీటెమ మండలాగ్రముల్
> పరిఘలు జక్రముల్పపులు పాశములంకుశముల్ సబళ్లును
> ద్గరములు దోమరంబులెడ గత్తులు శంఖులు భిందివాలముల్."
>
> –(12 ఆ 5 వ 321 పు)–

వివిధ ఆయుధములతో పోరిరి. వీనితోపాటు వేతి యంత్రముల నుండి విడువబడిన ముక్త మొదలగు ఆయుధములున్నవి. యుద్ధములలో ప్రారంభమును సూచించుటకు చేయి వీచుటయు, తిరిగ యథాస్థానమును జేరుటకు మరొక విధముగా చేయి వీచుటయు నాటి పద్ధతి.

జి. వినోదములు–వేట :

తారకుడు మునుప్ర దేవతల నోడించి వారి వాహనములను గ్రహించి వినోదించు సందర్భములో నాటి రాజుల వినోదములు తెలియ నగును. ఎద్దు–మృగముతోను, ఏనుగులు–సింహము, గరుడుడు–భేరుండాది పక్షులకు,పోతు–గుఱ్ఱములతోను పోరుచుండెను. (4 ఆ 23 వ 70 పుట).

హెచ్. శిక్షలు :

పదకొండవ శతాబ్దములో శిక్షలు చాల కఠినముగా నుండెనని తెలియుచున్నది. "హత్యానేరమునకు మరణ దండను యుండెడిది. ధనాపహరణమునకు 1000 నుండి 2000 రూకల వరకు అపరాధముగా చెల్లించెడివారని"3 బి.ఎన్. శాస్త్రిగారి అభిప్రాయము. "ఎఱ్ఱగా కాలిన ఇనుప గుండును చేతిలో పెట్టుకొని కొంత దూరము నడచిన ఆతని చేయి కాలినచో దోషియని లేనిచో నిర్దోషియని నమ్మెడివారని"4 డా. పుల్లెల రామచంద్రుడు వివరించుచున్నారు. తక్కువ నేరము చేసిన వారికి నాలుక కోయుట, కన్నులు పీకుట (2 ఆ 84 ప 38 పు) గలవు. దక్ష యజ్ఞము ధ్వంసము చేసిన సందర్భములో గణాధీశ్వరులు

"మునిమను-జాసురాహిసుర ముఖ్యుల వీపుల తోళులెత్తగా
మును గుదిగట్టి మోదియును, ముందల కట్టులు గట్టి కొట్టియున్
చర్మ పటంబులు దిగ్గనొల్చియున్
-(2 ఆ 78 ప 38 పు)-

వీపుల మీద చర్మము లేచిపోవునట్లు కొట్టుట, ముందున్న సిగలతో ఒకరి తలను మరొకరికి కట్టుట, శరీరము మీద ఎక్కడయినా బూది చర్మము లేచే తట్టుకొట్టుట యుండెను. నాలుక కోసి ఉప్పు నింపుట, ద్రవు ద్రవమును శరీరమునకు పూయుట, లోహము కాచి నోటిలో పోయుట, చర్మ పటలము ఒలుచుట మొదలగు శిక్షలు అమలు జరుపబడుచుండెను. (2 ఆ 84ప. 39పు) ములుగుది కట్టుట, ముందల కట్టుట, వెడకేల కట్టుట, తల బండల యెత్తుట (2 ఆ పు, 79-38పు) నారకోచిత దండములు (2 ఆ 82 ప-38 పు) (2 ఆ 84ప-38 పు) అలనాటి కొన్ని శిక్షలు.

2. వ్యవసాయిక జీవితము :

3. డా.యం. బుడ్డన్న-తెలుగు వాఙ్మయము-శివకవియుగ వైశిష్ట్యము (1984 : పు 380)

4. డా.యం. బుద్దన్న-తెలుగు వాఙ్మయము-శివకవియుగ వైశిష్యము (1984 : పుట 380)

విశేష శ్రమ తీసికొని జీవించు వర్గము వ్యావసాయిక జీవితము గల వారని నిర్వచనము.

"వ్యవసాయం ఉత్తమమని
వ్యాపారం మధ్యమమని
ఉద్యోగము అధమమని" అందురు.

ఎ. పంటలు :

వరి, జొన్న, చెఱుకు పంటలు, ములుకులు, వంగ నిమ్మలు, మాదీఫలములు, పనసలు, నారికేళములు పండుచున్నట్లు తెలియనగును. 'హాలిక నితంబినీతతి ప్రయత్నము నందమ కాచియున్న యక్కల ముపనాలి' (7 ఆ-91 ప-167 పు) కలమ వనముగగా వరి మళ్ళ చిలుకలు వరి యెన్నులను నోట కఱచు కొని పైకి ఎగిరి పోవుచున్నవట (6-120-141 పుట) ఆటవికుల ఆహారధాన్యములో వెదురు బియ్యము నుపయోగించిరి. తమాలలు అధికముగా పండించెడి వారని (5 ఆ-15 వ-91 పు) విశదమగును. జొన్నలు గొన్న బుఱంబు నీగుడున్. (11 ఆ-42 వ-290 పు)

బి. బండి నిర్మాణము :

మన్మథుడు రతీదేవికి కామతత్త్వ మహత్వంబు దెలిపిపరమేశ్వరుపైఁ బోవ నుద్యుక్తుడగుచు వసంతుడు తెచ్చిన రథమును వర్ణించు సందర్భమున నన్నెచోడుడు రథ నిర్మాణమును ఎంతో విపులముగా వర్ణించెను.

వంక తుహంబులు బండి కండులు, చంప
కంబుల నొగ అుత్పలంబు లిరుసు
గరవీరములు పలు గాడి — — — కొయ్య — గోడి పీట
—సీలలు, — మెట్టులు, — మెట్టు గుదెలు, —పలుపులు
—పగ్గములు, — గాడి, — కోల, — మనుకోల

-4 ఆ 83 వ 81 పు-

ఇట్టి బండికి కందియనలు పూసెడి వారట, (2 ఆ 3 వ.) రైతు గ్రామ సృష్టికర్తగా (1 ఆ 73 వ.) నిలచెను.

సి. జల యంత్రములు :

పంట పొలముల కాలువలలోనికి నీరు మళ్ళించుట ఉపయోగపడునది. ఇందు ఒకరాట్నముండును. ఇది ప్రధానమైన చక్రము. ఈ చక్రమునకు కుండలు కట్టి, పిడి సహాయమున త్రిప్పుచుందురు. లేదా ఎడ్ల సహాయమున లాగిస్తూ నీళ్ళుతోడుచుండిరి. ఇలాంటి జల యంత్రమును 'గుండ్రల రాట్నము'గా వ్యవహరింతురు ఇవియేకాక కర యంత్రమును గూడ నుపయోగించుచుండిరి. (9 అ-51 ప. 9 అ-89 ప) ఈ కాలములో గుండల రాట్నమును పేర్కొనెను. అది యొక యుద్ధ పరికరముగ ఉపయోగింప బడుట విశేషము.

"ఎగయు శిరంబులు నభమున
గాఁగ్రమ్మెడు రక్త జలము లొలుకుచు భువి పై
____________________
____________________
____________________
గుగ నోలిన రాటనమున ఁగుండలఁ బోలెన్"

(11 అ 171 వ 312 ప)

డి. అచ్చొత్తించుట :

నాడు పశు సంపద అధికము గనుక కొందరు యజమానులు తమ పేర్లను పశువులపై అచ్చొత్తించే వారట.

తారకాసురి బారి నుండి రక్షింపుమని బృహస్పతి బ్రహ్మను కోరు సందర్భమున తారకాసురుని ఆగడముల నుగ్గడించుచు

"కనకాద్రిగొని పోయి తనకెక్కయాడని
జారామ భూమి-గ్రీడాద్రిజేసె
- - - అమరారి దనపేరి యచ్చులు వెట్టించి
సురధేను సమితిఁ గీలరము సేసె'

-4 అ 11 వ-68 పు-

దేవతల ఆవులగుంపును ఈడ్చుకొనిపోయి తన పేరును అచ్చు పెట్టించెనట.

వ్యాపారము-ధనము విలువ :

వీరిది వ్యాప్తి లేక వ్యాపించు గుణము. ఒక ప్రదేశము నుండి మరి యొక ప్రదేశమునకు పోవుచు పదార్థము, వస్తువుల యొక్క క్రియ, విక్రయములు నిర్వహించుచుండిరి. కోమట్లు కోటికి పడగెత్తినట్లు వారి మేడలపై ధ్వజములుండినవట (7 ఆ 120 వ-172 పు). వీరు బ్రాహ్మణులకు విరివిగా గోదానము చేసిరిఁ (7 ఆ 121 వ). కుబేరుని ధన సంఖ్య నవ నిధులు మాత్రమే కాని పట్టణ వాసులైన వైశ్యుల ధనసంఖ్యఅసంఖ్యాకమట.

"ధనము ధన సంఖ్య నవనిధు
లన విని యాదేశనామమతనికినీ ; మే
మొనర నసంఖ్యార్థేశుల
మని ధనపతి నుఱరుపేర్మి నవ్వరి వైశ్యుల్"

(7 ఆ-117 వ) 171 పు-

పెరికెలు ఆ కాలములో వస్తువులను బండ్లపైన, ఎడ్లపైన, దున్నపోతులపైన వేసికొని ఒక చోటు నుండి మరియొకచోటునకు తరలించుచుండిరి. ఎడ్ల మీద వేసికొని తీసికొని పోయే ధాన్యము సంచులను 'పెరికెలు' అందురు. 'పెరికె' అనగా ఒక పెద్ద గోనెసంచి. దాని మధ్య భాగములో రెండరలేర్పడే విధముగా కుట్టుదురు. ఈ అరల్ని సరుకులతో నింపి రెండు దిక్కుల మూతులు గట్టిగా కట్టుచుండిరి. సంచి మధ్య భాగము జంతుల వీపులమీద ఆనేట్లు తీసుకొని పోవుచుండిరి.

"ఇక్కు ముట్టి చక్కె నెక్కగ మఱచి సం
భ్రమముఁ బొంది పిఱఁద బ్రమథ గణము
లార్వ బోతు మీదనడ్డంబు పడియు పె
రికెవోలె"

(2 ఆ 73 వ) 37 పు-

యముడు తారకాసురి ధాటికి తట్టుకొనలేక దున్నపోతుపై ఉవ్వసంచివలె అడ్డంబుగ పడియుండి పారి పోయెనట. అంగళ్ళ గురించియు నన్నె చోడుడు ప్రసక్తిఁ దెచ్చెను.

(చూ: యరి. చెన్నప్ప-ప్రాచీన కావ్యాలు-ప్రాచీన గ్రామీణ చిత్రణ-1988 : పుట 224)

"................................................ సత్కు
ద్వృత్తి గతి వీథిలో సుభ
గోత్రము లంగళ్ల మెఱయుచుండుదు రెలమిన్"

—7 ఆ 120 వ 172 పు—

4. జానపదులు-గిరిజనుల పరమ్పర సంప్రదాయములు :

జనపదములలో నివసించు వారిని జానపదులని, గిరులలో నివసించు ప్రజలను గిరిజనులని అందరు. ఆనాడు గ్రామములకు పురి, పురములని వ్యవహారము.

పల్లె జీవితము 35వ పుటలో వర్ణింపబడినది.

"................................................ క
గలిక ములుకకాయకెత్తు గల్లు గానగ నేల? ము
న్నెలుక వేటి కుఱుమతిండి యేల?

—2 ఆ-60 పద్యము-35 పు.—

అని వినాయకుడు శంభునితో పలుకు సందర్భమున కొంత గ్రామీణ వాతావరణమును వర్ణించెను. ములుకు కాయ సున్నితమైనది వ్యంజనములోనికి, శాకములలోనికి ములుకు కాయను ముమ్మరముగా వాడుదురు. వానిని పగుల గొట్టుటకు ఎత్తైన కల్లు అవసరమని ఈశ్వరునితో విఘ్నేశ్వరుడు విన్నవించెను. మన్నెలుకయనగా మట్టిలోని చిట్టెలుక

'క్రిక్కిదమైన సత్కృతియగు ర్పగుంగ్రాకిం జేకు లావకం
దొక్కినయట్లు' (1 ఆ 38 వద్యము 7 పు) కుక్కను గూడ నన్నె
చోడుడు వర్ణించెను.

ఎ. పుళిందులు :

అచలాధీశనందన తపంబు జేయుటకు పోవుచుండగా 'పుళిందుల'ను చూచినది. వారి రూపు రేఖా విలాసములను నన్నెచోడుడు మన కళ్ళకు కట్టినాడు. పుళిందులు చమరి మృగము యొక్క తోకలను, నెమళ్ళ యొక్క పింఛములను ధరించి

"చమరీ వాలములున్ మయూర వర పింఛప్రాతముల్ గండశృం

గములున్ సూకర వేణు నాగఘవ ముక్తాజలముల్ ఋక్షచ
ర్మములున్ సింహనఖంబులున్ మధువులున్ మాంసంబులున్ దాల్చిరౌ
ద్రిముతో వచ్చు పుళిందులం గనిరి కాంతారాంత రాళంబునన్"

–6 ఆ 39 వ 127 పు–

సింహము యొక్క గోళ్ళను ధరించిరి. మధువును త్రాగి మాంసముతో బాటు వచ్చిరట.

బి. గౌడు గీతములు :

ఇదే సందర్భములో వన్నెకాంతలు 'జీటిక కల్లు త్రాగి' 'గౌడు గీతములు' పాడుచు రమించిరట.

"జీటిక కల్లుద్రావి మదసింధుర గామినులన్ని కెటియల్
వాఱుచు గౌడు గీతములు వాడుచు ..........................

.......................................... వన్నెకాంతలుఁ రమింతురు".

–6 ఆ 45 వ 128 పు–

సి. లలిత కళలు :

గౌరి తపము జేయుటకు వెళ్ళుచు మున్యాశ్రములలోని మునులను చూచి వర్ణించు సందర్భములో నన్నెచోడుడు 'సంగీత, సాహిత్యము'లను రుచి చూపించెను.

"భారతి నడ పాడు గతులన మెలువ
తలకొని క్రాలు పద క్రమములు
.......................... వీణారవంబు నాఁ
.......................... సామ గానములును

..........................................................

.......................... శబ్దార్థ శాస్త్రములును
వాగ్దేవి మంజుల వాక్యంబులనగ" (6-56-130 పు)

పరమేశ్వరుడు వివాహ ప్రయాణము గావించు చున్నప్పుడు 'గీత వాద్యములు', 'పాఠక పఠనోరు రావములు' 'శంఖ కాహళాధిక' నినదంబుల నన్నెచోడుడు వినిపించెను. (8 ఆ.24 వ-186 పు) అదే విధముగా కుమారుడు

తారకుని సంహరించిన తర్వాత యువరాజ పట్టాభిషేక సందర్భమున 'గీతా తోద్యంబుల' (10-110-265) కూడ చెప్పబడినవి.

డి. శాస్త్రములు :

నన్నెచోడుని కాలములో అనేక శాస్త్రములు వృద్ధి చెందియుండెను. 'ప్రాణాయామాదిషడంగోపాంగ సకలయోగి జనారాధితుండు.' అని జంగమ మల్లికార్జున దేవుని (1_56-10) పొగడెను. యోగము చెల్లింప మన్నయని వర్ణించుట చేత (5-2-90) యోగము తప్పని సరియని తెలియ నగును. శీతల క్రియలు ' - - మేనత్తరి, అలనలు పార్వతికి శీతలక్రియ వెలయున్'-(5-149 14) వరుస వేది 'తెచ్చిన, వరుసున నవవిపుల ఫేనమకులు మెలంగున్' (1-117-21) 'పరుసువేదు లం బొండ హాటకంత శిఖల్ గాగి, కన కంబులగు (7-144-176) ప్రచారములో నుండినది. అంజనము- 'అమలా క్షదీప్తుల, న్గతి నంజనము గన్నుంగవ సమర్చి' (9-10-116) వారు నుండిరని తెలియనగును

ఇ. కుల వృత్తులు :

"సమా వంపసథ గ్రామౌ"యని అమరకోశము. సంస్కృతములో ఊరు అనే అర్థములో 'సంవసథం, 'గ్రామం' అనే రెండు పర్యాయ పదము లున్నవి. 'సంవసంతి అత్ర' (దీనిలో నివసిస్తారు) అనే ధాతువుపై 'నున్' ప్రత్యయము జేరి ధాతువులోని సకారమునకు 'అ' కారము ఆదేశమై గ్రామ శబ్దము ఏర్పడినది.

ఎ. గ్రామము :

'గ్రసనం' అంటే భోజనము, ఆహారము అనే అర్థములున్నవి. ఆహా రమునకు ఉత్పత్తి కేంద్రమయిన ప్రదేశమునకు గ్రామము అనే పేరు ఏర్పడినది. మార్కండేయ పురాణములో శూద్రాది వర్గములు నివసించి కృషిచేయుట కనుకూలమైన స్థలము గ్రామము అని పేర్కొనబడినది.

"తథా శూద్రజన ప్రాయా
సుసమృద్ధ కృషీవలా
క్షేత్రోప యోగ భూమధ్యే
వసతిః గ్రామ సంజ్ఞకా"

కుల వ్యవస్థ పుట్టుటకు వృత్తి పరమైన వర్గీకరణము కారణమని 'ఇబట్‌సన్' పేర్కొనెను.

బి. వృత్తులు :

గ్రామ పరిపాలనా బాధ్యత పండ్రెండు వృత్తుల వారి అధీనములో నుండెడిదని తెలియుచున్నది. అవి: 1. గ్రామాధికారి 2. న్యాయాధికారి 3. కరణము, 4. గన్తి (జలధారల అధికారి), 5. తలారి, 6. జ్యోతిష్కుడు 7. కమ్మరి, 8. కుమ్మరి, 8. వడ్రంగి, 10. చాకలి, 11. మంగలి, 12. గ్రామోపాధ్యాయుడు. (చూ: యం. చెన్నప్ప-ప్రాచీన కావ్యాలు-ప్రాచీన గ్రామీణ చిత్రణ (1988 : పుట 262)

శివతత్వ సారము :

మల్లికార్జున పండితారాధ్యులు రచించిన కొన్ని శతక లక్షణములు గల గ్రంథము. పండితారాధ్యుల భావము, శైలి గమనించినచో నన్నెచోడుని ప్రభావము చాలవరకు ఉన్నదని నిర్ధారింపవచ్చును.

ఎ. బావుల నిర్మాణము :

రాజులు నీటి వసతికై లోతు పెడల్పైన బావులను నిర్మించెడివారని తెలియుచున్నది. ప్రజలకు నారలు తెలియుననియు, వానితో తాళ్ళను తయారు చేయుచుండిరని కవి వ్యక్తపరచినాడు.

"జడ నిధి పెడల్పు లోతును
కడు నెఱుగుపె నూతి"-238వ పద్యము
"భూతములు దర్భ తాళ్ళను
హోతల మెడలంట గట్టి"..303వ పద్యము
"నారలు తలకెక్కినట్లు నానావిధ సం, 'సారులు'
—193 ప.

బి. గుడి :

పూజా సమయములో గుడిలోపల వెలుగు పెట్టు ఆచారము, గంట మోగించుట కలదు. పండుగలను యథాశక్తితో చేయుచుండిరని పండితారాధ్యులు తన కాలము నాటి వ్యవస్థను వర్ణించెను.

"నీ పురమునకున్ శివ ! నీ
ధూపావసరమున ఘంట తోడనె భక్తి"-430 ప.

"గుడి లోపల నలుగు వెట్టు కొన్న-న భీష్టం
బడుగగ నవ్వివ దుర్గతిఁ''
-283 ప.

" యథాశక్తిం
బండుగ సేయుదురు రుద్ర-భక్తులకు శివా"
-283 ప.

బి. వేశ్యావ్యవస్థ :

ఆనాడు వేశ్యావస్థ చాలా ప్రాముఖ్యమును పొందియుండెను.

"తన లంజయునుం బిల్కయు
దన లంజియు బంధు జనులు దానును జనడే!''
-415 ప.

డి. చాటింపు :

ఆ కాలమునాటి సాంఘిక వ్యవస్థ తీరు తెన్నులు స్పష్టమగుచున్నది. ఒక వార్త ఊరంతా తెలియుటకు చాటింపు వేయు ఆచారము నేడును గ్రామములలో గలదు.

"అక్షయము రుద్రాక్ష విభూ
తిని యుక్తుల యిండ్ల దిక్కుఁ దెసఁ బోవకుడో
యని చాటించును" -118 ప.

ఇ. శిక్షలు :

ఆ రోజులలోనే కులస్త్రీలను జారులు బలిమి వడ్డుచుండిరనెడి దుస్థితి గలదు.

"కలియుగమున జారులచే
బలి మిఁగుల స్త్రీలు వడ్డ-భంగిన హరః నీ"-307 ప.

ఇట్టి దుష్కృత్యములను చేసిన వారిని కోపముతో ముక్కు కోసేడివారట (308 ప), ఎడమ చనుమొనను చిదిమెడి వారట (314 ప.) మరియు "శూలముతోఁ బొడిచి చంపుచుండిరని కలదు. ఇట్లు శిక్షలు కఠినముగా మన్నట్లు తెలియ వచ్చుచున్నది.

యఫ్. వెట్ట :

ఆనాటి సంఘములో వెట్టి-వెట్ట గొనెడి వ్యవస్థ ఉన్నట్లు తెలియ వచ్చుచున్నది.

"కడ చేసి వెట్టగాంగొని
నడిపనం గటకమున సురియ చముం డయ గారిన్"
—423 ప.

జి. శాస్త్రములు :

మత గ్రంథములు రచించు చున్నప్పుడు వాని ప్రమాణతను నిరూపించుటకు ఆగమ శాస్త్రములు ధృవ పత్రములు. పండితారాధ్యుని కాలమున వ్యాప్తిలో నుండెను.

"శివశాస్త్ర పురాణ వచన సిద్ధాంత గతిన్" —222 ప.

మరియు—"సంధి, జ్ఞాన బహువ్రీహి మాన్ప" అనుటచే వ్యాకరణ శాస్త్రముకు తగిన ప్రాధాన్యత యుండెడిదని అభిప్రాయము.

బసవ పురాణము :

పాల్కురికి సోమనాథ మహాకవి బసవ పురాణము, పండితారాధ్య చరిత్రలు పండ్రెండవ శతాబ్దపు సాంఘిక వ్యవస్థకు దర్పణములు.

1. రాజులు-మంత్రులు-పురోహితులు :-

ఎ. రాజులు :

వీరశైవ సాహిత్య కాలము 11వ శతాబ్దము నుండి 13వ శతాబ్దము వరకు నిర్ణయింప బడినది అప్పట్లో కర్ణాటక, ఆంధ్ర దేశములు ఒక్కటిగా భావింపబడేవి. అందుచేత రెండు రాష్ట్రాల మధ్య రాజకీయ, ఆర్థిక, సాంఘిక పరిస్థితులు—నాటి జన సంస్కృతి ఒకటిగా కన్పించును.

"కర్ణాటక రాష్ట్రములో కీ.శ 1151లో రాజకీయ మార్పులు వచ్చెను. చాళుక్య రాజ్యమునకు జగదేక మల్లుని తర్వాత మూడవ తైలడు రాజయ్యెనని, ఆనాడు లభించిన అన్ని శాసనములలోను బిజ్జలుడు శైవుడనియే కలదని"[5] ఆర్.సి. హీరేమఠ్ ఉటంకించుచున్నారు. కాని చెన్న బసవ

5. R.C. Hiremeth—Essay in 'Sri Basavesvara'
(1967 : Pages 22, 23)

పురాణములో జైనుడని వక్రముగా చిత్రీకరింపబడినది. కనుకనే వీరశైవమును వ్యాప్తిలోనికి తెచ్చిన "బసవేశ్వరుని తన పండ్రెండు మంత్రులతో పాటుగా ప్రధాన మంత్రిగా, భాండారిగా, న్యాయాధికారిగా కూడ" నియమించెను. ఆ కాలములో అగ్రవర్ణముల వారు కొందరు మాత్రమే లోక బోధకులయి, కొందరు ఆనంద మగ్నులయి లోకములకు మఱి పడ్డ వారుండిరి-(ప్రథమాశ్వాసము, 14వ పట) మరి కొంధరు భక్తులు ఏ మాత్రము శారీరక శ్రమ లేకయే జీవించిరి. గురు, లింగ, జంగమ ప్రసాదంబులను చుబ్బన జూఅల దేల్చుట 'కయి బసవడు ఆవిర్భవించెనని (ప్రథమాశ్వాసము. 15 పుట) తెలియు వచ్చుచున్నది. "భూరమణందు శృంగారంబు సేసి"-(ద్వితీయాశ్వాసము 67 పు) కొనిడివాడని పాల్కురికి సోమనాథ మహాకవి వర్ణించెను. "నగిషి పని గల కటి వస్త్రము ధరించి, ధనుర్ధారులయి వేటలో పాల్గొనె వారనియు" అరుద్ర తెలియజేయుచున్నారు. "రెండవ ప్రతాప రుద్ర మహారాజుచే కాశి నుండి గంగోదకమును దెప్పించి పాల్కురికి సోమన అభిషేకము జేయించుచుండెనట"[6] అని ఏకామ్రనాథుడు వర్ణించియున్నాడు.

"ఆ రోజులలో రాయలసీమ, తెలంగాణాలు కళ్యాణీ చాళుక్యుల పాలనలో యుండేవని"[7] కంభంపాటి సత్యనారాయణ తెలియజేయుచున్నారు. కళ్యాణ కటకము 12 ఆమడల నగరము "మండలము, విషయ, నాడు, కంపన, రాణాలుగా రాజ్యము విభజింపబడియుండెను. రాష్ట్రపతి, విషయపతి ఆయుక్తక, రాష్ట్రకూటులు అధికారులని"[8] కంభంపాటి సత్యనారాయణ వివరించుచున్నారు.

బి. మంత్రులు :

ఎంతాంగము తెలుపువారు మంత్రులని అర్థము. నాటి మంత్రుల లక్షణములను పాల్కురికి సోమనాథుడు ఇట్లు తెలియజేయుచున్నాడు.

6. ఏకామ్రనాథుడు-ప్రతాపరుద్ర చరిత్రము (1984 : పుట 57)
7. కంభంపాటి సత్యనారాయణ-ఆంధ్రుల సంస్కృతి-చరిత్ర 1 (1988 : పుట 175)
8. కంభంపాటి సత్యనారాయణ-ఆంధ్రుల సంస్కృతి-చరిత్ర 1 1988 : పుట 178)

"................................................ వినయోక్తి పరుడు
నిరాజ్యమంతయు నిబుపంగఁ గలడు
దూరీకృతా ఘుండు దోర్బలాధికుఁడు
విను మఖిల కళా ప్రవిణాడెట "

—ద్వితీయాశ్వాసము 60వ పు..

మంత్రులు వినయోక్తి పరులనియు, శౌర్యము, దూరీకృతము కళా ప్రవీణత కలిగి యుండిరనియు అంప మించి దయగలవారనియు బసవేశ్వరునకు బిజ్జలుడు దండనాయక పదవి ఇచ్చు సందర్భములో నాటి మంత్రులను గురించి బలదేవ మంత్రి వివరించెను. బిజ్జలుని మంత్రి బసవేశ్వరుడు రెండవ ప్రతాప రుద్రుని మంత్రి 'ఇందుటూరి' అన్నమయ్యలు బ్రాహ్మణులు. ఆ కాలములో మంత్రులుగా చాలవరకు బ్రాహ్మణులుండిరని తెలియు గలదు. రాజు ప్రధాన మంత్రికి మొక్కు చుండెను. రాజు తాన ధిరోహించిన భద్రేభముతోను మంత్రులు తోడు రాగా సంగమేశ్వరమునకు వెళ్ళి బసవన్నను ప్రధాన మంత్రిగా నుండునట్లు రాజు ప్రార్థించి గౌరవములతో ఆహ్వానించుట విశేషము (ద్వితీయా శ్వాసము-43వ పుట).

ఆ కాలములో ప్రధానమంత్రిరాక సందర్భములో 'గీత గద్య పద్యములతో' స్తుతియించువారని విదితమగుచున్నది.

"హృద్యంబుగా గీత గద్య పద్యములఁ
జోద్య తరంబుగా స్తుతియించుచుఁ యి"

(—ద్వితీయా శ్వాసము 66 పుట)

స్త్రీలు ప్రధాన మంత్రిని గురించి గొప్పగాఁ జెప్పుకొనుచుండిరి. (ద్వి ఆ. 68వ పు). రాజు మంత్రిని చాల ఉన్నతుడుగా భావించుచుండెను. రాజ్యమునకు, రాజునకు మంత్రి పతిగా భాసించెను దీని వలన మంత్రి యొక్క అవినాభావ సంబంధము తెలియుగలదు.

సి. పురోహితులు :

బ్రాహ్మణ వాక్కు రాజునకు వేద వాక్కుగానుండెను. అట్టి "పురోహితులు వేద వేదాంగాలలోను, అధ్వర-హింస లేనివి-ప్రక్రియలలోను నిష్ణాతులయి

దైవ మానుష ఉపద్రవమునకు ప్రతీకారము జేయ గలిగిన వారిని పురోహితులుగా నియమించెడివారని[9] డా. పుల్లెల రామచంద్రుడు తెలియ జేయుచున్నారు. నాటి బ్రాహ్మణులు కూడ రుద్రాక్షలు ధరించెడి వారట.

డి. రాజ సభ :

పాల్కురికి సోమనాథ మహాకవి తన కాలము నాటి రాజ సభను చిత్రించినాడు. మర్యాద, హుందాతనము పాటింపబడుచుండెను. (పంచమాశ్వాసము 555 పుట). సభలో ఎవరెంతమంది యుండిరో బసవన్న విష మారగించునెడ మనకు తెలియజేసినారు.

"బండారులను నడ బాళ్లc బ్రెగ్గడల
దండనాయకులనుc దంత్రి పాలకుల
దాస జనులను విశ్వాసుల భట్ల
చతుర గాయక నిజస్తవ పాఠకులను
మండిత సత్కవి మండలినెల్ల!"

—సప్తమాశ్వాసము 556

ఆ రాజ సభలలో బండారులు, దండనాయకులు, తంత్రి పాలురు, కావ్య విశారదులు, నిజస్తవ పాఠకులు, పండిత, నర్తక, పరిహాసకులు మండిత సత్కవులు యుండిరట. సంఘ ఔన్నత్యాన్ని బట్టి వారు సభలో ఉపవిష్టులగుటకు ఉచిత సింహాసనములు ఏర్పాటు చేయబడియుండెను. పండ్రెండవ శతాబ్దములో వర కవులుండిరి. (ద్వితీయాశ్వాసము, 74 పుట), వారెవరో తెలియరాలేదు. బహుశా కావ్యాలంకార శాస్త్ర కవులేమో? వీరు కూర్చుండుటకు శంఖ పీఠములుండెను. (105 పుట)

ప్రతి రాజు బలవంతునిగా నుండెను. బిజ్జలుని సైన్యములో రథములు వాడుకలో నుండెను. వారి కేతనముల వయి వృషభములుండెనట. చతురంగ బలములలో గజ బలంబు ఏడు నూర్లట. అశ్వములలో అనేక రకములుండెను. పండ్రెండు వేల ఉత్తమాశ్వములు యుండినట్లు పాల్కురికి వివరించినాడు. పదాతి దళములో 12 లక్షల సైన్యము యుండినదట.

9. డా. పుల్లెల రామచంద్రుడు-విజ్ఞాన వేత్తలు (1953 : పుట 61)

మంత్రులు 12 మంది 13వ మంత్రి ప్రధానిగా బసవేశ్వరుడు నియమింప బడెను (బ.పు 64 పు).

ఇ. భవనములు :

రాజులు, రాణులు నివ్యాంబరములు ధరించెడి వారట (131 పుట). వారు నివసించు హర్మ్యములు సమున్నతముగా, అందముగా నిర్మింపబడెడివి. వారికి విలాసవంతమయిన పుష్పాగారము ఉండినవట. ఒక మందిరము నుండి మరొక మందిరమునకు వెళ్ళుటకు స్ఫాటిక సోపానము లుండెను. (తృతీయాశ్వాసము 134వ పుట). కాల సూచన తెలుపుటకు, 'భేరులు, నగారాలు, శంఖములు' మ్రోగింప బడుచుండినవని తెలియగలదు. సందర్భాను సారముగా పంచ మహా శబ్దానావములు మ్రోగింపబడుచుండెనని యు సోమనాథుడు తెలిపినాడు.

యఫ్, దేవాలయ నిర్మాణము :

పాల్కురికి సోమనాథుని కాలములో దేవాలయ నిర్మాణము కొంత తెలియగలదు. రాజులు, వర్తకులు దేవాలయములను నిర్మించు చుండిరి. శ్రీశైలము నుండి శివలింగముల కొని వచ్చి క్రొత్తగా నిర్మించిన దేవాలయములలో ప్రతిష్టించుచుండిరి (96వ పుట.) మఠములు కూడ చాల అధికముగా నుండెను. ప్రతి గ్రామములో మఠములుండినవి. కొద్దిగా వైష్ణవాలయములు కూడ యుండినవి. శివాలయములను శివాగారములని పిలుచుచుండిరి. (96వ పుట). భక్త-సద్భక్త కూటములు జరుగుచుండెను. వాని ప్రాముఖ్యత అధికము. ఓరుగల్లులో పాల్కురికి సోమనాథుడు బసవ పురాణము పఠించు సందర్భమున ఇటువంటి సద్భక్త కూటములు తటస్థపడును. ఆ కాలములోని దేవాలయ నిర్మాణమును బసవ పురాణములో సోమనాథుడు తెలియజేసెను. (252వ పుట).

"ప్రాకారమును ముఖ భద్ర మంటపము
శ్రీకరంబుగ స్వర్ణ శిఖరంబు గుడియు"
–(ద్వితీయాశ్వాసము 98వ పుట)–

'బల్లేశు మల్లయ్య కథ'లో బల్లేశుడు శివాలయ నిర్మాణము గావించినట్లు తెలియుచున్నది. నాటి ఆలయ నిర్మాణ చాతుర్యము నేటికిని తెలియుచున్నది. గుడి చుట్టు ప్రాకారమును ముఖ భద్ర మంటపమును, స్వర్ణ

శ్రీ డమును విరచించిరి. దేవాలయముల చుట్టు అగడ్తలుండుట (337వ పు.) విశేషము. దేవాలయములలో దీప కంభంబు లెత్తించినట్లు (ప్రథమాశ్వాసము-12వ పుట) గుగ్గులు వేయువారు, నేతితో దీపమును వెలిగించుచుండిరి (షష్ఠాశ్వాసము-421వ పుట) భక్తులకు ప్రసాదము కొదువ లేకుండ యుండినదట. ఆనాడు వీరభద్రి పళ్ళెముల కూడ ఆచారమయ్యెను. దేవాలయములలో బహిరంగ నృత్యములు జేయుచుండిరి. గర్భగుడికి అభిముఖముగా నృత్యవేదికలుండినవట. రాజులు నిత్యము దేవాలయములను దర్శించెడివారు (105వ పుట).

**౩. ఉద్యోగ చిహ్నములు :**

పడి హారులు మరపు లేఖ, నంది పడగ ధరియించుట విశేషము. వివిధ శాఖలలో పని చేయువారికి వివిధ చిహ్నములుండినవని ఊహింపవచ్చును.

**౪. నాట్య నృత్యములు :**

ప్రజలు నట నాట్యములందును వివిధ గీతము లాలపించుట యందు ప్రవీణులు. వినోదములందు మక్కువ గలవారని తెలియుచున్నది.

> " కోలాటమును బాత్రిగొండ్లి పేరణీయుఁ "
> గేళిక జోకయు లీలనటింపఁ

(ప్రథమాశ్వాసము-50వ పుట)

కోలాటము ఒక నృత్య వినోదము. కోలల సహాయముతో ఆడబడును. కనుకనే కోలాట మయినది. గొండ్లి అనే ఆటను తప్పెళ్లాటగా 'ఆంధ్ర భాషార్ణవము' పేర్కొన్నది. పేరణి ఒక నృత్య విశేషము. త్రిపురాంతకుని ఉత్సవములలోఁ కూడ కోలాటములాడినట్లు కవి పేర్కొనినాడు. ప్రజలు తాళగతులలో, వీధి-వీధులలో ఆడుచుండెడివారని (6-453 పుట) తెలియవగును.

> 'పంచిన వివిధ వాద్యంబులు దమ్మ
> టంబులు నిస్సహణంబులు సెలగి

--------------------------------

కొన్నువారు"

—2.66 పుట—

ఐ. నాటకోత్సవములు :

రాజు విధిగా నాటకోత్సవములను జరిపించుచుండెను. (441 పుట) జయము పొందినవారికి జయపత్రము లొసంగబడుచుండినవట. వైజకవ్వ కథ'లో ఏకాంత రామయ్య జైనుని శిరమును ఖండించినపుడు ఒకనాట కోత్సవమును పాల్కురికి తెలిపి ఆనాటి నాటకముల ప్రాముఖ్యమును ఉగ్గడించెను.

"వివిధ నాటక మహోత్సవము లొప్పార
వల చేతవలుగ డావలి చేత శిరము
దులు కాడ వీధి వీధుల మెఱయుచును
జతులు పెట్టగఁ దాళగతుల కాడుచును"

—షష్ఠాశ్వాసము 453 పుట—

ఏకాంత రామయ్య-జైన శిరమును ధరించి ఆడిన విధము నాటి సాంఘిక ఆచారములను దెలియ జేయుచున్నది. ప్రజలు తాళగతులకొ వీధి వీధులలో నాడుచుండిరని కవి చక్కగా చిత్రించెను. సంగీత ప్రక్రియలో తాళ సంఖ్యలను, వీణాభేదాలను, రాగములను పేర్కొనెను. సకలేశ్వర మాది రాజయ్య కథలో ప్రారంభములో ఏడు తాళములను, అనంతరము ఇరువది యేడు శుద్ధ తాళములను పాల్కురికి సోమనాథుడు పేర్కొనెను. దాదాపు నలుబది వరకు వీణా విశేషములను అనేక రాగములను వర్ణించి నాటి కళామ తల్లి యొక్క వైభవమును, ప్రజల ఆరాధనను చిత్రించెను. (208 పుట)

వై. బొమ్మల నాటకములు :

సోమనాథ కవి కాలములో ప్రజలకు బొమ్మల నాటకములనిన చాలా అభిమానము ఉండెడిది.

"ప్రకటిత కపట నాటక సూత్రములను
వికృతి ప్రకృతు లార్చు వెండీదు నతడు"

—బ.పు.-4వ ఆ.-228వ పుట—

బసవడు మడివాలు మాచయ్య మహిమను జెప్పు సందర్భములో బొమ్మల నాడించు వారి ప్రసక్తి గలదు. అట్టి వానిని 'పెండీడు'అని పిలిచేవారట. బొమ్మలకు దారములు కట్టి నాటకములను ప్రదర్శించు కళాకారులు ఆ కాలములో నుండిరి. నేడు వీరిని ప్రోత్సహింప వలసిన అవసరము యెంతేని యున్నది.

కె. సాంగ నాటకములు :

పండితులను ఆకట్టుకొను నాటకములు కూడ ఆ రోజులలో ప్రదర్శించుచుండిరి.

'అటుగాక సాంగ భాషాగ క్రియాంగ
పేటు నాటకంబుల నటియించువారు'

బ.పు.-4 ఆ-289 పుట

జంగమ రూప ధారియగు శివుడు హలాయుధునకు సిరియాలుని మహిమ తెలియ జేయు సందర్భములో ఆ కథను నాటకంబుగ ప్రదర్శించిరట.

యల్. వినోదములు :

ఆ కాలములో జూదము, ఫలక పాచికలు, దాయము సారులు ఇదరి జాలము లుండినవి. (6-374 పు) అటవీ జాతులలో పాముల వాళ్లు ప్రదర్శన లిచ్చుచుండిరి.

యమ్ శిల్పము :

"క్రీస్తు శకము పండ్రెండవ, పదమూడవ శతాబ్దములలో తెలుగు దేశమున ఒక ఉద్యమముగా వర్ధిల్లి వికసించిన కళను 'కాకతీయ శిల్పం'గా గుర్తించి, దానికి కళా పరిణామ చరిత్రలో గల స్థానమును, శిల్పముగా దాని స్థాయిని అంచనా వేసికోవలసిన అవసరము ఉంది"10 అని చలసాని ప్రసాదరావు తెలియజేయుచున్నారు. యుద్ధరంగములో మహిళల ఉధృతిని ప్రతిబింబించే శిల్పము యున్నది. "మహిళలు గజ సాహిణగా ప్రసిద్ధికెక్కి గజ బలములో ప్రాధాన్యత వహించిరి."

"మద గజములపై నాయుధముల ధరించి అధిరోహించిన శిల్పం" నాటి యుద్ధములో సైన్యములోని స్త్రీ పాత్రను చాటు చున్నది. ఈ శిల్ప

ములన్నియు అభించుటచే అప్పటి సైన్యములో స్త్రీ ప్రాముఖ్యత తెలియ
చున్నది.

యస్. నేరము–శిక్ష :

ఆ కాలములో దొంగల భయము లేదు. నాటి ప్రజలు నైతిక వి
వలను, భద్రితను సోమనాథ మహాకవి వర్ణించెను. రాజు, మంత్రి వ్రజ
ఫిర్యాదులను స్వీకరించుచుండిరి. అసత్యము వచించు వారికి శిక్షలు
వము. వారి నాలుక కోసి, సున్నము పూసి పొల వేయించెడి వారట.

చోరులు గృహములలో దొంగ తనములు గావించు విధానము
వారు ఉపయోగించు పరికరములను బట్టి గ్రహింవ నగును. ఇట్టి వ
చాల అరుదని తెలియనగును.

1 2 3
"కత్తియు బలపంబుఁగావి చీరయును
4 5 6
గత్తెర యిసుము నక్షతలును ముండ్ల
7
బంతియు నీలి కప్పడమును ద్రిండు
8 9
మంతర కాటుక మఱిచండ వేది
10 11 12
సెలగోల యొంటట్టె చెప్పులు బీకె
13 14 15
యొలుకుల బూడిదయును నాటు ఱాలుఁ
16 17
గుక్కల వాకట్టు ఁగొంకి నారసము
18
గ్రక్కునఁ గంకటి రజ్జువు నమర"

–పంచమాశ్వాసము, 362వ పుట–

"త్రవ్వుటకు బలపమునుపయోగించి చేవల పట్టుటకు గాలము
నట్లు ఇంట్లో వస్తువులను కన్నము ద్వారా చీరతో పైకెలాగేవారు. ఒక్క

సందర్భములో కొండికి బదులుగా ముండ్ల బత్తిని ఉపయోగించినట్లు తెలియుచున్నది. చీకటిలో కనబడకుండుటకయి నీలి కప్పడమును, శబ్దము రాకుండుటకయి-మరియు కిందికి దిగేటప్పుడు, పైకి లాగేటప్పుడు ఆ వ్యక్తి దేహము గట్టిగా ఒరుసుకు పోకుండా ఉండేటందుకు దిండును ఉపయోగించి యుందురు. కుక్కలు మొరగకుండుటకు వాకట్టు మందులను వాడారు. మూలికలతో తయారు చేసిన మంతర కాటుకను గుప్త ధనమును తెలిసికొనుటకు వాడిరని"'11 దేవినేని ప్రసాదరావు వివరించిరి.

## 2. వ్యావసాయిక జీవితము :

వ్యవసాయ దారుల భూములు, అగ్రహారములు, ధాన్య సంపద, పశు సంపద-రైతుల జీవన సరళిని అధ్యయనము చేయవలసియున్నది. వేద కాలమునకు ముందు అడవులను ఎంత వరకు నరుకుకొనిన అంత భూమికి యజమానులు అయ్యేడి వారట.

## ఎ. వ్యావసాయ భూములు :

"ఆ కాలమునాటి సాగుబడిలో కల భూములను వివిధ రకాల నీటి పారుదల సౌకర్యములను బట్టి రెండు విధములుగా విభజించుచుండిరి. మొదటి వర్గములో నదులు, వాగులు, కాలువలు, చెరువులు, కుంటలు, బావుల ద్వారా సాగు అయ్యే భూమిని 'నిధి మాత్రిక'లందురు. వర్షము మీద ఆధారపడియున్న భూములను 'దేవ మాత్రిక'లందురు. ఇది రెండవ వర్గము. భక్తులు చెరువులను నిర్మించుట (6-426 పు) సప్త సంతానములలో ఒకటిగా పరిగణించిరి. అందుచేతనే ఒక చెరువు కట్టిన, కాలువ త్రవ్విన, ఒక ఆలయమును నిర్మింపజేయుట విధిగా నిర్ణయించిరి. దేవాలయములను, భవనములను, చెరువులను వీటి సన్నింటిని సామంతులు పర్యవేక్షించు చుండిరి. ఆనాడు ఎవరైతే నిర్మించేవారో వారికి చెరువు క్రింద పదోవంతు భూమి పన్ను మినహాయించి రాజు యిచ్చేవాడట. దీనినే 'దశబంధం అనేవారు. రాజులు మరియు మంత్రులు ప్రజలకు లేక గ్రామ సభలకు కొంత ఆర్థిక సహాయము అందజేసినట్లు తెలియుచున్నది. అటవీ ప్రాంతాలలో

---

11. దేవినేని ప్రసాదరావు-తెలుగు వైజ్ఞానిక మాస పత్రిక (మార్చి 1987 : పుటలు 75-76)

చేపట్టిన నీటి పారుదల ప్రయత్నాలను బట్టి చూస్తే సుమారు 700 సం॥లు పూర్వమే గిరిజన ప్రాంతాలలో కూడ స్థిర వ్యవసాయము చోటు చేసికొన్నదని నిర్ధారించుటకు ఆధారము లున్నవి"[12] అని బి. దయాకరరావు విపులీకరించినారు.

బి. కొలతలు :

వ్యవసాయ దారులలో సెరవాటి కాపులు, నాచుకొండ కాపులు ఉండిరి. భూమిని నేడు ఎకరములలోవలె నాడు కుంటలలో కొలుచుచుండిది. కుంట అవగా 44 × 100 మూరలు గల పొలము. ధాన్యమును కొలుచుటకు 'మరుత్తు ఖండిక, తూము, కొంచెము, పుట్టి వాడుకలో నుండెనని' పాల్కురికి సోమనాథుడు పేర్కొనెను. తేడర దాసయ్య కథలోని పొట్ల చెఱువు-ఒక గొప్ప చెరువు కూడ! ఆ ఊరి చెంత యుండెనేమో? (షష్టాశ్వాసము 426 పు).

సి. నిలువ జేయుట :

ధాన్యమును 1 పాతరలు, 2. గాదెలు, 3. గుమ్ములు, 4. కొట్టరువులు (గరిసెల)లలో నిలువ యుంచుకొనుచుండిరి.

"మును పాతరల ధాన్యమును బండ్ల పూన్చ"
"తివిరి కొట్టరువు గాదియు ప్రవచ్చి కొనుచు
భువి ప్రతిష్టుండయ్యె"

-బ.పు-460 పుట-

ధాన్యములను కొట్టరువులలో పోసెడివారు! కొట్టరువు కొట్టు అయినవి. కొట్టు అనగా అంగడి.

డి. కూలి :

నిర్ణీత పనికాతుండ ఏ పని దొరికిన దానిని చేయు చుండిరి. 'కొడవలి గడియించు కొనుచు 'గైకూలి' (బ.పు.316వ పుట) యుండినది. నేడదిం 'గైకిలి' అయినది. 'చేకూలి గాని, పని వెలగొని చేయు బంట్లకు రాశిగొనవచ్చునే' (349 పు) అని వారికి విలువ లేదని తెలియుచున్నది.

---

12. బి. దయాకరరావు-తెలుగు వైజ్ఞానిక మాస పత్రిక (మే 1989 : పుట 50).

ఇ. పశువుల పోషణ :

కొందరు గోవులను కాయుచుండిరి. సోమనాథుని కాలములో ఇండ్లలో పశువులను కట్టుటకు గాడులు యుండినటుల నిమ్మవ్వ కథ వలన వ్యక్తమగుచున్నది.

> "గాడి లోపల వైచి కసువుపై డిగిచి
> వేడుక మదిం దులు కాడంగ మఱియుం"
>
> -చతుర్థాశ్వాసము 277 పు-

కసువు వేయుటకు ప్రత్యేక ప్రదేశములున్నట్లు, పశువుల పెంపకములో శ్రద్ధవహించినట్లు వర్ణించెను. ఎద్దులను కట్టి బండ్లు రవాణాకు వాడినట్లు తెలియును. బండికి పొనకలు కూడ యుండినవి (చతుర్థాశ్వాసము 320వ పుట, సప్తమాశ్వాసము 540వ పుట). ఆ ఎద్దులకు గంటలు, మువ్వలు, గజ్జెలు కట్టెడి వారని సోమనాథుడు ముసిడి చౌడయ్య కథ ద్వారా వ్యక్తము చేసెను. పశువుల అలంకరణ విషయములో చాల శ్రద్ధ వహించిరి.

> "ఓనరంగ వింత చెన్నొలయంగ గంట
> లును మువ్వలును గజ్జలును మ్రోయు చుండ"
>
> -పంచమాశ్వాసము 375వ పుట.

యఫ్. ఆహారపు అలవాట్లు :

కాపులు శాకాహారులుగా జీవించిరి. వీరు అనేక రకములయిన కూరగాయలను పండించుచుండిరని తెలియుచున్నది. పాడి పశు సంపద సమృద్ధిగా నుండెవని విదితమగును.

జి. ఆయుధములు :

పండ్రెండవ శతాబ్దములో నుపయోగించిన ఆయుధముల వివరములను సోమనాథ మహాకవి తెలియజేసెను.

> " ............................. ముద్గరమునం
> గుర్వాజ్ఞయును కతి కుంతంబునందుం
> వాడి సురియుం జేపట్టి
> ----- తోమరము ----- కుఠారము

విల్లు- - - బల్లిగోల- - - అడ్డాయుధము"

-పంచమా శ్వాసము 396 పుట-

హెచ్. పశు మందులు :

ఆ రోజులలో ప్రతి గ్రామములోను ఉమ్మడి పశు సంపదలు ఉండేవి. ప్రజలు ఆవు, గేదె, మేక, గొర్రెలను పాల కొరకు పెంచుచుండిరని తెలియ వచ్చుచున్నది. ఇరుగు పొరుగుల వారితో 'పోరు సంభవించినప్పుడు పశు వులను రక్షించుటలో మరణించువారికి 'స్మారక చిహ్నములు'గా వీరస్తంభ ములు-Hero Pillars-వంటివి నాటుచుండిరని తెలియ వచ్చుచున్నది"[13] అని అర్. శేషశాస్త్రి మరియు పి. చెన్నారెడ్డి వివరించుచున్నారు.

ఐ. వీర కల్లు :

Hero stones are those where human figures are engraved commemorating the heroic action-such heroes are defied and shrines were erected to the stones set up in their memory and regular worship is offered to them by the local people It is significant that such a practice continued till today for which the hero temples of pala-nadu can be cited as a Good example.

"ఆత్మ త్యాగములు సంఘ శ్రేయస్సు కొఱకును మతపరముగ భగ వంతుని చేరుటకును జరిపిన ప్రయత్నములకు సాక్షీ భూతములుగా మిగిలిన శిల్ప శాసన సహిత రాళ్లు వీనికి గుడులు కట్టుట కూడ ఆనవాయితీ యుండె వని"[14] అర్. చంద్రశేఖరరెడ్డి తెలియజేయుచున్నారు

జె. జల యంత్రములు :

పాల్కురికి సోమనాథుడు తన కాలమునాటి సాంఘిక వ్యవస్థను విపు లముగా వర్ణించెను. ఆనాటి జలయంత్రమును వేదాంతపరముగా అన్వ

13. R. Seshasatry and P. Chenna Reddy-Essay on 'Virasaivism-Memorial Stones (1988 : Pages 1,2)

14. R. Chandra Sekhara Reddy-Essay on Veerasaiva-Hero Stones in A.P. (1968 : Page 1).

యించుట జరిగినది. బసవడు బల్లహునకు మడివాలు మాచయ్య మహిమను వర్ణించునప్పుడు తెలియజేసెను.

"పటు వరివర్తన భ్రమణంబుఁ గూర్చి
కీలు పొందించి యాంత్రియ రాటనముల
వాలి యాడించు నా వడ్రంగి యుతడు"

-చతుర్థ 238 పు.

ప్రాణులను కుండలను కర్మ చక్రమునకు కట్టుట వలన ఏర్పడు తిరుగుళ్ల గమనించి 'జల యంత్రమును' రూపొందించిన వడ్రంగి యతడు అనే భావము పై పద్యములో నున్నది.

కె. పన్నులు-వసూలు :

"రాజులు మంచి ఆదాయము నిచ్చుతోట భూములను దేవాలయమునకు దానము చేయుచుండిరి. దేవాలయములకు, మఠములకు, ధర్మ సంస్థలకు భూములు ఈ విధముగా వచ్చినవే యని భూదానముల గురించి తెలియ నగును. భూములున్న వ్యక్తుల నుండి రాజులు భూములు కొనేవారు. పన్నులు వసూలు చేయుటకు తోటలు, తరి సాగు, మెట్టసాగు భూములుగా విభజించుచుండిరి. ఆనాటి పన్నులు వసూలు చేయు పద్ధతులు కూడ తెలియుచున్నవి. పన్నులు వసూలు చేయుటకు ముగ్గురు అధికారులుండిరి. వారు ప్రభుత్వోద్యోగులు, వర్తక శ్రేణులు, పన్ను గుత్తలుండెనని"[15] కంభంపాటి సత్యనారాయణ వివరించుచున్నారు.

యల్. వెట్టి చాకిరి :

గృహములలో పనిపాట జేయుటకు భృత్యులుండెడివారు. వీరు 'యజమానుల కనుసన్నఁ 'జేసన్న'తో మెలిగెడివారు. వీరితోపాటు వెట్టి చాకిరిచేయు వారుకూడయుండిరి. ఒక కూలికి ధన మవసరమయిన యజమాని వద్ద అప్పుగాఁ దీసి కొనును-కొన్ని సంవత్సరములకు ఆ అప్పు అసలు వడ్డీతో రెట్టింపగును. దీనిని తీర్చ లేని పరిస్థితులలో ఆబాకి తీరువఱకు చాకిరి జేయవలసి యుండును. ఇది ఒక్కొక్క సందర్భములో తర తరముల

15. కంభంపాటి సత్యనారాయణ-ఆంధ్రుల సంస్కృతి-చరిత్ర 1 (1988 : పుటలు 181,182,186).

వరకు సాగును. నేడు ప్రభుత్వము దీనిని నిషేధించినది.

ఎ. వ్యాపారులు-ధనము విలువ :

ఇది ఉత్తమము, అధమముకాని మధ్యస్థమైన జీవన వృత్తి. పాల్కురికి సోమనాథుడు తన కాలములో "కోటికి వడగెత్తిన" (ప్రథమాశ్వాసము 12వ పుట) వారుండిరని తెలియ జేయుచున్నాడు.

3 వ్యాపార వర్గములు :

"వ్యాపారులకు 'బలంజా' కుల బిరుదయ్యేను. కొన్ని గ్రామాలు, నగరాలున్న ప్రాంతానికికో శ్రేణి, ఆ శ్రేణికో సమితి, దాని ద్వారా ఆ ప్రాంతములో వ్యాపారము జరుగుచుండెడిది. అందులో 'తెలీలు' బెజవాడ ప్రభువులని, వైశ్యులు పెనుగొండ ప్రభువులని, వీర బలంజాలు బీజాపురము జిల్లా వారని అంటారు. వీరిని 500 కుటుంబాలనియు, వీరిని ఐహూల ప్రభు లందురు. వీరి దేవుళ్ళ కూడ వేరుగా నుండినారు. ఒకప్పుడు మొత్తము 714 వర్తక కుటుంబము లుండేవని వైశ్యపురాణము చెప్పుతుంది. వర్తక సంస్థలకు 'నాగరము' అని పేరుయుండెడిదని"[16] కంభంపాటి సత్యనారాయణ తెలియజేయుచున్నారు. వ్యాపారులలో పెరిక సెట్లు యున్నట్లు బసవ పురాణము (2-98 పు) గలదు పరస్పర వినిమయమునకు ధాన్యము నువయోగించుచుండిరని శంకర దాసి కథ వ్యక్తము చేయును.

"నూలికి మొదలును గూలియు నిచ్చు
నోలి కిం గొలుచిచ్చి చేలం గొన్నట్టి
యీాగి చెల్లింపక యెట్లు నాచేతం
జాగెద''వని పోయి శంభుని నాగు"

—4-265వ పుట-

బి. ధాన్యము_కొలతలు :

పాల్కురికి సోమనాథుడు తన కాలమునాటి ధాన్యము కొలతలను ఎంతో వివరముగ తెలిపియున్నాడు. అవి:

16. కంభంపాటి సత్యనారాయణ-ఆంధ్రుల సంస్కృతి-చరిత్ర 1 (1988 : పుటలు 188,190,191).

1. సోల, 2. మానెడు (4 సోలలు), 3. కుంచెడు (4 మానికలు), 4. ఇరుస (2 కుంచెములు), 5. తూమెడు (4 కుంచెములు), 6. పుట్టి (20 తూములు)·

తవ్వెడు-2 సోలలు
అడ్డెడు-2 మానికలు
"పాటి తూమునకును పాటి యొనేని౯
పాటింప సోలయుఁ బాటియకాదె" -బ.పు-1-9పు.
"ఎక్కవఁ దఱుఁగవు నేను మానికలు"-4-258 పు.
"చిక్క జేసినను గుంచెడుగాని లేవు" " 5-352 పు.
"ఇమ్ముల నిత్యంబు నిరుసయుఁ గొలుచు" 5-348 పు.
"పడయుమ పుట్టెడు వందుమునుముక" - 4-265 పు.

సి. దూరము-కొలతలు :-

దూరమును కొలుచుటకు కూడ స్పష్టముగా కొలతలు తెలియుచున్నవి. అవి. 1. వ్రేలెడు, 2. సల్లెడు, 3, జుట్టెడు, 4. జానెడు, 5. మూరెడు, 6. బెత్తెడు, 7. బారెడు.

రెండవ విభజన ప్రకారము :

1. కూగెడు, 2. అంత, 3. పాటెడు: 4. ఆమడలు.

డి. ద్రవ్య మానము :

సోమనాథ మహాకవి తన కాలము నాటి ద్రవ్యపు విలువలను చక్కగాఁ జేర్కొన్నాడు.

అవి రాజనారాయణ గద్య, సురభిగద్య, త్యాగగద్య, బిరుదగద్యలు వాడుకలో నుండినవి. గద్య అనగా బంగారు నాణెము. అవి 88 గ్రైన్లు బరువు కలిగియుండును. 1. కాసు, 2, వీసము, 3. తారము, 4. రూక 5. పాతిక, 6. మాడలు వాడుకలో నుండెను. రూక (బ.పు.332 పు), పాతిక (బ పు.332 పు), మాడ (చ.అ. 153). రూకకు 34 వళ్ళ ధాన్యము లభించు చుండెడిదట. (పంచమా-335 పు) 73 గ్రైన్ల బరువు కలిగినవెండి లేక బంగారు నాణెము యుండినదట. నూరు కాసులు ఒక పణము. 60 గ్రైనుల బరువు కలిగిన 'క అంజు' నాణెము కూడ యుండినది.

ఇ. గణన పద్ధతి :

ఆ రోజులలో నాణెములను, కుప్పగా పోసి యుంచి నాలుగేసి తీసి వేరు వేరు కుప్పలుగా వొక దిక్కునకు తోయుచు లెక్కించుచుండిరి. సోమనాథుడు దానిని చాకమనెను

"వెక్క సంబందంగ వేయి మాడలను
చక్కగా నెన్నితి చాకంబు ద్రోచి"

-బ పు-145 పు-

ఇది 'కుచ్చము' అని వ్యవహరింపబడుచున్నది

యఫ్ సముద్ర వ్యాపారము :

నాడు "సముద్ర వ్యాపారము విశేషంగా వృద్ధి చెంది యుండెను. రెండవ ప్రతాపరుద్ర మహారాజు కాలములో గోదావరి నదిపై సైనికులు దాటుటకు కొన్ని వేలపుట్లు సిద్ధంగా నుండెను"ని ఏటూరు బలరామమూర్తి తెలియజేయుచున్నారు పశు చర్మముపైన గల్లి లోపల వెదురు దబ్బల నిర్మాణమును కలిగినట్టి అర్ధ చంద్రాకారములోగల పడవ లాంటి వాహనము. పుట్టి

జి. పరిశ్రమలు :

లోహ పరిశ్రమ వృద్ధి చెందినది (6-410 పు) వస్తువుల మీద పన్నులు విధింపబడుచుండెను. కొన్నవారికి ఆవస్తువుల పయి గుర్తులు వేయుచుండిరట (పంచమా శ్వాసము 361 పు) పంచ లోహములతో విగ్రహములు తయారు చేసెడివారు(చతుర్థా శ్వాసము-267 పు) (సంతలు-మడి, మైల సంతలు జరుగుచుండెను)

4, జాన పదులు-గిరిజనుల సంస్కృతి :

పురజనులమ జాన పదులందురు. గిరులలో నివసించు ప్రజలను గిరిజనులని పిలిచెదరు (3-183 పు). వీరు ప్రకృతి ఒడిలో వసించుచు సహజ సుంధరముగ పవిత్రముగా నుందురు వీరి జనసంస్కృతికి సంబంధించిన సామెతలు కోకొల్లలుగా ప్రాచుర్యములోనున్నవి. వీరికి సంబంధించిన కథలు బసవ పురాణములో అనేకములు గలవు. ద్వితీయా శ్వాసములో బసవడు గొల్లెత చల్ల కడవ బడకుండ బట్టిన కథ (2-107వ పుట). తృతీయా

శ్వాసములో బెజ్జమహాదేవి (3-151వ పుట). గొడగూచి (3-160వ పుట) ఉడుమూరి కన్నప్ప (3-180వ పుట) నిమ్మవ్వ కథ (చతుర్థాశ్వాసములో -276వ పుట)పంచమా శ్వాసములో గొటియ కథ (-333 పుట) మరియు తెలుగు జొమ్మయ్య కథ (5-389 పుట) సప్తమా శ్వాసములో గుడ్డవ్వ గారి కథ (528 పు)లు గలవు. సోమనాథుడు వారి జనసంస్కృతిని చక్కగా వర్ణించెను.

ఎ. గోపాలురు :

పాల్కురికి తనకాలము నాటి గోపాలుని మాది రాజయ్య కథలో తెలియుజేసెను. మల్లికార్జునదేవుడు మాదిరాజయ్య భక్తిని పరీక్షింపదలచి గొల్లవాని వేషములో దర్శనమిచ్చెను.

"బలుపు వ్రేళ్లును మెట్టు పాదముల్ గజ్జ
చిఱు తొడలును దొప్ప చెవులను - - - -

మేక పిల్లలఁ దస చాకిట నిఱికి"

—తృతీయా శ్వాసము 224, 225వ పు.—

ప్రక్కటెముకలు కనిపించుచూ, నరములు ఉబ్బుకొని, దోనికడుపును కలిగి లొత్త వడిన చెక్కిళ్ళు, బొక్కి బొమ్మును, నిక్కిన మెడతో వల్ల మీసములు పిల్లిగడ్డము, ప్రాకు గట్టిన పండ్లు బద్ధ చేతులను వర్ణించెను. ఇది నాటి దళితజనులజీవన విధానమునకు దర్పణము.

బి. పాత్రలు :

సోమనాథ మహాకవి ఆరోజులలో నిలువ యుంచుటకు పనికి వచ్చు పాత్రలను పేర్కొనెను. అవి గురుగులు, బానలు, కుండలు, గొడగూచి ఇంట్లో గురుగుల్లో "పోతెలున్నవి వంపుపోయి తెచ్చెద". "ఉట్టిపైన బానలో - - - - నెయ్యి" 'కుండెడున్నది - - - - పుల్లకండంబు" అని తెలిపి యున్నాడుఁ (తృతీయా శ్వాసము. 162 పు) ప్రాచీన కాలములోనేగాక నేడును గ్రామాలలో వంటవేసికొనుటకు, ఆయా పదార్థములను నిలువ జేయుటకు మట్టి పాత్రలుపయోగించుకొనుట అందరికి తెలిసిన సంగతి. ప్రజలు రాగి బిందెలు వాడుచుండిరి.

సి. అంబలి :

ఆనాటి ప్రజలు "అంబలి, ఒడిపెల పాసెము, పులగము" మొ: ఆహారముల తినుచుండిరని తెలియుచున్నది. 'అంబలి'ని ఆ కాలమ 'అంబకళము' అని పిలచుచుండిరి.

"కామింపగ కరి కాళవ్యయింట
మామిడి పండులు మఱుగున నమలి
పోయి చెన్నయ యింటిఁ బులి యంబకళము
జేయుఁ దీయుకజుట్టి చిఱుతొండనంబి"
—తృతీయా_157 పు_

మోళిగ మారయ్య పాత్ర 'కాయకమునకు' ఉత్తమ ఉదాహరణ అందులో అంబటలి ప్రస్తావన కూడ కలదు.

"అతని నగరఁగాంచు నంబకళంబు
ప్రతి వచ్చునే యెన్ని భంగుల నైన"
—పంచమాశ్వాసము-355 పు._

అంబలిని కన్నడ భాషలో 'అంబ కళంబు' అని పిలిచెదరు. బ ఇది అమ్మ_అంబకు సమర్పించిన ప్రప్రథమ ప్రసాదముగ యుండ నని భావింపనగును.

డి. పాసెము :

ఇది మరొక ఆహార విశేషము. 'ఒడిపిలి పాసెము. పండబారి ప నున్న ధాన్యమును దంచి ఆ బియ్యముతో వండిన పాయసము' వేటూరి ప్రభాకర శాస్త్రి వివరించియున్నారు

ఉడుమూరి కన్నప్ప కథలో నిట్లున్నది.
"అతపుల మనుమిళ్ళ కడు మంచి పాలుఁ
నొడిపిలి పాసెంబు"
—తృతీయాశ్వాసము 183వ పు_

శివ లింగమును తనయూరికి రమ్మని కొండలలో నొక్కడపు లేవని మా పల్లెలో మంచి పాలు ఒడిపిలి పాసెంబు గ్రోలుటలో అన కలదని ఉడుమూరి కన్నప్ప ఆహ్వానించెను.

ఇ. పులగము :

మరొక సందర్భములో పులగము పేర్కొనబడినది. ఆ కాలములో నందీశ్వరుని నోము నోచుకొనేవారు 'పులగం' వండుకొనుచుండిరి. అంతే కాదు సురియ చౌడయ్య కథలో ఇది కూడ కాయక నియుక్తమునకు సంబంధించినది. వీర చోడవ్వ గుడుకతో నందించిన పులగము భీమేశుడు తిన్నట్లు సురియ చౌడయ్య తెలిపెను.

"పుత్తెంచె మా యక్క పులగంబు నీకుఁ
జిత్తజాంతక ! యిదే చేకొనుచునిన॰"

-పంచమాశ్వాసము 388 పుట-

నువ్వులు, బెల్లము, బియ్యము కలిపి పులగము వండుదురు-దానిని శివునకు నైవేద్యముగా సమర్పించెదరు. సంక్రాంతి, రథ సప్తమి వంటి పర్వ దినములలో వండుకొనెదరు. సంక్రాంతి శీతాకాలములోవచ్చు పండుగ నువ్వులు శరీరమునకు వేడిని కలిగించును. కాబట్టి వానిని పులగములో వేసి వండుకొనెదరు. బెల్లము సున్నమును కలిగియుండుటచే జీర్ణ శక్తిని వృద్ధి జేయును. మరికొందరు బియ్యము, పెసర బేడలతో కూడ పులగము వండు కొనెదరు.

యఫ్. యాత్ర-జాతర :

జానపదులకు, గిరిజనులకు యాత్ర-జాతరలనిన ప్రీతి. అలనాడు ప్రజలు జాతరలకు బండ్ల మీద వెళ్ళేవారని గొడగూచి కథవలన తెలియు చున్నది. గొడగూచి తండ్రి యాజ్ఞ మేరకు శివలింగమునకు పాలు సమర్పింప రాగలేదు. అపుడు గొడగూచి శివునితో

"- - - - - - - - - - నీ పాలు పురహర ! కొనుము
వీరభద్రుని జాత్ర వేళ నివ్వండి
యేరొప్పఁ బనిచెద నీ పాలు ద్రాపు"

-తృతీయాశ్వాసము 162వ పు.-

అని ప్రార్థించిన సందర్భములో వీరభద్రుని జాతర ప్రసక్తిని పాల్కురికి సోమనాథుడు ప్రస్తావించెను.

జి. దండన :

భృత్యులు అపరాధము జేసిన వారి స్వామిని దండించిన ఆ అపరాధము తీరిపోయెడిది.

"ప్రేమం బెలర్పగ 'భృత్యాపరాధ
స్వామినో దండ'యన్పదుపు నిష్ఠించి"
—చతుర్థాశ్వాసము 247 పుట—

మనుష్యులు తప్పు చేసిన గుండులతోఁ బడియలతో వెంటపడి కొట్టుచుండిరి. (సప్తమాశ్వాసము-524 పు)

హెచ్. ఔషధ ప్రక్రియ :

జాన పదులు చెట్ల యొక్క వేర్లు, ఆకులు, కాయలు, పూలతో ఔషధములను తయారు చేసి ఉపయోగించుచుండిరి.

"జాన పదులు శిల్పాలను కూడ రూపొందించుచుండిరి." అని శ్రీ చలసాని ప్రసాదరావు పేర్కొన్నారు. ఆ రోజులలో గీతములు రచించుటకు, పాడుటకు మిక్కిలి ఉత్సుకతను ప్రదర్శించుచుండిరి. అప్పట్లో మొత్తము 4 లక్షల 64 వేల గీతములున్నట్లు తెలియుచున్నది. నృత్యము కూడ చేయుచుండిరి మాతృ ప్రేమకై ఆరాటము గొల్లడయిన కాటకోటుని కథ ద్వితీయాశ్వాసము 99వ పుట, బాలుర పయి మమకారము బెజ్జ మహాదేవి కథలో 152పుట, భక్తి మహాత్యము గొడగూచి కథ 160వ పుటలో, తృతీయాశ్వాసములోని ఉడుమూరి కన్నప్ప కథ, గిరిజనుల సంప్రదాయమునకు 180వ పుటలో అభివ్యక్తము కాగలదు.

5. కుల వృత్తులు :

పాల్కురికి సోమనాథుని కాలము నాడు కులవృత్తులు గౌరవింపబడెను. ఎవ్వరి వృత్తులు వారు యథేచ్ఛగాను, 'సత్య శుద్ధము'గాను చేసికొని జీవించిరి. వీరికి స్వతంత్రము, సమాన ప్రతిపత్తి లభించినది. దళితులైన శూద్రులు వీరశైవ మతమును స్వీకరించి తన్మత వ్యాప్తికి అగ్రగాములైరి.

ఎ. వృత్తి విభాగములు :

"కుల వృత్తిని మించిన ఉద్యోగము లేదు గువ్వల చెన్నా" అన్న నీతి ఎల్లరకు విదితమే. నాడు గ్రామ పరిపాలన వృత్తుల వారిపై ఆధార

వడియుండినది. అవి: 1. గ్రామాధికారి, 2. న్యాయాధికారి, 3. కరణము 4. గ్రిష్టి (జలధారల అధికారి) 5 తలారి, 6. జ్యోతిష్కుడు, 7. కమ్మరి, 8 కుమ్మరి, 9. వడ్రంగి, 10. చాకలి, 11. మంగలి, 12. గ్రామోపాధ్యాయుడు"17 మరొక విభాగము ప్రకారముగా 13. చేనేతకారుడు 14. వైద్యుడు 15 పౌరోహిత్యము, (జ్యోతిష్యుని. పురోహితుని ఒకే వృత్తిగా భావించిన) 16. కారణీకము, 17. స్వర్ణకారుడు, 18 గాండ్ల, 19. దర్జీపని.

సోమనాథ మహాకవి కులవృత్తుల వివరాలను ఎంతో చక్కగా వర్ణించి నిర్వచించినారో గమనించిన ఆనాటి వృత్తుల స్థితి గతులు అవగతము కాగలవు. నాటి ధార్మిక సమాజములో వృత్తి పాలన పారలౌకికముగా నుండెడిది. బసవడు బల్లహునకు మడివాలు మాచయ్య మహిమను వివరించు సందర్భములో

"పరగ భిక్షించిన బ్రాహ్మణుండతడ
మహితాప వర్గ సామ్రాజ్య పట్టంబు
సహజంబ పాలించు క్షత్రియుండతడ

---

వడి భవాంబుధిఁ డ్రిప్ప వైశ్యుండు నతడ
యిల సత్క్రియారంభ ఫలములు గోసి
పొలవక నూర్చెడు శూద్రుండు నతఁడ
గూడ వానెడు నాటి కుమ్మరి యతడ

---

లీల నంటించునాజాలరి యతడ''

-చతుర్థాశ్వాసము 237, 238 పుటలు-

మిగిలిన వడ్రంగి, కనుమరి, నగపాల, శబలుండు, ప్రేతేడు, వెండీడు, బోయ, చాకియు తమ వంతు కర్తవ్యమును సంఘ నిర్మాణమునకు-నీతి నిజాయితీలతో కృషి చేయుచుండిరని విదితమగుచున్నది.

బి. వృత్తుల ఉనికి :

కులమనగా వృత్తియని పాల్కురికి సోమనాథ మహాకవి స్పష్టముగా తెలిపియున్నాడు. యజ్ఞోప వీతమును ధరియించి భిక్షించువాడు బ్రాహ్మ

ఋడని, రాజ్యమును చక్కగా పాలించువాడు క్షత్రియుడని, జన్మ విధాన మును త్రిప్పువాడు వైశ్యుడని, సత్క్రియ ఫలముల గోసి అలసిపోక నూర్చు వాడు శూద్రుండని పాల్కురికి సోమనాథుడు భాష్యము చెప్పియున్నాడు. తాబేళ్ళను, చేపలను పట్టువాడు జాలరని, వడ్రంగి, కమ్మరి-లోహము నకు అగ్నిని రంగజేయుననియు, వగపాలి అచ్చుల నొరగువాడనియు, శబరుడు, పశువులను పాలించువాడు ప్రవేణిడనియు, తోలుబొమ్మల నాడించు వాడు నెండీడనియు, పొలముల ఓడేర్చువాడు బోయ యనియు, ఉదికెడు వాడు చాకియనియు వివరించియున్నాడు.

సి. మాన్యములు :

"ప్రభువులు వృత్తి మాన్యముల నిచ్చి వస్నుల మినహాయించుట వలన అనేక వృత్తుల వారు గ్రామములలోనే నివసించి సర్వతోముఖాభి వృద్ధికి తోడ్పడిరని తెలియుచున్నదని"[18] కంభంపాటి సత్యనారాయణ వివ రించియున్నారు. తెరికి కుమ్మరి, కమ్మరి, కంచర్లకి, మంగలి, చాకలి, మేదరి, చర్మకారుల వృత్తులు యుండివవని సోమనాథ మహాకవి గ్రామ వృత్తి విధానమును విశ్లేషించినాడు. వాస్తి, తాపి, రాళ్ళు చెక్కుట మొదలగు వారికి కూడ మాన్యము లివ్వబడినవి. ఆనాడు నూనెను గాను గాడించి ఉత్పత్తి చేయువారుండిరి.

ఆ కాలములో గొల్లలు ఏట పెంట్రికమ దైవముగా భావించి తమ పశు సంపదను ఎంతగా సంరక్షించుకొని వృద్ధి చేసికొనెడివారో తెలియుచున్నది. కాట కోటని కథలో

"ఏట పెంట్రిక దన కీశ్వరుండనుచు"
బాలెల్లఁ బెంట్రికపైఁ బోయఁ దండ్రి"
—ద్వితీయా శ్వాసము 98వ పు.-

విశ్వసించిరి. గొల్లలు చల్లమ్ము పద్ధతిని వివరించియున్నాడు.
"ఆ వీధిఁ జల్లఁ దానమ్ముచుఁ గణకఁ

18. కంభంపాటి సత్యనారాయణ-ఆంధ్రుల సంస్కృ-చరిత్ర I (1983 : పుట 137)

పడం బోవ గొల్లెత 'బసవరో' యనినం"

-ద్వితీయా శ్వాసము 108 పుట-

ఆ, ఈ వీధులు తిరిగి గొల్లెతలు చల్ల నమ్ముకొను చుండిరి. జాతర వంతలు, పండుగ దినములలో చల్లనమ్ముకొనువారిని నేటికిని మనము చూచుచున్నాము.

౯. ఎఱుకలు :

పండెండవ శతాబ్దము నాడు ఎఱుకలు ఎటువంటి ఆహారమును తీసికొనుచుండిరో సోమనాథుడు తెలియజేసెను.

ఉడుమూరు కన్నప్ప కథలో 'అడవుల మనుబిళ్ళ కడమంచి పాలు, పాలపిరి పాసెంబు, యిప్ప పూవును, తెనె లెల్ల ఫలాదులొప్పెడు వెదురు బియ్యంబులును" అట వికుల ఆహారముగా నుండెను. ఆనాటి ఎఱుకలు మాంసమును వండుకొను విధానమును తెల్పింగి యుండిరి. అడుమను మృగముల పాల చేత తయారు చేయబడిన ఆటవిక పాయసము మనుబిళ్ళ పాయసము.

"మంచి మాంసముగ శోధించి శోధించి

------------------------------------

కాల్చుచుం బక్వంబుగాం దిప్పి త్రిప్పి

------------------------------------

తవిలి ఖండింపుం దాజలి సూచి"

చవియున్న లెస్స మాంసము దొవ్వం బెట్టి

-తృతీయా శ్వాసము 186వ పుట-

కన్నప్ప మాంసమును వండిన సందర్భములోం జెప్పబడినది. బోయలు రాజు వద్ద మంచి పలుకుబడిని కలిగియుండిరి. వీరు అపుడపుడు దేవతా ప్రసాదము కొరకు రాజునకు ఫిర్యాది చేయుచుండిరి.

౧౦. బొంతలు కుట్టువారు :

పాల్కురికి సోమనాథుడు శంకర దాసయ్య కథలో నాటి బొంతలు కుట్టువారి "వృత్తియే కైలాసము"మ ప్రవచనము ప్రపంచ సత్యముగా బోధ

పడగలదు. సాక్షాత్ శివుడు ప్రత్యక్షము అయి ఏమి కావలయునని కోరు కోమనగా దాసిమయ్య మడులు, మాన్యాలు కోరుకోలేదు. మరి

"రాత్రియు సూది దారంబు గ్రువ్వంగ
నేత్రములకు దృష్టి నెక్కొల్పుమనుడు"
—చతుర్థాశ్వాసము 261వ పు—

## జి. కంసాలి :

ఆ రోజులలో కొందరు కంసాలులు సంగీతములో మంచి ప్రావీణ్యమును సంపాదించిరని తెలియగలదు. కిన్నెర బ్రహ్మయ్య కథలో బ్రహ్మయ్య.

"గీతార్థమై మఱి కిన్నర వీణ
వేడుక నొక నాడు వినిపింపఁ దడవఁ
గిన్న రేశ్వర వంద్యుఁడన్నార దాది
సన్నుత నాదాను షక్తుండు మెచ్చి"
—పంచమా శ్వాసము 332వ పుట—

కిన్నెర (వీణ) పై నిరంతరము శివుని గూర్చి గానము చేయుచు శివయోగ మగ్నుడయియుండెనట. అతని కిన్నెర వీణ వాద్యమును వినుటకు నారదాదులు వచ్చెడివారట.

## హెచ్. నేత కారులు :

అప్పట్లో నేత కారులు మంచి నైపుణ్యమును కలిగి యుండిరని వ్యక్తమగును. తేడర దాసయ్య ఒక తపస్వికి 12 సంవత్సరములు నేసిన 12 మూరల బంగారు వస్త్రమును దానము చేసినట్లున్నది.

"పండ్రెండు వర్షముల్ వాయక నేసి
పండ్రెండు మూరల పసిడి పుట్టంబు
విపరీత గతిఁదన్ను వేడుడు నొక్క
దపసికిఁ దేడర దాసయ్య యీఁడె"
—తృతీయా శ్వాసము 130వ పు—

## ఐ. కుమ్మరి :

పాల్కురికి సోమనాథుని కాలములో శూద్రులు కూడ శపథము చేయు

చుండిరని, వారు తమ మాట కొరకు ప్రాణ త్యాగమునకు వెనుకాడిడివారు కారని అభివ్యక్తమగును.

కుమ్మరి గుండయ్య గారి కథలో గుండయ్య ఒక కాంత ఇంటిలో ఒక రోజున గడపి రాగా భార్య తనను ముట్టకుమని శాసించెను. ఆ నియమము ప్రకారము జీవించిరి, వారు ముదుసలులు అయిరి. శివుడు వారిని కరుణించి ఒక కప్పెరనిచ్చి దానిని తానే మాయము చేసెను. శివుడు తన కప్పెర యిమ్మని కోరెను. కాని అది లభింపలేదు. అపుడు శివుని మాటల కలిగి భార్యా భర్తలు.

"గంభీర జలము లం గామిని బతిని
దండి గుండము పటంపం దత్క్షణ మాత్రి"

—చతుర్థాశ్వాసము 326వ పుట-

మరియు "గుడి పొచ్చు మతిపొచ్చు గుండంబు పొచ్చు
విడుతురే గోటియుల పిలిచినవాఁడు"

-పంచమాశ్వాసము 334వ పుట-

మాట కొఱకు గుండంబులో కూడ పడుచుండిరి.

జె. తెలుగు వారు :

సోమనాథ మహాకవి కాలమునాడు తెలుగువారు కొందరు మేటి విలుకాండ్రయిరని తెలియుచున్నది.

తెలుగు జొమ్మయ్య కథలో తెలుగు జొమ్మయ్య "కలియుగ జనిత మృగ వ్యాఘు రుద్రి, 'డలధ వరాక్రిముఁ డసమాను'' (పంచమాశ్వాసము 389వ పు) డని వ్యక్తపరచెను. శ్రీశైలములోని శివానంద యోగికి అపచారముగావించి మృగములైన గంధర్వ కాంతలకు జొమ్మయ్య శాపవిముక్తి కలిగించెను.

కె, చాకలి :

12వ శతాబ్దములోని శివ శరణ ధర్మము సకల వృత్తుల వారి మధ్య సమతను సాధించినది. అన్ని వృత్తుల వారు ధార్మిక జీవనముతో గ్రామ పురోభివృద్ధికి పడుము కట్టిరి. శరణ ధర్మమును పాటించుటలో తారతమ్యము లేదని తెలియగలదు.

మడివాలు మాచయ్య ఒక మనిషిని చంపగా బిజ్జలుడు ఆగ్రహపడెను.

"కారణంబులుఁ గథల్ గల్పించుకొనుచు
నూరక చూచుచు నుండిమీ' వనుచు"

-చతుర్థాశ్వాసము 240 పు-

బసవని వారించెను. తర్వాత పశ్చాత్తాప పడెను. ముఖ్యముగా కాయకమే కైలాసమునకు' మడివాలు మాచయ్య చక్కని ఉదాహరణ అని తెలియు వచ్చుచున్నది.

యల్. లుబ్దులు :

పాల్కురికి సోమనాథుని కాలములో కొందరు లుబ్ధులుండిరి. వారిలో పరివర్తనము తెచ్చుటకు కొందరు ప్రయత్నించుచుండిరి. తాకుడువక, యితరులకు పెట్టకయున్న ధనమునకు చోర ప్రాప్తి తప్పదు.

" ............................ ఇహపరంబులకు
దూరమైనట్టి లుబ్ధుల యిండ్లు సొచ్చి
వారలఁ జరితార్థవంతులఁ జేయు"

-పంచమాశ్వాసము 367 పుట.

యం. చోరులు :

ఆ రోజులలో చోరులు కూడ శివ శరణ ధర్మమును పాటించుచు చోర వృత్తిలో నీతిని ప్రదర్శించువారుండిరని తెలియుగలదు.

కన్నడ బ్రహ్మయ్య కథలో- బ్రహ్మయ్య చోర వృత్తిపై నాధారపడి జీవించినను నీతి వంతుడగుట చేత ఇహపరములకు దూరమయినట్టి పిసిని గొట్టు వారి యిండ్లలో దొంగతనము చేయుచుండెను.

యన్ అంత్యజులు :

అనాడు అంత్యజులు కూడ వీరశైవ ధర్మమును పాటించుచుండిరి. ప్రధానియైన బసవేశ్వరుడు, అంత్యజుడయిన శివనాగుమయ్యను సన్మానించెను. నాడు సమతా భావము సహ జీవనము అయినదని తెలియుగలదు.

శివనాగుమయ్య కథలో బసవేశ్వరుడు శివనాగుమయ్యను సింహాసనముపై కూర్చుండ బెట్టెను. లింగ పసాయితముతో అతని చేతి వ్రేళ్ళను ఒత్తగా పాలు కారెనట.

"కరతలాంభోజంబు గరములఁ బట్టి
యొత్తుడుఁ బింజించి యుడు వీథిఁ దాఁకి
యత్తటి క్షీర ధారావలి వర్వె''

సప్తమాశ్వాసము 534 పుట-

6. భిక్షకులు : సమాజములో వృత్తిపరమైన ఉనికి :

పాల్కురికి సోమనాథుని కాలములో భిక్షకులు సమాజములో వృత్తి పరమైన ప్రాముఖ్యత కలిగియుండిరి.

ఆ రోజులలో వీరశైవ మతము బాగుగా వ్యాప్తి చెందియుండెను. జంగములు భిక్షా వృత్తిని స్వీకరించిరి. జంగములు అనగా ఒక ప్రదేశము నుండి మరియొక ప్రదేశమునకు సంచరించు వారయి ఉండిరి. వీరు సాక్షాత్ శివ స్వరూపులు, వీరిది క్రియా మార్గము. త్రికాల లింగార్చన చేయుచు లౌకిక పార లౌకిక దృష్టిని కలిగి యుండిరి. ఒక వర్గము, మత ప్రచారము గావించుచుండిరి. ద్వితీయ వర్గము వారు శివ శరణ ధర్మమును పాటించుచు వారి సమస్యలను పరిష్కరించుచు సమాజము యొక్క నిర్మాణమునకు పాటు పడుచు దాని చైతన్యమునకు కృషి గావించిరి. వీరికి మఠములు వాసయోగ్యమై యుండెను. జంగములలో మరొక తెగ మిండ జంగములు. ఒక విధముగా వీరు సమాజములో అతివాదులని భావింప వచ్చును.

అప్పటి జనాభాలో కళ్యాణి నగరములో 1,80,000 జంగములు, 12,000 మిండ జంగములు యుండిరట (ద్వితీయాశ్వాసము 85వ పు. 77వ పం.) వీరి ప్రాముఖ్యత తెలియుచున్నది.

ఎ. మిండ జంగములు :

ఆ రోజులలో మిండ జంగములు శాస్త్ర పాండిత్యము కలవారని పాల్కురికి సోమనాథుడు తెలుపుచున్నాడు. వారు లంజల కొరకు జంతువులను బహుమతులుగా తీసికొని పోయెడి వారని ఆనాటి సాంఘిక వ్యవస్థను పాల్కురికి సోమనాథుడు బహిర్గతను చేయుచున్నాడు.

"చా : ఱెటి మిండడ చను సను మింక

చదివెదు వెక్కులు శ్లాఘ్యమే? పక్షిం డి"

-పంచమాశ్వాసము 335వ పు-

గొఱియ కథలో మిండ జంగముని మొదట తెచ్చిన గొఱియనే తీసికొని రమ్మని శాసించుచు కొనుచు పొలతి పలికిన సందర్భములోనిది.

వీరికి సంఘములో సంపూర్ణ స్వాతంత్ర్యము ఉండెను. ఒక వేశ్య గంగాంబ కట్టిన పుట్టంబు గ్రక్కున దెచ్చి ఇమ్మని మిండ జంగముని కోరెను ఆ మిండ జంగముడు బసవన్నతో

"సనికాంచి ! బసవ 'నీ వనిత గంగాంబ
కట్టిన పటవలి పట్టంబు మాకు
నిట్టున్న భంగిన యిప్పింప వలయు"

-తృతీయాశ్వాసము 129వ పుట-

నని కోరెనట.

జంగములు అనాడు చాల శక్తి వంతులని తెలియుగలదు. రాజును కూడ వెలివెట్టు వాంగుచుండిరి. ఒదయునంబి గర్వమునకు మిండ మిండడు కుపితుడైన వెలిపెట్టెను.

"ఒరి వీం డెవ్వడు రా? రాజమౌళి
ధీర దిగ్గజములం జీరికిం గొనక
క్రొవ్వె ! మా భక్తుల కొలం దెఱుం గండు"

-చతుర్థాశ్వాసము 200వ పుట-

మిండ జంగములు అను తెగవారు గడ్డములు, మీసములు పెంచి చందనము, కస్తూరి, వాసనలతో నొసట తిలకము కలిగి తెల్లని వస్త్రములు ధరించుచుండిరి.

బి. వేశ్యలు :

పండెండవ శతాబ్దములో వేశ్యలకు మంచి గిరాకి, పలుకుబడియుండినవి. వీరు అపురూప సౌందర్యరాశులట. "తలపం చిత్తరు రూపమో? చెలువయో, పసిడి పుత్తడి యో" (తృతీయా శ్వాసము - 132వ పుట). వేశ్యల గృహములలో 'గణికలుండిరి', ఆ గృహములు హర్మ్యముల వలె నుండెను.

వీరు శయనించుటకు "ఉత్తుంగ సింహాసనోపంబైన, యత్నపు చారు పర్యంకంబులు అమర్చబడియుండెనవట (తృతీయాశ్వాసము 135వ పుట).

పండితారాధ్య చరిత్ర :

పండితారాధ్య చరిత్రలో లభించు జన సంస్కృతిని అధ్యయనము జేయవలెను.

1. వ్యావసాయిక జీవితము :

ఎ. కూలి నిర్ణీతము గాక చే(తి) కూలికి జీవించుటయు నుండెడిదని ఆనాటి కూలి వ్యవస్థను పాల్కురికి సోమనాథుడు తెలియజేయుచున్నాడు.

తిరునాళ్ళ పోవు వృత్తాంతము గలదు.

బి. జీతము :

వీరశైవ సాహిత్యమునాటి ప్రజలు భృత్యులను నియమించకొను చుండిరని తెలియవచ్చుచున్నది. వారికి జీతము లిచ్చు విధానమును గురించి పాల్కురికి సోమనాథుడు వివరించుచున్నాడు.

1. ఎప్పటి కప్పుడు పనిచేయించుకొని జీతము ఇచ్చు విధానము.
2. మాసమునకు జీత మిచ్చు విధానము ఆ కాలములో నున్నట్లు వివరణ కలదు.

"చోళవాళిక కాక క్షోణీతలేశ.
వేళ వాళికిఁ గరమే యటులైన"

-మహిమ ప్రకరణము-పుట-185

చోళవాళికనగా 'చోళ్ళ' పరిపాటిగా గలది ఐహిక జీవనమునకు సంబంధి-వేళవాళికనగా జీవితావసాన 'వేళకు వాళి' ఐనది. ఆ ముష్మికక జీవనమునకు సంబంధించినదని బండారు తమ్మయ్య వివరించారు.

సి. బానిసలు :

బానిసలు సంతానము బానిసలుగనే యుండు ఆచారము యున్నట్లు తెలియుచున్నది.

"పాదముల్ కడు గంగ బానిస కొడుకు
నాద టజంగమంబై యేఁగు దెంచి

అది దేవుండ్ల కాన్గర్థి గురించి"

-పురాతన ప్రకరణము-280వ పు-

పాదాంబుపుల పోయు నతని వడతి మాత్రము గుర్తించి ఉదకమును పోయుట నాపినది. బానిసలు తాము బానిసలుగా చేరునపుడు పత్ర మొకటి ఐదుగురు పెద్దమనుషుల సాక్షి సంతకములతో వ్రాసి ఇవ్వవలసియుండెడిదట సుందర నంబెన్న కథలో నిది తెలియుచున్నది.

సి. జల యంత్రము :

వ్యవసాయదారులు 'ఘట కర్మ చక్ర'ములను విరివిగా నుపయోగించెడి వారని తెలియుచున్నది.

"చను జీవ ఘటకర్మ చక్ర సుర్యేందు
విశ్వాధి తుండు"

జీవులనే ఘటాలను కర్మయను చక్రమునకు తగిలించి సూర్యచంద్రులను యెడ్లతో లాగిస్తూ రాటములను శివుడు తిప్పుచున్నాడని వ్యక్తమగుచున్నది.

డి. జాతరలు :

ఆనాడు ప్రజలనేక జాతరలు చేయుచుండిరి. (11-413-414 పుట) పాటి జాతరలు కూడ జరుపబడుచుండెను. భక్తుల కోర్కెలను తీర్చి తమ మహాత్మ్యమును ఋజువు పరచెడి క్షేత్రములు పాటి జాతరలు.

2 జానపదులు-గిరిజనులు :

ఎ. గోపాల గృహము-ఆయుధములు :

గాదె, గాదియు, కొట్టె తెలుపబడినవి శివుడు గోపాలుని వేషములో వచ్చినపుడు ఉపయోగించిన ఆయుధములు "గొడ్డలి, బరిగమ్మి. కూటి కండయు, దుడ్డ గోలయు, (తృతీయా శ్వాసము - బసవ పురాణము 225వ పుట) గలవట.

బి. గోవులకు ప్రత్తి గింజలు పెట్టుట :

ఆ రోజులలో గోవులకు ఆహారంగ పత్తి గింజలు పెట్టుచుండినట్లు చేటలు వేమయ్య కథ వలన తెలియుచున్నది.

3. కుల వృత్తులు-ధనిక, పేద వర్గీకరణ :

సోమనాథ మహాకవి వృత్తుల నమ్మి జీవించు వారిలో ధనికె పేద వర్గీకరణము లేదు. వీరశైవ మతములో ప్రధాని, పేదలు అను వాదా వాదాలు అసలు కానరావు.

చేటల వేమయ్య కథలో వృత్తిలోని ఉత్కృష్టత తెలియ జేయబడినది.

"వీగుచుఁ జేటల వేమయ్య భువిని

---

---

జీవితంబు సేసి చేటలఁ స్వాఁ

గావించి, -పురాతన ప్రకరణము, 162వ పుట-

4. భిక్షకులుః సమాజములో వృత్తి పరమైన ఉనికి :

పాల్కురికి సోమనాథుడు అలనాటి పరుసలను తెలియజేసెను.

ఎ. మిండ జంగమముల నడకలలో వారి వేషభూషణములు తెలియ వచ్చును

" ________ కట్నముల్ మేలి చందనము

---

గస్తూరి మొదలుగాఁ గలుగు సుగంధ

---

ధవళాంబరములు"

పర్వత ప్రకరణము 317వ పుట-

వీరు తాపరక్షణకై వివిధములైన గొడుగులు ధరించుచుండిరి. పాదములకు వివిధములైన పావులను వేసికొనుచుండిరి. పచ్చడములు, కౌపీనములు ధరించిరి. (పర్వత ప్రకరణము 309వ పుట). అందులో కొందరు పట్టు వీణలు వాయించుచుండిరి. స్త్రీలు చంద్ర, సూర్య మకుటములు, నంది కంచు, పులితోలు, రుద్రాక్ష, రాగి, నవరత్న కంబళి మకుటములు యుండినవి

బి. పుణ్యాంగనలు :

నాడు భక్త హృదయ పీఠములలో భ్రమరాంబ సహిత మల్లికార్జున స్వామి అధిష్టించి యుండెనని తెలియగలదు. శ్రీశైలమునకు కాశి యంఁటి

ప్రాముఖ్యము గలదు. పాల్కురికి సోమనాథుడు తన చతుర్వేద సారములో "తాను శ్రీ పర్వతమున కుత్తరమున 'బసవ పుర స్థాప్య పర్వతోత్తరముఖ సీముండ పాల్కురికి సోముడనగ" యని స్వామి వారికి కైంకర్యము జేసినాడు. అందుచే ఈ మహాకవి శ్రీశైలమునకు వచ్చు భక్తులను తనివి దీర దర్శించి వారి నడకలను. 'వరుస'లను కన్నులకు కట్టినట్లు జేసినాడు.

"పలుచని తొల్లు కుప్పసములు పూని
వదc పడి యలతి దుప్పట్లు గొండలు

............................................................

............................................................

మొదలి మంగళ, సూత్రములు"

—పర్వత ప్రకరణము 339 పు.—

దాల్చి తమ పతుల హస్తములూది కొమచు బింబాధరములు చాటల్లడంగ గర తలంబులు రోండ్ల గది యించుకొనుచు నడిచిన పుణ్యాంగనలు 12వ శతాబ్దము వారే! ఇప్పటికి మహారాష్ట్ర, కర్ణాటకులు ఇట్లే నడుచుచుందురు.

సి. జోగులు :

ఆ కాలములోని జోగుల వేష భూషణములను పాల్కురికి సోమనాథుడు తెలియజేసెను. వీరు చుక్కల బొట్లను, జుక్కి వెండ్రుకలు కలిగి, చక్కని పాపటలు తీర్చి యుండిరి.

"— — — — వెండ్రుకలు దండలును, దగరంబు
పిల్లాంగ్రు మట్టెలు, బెత్తువన్నియల
తొల్లునప్పసములు, నల్లగాజులును"

—పర్వత ప్రకారణము 341వ పు.—

శంకును పూవులుగా ముడిచిరి. బొంతలు కుట్టుచు జీవ యాత్ర చేయు చుండిరి. ముక్కెర, మువురులు, వడ్డాణము, ఉంగరములు, కడియములు ధరించినారట వీరు గుర్రాలపైనను, నడకతోను శ్రీశైలమునకు వెళ్ళు చుండిరి.

డి. యోగులు :

పండ్రెండవ శతాబ్దములో యోగులు మిక్కిలి ప్రసిద్ధి కెక్కియుండిరి.

అనాడు "విద్యారణ్యుల వారు తత్త్వతేజో రాశిగను (1267-1386), గణవ నారాధ్యుడు సర్వ యోగిగను (1323-1345) ప్రసిద్ధి కెక్కిన శివ యోగులని"[19] మేడపాటి వెంకటరెడ్డి తెలుపుచున్నారు.

శివ యోగులు నడకల ద్వారా వారి రూపు రేఖా విలాసాదులను సోమ నాథుడు వ్యక్తము చేయుచున్నాడు.

"విలసిత పుణ్య రేఖలు వొలుపార
నయ నాబ్జరు చులును వ్నత నాసికములుం

----- జారు భుజంబులు విశాల వక్షములు"

(పర్వత ప్రకరణము 325వ పుట) కలిగి "అయాచితా కామ కృతా హారుల సుచు" (పర్వత ప్రకరణము 326వ పుట) ఏకాంత గోష్ఠ మహిష్ఠితులగు హఠ యోగ, రాజ యోగముల ద్వారా ప్రసిద్ధి కెక్కిరి.

డి. అభ్యాస యోగులు :

పాల్కురికి సోమనాథుడు అభ్యాస యోగుల నడకలను వర్ణించి కాల వివరణమును ప్రపంచమునకు తెలియజేసెను.

| | | |
|---|---|---|
| "60 శ్వాసములు | — | 1 ప్రాణము |
| 6 ప్రాణములు | — | 1 గడియ |
| 5 గడియలు | — | 1 అగ్నము |
| 12 అగ్నములు | — | 1 దినము |

శ్వాసమునకు స్వరమని కూడ పేరు చెప్పెను."[20] యని పి. నరసింహారెడ్డి వివరించిరి

'సర్వేశ్వర శతకము'

ఇది శతకమగుటచే జన సంస్కృతి ప్రతిబింబంచుటకు ఎక్కువ అవ కాశములు లేవు.

19. మేడపాటి వెంకటరెడ్డి-తెలుగు యోగులు (1987 : పుటలు I,II)
20. డా. పి. నరసింహారెడ్డి-పాల్కురికి సోమనాథుడు కృతులు-ఒక పరిశీలన-సంపుటి 3 (సెప్టెంబరు 1974 : 1501).

ఎ. నాటకములు :

ఆ కాలములో నాటకములు భాష, క్రియాంగముల అభిరమ్యముతో వొప్పారు చుండినవి.

"అమరంగా స్ఫుట భక్తి నాటకము భాషాంగ క్రియాంగాభిర
మ్యము గాఁ జూపిన మెచ్చి మీరలు పురే!"

—20వ ప. 40వ పు.

బి. గద్య వ్రాతములు :

శివుని గద్య పద్యములతో నుతించి గీత వ్రాతములు పాడుచుండిరని విదితమగును.

"అమితామోద నవప్రసూనముల నిన్నర్చించుచో గద్య ప
ద్యము లూహించి నుతించుచో వివిధ గీత వ్రాతము ల్పాడుచో"

—78వ ప 51వ పు.

యని 'తాళసమ్మిళిత - - - - ధ్వనుల గీతంబొప్ప" తాళముతో కూడిన ధ్వనులతో గీతములు పాడుచుండిరని తెలియును దీనిని బట్టి శ్రీనాథుని కాలము నాటికి కూడ గీత, గద్య, పద్యములు జీవించియుండెనని అభిప్రాయము.

సి. యోగ శాస్త్రము :

యథా వాక్కుల అన్నమయ్య కాలములో యోగ శాస్త్రము ప్రజలపై ప్రభావము కలిగియుండినదట.

"నానా శాస్త్ర సమచ్చయాగమ పురాణ ప్రౌఢులై తత్వ వి
జ్ఞాన ధ్యాన సమాధి విద్య"

—90వ.ప. 52 పు.

విద్యలు నేర్చిరట. యోగను బహుళ వ్యాప్తిలో నుండెనని తెలియును.

"చెదరంబాఱు దళప్రభంజనములన్ శిక్షన్ సుషుమ్నంబునం
గుదియంబట్టి చరింపకుండ శశి నర్కుంగట్టి"

—48వ ప. 45వ పు.

"నరుసం బేర్గొన నాల్గు యోగములు తత్త్వంచెందు నీదుభక్తివి"

స్తర బాహ్య క్రియలెల్లఁ బొల్లులగుటం దద్భక్తి యోగంబు తా.

-65వ ప. 47వ పు.

శాస్త్రాగమ పురాణములలో తత్త్వజ్ఞాన మెరిగిన పండితులుండిరని తెలియు నగును. నాలుగు యోగములలోను గొప్ప వారుండిరి.

'వర్ణాశ్రమ భేద రహితము భక్తి ప్రధానము ఆవేశ పూరితమగు బసవన వీరశైవమే, (జన సంస్కృతి) తెలుగు దేశమున మొదటగా ఎక్కువగా వ్యాపించి"[21] దని యం భవాని పేర్కొన్నారు.

ఈ వీరశైవ జన సంస్కృతి కొంత వరకాదర్శమైనది. అది యంతయు నేడు పయుక్తముగా నున్నది. సంఘ పునర్నిర్మాణమునకు బసవని భాష, భావములు శరణ్యమని భావించి Sri James campbel "The present day Social reformer in India-is but speaking of the language and seeking to reinforce the mind of Basava"[22]అని ఉద్ఘాటించియున్నారు.

---

21. యం. భవాని-ముదిగొండ వీరేశలింగ శాస్త్రిగారి జీవితము-కృతులు-భాగము 1 (1989 : పుట 17)

22. Sri James Campbel-Essay in Srisaila Jyothi (March and April 1962 : P. 24)

అధ్యాయము 9

## గృహ జీవితము-స్త్రీలు

(12వ శతాబ్దపు నాటి గృహ జీవితము యొక్క ప్రాముఖ్యతను వివరించి స్త్రీల పాత్రము ఇందు చర్చించెదము. ముఖ్యముగా వీరశైవ ధర్మమునకు సంబంధించిన అంశములు ఎట్లు పాటింపబడినవో విశదీకరించెదను.)

### ఎ. గృహస్థాశ్రమము :

### 1. గృహ జీవితము :

మానవ జీవితములో నాలుగు అవస్థలు గలవు. అవి బ్రహ్మచర్య, గృహస్థు, వానప్రస్థ, చివరిది సన్న్యాసము. వీనిలో గృహస్థాశ్రమము చాలా శ్రేష్ఠమైనది. భిక్షకులు, జంగములు గృహస్థాను సారముగనే ఉపజీవించుచు తృప్తి పొందుచున్నారు. సమస్త ప్రాణులకు గేస్తు పరమాధారమనుట లోకములో వినబడుచున్నది.

"యథాహి పక్షిణో వృక్ష
మాశ్రియంతి దిన దిన క్షయే
తథాశ్రియంతి భూతాని
క్షుధితాని గృహ ధివమ్"

భిక్షకులు, జంగములు, గృహస్థాను సారముగనే ఉపజీవించుచు తృప్తి పొందుచున్నారు. సమస్త ప్రాణులకు గేస్తు పరమాధార మనుట లోకములో వినబడుచున్నది.

### 1. ఎ. గృహ నిర్మాణము :

ఆ కాలపు గృహ నిర్మాణములందు మండియలు (మండపాలు) యున్నట్లు నన్నె చోడ కవి రాజు తెలియ జేయుచున్నాడు.

"గుళ్ళు మండియలును గుడారములును
దిళ్ళును గలయు నెత్తించు వారు"

—కుమార సంభవము 11 అ. 30 ప. 287 పు.

వీనితోబాటు ధారా గృహములు నుండినవి. సోపానములు కూడ ఆనాటి గృహములలో నుండెడివి. ఇండ్లపై అడ్డుగోడ లుండెడివి (8-55-191 పు.)

కృతక పర్వతములున్నట్లు, సతాక్ష్టస్థిశిలలతో ఇండ్లు కట్టెడివారు. కలువంబురుహోత్పతులతో కలిపి చల్లుకొనుచుండిరట. పక్షులు రాత్రి వృక్షముల నెట్లు ఆశ్రయించునో అట్లే అన్నార్తులు గృహమును ఆశ్రయింతురు.

1. (బి) లింగ ముద్రలు :

నన్నెచోడుడు సోమనాథ మహాకవుల మధ్య కాలములో వీరశైవులు ఇతరుల దృష్టి పడకుండ 'సర్వాంగ కచ్ఛదము'ను ధరించుచుండిరి, (బసవ పురాణము-3 137వ. పు)

గృహములకు, క్షేత్రములకు, ఆవులకు, ఎడ్లకు మొదలగు పశువులకు లింగ ముద్రలు వేయుచుండిరట, ఆ ప్రాంతీయులు బసవనితో లింగ ముద్రలు వేయించకొనుచుండురని ప్రచారములో నుండినది. ఎడ్ల బండ్లలో ప్రయాణము సాగించుచుండిరి. పాల్కురికి సోమనాథ మహాకవి రెండవ ప్రతాపరుద్రుని వద్దకు వెళ్లునపుడు ఓరుగల్లులో ఎడ్లబండిలో ప్రయాణించెను.

2 స్నానము :

ఆ రోజులలో అలంకరణకు తగినట్లు స్నాన గృహములు యుండెడివి. అవి ప్రకాశించు స్తంభములతోడను, స్ఫటిక వేదికల తోడను, చిత్రముల తోడను వెలిసినవి.

"పరిఖామల జలములతో నురగ ఫణామణుల దీప్తులొగి వెగసి యుం" (7 ఆ 104 పు) కనిపించుచుండెను. అగడ్తలుండినవనియు అవి స్నానార్థమునకు, పానార్థమునకుపయోగింపబడినట్లు (7-169 పు) విశదమగును,

2 (ఎ) స్నాన భోగము :

ఆ నాటి భోగజనులు హంసోదకములతో స్నానము వేయుచుండిరి. "అంత నంతఃపురాభ్యంతర ప్రౌఢ కాంతలత్యంత సంతోషంబున సుగంధ తైలాభ్యంజనామల కోద్వర్త పూర్వంబు పరిమిత పరిమళ మిశ్రిత హంసోదకంబుల "వసర మగుచుడెంనట. (7 ఆ-76వ 165 పు) మరియు (10 ఆ. 107వ వచనము-265) రాజులు రోజు విడిచి అభ్యంగన స్నానము చేసెడివారనియు ద్వితీయ దశిమి, ఏకాదశి దినములు వర్జములనియు డా॥ ఫుల్లెల రామచంద్రుడు వివరించుచున్నారు. ప్రయాణ సమయములలో భేరి

మోగించుచుండిరట (8 ఆ 19ప.185 పు) రజస్వలకు దోషము యుండెడిది. (8 ఆ 88పు-196-పు) ప్రజలు అతపత్రములను నుపయోగించిరి. (9ఆ-28ప) ధారా గృహములలో కొలనులుండెడివి.

2. (బి) పిదల పైనము :

బెజ్జ మహాదేవి కథలో స్నానమును గూర్చి తెలియుగలదు. తొంగిళ్ళ పైనిడి లింగమూర్తికిని, నంగవ గావించు నభ్య జనంబు, ముకొత్తు జెక్కొత్తుముక్కన్ను బులుము - - - -యడర పుత్రుని నొసలారంగ బూయు 'పసి పిల్లలకు అభ్యంగన స్నానము చేయుచుండిరి. స్నానాంతరము పదుపార్చి, కాటుక పెట్టి, పూలు ముడుచుట కూడ యుండెను.

3. వస్త్రములు :

పదకొండవ శతాబ్దము నాటికే చేనేత వస్త్రములున్నట్లు తెలియుచున్నది. పడుపుం బ్రేకయు ప్రనక్తి గలదు. (11 ఆ 127 ప-305 పు) నేత్రపుం బడగలు నేత్రపటి, కామయములు (8 ఆ-74 వ-194 పు) పొంబట్లు, చేలములు (3ఆ-12ప-46 పు).

"దుస్తులు కుట్టించుకొనుటకు ఆనాడు దర్జీలు ఉండెడివారని, వనిత శరీరము మీద జానలతో దర్జీవాడు కొలతలు తీసికొమనట్లుగా"[1] యార్లగడ్డ గంగాధరరావు తెలిపియున్నారు.

3. ఎ. పట్టు వస్త్రములు :

ప్రజలు అమూల్యమయిన వస్త్రములను ధరించుచుండిరి. అవి దివ్యాంబరములుగాను, అనేక రంగులలో విరివిగా లభించుచుండెడివట. అందు చేతనే సోమనాథ మహాకవి.

"తీ వన్నియము, మహా చీని, చీనియును

------------------------------------------------

------------------------------------------------

గౌరి గనియమును, క్షీరోదకంబు

1. డా. యం. బుడ్డన్న-తెలుగు వాఙ్మయము-శివకవియుగ వైశిష్ట్యము (1984 : పుట 349)

పట్టును రత్నంబు పట్టును సంకు
- - - - నేత్రంబు పట్టు" తృతీయాశ్వాసము 127, 128 పుటలు

వెంజాళియు, జయ తంజయు, మంచు పుజంబు, మణి పట్టు, భూతిలకము, శ్రీవన్నియము, మహాచీని, చీనియు, భావజ తిలకంబు మొదలుగా గల 40 రకముల పట్టు విశేషంబులు లభించుచుండెడివనిరి. వస్త్రముల రంగు గూర్చి కూడా తెలియ వచ్చుచున్నది. ఆనాటి ప్రజలకు "పచ్చ" రంగు అనిన చాలా ప్రీతి.

వరంగల్లు నగరమునుండి సన్నని దారముతో నేసిన మల్లు సెల్లాలు, తివాచీలు కంబళీలు అధికముగా ఎగుమతి యగుచుండినవట.

3. (బి) స్త్రీ పురుషుల వస్త్రధారణ :

సోమనాథ మహాకవి కాలములో పురుషులు దోవతులతో పాటు, లుంగీలు వంటివి కూడా ధరించుచుండిరి. స్త్రీలు రెండు వస్త్రములు ధరించినట్లు తెలియనగును. అవి పై చీర సమకట్టులు అని బసవపురాణము, తృతీయాశ్వాసములో వివరింపబడినది. నాటి స్త్రీ, పురుషులు సాధారణముగా పైన కప్పుకొను వస్త్రములు గూడ ధరించిరి. 'కట్నమనగా బహుమానముగా యిచ్చెడి వస్త్రమని' అర్థము.

వస్త్రముల వివరములు కూడ తెలియవచ్చుచున్నవి.

కొందరు పడి వెట్టు వస్త్రములు, తడి యెత్తు వస్త్రములు, మేల్కట్లు కట్టడి వస్త్రములు, తెరకట్టు చీరలు ధరించిరి. స్త్రీల పట్టు చీరలకు చిత్రవిచిత్రములగు అంచులుండెడివి. వీనిలో కరకంచులు, బొమ్మంచులు, ముయ్యరి అంచులు, చిలుక చాళ్ళు, ఉడుత చారలు, పుప్పొడి వన్నెల హంసావళులు అధికమట.

4. లింగార్చన :

పూజా మందిరము ప్రత్యేకించి యుండెను. మోళిగ మారయ్య ఇంటిలో అట్టి వసతిని మనము గమనింపవచ్చును. ఆనాడు స్ఫటిక, పుష్యరాగాది లింగములు వాడినట్లున్నది. (బసవ పురాణము-7-542 పు) అంగము పెని లింగమును సదా ధరించవలయుననెడి ఆచారము కలదు. మంచి రుద్రాక్షలను కూడా యుండినవి.

4. (ఎ) పూజా విధానము :

ఆనాటి శివపూజా విధానమును సోమనాథుడు చక్కగా తెలియజేసినాడు. భక్తుడు పద్మాసనస్థుడై పూజా మందిరములో కూర్చొని వామకరము పై లింగము నుంచి అభిషేకించి, విభూతి, పత్త్రిర సమర్పించి చెప్ప వేయు ధ్యానించెడి వారని విదితమగుచున్నది.(బసవ పురాణము 2-116 పు) లింగా ర్చనకు నీరు, పాలు, పూలు, గజ్జెములు, మారేడు పత్త్రి విడియముల ఏర్పాటు చేయుచుండిరి. దాదాపు ఇరువది ఐదు రకముల పత్త్రలు, నలుబది రకముల పూలు, ఏబది రకముల పండ్లు ఉపయోగించుచుండిరని పండితా రాధ్య చరిత్ర-56,366 పుటలలో వర్ణింపబడినది. దేవాలయములో లింగ మునకు భక్తులు తల తాకించెడివారు. తదుపరి లింగావసరమును-భోజనము తీర్చుకొనుచుండిరి.

4 (బి) పూజా సామగ్రి :

సోమనాథుని కాలములోని పూజా సామగ్రి వివరణ తెలియనగును. పూజకు ధూప గంధమును, గుగ్గులము, అక్షింతలు, పాలు. మారేడు పత్రి ప్రసాదముగా వంచ భక్ష్యములు. పుల కండమును, నెయ్యిని అర్పించె వారని తెలియుచున్నది. నాడు నేతితో దీపములు వెలిగించెడి వార వ్యక్తమగును.

నమినంది నెయ్యితో సహస్ర దీపంబులు వెలిగించు నిజవత్రము కలి యుండెను. నెయ్య లభింపక పోయిన, దీపములారి పోయిన ప్రాణము విడుతునని "ప్రాణేశు నేయి యెప్పాటను లేదు, ప్రాణముల్విడతు దీవం లారినను''

—బ పు-షష్ఠాశ్వాసము 421వ పు-

అని శిరమును పరిచ్ఛేదించు కొనబోగా సద్దేవుడు ప్రీతితో ప్రత్య మయ్యెను" ''మైలారు దేవుని పూజయు, ఏకవీర మహోత్సవము, భై వార్చనలు చేయుచుండిరని, ఈ వీర పూజలు మతోద్రేక లక్షణముల"2 కె. వెంకట నారాయణరావు తెలియజేయుచున్నారు.

---

2. కే. వేంకట నారాయణరావు-ఆంధ్ర వాఙ్మయ చరిత్రసంగ్రహము (1967 : పుట 77)

4. (సి) ముడుపులు కట్టుట :

ఆ రోజులలో ప్రజలు కష్టములున్నపుడు ముడుపు కట్టు ఆచారము కుమార సంభవములో వర్ణించబడెను.

ఆ. "ఎల్ల సమయములకు నీకుండు వేల్పని
ముడియ పైవ పచ్చు వడుపు వోలె''

–కు.సం.8 ఆ 64ప. 192 పు.

4. (డి) మొక్కులు :

తర్వాత ప్రజల మొక్కుల గూర్చి తెలియవచ్చుచున్నది. అవి వరుసగా (1) వ్రేళ్లతో హారతులిచ్చుట (2) అచ్చన బాడుట (3) గండ దీపము పం.చ (1-408-9వ పుట) (4) మూపున గండలిచ్చుట (పం.చ 1.471వ పుట) (5) జడలతో నారలిచ్చుట (6) నేత్రము లిచ్చుట పం.చ (11 405) (7) తదితర శరీరభాగములిచ్చుట (పం.చ.11 406-407వ పుట) (8) కనుమూరి ఇది కర్మ కారేశ్వర శిఖరము, (9) గండ కత్తెర పం చ. (11-86వ పుట), (10) కాలుచున్న ఇనుప పెన్నముపై కూర్చుండుట (వీర శంకరుని కథ)గలవు

4. (ఇ) త్యాగము :

వీరశైవులు 'శివ ధర్మ శరణ రక్షణకై' ఆత్మ త్యాగములు చేయు చుండిరి. ఇదియే వీరశైవము యొక్క ప్రత్యేకత. ఆత్మాహుతికై 'ఘన జలాంతరములలో నురుకుట' (బ.పు-3-147వ పుట) 'కొడవలితో తల నరుకు కొనుట-అరివాళు నాయనారి కథలో "పెడ కచ్చుగొడవలి మేడఁ బెట్టి మూపు" బ.పు 4 (316వ పుట) తలము పగలు కొట్టుకొనుట బ పు-3-(159వ పుట) బెజ్జమహాదేవి కథలో "తగ శిరమున కలుగ నున్నంతఁ" కత్తిని రొమ్మున దూసుకొనుట : తల వెండ్రుకలతో దీపగానము చేయుట జరుగు చుండెను. దీవద కళియూరు కథలో

"క్రగక్కునఁ దలవెండ్రుకల జడయల్లి
చక్కన దీపంబు సంధించి పట్టి''

–బ.పు-తృతీయాశ్వాసము 172 పు.

వర్ణింపబడినది

4. (ఎఫ్) నోము నోచుట :

అగ్ర వర్ణాల ప్రజలు-బ్రాహ్మణ క్షత్రియులు నోము నోచుచుండిరని తెలియుగలదు. ముఖ్యముగా కార్యసిద్ధికి 'నందికేశ్వర నోమును' ఆచరించుచుండిరి. ఈ వ్రతమును తొమ్మిది సోమవారములు ఆచరింపవలయుననియు, వ్రతానంతరము నందిని స్నానము చేయించి, పుష్పములతో పర్చించి, మెత్తని వస్త్రములు కప్పి, గజ్జలు మొదలగు అభరణములతో అలంకరించుచుండిరి.

"ఇమ్ముల సోమవారమ్ము గాఁగఁ
తొమ్మిది దినములుత్సక వృత్తినోఁచి
..................................................
..................................................
................................యర్పించి"

—బ పు-ప్రథమాశ్వాసము 29వ పు

హింగుళేశ్వర భాగవాడి అగ్రహారమందలి మండెగ మాదిరాజు భార్య మదాంబ సంతానమును బడయుటకు నందికేశ్వర నోము నోచినది. వ్రతానంతరము నేటి వినాయకుని నిమజ్జనము లాగ నందికేశ్వరుని నిమజ్జనము చేయక యెక్కడో పూల చెట్ల మొదల్లో విడిచి పెట్టుచుండిరి

4. నామకరణము :

వీరశైవులకు పంచ సూత్రిక కర్మలు లేవు. కొందఱు బిడ్డ పుట్టకమునుపే నామకరణము చేయుట ఆ బిడ్డ వ్రత ఫలమని భావించుట జరుగుచుండెను. నామకరణ మహోత్సవములో విభూతి, వీడ్యమును పాదోదకమును మొసంగెడివారు.

"భక్తులఁ బిల్వంగఁబనిచి యిరువురును
భక్తి ప్రబంధము మేర్పడ నాచరించి
..................................................
- - - - - - - విభూతి వీడ్యములర్పించి"

—బసవ పురాణము-1-38వ పు-

మాదిరాజు. మదాంబలు తమ పుత్రుని నామకరణ మహోత్సవమున భక్తులకు

విభూతి, వీశ్యములు సమర్పించి పాదోదక సత్కారము చేయుచుండిరి. బసవన్న మదాంబ కడుపులో మూడు సంవత్సరములు పెరిగినాడట.

6. వ్రతము :

వ్రతములకు క్షత్రియులు అర్హులు కారని తెలియుచున్నది. సాక్షాత్ మహారాణి రుద్రమదేవి కూడ నందికేశ్వరుని వ్రతము నాదరించినట్లు చరిత్ర ఉటంకించుచున్నది.

వ్రతములకు, పూజలకు సోమవారమును పవిత్రముగా భావించు నాచారము ఆ కాలములో నున్నట్లు సోమనాథ మహాకవి తెలియజేయు చున్నాడు. శివుణ్ణి సోమవారము పూజించు ఆచారము నాడు నేడు ఒక్కటి గానే యున్నది.

"క్రమ మొంద సోమవారము సోమవార
భవుని పూజించుచు బడయుచునుండె''

యని కవి పేర్కొనినాడు. (బం,చ.మ.ప్ర 274 పు)

"వ్రతమను పదమునకు వాచస్పత్యనిఘంట కారుడగు తారానాథ తర్కవాచస్పతి ట్లర్థము చేసియున్నాడు.

"ప్రజ ఘుజ స్యతః భీషణ భేదే ఉణాది పుణ్య సాధనే ఉపవాసాది నియము భేదేచ"—

'అనగా పుణ్య సాధనమునకై ఉపవాసాది నియమము చే జేయు కార్యమునకు వ్రతమ'ని అర్థము. సమ్యగను ష్టానము జేయవలెను- ఇది ప్రవృత్తి, నివృత్తి రూపములని రెండు విధములు. భోజన పూజాది కములతో గూడినది ప్రవృత్తి రూపము. ఉపవాసాదికమైనది నివృత్తి రూపము.

ఈ వ్రతములు మూడు రకములు 1. నిత్య వ్రతము ఉదా॥ ఏకాదశి ఇత్యాదులు, 2. నైమిత్తిక వ్రతములు, ఉదా॥ చాంద్రాయణము ఇత్యాదులు 3. కామ్య వ్రతములు ఆయా తిథులందు ఉపవాసములుం డిచేయవలసినవి. మరొక విధముగా వ్రతములు మానసికములు, కాయికములని రెండు విధ ములు వ్రత ఫలితమును పరిశీలింపగా

శ్లో॥ తథా దశరథో రాజా వ్రతే షు నిరతస్సదా
యజ్ఞ దాన తపోయోగైః సంతుష్టం పురుషోత్తమః''

దశరథ మహారాజు వ్రతములకు పురుషోత్తముడు మెచ్చి తానే యాతని పుత్రుడయి జన్మించెనట" అని సుకవరను ప్రతాపరెడ్డి వివరించియున్నారు (చూ. హిందువుల పండుగలు-1987 : పుట 3)

7. వరములు :

వీరశైవులు స్వార్థ చింతనతో వరములు కోరుకొనలేదని తెలియుచున్నది. భక్తులు తమకొఱకు వరములు అడుగక శివుని వైభవము కొఱకు యోగ క్షేమములు కొఱకు కాంక్షించిరి. (బసవ పురాణము-3-147వ పుట) మరియు శివ శరణుడైన శంకర దాసిమయ్య శివుని కోరిన అద్భుత వరమును పరిశీలించండి. తనకు "రాత్రి సమయములో పని చేయుటకు సూదికి దారమును ఎక్కించుకొనగల-శక్తిని కంటికి ప్రసాదింపమని" కోరుట ప్రత్యక్షముగా కాయకమే కైలాసము అన్నది పరోక్షముగా వీరశైవ రక్షణ-అక్షర సత్యము. స్వార్థమునకైనీ మోల్లంఘన జరిగెడిది కాదు.

8. ఆహారము :

ఆ కాలమునాటి ఆహారము ఎట్లుండినదో పాల్కురికి తెలియజేసెను. సూరసాని కథలో కొకత భోజన ప్రసక్తి యున్నది. శివుడు హరిజనుని వేషములో సూరసాని ఇంటికి వచ్చినపుడు ఆమెగావించిన అతిథి మర్యాద లిట్లున్నవి.

"కదళీ దళంబిడి కన్నుడనియగ
బద పదార్థములను ఖక్వాన్నములను
ధృక్కొనఁ గూడ వడ్డింప నాయయ్య
యక్క జంబుగలోన నారగింపగ"

-పంచ-దీక్షా ప్రకరణము 119 పు.

పద పదార్థములనగా 'పసంఖ్యాకంబులయిన' పనంబైన పదార్థములని అర్థము.

8. (ఎ) విందు :

అల్లమ ప్రభువు విచ్చేసినపుడు బసవేశ్వరుడు జంగములకు విందు చేసెను. ఆ కాలము నాటి విందు మనకు తెలియ వచ్చుచున్నది. విందు చేయు విధము వ్యక్తమగుచున్నది.

"పళ్లెరంబిడి వంచ భక్ష్యాన్నములును
నెల్ల పదార్థముల్ మొల్లంబుగాఁగ
వడ్డించి యిబ్బ సవండర్థి దొడ్డ"
-బ.పు-ద్వితీయా శ్వాసము 65వ పు-

వీరశైవ మతమును స్వీకరించి సన్యాసమును పాటించి ఆ మత ప్రచారము కొరకు దేశాటన మొనర్చువారిని 'జంగమములని' అందురు. వారి యందే భృంగిత్యాది ప్రమథ గోత్ర వ్యవహారము యుండునని డా॥ చిలకలూరి నారాయణరావు పంతులు నిర్వచించియున్నారు.

8. (బి) పానము :

కుమార సంభవములో వివరములు గలవు జనుల పండ్ల రసములు గ్రోలుచుండిరి. (9 అ-133 ప-234 పు) జల మిక్షు ఫల రసంబులు (7అ-93 ప-167 పు) గ్రోలుచుండిరి. జున్ను తినుచుండిరని తెలియగలదు. (8అ-160 ప-208 పు) సోమమును త్రాగుచుండిరి. (2 అ-36 ప-31 పు) మధు పానమును గ్రోలు విధము ప్రత్యేకముగా నుండెను. మండలాకారముగా స్త్రీ పురుషులా సీనులై యుండిరట.

పండితారాధ్య చరిత్రలో సోమనాథుడు అప్పటి పానయోగ్యమైన నీటిని గుఱించి తెలియచేయుచున్నాడు.

"ఒక్కొక్కచము క్రియ్యాటల చోటల, బావుల, కుంటల, పద్మాకరముల - - - కరతిత్తుల! నుదకంబులు గొనుచు" ఆ జనులు కొంత వరకు బావి నీరు, కుంటల నీరు, కొలని నీరు వాడినను ఎక్కువగా ప్రవాహముల నీరును సేవించినారు.

9. శైశవము :

పండ్రెండవ శతాబ్దములో శిశువు పెరుగు విధమును యోగముతో నన్వయించి చెప్పుకొనుచుండిరెమో?

"క్రచ్చ షడ్దళకమలంబు నొంది
........................................
........................................
షోడశదళ పద్మసురుచిర సౌఖ్య
క్రీడా విలోలుడై కేరియాడుచును"

–బ.పు–ప్రథమాశ్వాసము_33వ. పు–

తల్లియైన మదాంబ గర్భములో బసవేశ్వరుడు శిశువుగా వృద్ధి చెందిన విధము తెలియ గలదు నాడు భగవంతునికి సాష్టాంగ దండ ప్రణామములు గావించుచుండిరి. చంద్రుని, సూర్యుని దేవతలుగా నారాధించిరని తెలియుచున్నది. శుభ సందర్భంలో శృంగ, శంఖ, భేరి, జయగంట డోలు–పంచమ వాయిద్యాలను వినిపించెడివారు.

9 (ఎ) అక్షరాభ్యాసము :

నన్నయ్య తర్వాతి కాలములో అక్షరాభ్యాసము "ఓంనమః శివాయ"తో ప్రారంభించు పద్ధతి యుండినట్లు తెలియగలదు. "ఓనామాలు, అను మాట 'ఓం నమః శివాయ' నుండి పుట్టినట్లు విజ్ఞుల అభిప్రాయము.

పార్వతి అక్షర స్వీకార సంస్కారమును నన్నెచోడుడు వర్ణించిన విధము తిలకించండి.

"గిరిసుత దొలు పలుకులను
స్వర మొదవంగ 'నోం నమశ్శివాయ సదాన్న
దవోదాయ నమశ్శంకర !
శరణు ! మహాదేవ ! నీవ శరణ నజొచ్చెన్"

–కు.సం–3 ఆ 34 వ 51 పు.

ఇది శైవ సంప్రదాయము. సిద్ధం నమః అనునది జైన సంప్రదాయము

9. (బి) శైశవ క్రీడలు :

అప్పటి ఆటలు పేర్కొనబడినవి. పార్వతి శైశవ క్రీడలను వర్ణించుచూ ఆమె తోటి బాలికలతో గుజ్జన గూళ్లాడినది.

"తరణులు చిలక బొమ్మలును, దంతపు బొమ్మలు మేలిగాజులు

వ్నరులును, ౖమాని చొప్పికలు నల్గడనోలిత పేర్చి లీలచే
కుర బొమ్మరిండ్లు జేయు"

—కు సం.-3 ఆ.36 వ 51 పు-

ఆ బొమ్మలలో చిలుక బొమ్మలు, దంతపు బొమ్మలు, గాజులతో చేసిన గురు
గులును కలవు. వివాహము కాని ఆడవారు ఆడ చిలుకలతో ఆడుకొనేవారు
(5 ఆ 131 వ)

9 (సి) ముద్దు పల్కులు :

తల్లి దండ్రులకు బాలుర ముద్దు పలుకు సంతో షావహమయినట్లుగా
తాను తండ్రియైన శివుని కీర్తించుచు రచించెనట.

"బాలుండాడెడు ముద్దు పల్కులు ఉపమింపందండిౖంకింభౌధ బా
షాలాపంబుల కంటె నింపయిన యట్లు"

—స.శ-136వ ప. 59 పు-

9 (డి) ఆటలు :

పండ్రెండవ శతాబ్దములో సూడు పట్టెలాడు చుండిరని, 'కందుక కేళి'
యందు మిక్కిలి ప్రీతి కల్గియుండిరని శివతత్త్వసారము వలన విదితమగు
చున్నది-

"చారుగతి నిలిపి, ఛత్రాకారంబుగఁ దాల్చియాడు'

—శి.సా 244 ప.-

"నందముగా సూడు పట్టిలాడుదురు శివా!"

—శి.సా-333 ప -

"సుర పర్వతాది ధరణీ
ధర కందుక కేళి వలిపి తత్క్షణమున"

—శి.సా-335 వ.-

సోమనాథ మహాకవి ఆ రోజులలో పిల్లలు ఆడుకొను ఆటలను తెలియ
జేసినాడు. ఇవి నాటి బాల బాలికల ఆటలుగాఁ దలంప వచ్చును.

"పొందంగ రాగుంజు పోగుంజులాట

..................................... దిక్కనను నాట'

-పం.చ.-పు.ప్ర. 157 పు.-

లున్నవట.

కుందెన గుడి గుడి గుంజమ్ములాట, అవ్వల విందుట, చప్పట్లు, సరి గుంజులాట ఇత్యాదులు పేర్కొనబడినవి. కుమార పాల ఘూర్జరుని కథలో ద్యూత వినోదము కలదు.

"వది నిహ పర్రముఁ దన్ వాడలయందు
వావ పుణ్యములను పాసికల్ వైవ"

-పం చ పురాతన ప్రకరణము 268 పుట-

9. (ఇ) పాటలు :

పార్వతి బాల్యమున శివార్చన చేయు సందర్భములో 'అంకమాలికలు' పాడినట్లు నన్నెచోడుడు వర్ణించెను.

" ................................ ఈశ్వరు నంక మాలికల్ వాడుచో
గీత భేదంబుల రీతులెఱిగ"

-కు సం 3_38 52 పు-

"కన్నడ శాసన వాఙ్మయములో అంకమాలిలు అధిక ప్రచారములో నున్నట్లు"[3] డా॥ నేలటూరి వేంకట రమణయ్య పేర్కొన్నారు.

నన్నెచోడుడు "ఓయల పాటలను' కూడా పేర్కొనెను.

మన్మథుడు రతీదేవి సమేతుడై హిమవంతమునకు బోయి పరమేశ్వరుని తపోవనములో ప్రవేశించునపుడు ఉవిదలు "ఓయల పాటలు" పాడినట్లు వర్ణించెను.

"ఉవిదలింపు మిగుల నోయల పాటలు
వాడ మధు మదమువఁ బాడె నలులు"

-కు.సం.4 అ 69 వ 82 పు-

ఈ పాటలను శ్రీమానవల్లి రామకృష్ణ కవి పుష్పావచయ గీతాలుగా 'పేర్కొన్నట్లు తెలుపుచూ డా॥ నేలటూరి వేంకట రమణయ్య 'ఓయల'కు

3. నన్నెచోడుడు_కుమార సంభవము_వ్యాఖ్యాన సహితము (1978 : పుట 178)

మూలము 'ఓయల్'యని వివరించెము. సూర్యరాయాంధ్ర నిఘంటువులో 'పండుగ సందర్భములో నృత్యము చేస్తూ పాడుకొనేవి ఓయల పాటలని' అర్థము యివ్వబడినది. అంకమాలికలు శాస్త్రీయ సంగీతమున కనుకూలమైన గౌడు గీతాలు అచ్చముగా దేశీయము లయినవి.

సంగీతమున కవకాశములేకున్నను కొంత వఱకు తెలియ వచ్చుచున్నది. ప్రజలు పాటలు పాడు నపుడు తాళములు వేసెడివారని వ్యక్తమగుచున్నది.

"సమసుప్తి దుస్పికొని నీ
ప్రమథులుఁ దాలములు వేసి పాడుదురు శివా!"
—శి.సా-331 ప.-

"స్థిర భక్తి నీకుఁ బాడుచుఁ
బుర హర ! తన చేతి తాళములతోడ వెచె
—శి.సా-435 ప.-

## 10. వివాహము :

వీరశైవుల ఇండ్లలోని వివాహ ఘట్టములు వర్ణింపబడినవి. బసవ పురాణములో వరుని అలంకరించిన విధము తెలియును. బసవేశ్వరుని పెండ్లి సందర్భములో పెండ్లి కొడకును ఒక సారి చూడండి. దివ్యాంబరములు ధరించి, భసితమును శరశమునకు పూతగా పూసి

"నొసలఁ త్రిపుండ్ర మొప్పసఁగ ధరించి- - - -పోలగ రుద్రాక్ష భూషలు దాల్చి, సారమై లింగ వసాయి తంబసెడు పేరను గల్గు కఠారంబు గట్టి"

-బ.పు-ప్రథమా శ్వాసము 51వ పుట-

వివాహ మహోత్సవాహ్వాన పత్రిక ఆ ప్రాంతమందలి పీఠాధిపతుల ఆశీర్వాదముతో వారి సమక్షమున కాని వారి అనుమతితో గాని జరుగుచుండెడివని తలంపవచ్చును. శుభ సమయములో నంది కోల గలను గొప్పవారు రుద్రాక్షమాలలు (భూషలు) ధరించుచుట ఆచారమైవది. నేడును రుద్రాక్ష మాలలు గొప్పవారు ధరించుచున్నారు.

## 10. (ఎ) పెండ్లి వేడుకలు :

గృహ జీవితమున స్త్రీలకు సమున్నత స్థానము యుండెను. సోమనాథుడు

పెండ్లి వేడుకలను వర్ణించి నాటి సాంఘిక వ్యవస్థను తెలియజేసెను. ఆ కాలపు ప్రజలు పెండ్లి వేడుకలను వైభవోపేతముగా జరుపుకొనుచుండిరి. ప్రజలకు కస్తూరి, ముక్తాఫలములనిన ప్రీతి మెండు. వివాహ సమయము నాటి బావను గుర్తు చేయుచుండిరట.

10. (బి) కట్నము :

పెండ్లి సమయములలోను, శుభ సందర్భములలోను "కట్నాలు" వ్రీవక్తినాడును, నేడును గలదు. బసవేశ్వరుడు కళ్యాణ కటకమునకు విచ్చేసిన సందర్భమున అనేక రకములయిన కానుకలను రాజు ఇచ్చివట్లున్నది, వానిలో పర వస్త్రములు భూషణములు కూడా ఉన్నవి.

"వచ్చు వారును, జూచువారును గట్ట నిచ్చు వారును"

–బ.పు–ద్వితీయాశ్వాసము 65 పుట–

గలరని చెప్పవచ్చును.

మడివాలు మాచయ్య జంగముల వస్త్రములను శుభ్రపరచి వారిచ్చు కట్నముతోనే తృప్తి జెందు చుండెనని తెలియుగలదు.

"ఎట్టి కట్టంబైన నిచ్చి మ్రొక్కుచును
నా వస్త్రముల వారలడుగ వచ్చినను"

–చతుర్థాశ్వాసము 234 పు–

లేవనిడి వాడు కాడు.

10. (సి) కొట్నము :

ఆ నాటి ప్రజలు 'కొట్నం' పెట్టు ఆచారము గలవారని తెలియుచున్నవి. పాల్కురికి ఆ విధానమును వివరించుచున్నాడు.

"కాళ్లగోళ్లు దిద్దించి క్రమముతోడ

–బ.పు–ప్రథమాశ్వాసము–11 పు–

"సుంకులు బెరగించి పొంకముగను"

–బ.పు–ప్రథమాశ్వాసము–26 పు–

ఆ కాలపు ప్రజలు

"కొట్నంబు దినము పుట్టిడు సంపంగ బోలక"

–బ.పు.చ.ఆ–316 పు–

కొట్నము, కొట్టనము, కొట్నము-ధాన్యమని వేటూరి ప్రభాకర శాస్త్రిగారు 'కొట్నము'ను గూర్చి విశదపరచినారు.

వడ్లు మున్నగు వానియొక్క దంపును కొట్నముగా సూర్యరాయాంధ్ర నిఘంటువు పేర్కొన్నది. ధాన్యము దంచిన తర్వాత పళ్లెములో పోసి ఆ తర్వాత చెరగగా వచ్చిన వడ్ల పొట్టును 'కొట్నము సుంకులంటారు'. కొట్నము పెట్టె సమయములో స్త్రీలు పాడు పాటలను కొట్నము పాటలందురు. ఆ నాడు ఒక పెండ్లి వారము రోజులు జరుగుచుండెడిదట-

## 10. (డి) పేరంటాలు :

అప్పటి మహిళలు పేరంటాలకు వెళ్లేవారు.

'మర్తారి ద్రోపఁ నింటికిఁ !
బేరంటము వచ్చి తమచుఁ బెలు చనుగొనెన్"

—శి.సా-309 ప-

ఆ వ్యవస్థలో ముత్తైదవలు 'పేరంటాలు' జరుపుకొనుచుండిరి. అని సోమనాథ మహాకవి తెలిపియున్నాడు. తల్లులు చిన్న పిల్లలను మగ పిల్లలైనను పెళ్లికి పేరంటాలకు తీసికొని వెళ్ళు ఆచారము కలదట.

"పెండ్లిండ్ల నోములఁ బేరంటములను
బండువు దినములఁ బొటి జాతరలఁ

.................................................................

.................................... మగ బిడ్డలైన"

—బ.పు-తృతీయాశ్వాసము 153వ పుట-

బెజ్జమహాదేవి బాల శంకరుని మగ పిల్లవాడైనను సరే పెండ్లి పేరంటములకు తీసికొని వెళ్లినదట.

## 10. (ఇ) విడాకులు :

పెళ్లనాడు తాంబూలము ను-రెండు తమలపాకులను-పుచ్చుకొనునట్లే భార్యా భర్తలు విడిపోవునపుడు ఆ రెండాకులలో చెరియొక ఆకును తీసికొని దూరముగు చుండి చుండిరేమో?

అప్పటి సంప్రదాయములో విడాకులిచ్చే ఆచారమున్నట్లు నన్నెచోడుడు సూచించినాడు.

"ఓలము లేదు కూర్చునని యూఱడి యుండిరి
– – – – నన్ను బెడయాకులం బెట్టి"

–కు. సం_11 అ 55 ప 292 పు_

11 భోగము :

అప్పటి ప్రజలు తాంబూలము, ఘనసారము, గంధము, పుష్పములను గొనుచుండిరని తెలియరాగలదు.

సూర్యాస్తమయ వర్ణన సందర్భములో వివరణ గలదు.

"ఘనసార తాంబూల గంధ ప్రసూన
వినుతా భరణ వస్త్ర వితతలు గొనుచు
గరమర్థి లంజెరికంబు సేయంగ"

–తృతీయా శ్వాసము 132వ పుట_

మిండ జంగములు, దండనాయకులు సుగంధ ద్రవ్యములు గొనుచు లంజరికంబు సేయుటకు వెళ్ళుచుండిరనిన ప్రజలు వీరభక్తితో పాటు వీర భోగములననుభవించుచుండిరని సువ్యక్తమగును ముగ్ధ సంగయ్య కథలో వారకాంత గృహము కలదు. 'హాటకంకుట్టిమ హర్మ్యము.' అతి పుష్పకాగారము కంభకట్లతో, మేలు కట్లతోనొప్పినది. రత్నమణి దీప ప్రభలతో హంసతూలికా తల్పములతో ఆ వేశ్యా గృహము చెలువారినది.

12. అలంకరణ :

పార్వతి ఈశ్వరారాధన భక్తితో చేయు సందర్భములో వివిధ సువాసన ద్రవ్యములు వాడినట్లు నన్నెచోడుడు విపులముగా వర్ణించెను.

"కర్పూర తైలార్ద్ర కస్తూరికాకర్ద
మంబుల నను లేపనంబు సేయుం"

–కు. సం_3 అ 116 ప 64 పు_

పార్వతి కర్పూర తైలమును, కస్తూరిని పూతగా వాడినది. తర్వాత శివుడు ఋషి వేషములో వచ్చి పార్వతిని గాంచెను. ఆమె సహజ సౌందర్యముతో 11 కమ్మమానియు మెఱుగెక్క గలయ దువ్వి" (6అ52 ప 130 పు) యని నన్నెచోడుడు వర్ణించెను. ఆనాడు చందనమును, కాశ్మీర తిలకమును కూడ విరివిగా వాడుచుండిరి. అంతేకాదు "సలలిత సాంద్ర కుంకుమము

చన్నులపైఁ (మె)యిఁ'' (5 ఆ 72 ప 101 పు) పూసికొన్నది దంతము లూడిపోయిన మెరుగు దంతములు తయారు చేయించుకొనెడి వారట. "పఱచని పూతలున్ మెఱుగు బండును నున్న కోరకొప్పటన్'' (8-143-205 పు)

బసవేశ్వరుని పెండ్లి సందర్భములో గృహస్థులు గావించిన అలంకరణను గమనించి తీరవలయును.

"తలయఁగ వీధులఁ గస్తూరి యలుకుఁ
డెలమి ముక్తా ఫలంబుల ముగ్గులిడుడు"

-బ.పు-ప్రథమా శ్వాసము 49 పు-

అట్టి పెండ్లికి భక్తుల కరుణ లగ్నంబుగాను, దీవెన ముహూర్తంబు గాను ప్రజలు భావించుచుండిరని తెలియనగును. వీరికి పద్మము మిక్కిలి ప్రీతి పాత్రము. అది భాగ్య లక్ష్మికి చిహ్నమని భావించుచుండిరి.

## 13. ఆభరణములు :

నన్నెచోడుని కాలములో కామినీజనము ధరియించు భూషణముల వివరములు గలవు.

"కరవీర రచిత నూపురములు సెలవొంతఁ
గాంచిన పుష్పమేఖలలు గట్టి
పున్నాగ మయ హారములు వెట్టి నవకర్ణి"

-5 ఆ, 20ప, 92 పు-

కటకములు, కేయూరములు, కర్ణ పూరములు, హేమ తిలకములు ధరించెడి వారు.

మరొక సందర్భములో ఏకసర, త్రిసర, పదకరాంగుళీయకము, ఉదర బంధకము, కటి సూత్రము, శింజిని ధరించిరి (9 ఆ-25ప-230 పు) కంసాలులు బంగారపు మేలిమినెఱగుటకై 'యొరగల్లును' పయోగించు నాచారము కలదు.

## 13 (ఎ) ఒడ్డాణము ఆభరణములు మట్టెలు :

ఆ కాలములో స్త్రీలందరు సామాన్యముగా ధరించు ఆభరణము 'ఒడ్డాణము'

"కొమరుగ నొడ్డాణము-దండ గ్రుచ్చిన భంగిన్''
హిమకర మండలమును"

-శి.సా.-240 పద్యము-

13. (బి) కుండలములు :

ఆ కాలములో ధరించు ఆభరణములు లోని రకములు తెలియవచ్చును.

అవి కొక్కెరలు, పాలెలు, సరివేణలు, నేదళములు కీలు గొలుసులు, రాగి కీర్తి ముఖములు, అందెలు, పల్లయూరలు మున్నగున్నవి కలవు.

చెవులకు, బంగారు కుండలములు ధరించుచుండిరి. అందులోని రకములు స్ఫటిక కుండలములు, రజిత కుండలములు, మణి కుండలములు, హేమ, నంది, నాగ కుండలములు, పలు కుచ్చులు, వెండి గొలుసులు కటి సూత్రములు నేత్రి పర్వ మొనర్చుచుండినవట.

ఆనాడు రాగి ఆభరణములు కూడా వాడుకలో నుండెను. రాగితో మాలలు. నందులు, ఉంగరములు, దండములు, జన్నిదములు, కటక ములు, పడకములు, యొడ్డాణములు తయారు చేయుచుండిరి.

వీరు చేతులతో కలశములను, బెత్తములను ధరించుచుండిరి. బెత్తముల లోని రకములు ఇవ్వబడినవి. వన్నె, వలె, వలయంబు, పులక గజ్జగౌరి, వెదురు, పొంజాయి, బెత్తములలోని విశేషములు. జోగులు, చెవులలో పకెలు, నిడుదతోక పచ్చెదములు, కడియములు ధరించిరి.

13. (సి) పాపుకోళ్ళు : పావులలోని రకములు 'తెలుపబడినవి.

(1) పొడవగు నంబవులు-పాపుకోళ్లు.

(2) పసిడి గొడుగుల పావులు-గుబ్బగొడుగు ఆకారముతో బంగారు పూత గలవి.

(3) గూడ లోహంబు పావులు యుండినవి.

వీరశైవులు వెల, గొడుగులే ధరించిరి

అనాటి ప్రజలు హార వస్త్ర భూషణములు ధరించెడివారని యథా వాక్కుల అన్నమయ్య పేర్కొనెను.

'భీల జ్వాలల గ్రాగు మావునకున్ బింబాధరా హారవ
స్త్రాలంకారము లించుక సుఖం బైతోచుసర్వేశ్వరా!"

-182వ ప. 54వ పు.

## 14. సదాచారము :

వీరశైవులు మొదటిసారిగా ఒకరికి ఒకరు ఎదురైనపుడు 'శరణు శరణార్థి' అనిన శరణు శరాణార్థి' అని అభ్యుత్థాన మొనర్చు చుండిరి. ఇట్టి ఉభయకుశలత ప్రసంగము వీరశైవము యొక్క ప్రత్యేక ఆచారము వీరశైవులు ప్రత్యుత్తర మియ్యని బాస కలిగియుండిరి. గృహమునకు భక్తులురాగానే అర్ఘ్యపద్యంబ లొసంగుట యాచారమై యుండెను. 'అడుగుల కర్ఘ్య పద్యంబులు దేర' మోళిగ మారయ్య కథలో బసవ పురాణము-5-536 పుట తెలియవచ్చును.

వీరశైవులలో గొప్ప వారికి చిన్న వారు సాష్టాంగ దండ ప్రమాణము చేయుట అనెడి వినయ సంపన్నమైన, భక్తి బంధురమైన ఆచారమున్నట్లు వ్యక్తమగుచున్నది.

"చిన్న పంబేఁ బనిచిని యెద'' ననుచు
నన్నందికేశుడు సాష్టాంగ మెరిగి''

—బసవ పురాణము-ప్రథమాశ్వాసము 28వ పు-

నందికేశ్వరుని మర్త్యమున బసవేశ్వరుడుగా జనింపబంపు సందర్భమున శివునకు సాష్టాంగ నమస్కారము గావించెను. ఈ పద్ధతిని శివాలయములో కూడ పాటించుచుండిరి. నేడిట్టి ఆచారము కనిపించుట తక్కువ అగుచున్నది. గొప్ప శివ భక్తులు నడుకలలోగాని విరామ సమయములలోగాని 'చామర ధారుడి' లుండెడివారు. ఒక వీరశైవుని గృహములో యెట్టి శుభ, అశుభ కార్యములు జరిగినను, వీరశైవులందరూ తప్పక దయ చేయుచుండిరట.

## 15. మాహేశ్వర వ్రతము :

వీరశైవుల-దర్శన, స్పర్శన, ఆసన, శయన, భోజన సంపర్కములకు దానములకు ఇతరులు అర్హులుకాదు.

''గడియింప కుండితఁ గాదు కార్యంబు
హర భక్తులార లేరొరుల నేనడుగఁ
బొదగూరి కీవేళఁ బోవంగరాదు''

—బ.పు-ద్వితీయాశ్వాసము-101వ పు-

హర భక్తులు, హర భక్తులనే అప్పు అడిగెడివార్లని, ఇచ్చి పుచ్చుకొనుట వారి మధ్యనే జరుగుచుండెడి ఆచారము ప్రత్యేకము.

ఈ నాడు 'దొరికిన చాలు ఎవ్వరైన నేమిః ఏమి అడిగిన నేమిః యని ప్రతి చిన్న విషయమునకు 'చేయి చాచుట' సులభమైనది.

16. అతిథి మర్యాదలు :

"అజ్ఞాత కుల నామానం తత్కాలే సముపస్థితం
బుభు క్షుమాగతం శాంతం యాచమాన మనించనమే
బ్రాహ్మణం ప్రాహురతిథిం సంపూజ్యశ్శక్తితో బుధైః"

భావము :

తెలియబడని కులనామములు గలవాడు. తత్కాలాలు ప్రాప్తించిన వాడు, ఆకలి గొన్నవాడు, అకించనుడు, అర్థి శాంతుడు అయిన బ్రాహ్మణున్ని అతిథి అందురు.

అతిథి అనగా ఫలానా తిథిరోజున ఇంటికి ఆతిథ్యముకొరకు వస్తున్నానని తెలియజేయనివాడు. 'అతిథి స్వయం విష్ణువు సమానమని జెప్పబడినది,

"అర్ఘ పాద్యాది విశేషార్చన లర్పించ
మణి కనకాది వస్తు నిచయంబునం బూజించి"
-కు.సం. (1 ఆ-114వ ప-20 పు)-

అటులననే నిందుద్ధుధ్వరరాజు, ఫలరాజును పార్వతీ పరమేశ్వరులం గలుపుటకై 'బోత్సహించిన సందర్భములో "సముతాచితాసన తాంబులదాన సన్మానదులం "సత్కరించెను.

-కు.సం.(4 ఆ-40వ-73 పుట)

నన్నెచోడుడు స్వాగతంచేయు సందర్భములో స్వాగత ఛందస్సును 'ఆగిరీంద్రసుత హర్షముతో"యని ప్రయోగించెను.

ఆ యుగము అతిథి మర్యాదలకు స్వర్ణ యుగము. గృహములకు భక్తులు రాగానే అర్ఘ్య పద్యంబు లొసంగుట ఆచారము. (బ.పు-పంచమాశ్వాసము-356 పుట)

"అభ్యాగతి స్వయం విష్ణుః
అతిథి పరమేశ్వరః" భావించుటాచారము.

ఆహుతలకు దండిగా పుష్పాంజలులు, ధూప దీప గంధంబులు వ్రజలు సమర్పించుచుండిరి.

17. పండుగలు :

పండ్రెండవ శతాబ్దము నాటి పండుగలను పాల్కురికి సోమనాథుడు తెలియజేసెను.

1. వసంతోత్సవము అనిన ప్రజలకు మిక్కిలి యిష్టము.

"ఇంతులు మెచ్చ వసంతోత్సవంబు
కాంత జేసెమ హస్తిఃటకంబు లమ్మి"

—బ.పు 5-360వ పుట-

2. దవన పున్నమ, దీనిని వ్యాస పూర్ణిమ అని నేడు వ్యవహరింతురు. కన్నడములో 'దవనదె హుణ్ణయె' అందురు.

3. నూలి పున్నమః దీనిని జంద్యాల పూర్ణిమ అందురు

-బ.పు-5-361వ పుట-

4. దివ్వెల అనగా దీపావళి పండుగ

17. (ఎ) శివరాత్రి :

నేడును శివరాత్రిగానే పిలవబడుచున్నది,

శివరాత్రిని గొప్ప పర్వదినముగా జరుపుకొనుచుండిరి. శివక్షేత్రములకు వెళ్ళుట తప్పని సరి.

17. (బి) వసంతోత్సవము :

దీనినే 'హోలీ' అందురు. వసంతకాలమునందు కామోత్సవము చేయుటచే కామ దహనము గూడా జరుగును.

చైత్రోత్సవే సకల లోక మనో వికాసం
కామం వసంత మలయాది మరుత్సహాయం
రత్యా సహర్చ్య పురుషః ప్రవరాచయోషిత్
సౌభాగ్య రూప సుత సౌఖ్యయుతాస్యాత్"

అనగా సకల లోక మనో నివాసుడగు మన్మథుని, వసంతుని, రతీదేవిని

చైత్రోత్సవమందు పూజించు వారకు సౌభాగ్యము, రూపము, సుతులను, సౌఖ్యములని కలిగియుంతురని"4 సురవరము ప్రతాపరెడ్డి దాని మహాత్మ్యమునుగ్గడించారు.

పెళ్లి అయిన తర్వాత బంధువులు సంతోషముతో వసంతాలు ఆడుకొన్నట్లు నన్నెచోడుడు వర్ణించెను. చిమ్మన గొట్టాలతో కుంకుమ కలిపి నీరు నింపి ఒకరి మీద ఒకరు చల్లుకొనేవారు.

"కన కంపుఁగొమ్ములు గొని ముంచి కాశ్మీర
జలము లొండొరులపైఁ జల్లువారు

కర్పూర చందన కస్తూరి మృగ పంక
ములుగొని యొండరుఁ బూయువారు,
_ _ _ _ _ _ నీరు పోఁత లాడిరొప్ప"

_కు.సం._9 ఆ 51 వ 225 పు_

నవమాశ్వాసములో 59,60,67వ పద్యములలో ముఖ్ఖాటలాడిరి. దశమాశ్వాసములో కుమార యువరాజ్య పట్టాభిషేక సమయమున 104వ పద్యములో ముఖ్ఖాటలు వర్ణింపబడినవి.

'ఉంకువ (ఓలి)' 'అరణము' నిచ్చుట అనాటి వివాహ ఆచారములు. 'ఇది నాకు సుంకు నిచ్చుట' 11 ఆ 138వ పద్యములో వివరింపబడినది. సంబంధ నిశ్చయ సూచికముగా వధువు శిరమున సేలాలుంచుట శాస్త్ర సంప్రదాయము తోరణములలోని రకములు (8 ఆ-42వ) వివరింపబడినవి.

18. సన్మానము :

అన్నమయ్య రోజులలో తమకు కావలసిన వారిని సన్మానించుట యుండెడిదని శివార్చన జేయు సందర్భమున తెలిపియున్నాడు.

" దీనమా
నవులన్ విద్వషులన్ భవాతరుల సన్మానించు
టల్ సౌఖ్యము, ఖ్య విహారేచ్ఛలు"

_స.శ_35వ ప, 42 పు_

4. సురవరం ప్రతాపరెడ్డి_హిందువుల పండుగలు (1987 : పుట 146)

19. సేవకులు :

అన్నమయ్య శివుని స్తోత్రము చేయు సందర్భములో సూర్యుడు, విఘ్నేశ్వరుడు, మాతృకలు నీ పరివారమని వివరించు సందర్భములో ఆ కాలములోని గొప్ప వారికి భృత్యులుండిరని తెలియజేయుచున్నాడు.

"కని శంబుంబరివార భృత్య నికరంబైనీయున్న నిన్నింకఁగొ
ల్వని వారెవ్వర జాండ భాండములలో వర్ణింప సర్వేశ్వరా"
-స,శ-5ప వ 37వ పు-

20. శుభా శుభములు :

ఆ కాలములోను శుభా శుభములున్నట్లు నన్నెచోడుడు తెలిసియున్నాడు పరమేశ్వరుడు మునుల రావించి తన వివాహ సందర్భమున శీతల గిరీశ్వరుని పాలికి పొమ్మన్నపుడు శుభములు కలిగినవట.

"శుభ వచనంబులు వినుచు, శుభద్రివ్యంబులు
సూచుచు, శుభ శకునంబులుగైకొనుచుం - - - చనిరి"
-కు.సం-7 ఆ 85వ ప. 166 పు-

మరుడు, హరుడుఁ దపంబుఁ జేయు దెసకుచను సందర్భమున 'సద్యో మరణ సూచకంబులగు నపశకు నంబులగాంచెనని కవి వర్ణించెను.

'సతీ సహగమనము' అను ఆచారము ఆ రోజులలో నధికముగానున్నట్లు తెలియవచ్చుచున్నది. రతిదేవి సహగమన చర్యకు ప్రవర్తించుటయే నిదర్శనము. "అని తన్నుదాను నిరాకరించుచుంటతి సహస్త్ర వృత్తిలేదీ నింగుల పాలికా ధర్మవృత్తిసైసె - - - - - రతి మరణ నిశ్చయంబు సేసిన - - - - -" 5 ఆ 94వ వ. 104వ పుటలో వర్ణించినాడు.

21. దండన :

భృత్యులు అపరాధము జేసినచో వారి స్వామినిదండించిన వారి ఆ అపరాధములు తీరిపోయెడివి. ఇది యెనిమిదవ అధ్యాయమున వివరింప బడినది.

22. వెలి వేయుట :

అప్పటి మరొక సంఘ సంప్రదాయము వెలివేయుట. ఊడమూర్తి

కన్నప్ప కథలో అడవిలో నున్న శివ లింగమును జూచి తిన్నడు సంభ్రమాశ్చర్యములతో

"చెన్నయ్యఁగలిసివఁజెడెఁ గులంబనుచు
నిమ్న లోకులు వెలియన్న వచ్చితివొ?"

-బ.పు. తృతీయా శ్వాసము 182 పు.

అని ప్రశ్నించెను. శివుడు చెన్నయ్య అను అస్పృశ్యుని ఇంట అంబలి త్రాగెను. మరొక సందర్భములో ఒడయనంబి గర్వమునకు మిక్కిలిమిండుడు కుపితుడై వెలివెట్టిన విధము గమనార్హము.

"నంబియు గింబియు నంబికిఁ గూర్చు
................................................ సకల భక్తులకు
వెలియుఁ జుండో"

—బ.పు.చతుర్థాశ్వాసము-302 పు.

అని ఘంట వాయించి వెలివేసిరి. వెలివాడలున్నట్లు కూడ తెలియ వచ్చుచున్నది.

(బ.పు.పంచమా శ్వాసము 154 పుట)

వీరశైవులు శరణ ధర్మమునకు విరుద్ధముగా ప్రవర్తించిన వారిని వెలివేయుచుండిరి. ఇట్టిది మాకు తెలిసిన ఒక కుటుంబములో క్రీ.శ. 1925-1930లో జరిగినదట. పత్తికొండ సమీపములోని 'హోసూరు'లో ఒక సోదరుని నాయనమ్మ పిన తండ్రి పతదర్శనులయింట భుజించుటచే వెలివేసిరి. ఆతడు జీవనాధారములేక భిక్షమెత్తుకొనుచూ జీవించుచుండెను. ఇట్టి వెలివేయుట ఇప్పుడు జరుగుట లేదు. ఇది ఎంతేని అభిలషణీయము.

## 23. బలి :

ఆ కాలములో జంతువులను బలి ఇచ్చుట ఆచారముగా నుండెను. 'గావు' అను మరొక సంప్రదాయము కలదు. 'గావు'లో మేక, గొఱ్ఱెల మెడలను కొరకుదురు. జన్నె విడుచు ఆచారము కలదు. అబోతు నొకదాని తొడపై లింగ ముద్రలు వైచి శివుని పేరు మీదుగా వదులుటను జన్నియ (జన్నె) అందురు. మా ప్రాంతములో దీనిని "దేవర దున్న" అందురు

24. ఆన చెప్పుట :

వీరశైవులు మాట నిలుపుకొనుటకై త్రిసులలో కూర్చొనెడివారు. తాను ఒక మాట చెప్పునది నిజమనుటకుఁ 'ఆన' చెప్పుచుండిరి. శివుని మీద ఆన చెప్పునట్లు బసవన్న పై కూడ ఆన చెప్పుచుండిరి. వీరు శరణాగతులకు 'వజ్రపంజరమని' బిరుదు యుండెను. నేడును దీనిని 'నీ సాక్షి' లేక 'నీతోడ' అనుట పరిపాటి"

25. వీర వ్రతము :

వీరశైవులు తమ కలలో నితర దర్శనుల వారిని గాంచిన శిక్ష వేసి కొనుచుండిరి. ఒక శివశరణుడు తన కలలో బుద్ధుని గాంచుటచే - ఆ మాలిన్యమును తొలగించుటకయి వీర శంకరుడు, హాటకేశ్వరము వద్ద మాడుచున్న పెన్నముపై కూర్చొండెనట.

(బసవ పురాణము. షష్ఠాశ్వాసము, 466వ పుట)

26. నమ్మకములు :

ఆ రోజులలో ప్రజలు 'రాతిపొన్న పూల'ను 'రాతికోడి రవము'ను నమ్మెడివారని మనకు తెలియుచున్నది.

"కలు పొన్న విరులఁ చెరుఁగన్
గలుకోడి రవంబు దిశలఁగలయఁగఁ జెలఁగన్
నలఘు పరాక్రమఁడఁ డెంకణా దిత్యుండన్"

-కు.సం 1 ఆ 54 వ 10 ప-

27. విశ్వాసములు :

పండ్రెండవ శతాబ్దములో మహాత్మ్యములపై విశ్వాసము యుండెను శివునకు, బసవేశ్వరునకు భేదము లేదనియు, బసవేశ్వరుడు ద్వితీయ శంభుడనియు" నాకును నీకును సందుకొనాడు లేదని' తెలిపియున్నాడు బసవేశ్వరుడు ఎన్నో మహాత్మ్యములను ప్రదర్శించి ఉన్నత వర్గముల దళితులయిన శూద్రులకు ఆకర్షించెను.

"భృంగి నా బసవయ్య భావ సంగతిని
పంగ కాయులు ప్రాణ లింగంబులయ్యె"

-బ.పు.ద్వితీయా శ్వాసము 97వ పుట-

"జొన్నల ప్రోక విశుద్ధముక్తాఫ
లోన్నత రాశియైయున్న నవ్వుచుమ"

_బ.పు. ద్వితీయాశ్వాసము 108వ పుట_

ఇట్టి నమ్మకములు ఆ కాలములో నుండినవి. అయిన వీనియందు కేవలము అనుకరణమే కాని జిజ్ఞాసయున్నట్లు కన్పించదు. నేడు 'బాబాలు, స్వాములు' ఇట్టివి ప్రదర్శించునెడ అవతార పురుషునిగా కీర్తింపబడిన వీర శైవ మతోద్ధారకుడు ప్రదర్శించుటలో నాశ్చర్యము లేదు.

## 28. స్వప్న శకునములు :

అప్పటి ప్రజలు కొన్ని విశ్వాసములు, శకునములు నమ్ముచుండిరి.

(1) స్వప్నములందు చూచు దృశ్యములు జరుగుననెడి అభిప్రాయము (పం.శ. 11 61,62 పుట)

(2) బాహిరముగ కన్పట్టునట్టివి (పం.చె. 11-59, 60వ పుట)

ఆ రోజులలో ఎవరైనా తుమ్మిన దీవించుచుండిరని తెలియుగలదు"

'నావేమ విభుడు శతాయుష్య మనుచు'

పం.చ_1-496వ పుట_

అంతేకాక పిల్లలను 'పైకెత్తిన పెరగరనియు', కాటుక పెట్టిన మేర 'కన్నులు విశాలమగుననియు' తెలియుచున్నది.

## 29. మంత్రించిన కాటుక :

ఆ కాలములో బోకి పెంచుల మీద మంత్రించిన కాటుక పూసి చూసినట్లైతే అదృశ్యమైనవి కనిపిస్తాయని ప్రజలు నమ్మేవారు.

"పరమ స్నేహము హృత్సరోరుహమునది బాతుగాం లు
స్థిరతర ఖ్య దశందపోగ్ని మదినుద్దీపించి బ్రహ్మాండక
ర్పర ఖండంబున మంత్రకాటక దగన్ పాలాక్షుంగూర్పంపన
గ్గిరిరాజాత్మజపట్టినా నమరి నింగింబర్వె నీలాభ్రముల్"

_ఉ.వ-6 ఆ-96 వ_137 పుట_

## 29. (ఎ) చేతబడి :

పదహాంఢవ శతాబ్దములో 'చేతబడి' (అభిచారము) మీద విశ్వాసమునట్లు తెలియవచ్చుచున్నది. కుమార సంభవములో

"కొలచెమధు వేళ గంకేలిపూచి భృంగ
పరివృతమైఁ మనోజుండు పొంథతతికి
నాభిచారంబు పేల్చు కుండాంతమునఁ"

-కు.సం_4 ఆ_94 వ_83 పు-

కంకేలి పూలు నిప్పులాగ ఎఱ్ఱగా మంటాయి. వాని మీద యెగరే తుమ్మెదలు నల్లనివి. కవి పూలను అభిచార హోమగుండములో రగిలే నిప్పులతోను, తుమ్మెదలను దానిమీద ఎగిరే ధూమముతోను పోల్చినాడు. 'చేతబడి' చేయు విధానములో హోమమును ప్రేలుచుట ఒక విశేషము.

## 29. (బి) మాంత్రికులు :

ఆనాడు మాంత్రికులకు ప్రాముఖ్యత యుండెనని సోమనాథుడు తెలియజేయుచున్నాడు.

పాము విషము పోగొట్టువారు వాడుక, నేడును గలరు. ఇది యెల్లరును విశ్వసింపదగిన సత్యము.

" ____________ శాస్త్ర
వైద్యులు గారుడ వరమంత్రవిదులు
____________
____________ భావంబులాని
-రంగ ప్రవేశము జేయుచుండిరి-"

(బ.పు-435వ పుట)

## 30. ఇంద్రజాలము :

ఆనాటి ప్రజలు ఇంద్రజాలమును నమ్ముచుండిరని కుమార సంభవము వలన వ్యక్తమగుచున్నది.

"దొరకొను నింద్రజాలమునఁ దోఁచిన నింద్రజాలమా
చరయుఁగ లేక చూపులకు నన్నియు నిక్కము వోలెనైనయు
ట్టిరపుగఁ బార మార్థికులకెపుడు ద్రవ్యములెల్ల మిథ్యలై
నిరతముఁ జూడ లోకులకు నిక్కములైచను భ్రాంతి పెంపునన్"

-కు.సం.6 ఆ-77వ-134 పుట-

ఇంద్రజాలములో చూపిన రూపాలను సత్యముగా భావించుచుండిరని పై పద్యములో కవి నిరూపించినాడు. ఇతరులను వశము చేసుకొనుటకై 'వశ్యాక్షతలు' చల్లుటయు 'వశ్యాధి దేవతల' గొలుచుటయు నాటిఆచారముగా నుండినది.

సర్వేశ్వరుని మహిమ తెలియజేయుచూ యథా వాక్కుల అన్నమయ్య ఇంద్రజాల ప్రభావమును యీనాటి ప్రజలకు వ్యక్తము జేసెను. ఇంద్రజాలము అల్పులను గొప్పవారిగ, గొప్పవారిని అల్పులుగ, పుణ్యులను పాపులుగ, పాపులను పుణ్యులుగా పరివర్తనము జేయుచుండినదట.

> "తర్కముంగా, ఘను నల్పుని ఘనుంగా బుణ్య పాపాలి వేఁ
> దిరుగసైచుచు నీ మహిమ పీఠిం బద్మజాండంబులం
> దరయన్ జీవుల నింద్ర జాలములుగా నాడించు"

-12వ వ. 38వ పుటలు-

అన్నమయ్య కాలములో భగీరథ తీర్థములకు మహాత్మ్యము హెచ్చుగా నుండెనని వ్యక్తమగుచున్నది.

## 31. సంస్కృతి :

ఆ నాడు పసిపిల్లలు బొమ్మలు, బొమ్మ పాత్రికలతో ఆడుచుండిరి. శృంగారములో పద్య శృంగారమున్నట్లు సిరియాలుని కథలో (చతుర్థాశ్వాసము 269వ పుట) తెలియును. మంత్రములతో జలమును శుద్ధిచేయుచుండిరి. వైద్య విధానము వాసి కల్గియుండెను. అందులోను ఆయుర్వేదము బహుళ వ్యాప్తి పొందియుండెను. ప్రజలకు 'గడియారమును'? కాలమానమును గొలుచు యంత్ర ప్రసక్తి కలదు? (తృతీయా శ్వాసము 214వ పుట) మల్లె తోటలు, "వనములు, పుష్పవాటికలు".(సప్తమాశ్వాసము 527వ పుట)ను ప్రజలు పెంచుచుండిరి. పూలపైగల ప్రేమను సోమనాథుడు గుబాళింపజేసెను.

## 32. పుణ్య క్షేత్రములు :

అనాటి పుణ్యక్షేత్రముల వివరములు కొంత వరకు గలవు. కర్ణాటక దేశములోని, త్రిపురాంతక దేవాలయము, సొన్నలాపురము మిక్కిలి

ప్రసిద్ధములు. ఆంధ్రదేశములో శ్రీశైలము, అలంపూరు కడప జిల్లాలోని పుష్పగిరి, ప్రాచుర్యము వహించెను. "కూడలి సంగమేశ్వరము 'బ్రహ్మపురిగా'గా ఓరుగల్లు-'మహానగరము'గ ఖ్యాతి గడించెనని" తెలిపెను. భక్తులు శివరాత్రి పర్వదినమున శ్రీశైలములో మహా వైభవముతో జరుపు కొనుచుండిరి. ఈ శతాబ్దములో కూడా శ్రీశైలము గొప్ప శైవ క్షేత్రముగా విరాజిల్లుచున్నది.

సోమనాథుడు నాటి భక్తుల శ్రీశైలయాత్రను, దర్శనమును తెలియ జేయుచున్నాడు.

మార్గాయాసము తీర్చుకొనుటకు జలపందిరులు (చలివేంద్రములు) సత్రశాలలను దాతలు నడుపుచుండిరి.

వక్షత్ర పర్వతారోహణము జేసి, పాతాళ గంగలో స్నానము గావించి లింగావసరమును దీర్చుకొని, మల్లికార్జున భ్రమరాంబల దర్శించి భోజనము చేసి, సాయంకాలము నుండి బసవన్న వచనములాలపించుచుండిరి.

33. పదములు :

ప్రజలలో 'పదములకు' మంచి ప్రచారము యుండెనని తెలియగలదు. "అన్నమాచార్యుని మనుమడు తిరుమలాచార్యుడు పద నిర్వచనము ఇట్లు చేసెను.

"పదమగు సుప్తిఙన్తము
పదమన యున, మయు యువియును బదమనఁ బరగున్
దుది నీ తెలుంగు లన్నియుఁ
పదకవితా మార్గ సార్వభౌముడు తెలిపెన్"[5] అని

యస్. గంగప్ప వివరించినారు.

"మదినుబ్బి సంసార మాయా వస్త్రంబు
పదములు తుమ్మెద పదముల్ప్రభాత పరమహర్షమౌన
-బ.పు.573 పుట-

5. యస్. గంగప్ప (వ్యాసము)-తెలుగులో పరిశోధన (1983 : పుట 138)

భక్తులకు 'తిరు' పాటలనిన ప్రీతి. సోమనాథ మహాకవి ప్రజల మాట-పాటకు సన్నిహితుడగుటచేత

"కరమర్థి నూహూర పెరియాలు చరిత పాటలుగా కట్టి"

పాడుచుండిరి.

అక్కడ ఉత్సవములు యేర్పాటు చేసి శ్రమతో పాలు వంచుకొనిన కడగండ్లు తొలగి పోవునని ఉత్తమ గతులు ప్రాప్తించునని విశ్వసించు చుండిరి. కొందరు శేషజీవితమును శ్రీశైలములో గడుపుటకు నిర్ణయించుకొను చుండిరి.

34 శృంగారము :

యథా వాక్కుల అన్నమయ్యగుడు, లింగ, జంగమ భక్తిని వివరించుచూ 'శివ శృంగారంబగు' (64వ వ 47వ పు) అని వీరశైవులు శివ యాత్రను శృంగారముగా నిర్వహింతురని తెలియజేసినాడు. ప్రజలు 'మధుర భక్తి'ని కలిగి యుండిరనియు వ్యక్తీకరించును.

శ్రీ రంజిల్లు చువేడ్క నుండగతి, నా చిత్తంబు నీ దివ్యశృం
గార ధ్యానమునందు హార్నిశముఁ జొక్కంజేయు వేదేవ : శ్రీ"

_86వ వ 51 పు-

నాటి గృహ జీవితము కాని మరే యితర అంశములతుగాని వీరశైవ సాహిత్యము దర్పణము పట్టినది. సాహిత్యమును గురించి ఇటువంటి అభి ప్రాయమునే స్వామి వివేకానందుని మాటలు 'Literature is Golden Mirror of the Contemporary Society' వ్యక్తీకరించును.

బి. స్త్రీలు :

(వీరశైవ సాహిత్యములో మత సాంఘిక పరిస్థితులందు సమాన దృక్పథము కలిగియున్నది. స్త్రీలు కూడ పురుషులతోపాటు సమాన హక్కులను కలిగియుండిరి. వీరికి సంబంధించి ప్రధానమైన ఐదు స్త్రీల పాత్రులను పరిశీలింతము.)

ఎ. "వీర వ్రతమును పాటించుచు కుమారునిపై ప్రీతివీడిన నిమ్మవ్వ బి. వ్యమత వ్యాప్తి చేయుచు పరదర్శనుల నిర్మూలించిన-పైజకవ్వ

సి. హీన కులజ అయినను ధార్మిక సమాజములో సమాన గౌరవమును పొందిన_గుడ్డవ్వ వీరు ముగ్గురు బసవ పురాణములోనివారు. డి. విధవరాలు అయినను పురుషులవలె వీరశైవ ధర్మమును ధైర్యముతో అనుష్ఠించిన_సూరసాని పండితారాధ్య చరిత్రలో నుండినవారు. ఇ. సంఘములో వేశ్యలు కూడ కులస్త్రీలవలె వీర మహేశ్వర వ్రతమును పాటించి తద్ధర్మ మహాత్మ్యమును వెల్లడి చేసిన కములవ్వ చెన్న బసవ పురాణమునందలిది.

1. నిమ్మవ్వ :

విరాట దేశములోని 'తలై గ్రామ నివాసి' అయిన ఇందళ దేవుని భార్య నింబలాదేవి కావచ్చును.

ఎ. నిమ్మవ్వ వ్యక్తిత్వము - సంఘములో ఉన్నత స్థానము కొలవడిన వీరశైవ ధర్మమును నిర్మల భక్తితో పాటించిన దృఢ చిత్త-త్యాగశీల. ఈ రెండు గుణములు పరిశీలన చేయవలసియున్నది.

శివుడు చిఱుతొండనితో లింగావసరమునకు నిమ్మవ్వ యింటి కేతెంచెను. ఆమెకు బీదతనమని చింతనలేదు. శివుని కొఱకు వండిన వంటకములలో ఒక బూరెను కొడుకు తినుటచే 'శివద్రోహి'యని చంపి గాది లోపల దాచిన వీరవ్రత నిమ్మవ్వ నిర్మలభక్తి స్త్రీజాతికి గర్వహేతువు.

బి. స్త్రీకి పుత్రవ్యామోహము సహజము, చిఱుతొండడు భార్య సంగళవ్వ శివతపసి కొఱకు కుమారుని జంపి మాంసమును వండి వడ్డించిరి. ఆ జంగమము వారి పుత్రుని భోజనమునకు పిలువమని కోరగా సంగళవ్వ కొడుకుపై వ్యామోహముతో పిలిచినది.

"పూర్వజన్మార్జిత భూరికర్మముల
గురుణించు నా కొడుక రావయ్య!"

-బ.పు-చతుర్థాశ్వాసము-276వ పుట-

అని నాలుగు దిక్కులు వినునట్లు పిలిచెను.

కాని నిమ్మవ్వ ఒక యోగినివలె శాంత చిత్తముతో నేమన్నదో గమనించండి

"తన ద్రోహమునఁ జేసి తాఁ బోయెఁ బోసిలి
గొనకాని యాద్రోహిఁగూడునే తలప"

-బ.పు-చతుర్థాశ్వాసము 279వ పుట-

నిమ్మవ్వ వ్యక్తిత్వము సంగళవ్వ వ్యక్తిత్వము కన్న చాలమిన్న. వీరవ్రతమువందు త్యాగమునకే స్థానముగాని భోగమునకు, బంధమునకు తావులేదని నిరూపించినది.

"ఇమ్మహి వెండియు నిద్ధసద్భక్తి
సమ్మిళితాచార సారనిమ్మవ్వ"

-పం.త-పురాతన ప్రకరణము-286 పు-యని

పాల్కురికి సోమనాథ మహాకవి పండితారాధ్య చరిత్రలో వర్ణించెను.

## 11. వైజకవ్వ :

కర్ణాటకలోని 'వరవళిగ' పురమున నివసించుచుండెను. వైజకవ్వ సహనమూర్తి అమాయక శివ భక్తురాలు "కడవగ నేరకమ్రొక్కిన వదు మవ్వాడు డుస్సి వడజీన ప్రతిమ మహిమన్ 'బడియందు' వైజకవ్వకు బొడసూపె లింగమూర్తి! బురహరదయతోన్" అని మల్లికార్జున పండితారాధ్యులు ఆమె అమాయకత్వమును వివరించెను.

జీవితములోని రెండు ప్రధాన సంఘటనల ద్వారా వైజకవ్వ గుణగణముల చిత్రణ జరిగినది.

ఎ. భర్త జైనుడు-జైనులకు ప్రీతితో బర్వం బు పెట్టుటకై వైజకవ్వతో పదార్థములను వండించెను. కాని శివ శరణ ధర్మమును పాటించు ఆమె-తాపసి వేషములోనున్న శివ ప్రభువున కర్పించెను. తపసి రాక వేళలో

వడివలు నీలు మ్రొక్కు బడి పాద ధూళి
బడి శొరలుచును బైఁ బడి వైజకవ్వ''

బ.పు-6 444వ పుట-

పాదములు కడిగి సేవించెను. పద పదార్థములను బక్వాన్నములను గదళీదళం బిడి కన్నుదనియగ సమర్పించెను. శివభక్తిలోని ఆర్ద్రత, అమాయకత అర్పణ అర్చనీయములు.

బి. ఇది గ్రహించి భర్త వైజకవ్వను సమ్మెటతో బాదెను. ఆ దెబ్బలు జైనులకు తగిలెను. వారు భరింపలేక భర్తను విడిచి పొమ్మనిరి. వైజకవ్వ చీకట్లో తెలియక జైనాలయము చేరగా

అట జీవ ప్రతిరూప మపుడవ్విస్సి
యట యిట పడఁగద దభ్యంతరమున
మదయించె నద్భుతాస్పద లింగమూర్తి
ముదిత సముదిత "సమ్మదలీలఁ దనర"

-బ పు 6_449వ పు-

ఆమె చూపుతో స్పర్శతో జీవ ప్రతిమ పగిలి లింగమూర్తి వెలసెను. ఆమె పేరు మీదుగ వైజనాథుడయ్యెను.

వైజకవ్వ హృదయ పరితాపము ఆవేదనతో మనస్పూర్తి నైవేద్యము గావించినది. ఆ క్షణములో జైనాలయము నిర్మూలనము శివాలయ నిర్మాణమునకు నాందిఁ బల్కినది.

III. గుడ్డవ్వ :

ఈమె గుడ్డందేవి అయి ఉంటుంది. మొదటి రాజేంద్ర చోడుని (క్రీ.శ. 1115-50) భార్య గుండాంబిక కావచ్చును.

గుడ్డవ్వ జీవితములో రెండు ప్రధాన ఘట్టములు జరిగినవి. ఏ. ఆమె సౌరాష్ట్రమున కేగుట. బి. అవిందిగె పురములో సోమనాథుడు వెలయుట.

ఏ. గుడ్డవ్వ హీనకులజ కాదదు. ఒక కుష్ఠరోగి-జనజాతి జాగృతికి స్ఫూర్తి సంఘమునకు దూరముగ బ్రదుకుచునే శివదీక్షగైకొని అవిందిగె పురములో ప్రవేశించెను. భూసురులు 'కులిపి జంగెత' యని దూషించిరి. వెడల గొట్టిరి. ఆమె చిత్త క్షోభకు అక్షరములు లేవు. కాలము గడచినది. ముదుసలి అయినను కృంగిపోక చాల దూరము నడచినది. ఇక నడవలేక

"మోకరించుచు వంగి మొగినేగ నేగ
మోకాళ్ళ చేతలు మరియు నిల్వకయు"

-బ.పు-పర్వతమా శ్వాసము_529వ పుట-

పోవుచుండ సోమనాథుడు ప్రత్యక్షమయ్యెను. ఆమె యొక్క ఆత్మవిశ్వాసము అచంచలమయినది.

బి. ఏ ఊరి భూసురులు నిందించి వెడలగొట్టించిరో ఆ పురములోనే సోమనాథుడు వెలయుటట్లు వరమును పొంది కృతకృత్యురాలయిన భక్తి

శిఖామణి వీరశైవ ధర్మములో సకల కులముల వారు సమానమని నిరూపించుటకు సరిపడ్డ పాత్రి. ఒక స్త్రీ ముదువలిది. అందునా హీనకులజ. అయినను సంఘములో సమానత పొందినది.

పాల్కురికి సోమనాథుడు గుడ్డవ్వను

"సిద్ధస్పర్శ, మాణిక్యము, రాజీవము" అని 531వ పుట బసవ పురాణములోను "ఉవిదసద్భక్తినియుక్తిని" పండితారాధ్య చరిత్రలో 149వ పు. దీక్షా ప్రకరణములో కీర్తించెను.

IV. సూరసాని పోరెండ్ల !

పోరెండ్ల సూరసాని విధవరాలు. శివదీక్ష పొందిన మహిమాన్విత. అకుంఠిత దీక్షా పరతంత్రురాలు. మహావతివ్రత. ఈమె జీవితములో జరిగిన రెండు ప్రధాన సంఘటనల వలన వీరశైవ సాహిత్యమునందు సమతా దృక్పథము గలదని ఋజువు పరచినది.

ఎ. సంప్రదాయ విముక్తి పోరాటము సల్పిన ఉత్క్రాంతి వనిత ఆమె విధవరాలు కూడ శరీరమంతయు బూడిద పూసికొని, రుద్రాక్షలు ధరించి పటికంపు పూసలు వేసుకున్నది. శివశరణుడు ఏ కులము వాడయినను సేవించి తరించుట శరణ ధర్మము. భూసురులిట్లు నిందించిరి.

"కుల ధర్మ మెడపుట గుణమూ గా దనక
విధవత్వమునకు వెలితి వొమ్మన"

-పండితారాధ్య చరిత్ర-దీక్షా-ప్ర 125 పుట-

అయినను సూరసాని భయమొందక ప్రతమాచరించిన స్వాతంత్ర్యజీవి.

బి. ఒక రోజు అంత్యజుడయిన ఒక శివశరణుడు అరెలు, కత్తులు ధరియించి, 'సణబార్తి' అనుచు వచ్చెను. ఆమెవానికి

"వందింప కెదురుగాఁ బణతెంచి ప్రొమొక్క

"భక్తులనుచు కాళ్ళఁ బడికడ్గి ద్రాగు"ను అతడు లింగావసరమును చెల్లించుచుండగా భూసురులు సూరసానిని కులటగా చిత్రించిరి. ప్రశ్నించిన వారికి ప్రత్యుత్తరమిచ్చుచు

"లింగసన్నిహితుల యంగణంబులను

లింగులుగాక మాదింగులున్నారె"

-పండితారాధ్య చరిత్ర-దీక్షా ప్రకరణము-127వ పుట-

అంత్యజుడయిన శివశరణుడు భోజనము గావించిన స్థలములో వెలసిన స్వయంభూలింగమును జూపి నివ్వాలాంటి తన జీవన పరశిని చాటినది.

అసత్య వాదులతో పోరాడిన ఒక మహాశక్తి. చివరకు ఆ భూసూరులు సూరసానమ్మను పొగడి

"హరుడవు నీవ సద్గురుడవు నీవ
ధాతవు నీవ విధాతవు నీవ"

-పం చ-దీక్షా-157వ పుట-

'మాతవు నీవ వేమాటలు నేల'

-పం.చ.-దీక్షా-155వ పుట-

పాదాబ్జములపై బడిరి.

కమలవ్వ :

కమలవ్వ కళ్యాణ కటకములో నివసించు వేశ్యాంగన. ఆమె లింగ సన్నిహిత-ప్రాణ సదయ హృదయ తత్త్వకోవిదురాలు. తను సంఘశక్తిని సంఘటిత పరచి స్వాతంత్ర్య సముపార్జనకై తిలకము దిద్దిన ధీరురాలు.

ఎ. కమలవ్వ సరస వచన, తత్త్వ గోష్ఠి ప్రార్థించి, లింగావసరమును తీర్చుకొనెడిది. ఆమె నిర్మల శీలయగుటచే "గణాధీపులు" ప్రధాన మంత్రియైన బసవేశ్వరుడు కూడ ఆమెను మన్నించి ఆమెతో కలసి భుజించిరి. ఇది బిజ్జలున కాగ్రహము కలిగించెను. కమలవ్వ నాటి వెలయాలుల సముద్ధరణ కొఱకు ప్రభుత నెదిరించి పోరాటము సల్పిన దీప శిఖ, సకల జన ప్రస్తుత.

బి. కమలవ్వ కమనీయ చరితను బసవేశ్వరుడు "శైవమత ప్రవర్తనములో గురుకర వరుల గోత్రంబు లెంచరాదని 'బిజ్జలునకు వివరించెను. కాని బిజ్జలుడు కమలవ్వ లింగమును దొంగల చేత తెప్పించెను తోడనె ఆమె మరణించినది. ప్రాణ భయముతో రాజు బసవేశ్వరుని వెంట నిడుకొని కమలవ్వ యింటికి వెళ్ళెను. అచట పూర్వాచార్యులచే లింగమును

ధరింపజేయగా కమలవ్వ పునర్జీవితురాలయ్యెను. శివశరణులకు లింగము ప్రాణముని నిరూపించిన ఆదర్శమూర్తి. మహిమాన్విత సంపన్న.

"కమళవ్వ నీదు వినన, తత్కమలాంక కలాపభక్తిగతి యిజ్జగతిన్
కమలాధవ కమలోద్భవ, కమలాధి ప్రముఖులకైన గావఁగ వశమే"
-చె.బ.పు.తృ ఆ-151 పు-

యని సాక్షాత్తు బిజ్జలుడు కీర్తించి 'నా హీన గుణంబులు నీమది, మానకు'మని వేడుకొనెను.

సి. దళిత జనుల ఆర్థిక సామాజిక స్థితి :

12వ శతాబ్దము నాటి దళిత జనుల ఆర్థిక దుస్థితిని మరియు సామాజిక స్థితిని క్రింద పేర్కొనిన రెండు కథల ద్వారా కొంత వరకు తెలిసికొన వచ్చును.

1. గొడగూచి కథ :

ఈ కథను ఏడవ అధ్యాయములో సూక్ష్మముగా వివరించితిని. ఇందులోని పేదతనము, వెనుక పడిన తనము ఎట్లున్నదో ఇచట తెలియగలదు.

శివుడు పాలు త్రాగనందులకు గొడగూచి చెప్పుచున్న కారణములలో పేదల దుస్థితి వ్యక్తమగును.

"కాచుట సొలదో కమ్మలవ్వమినో
పాఁచియో విఱిగెనో పడుచనేవనియొ?
పొద్దెక్కెనో యొండెఁ బొగయువల్చెడినొ?
బుద్ధిపుట్టదొనెయ్యివోయకుండితినొ?
కడువేఁడియో నీరు గలసినవనియొ?
యెడవాద్యములు లేక యేనెతెచ్చినవొ?

-బ.పు-తృ.ఆ-161వ పుట-

గుడిసెలో పుల్లలు మంటబెట్టి పాలను కాచుచుండిరి. ప్రాచియుండుట పాలు విఱిగియుండ వచ్చును. తప్పక పొగ వాసన వచ్చును. నెయ్యి కలిసి యుండదు. మిక్కిలి వేడిగా నుండవచ్చును. నీరు కలిపియుండ

వచ్చును. ధనవంతుల వలె అట్టహాసముగా వాద్య ఘోషతో గొడ గూచి పాలను తీసికొని రాలేదు. ఇది ఆనాటి దళితుల ఆర్థిక దుస్థితి.

2. కడమజాతి శివభక్తుని కథ :

ఇందు అగ్ర వర్ణముల దౌష్ట్యము కానవచ్చును.

జైనుల అగ్రహారములో మంచి పేరు గల ఒక హరిజన భక్తుడు గలడు. జైనులది యోర్వలేక అతని పశువులను ఒక రహస్య ప్రదేశములో మంచిరి. ఈ కథలో మనకు తెలియవచ్చు "అంశము 'Kidnapping' సామాజిక న్యాయము (Social Justice) ఆనాటి నుండి ఈ నాటి వరకు దళిత జన వర్గమునకు అందలేదు" అని హెచ్.ఎస్. బ్రహ్మానంద తెలియజే యుచున్నారు చూ: దేశికవిత - దళిత జన జీవన చిత్రణ - (వ్యాసము) 1989. దీని కొఱకు ఎల్లప్పుడు పోరాటములు జరుగుచునే ఉన్నవి.

ఇట్టి ఆర్థిక దుస్థితిని కాయకము ద్వారా నిర్మూలించుచు, సామాజిక న్యాయమును శరణ ధర్మము ద్వారా లభింపజేయుచు తద్వార సమత్వమును సాధించుటకు వీరశైవము కృషిజేసి విజయవంతమయినది.

# ముగింపు

1. వీరశైవ మతము వైదిక మతములలోని వర్ణాశ్రమ ధర్మములను, కర్మలను ఖండించినది. యజ్ఞయాగాది క్రతువులను నిరసించినది. క్రియకు ప్రాధాన్యత కల్పించినది. వీరభక్తికి నీరాజనము పట్టినది. భిన్న దర్శనములలోని మానవతా గుణములను గ్రహించి విశ్వ ధర్మమయినది. ఇది బసవేశ్వరుని వీరశైవ మతము. స్త్రీజాతి జాగృతికై పోరాటము సల్పినది. వృత్తి విలువలను పెంచి దానిని ధర్మముతో అనుసంధించినది. కాయకమే కైలాసము నిజముగా ఒక గొప్ప సిద్ధాంతము. ప్రతి మనిషి ఒక ఉత్పత్తి శక్తి అని సంఘాభ్యుదయమునకు అతడు భాగస్వామి కావలయు ననెడి భావన చట్టరీత్యా సమ్మతము. ఇది సామ్యవాద సిద్ధాంతమునకు ప్రాతిపదిక.

2. వీరశైవ కవులు తమ గ్రంథములలో వీరశైవతత్త్వ గుణములను సహస్ర ముఖముల కీర్తించి పేర్కొనుట విశేషము. ఆచరణ సాధ్యమైన అంశములను అనుభవ మంటపములో ఆనాడే చర్చించి, క్రోడీకరించినది. వానిని యెల్ల శివశరణులు ఎంత వరకు అనుసరిస్తున్నారో తెలిసికొనుటకు ఒక ప్రత్యేక పర్యవేక్షణ విభాగమును యేర్పరచినది. వారే కాయకద స్వాములు. నిజముగా ఆనాటి శివశరణ ధర్మము, సంఘములో ఆదర్శమునకు, మానవతా విలువలకు నిలయమైనదనుట సత్య దూరము కాదు. ఇదియే శివశరణుల సంస్కృతీ సాహిత్యములందలి 'సమతా" దృష్టికి మూలము.

3. శివశరణులు సాధారణ జీవితమును గడిపిరి. సాధారణుల జీవితమును గురించి వ్రాసిరి. ఆధునిక పరిభాషలోఁ జెప్పవలయునన్నచో అగ్ర వర్గీయుల దౌర్జన్యమును, దోపిడిని యెదుర్కొనిరి. ఇతర హైందవ సాహిత్యమున కనిపించని నిమ్నజాతి స్పృహ, నిమ్న వర్గీయుల పైన పక్షపాతము విశేషముగా కన్పించుట వీరశైవ సాహిత్యమున కన్పించు వర్గ పోరాట చిహ్నము.

4. శివభక్తి పారమ్య ప్రచారముతో సులభమైన పూజా విధానముతో బ్రాహ్మణేతరులందు ఒక నూతన సమిష్టి భావ చైతన్యము పుట్టినది. వృత్తి

ధర్మ నిర్వహణము కేవలము వృత్తిగా కాక, మనః ప్రవృత్తిగా పరిణమింప జేసికొన్న శివ శరణులలో-ఆధునిక మేధావి వర్గము గుర్తించు నిబద్ధత నిమగ్నతలున్నవి. దళిత జనుల కాయక సిద్ధాంతము ఒక విధముగా ప్రాచీన భారతీయులు దర్శించిన శ్రామిక సిద్ధాంతముగా చెప్పవచ్చును.

5. బసవేశ్వరుడు వీరశైవమును ఒక ప్రజా ఉద్యమముగా నడిపిన మహామేధావి, యోధుడు. రష్యా దేశమున లెనిన్‌వలె ఒక ఆదర్శ సామ్రాజ్యమునకు కావలసిన పునాదులు వేసిన మహనీయుడు బసవేశ్వరుడు బిజ్జలుని హత్య ఒక వ్యవస్థ మరణమునకు చిహ్నము. వీరశైవులకు జరిగిన అన్యాయమునకు, అవమానమునకు బసవేశ్వరుడు తన పక్షము వారితో చెల్లించిన ప్రతీకారమే బిజ్జలుని హత్య. దీనిని బట్టి వీరశైవ మతానుయాయులు శివవసాయితమన ఖడ్గము ధ్వజాలతో ప్రతి పక్షముపైన పోరాడిన వీరులుగా గుర్తింపబడిరి కావున ఇది వర్గ పోరాటమును, దళిత విజయమును శివశరణ విజయముగా నిరూపించిన సంఘటన.

6 ఆధునిక సామ్యవాద ఉద్యమములను ఇతర అవకాశ వాద ఉద్యమములు అణచినట్లె వీరశైవ ఉద్యమము కూడ అసంపూర్ణ విప్లవముగా మిగిపోయినది. కాని అంత మాత్రమున సామ్యవాద ఉద్యమము నిరర్థకమని చెప్పలేము. నిష్ఫలమని అనలేము అట్లే వీరశైవ ప్రతిపాదికములైన కాయక తత్త్వము, శివశక్తి పారమ్యము తక్కిన హైందవ మత ప్రధాన స్రవంతిలో కలిసిపోయినవి ఒక్క సమతా దృష్టి మాత్రమే వీరశైవ ఉద్యమ శిథిలముగా మిగిలిపోయినది

# ఉపయుక్త వాఙ్మయము

నా పరిశోధన ప్రారంభమునకు పూర్వమే విషయము కొఱకు దాదాపు 100 గ్రంథములు పఠించితిని. అవి పోను విషయ నిర్ధారణము చేసిన ఈ క్రింది గ్రంథములను ఆకర గ్రంథములుగా పేర్కొనుచున్నాము.


ఎ. తెలుగు గ్రంథములు :

1 ఆరుద్ర : కాకతీయ యుగం, ప్రజాశక్తి ప్రెస్, విజయవాడ (1988)

2 ఆరుద్ర : సమగ్రాంధ్ర సాహిత్యము-వాల్యూం-1

3 ఏకామ్రనాథుడు : ప్రతాపరుద్ర చరిత్రము, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి. కళాభవన్, హైదరాబాదు (1984)

4 కోదండ రామయ్య-తిమ్మవజ్ఝల : పండితారాధ్య చరిత్ర, ఆంధ్ర పత్రికా ముద్రాక్షరశాల-చెన్నపురి (1974)

5 తిక్కన్న : ఆంధ్ర మహాభారతము, సంపుటము-7, వావిళ్ళ రామస్వామి శాస్త్రులు అండ్ సన్స్, వావిళ్ళ ప్రెస్, చెన్నపురి (1962)

6 దేవిప్రసాద్ చటోపాధ్యాయ : భారతీయ తత్త్వ శాస్త్రం, విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, హైదరాబాదు (1989)

7 నారాయణరావు కే.వి. : ఆంధ్ర వాఙ్మయ చరిత్ర-సంగ్రహము వి. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్, మద్రాస్ (1967)

8 ప్రతాపరెడ్డి-సురవరం : హిందువుల పండగలు, సురవరం ప్రతాపరెడ్డి సాహిత్య వైజయంతి-ఆంధ్ర సారస్వత పరిషత్-తిలక్‌రోడ్, హైదరాబాదు (1987)

9 ప్రభాకర శాస్త్రి వేటూరి : ప్రబంధ రత్నావళి-శ్రీ ప్రభాకర పరిశోధక మండలి, హైదరాబాదు 1976

10 ప్రసాద్‌రావు-వంటసాని-కాకతీయ శిల్పం-విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, హైదరాబాదు 1976

11 పావకవి-అత్తనూరి-చెన్న బసవ పురాణము, వి. రామస్వామి శాస్త్రి అండ్ సన్స్-ఆది సరస్వతి నిలయం-మదారాసు, (1916)

12 బలరామమూర్తి-ఏటుకూరు-మన చరిత్ర (1986) ఆంధ్రుల సంక్షిప్త చరిత్ర, విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, హైదరాబాదు (1989)

13 బ్రహ్మానంద డా॥ హెచ్.యస్. భాషా నిర్వచనము (అముద్రితం), 1985, శిష్టసాహిత్యములో జానపద ధోరణులు-1989, 3 దేశికవిత-దళిత జనజీవన చిత్రణ(పసంగ వ్యాసము)1989, ఆంధ్ర విశ్వవిద్యాలయము

14 భాస్కరరావు టి. : స్ఫూర్తి శ్రీ వ్యాసావళి-1 భాగము, కీలక ఉగాది మహతీ గ్రంథిమాల, గుంటూరు.

15 మల్లికార్జునుడు-కె.పి. (అనువాదము)-భారత రాజ్యాంగము
The Orient Publishing Co-(Regd) Tenali 1951

16 మహాదేవ శాస్త్రి-కోరాడ : (పీఠిక) కుమార సంభవము. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి, కళాభవన్, హైదరాబాదు-1968

17 రంగనాథాచార్యులు కె.కె. : తెలుగు సాహిత్యం-మరోచూపు : ఆంధ్ర సారస్వత పరిషత్, తిలక్‌రోడ్, దరాబాద్_1981

18 రంగనాథుడు : శ్రీరంగనాథ రామాయణము -ఏ వి. కృష్ణా బుక్ డిపో మద్రాసు_79, 1968

19 రజనీకాంతారావు ; బాలాంత్రపు-ఆంధ్ర వాగ్గేయకార చరిత్ర_విశాలాంధ్ర ప్రచురణాలయము, విజయవాడ, 1958

20 రామయ్య-బాడాల : బసవ వచనామృతము (అనువాదము) బసవ సమితి, బెంగళూరు, 1965

21 రామచంద్రుడు-పుల్లెల : భారతీయ విజ్ఞాన వేత్తలు, ఆంధ్ర సారస్వత పరిషత్, తిలక్‌రోడ్, హైదరాబాద్, 1983. ఈశావాస్యాదియు కఠోప నిషత్తులు-సుర భారతీ సమితి, హైదారాబాదు 1961

22 రామారావు-మారెమండ ; భారతీయ నాగరికతా విస్తరణము_వ్యాసము
Text Book Prescribed For Degree 1975

23 లక్ష్మీరంజనము-ఆచార్య ఖండవల్లి-ఆంధ్రుల చరిత్ర-సంస్కృతి_1951 సిద్ధేశ్వర చరిత్రము (పీఠిక) 1960

24 లక్ష్మీకాంతము : ఆచార్య పింగళి-ఆంధ్ర సాహిత్య చరిత్ర-1974

